# పోతులూరి వీరబ్రహ్మం గారి

## జీవితం - రచనల పరిశీలన

( డాక్టరేట్ డిగ్రీ పొందిన గ్రంథం )


రచయిత :

**డాక్టర్ కన్నెకంటి రాజమల్లాచారి, M.A., Ph.D.,**

ఆంధ్రోపన్యాసకులు

S. V. K. P. కళాశాల

మార్కాపురం.



సరోజా పబ్లికేషన్స్

**నరసరావుపేట.**

సరోజా ప్రచురణలు నెం. 3

ప్రథమ ముద్రణ 1988 మార్చి

ప్రతులు 1000



**వెల: రు. 75—00**

తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయంతో ముద్రించబడినది

ప్రతులకు :

1) శ్రీ రామదాస్ అమరనాథ్, B. Com,
సరోజా పబ్లికేషన్స్
12-14-8 కవిత
ప్రకాష్ నగర్, నరసరావుపేట-522 602

2) డా॥ కె. రాజమల్లాచారి, M.A: Ph.D;
తెలుగు లెక్చరర్
S. V. K. P. కళాశాల
మార్కాపురం-523 316

ముద్రణ :
శ్రీ సత్యనారాయణ ప్రింటింగ్ ప్రెస్,
మార్కాపురం-523 316
ఫోన్ 174

# విషయానుక్రమణిక

## ద్వితీయ ప్రకరణం - బ్రహ్మంగారి రచనల తత్త్వప్రదర్శనం

## తృతీయ ప్రకరణం - భాషాదిక విశేషాలు



## అనుబంధాలు

# అంకితం



గురువర్యులు, తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు
పద్మశ్రీ, కళాప్రపూర్ణ
**ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డి కవీంద్రులకు**

ఆధునికాంధ్ర కవిత్వ మ
హాంభోరాశిని మథించి
స్వాదు ఫలము సాధించిన
నారాయణరెడ్డి కవికి

అస్మదీయ జీవిత కా
వ్యమ్మున కూపిరిగ శిష్య
వాత్సల్యము కురిపించిన
నారాయణరెడ్డి కవికి

వీరబ్రహ్మేంద్ర జీవి
తము రచనల కడలిత్రచ్చి
సాధించిన సత్యమనెడి
ముత్యమ్మును సమర్పింతు.

— రాజమల్లాచారి

# అంజలి



తెలుగు విశ్వవిద్యాలయ విశ్రాంతకులపతి, గురువర్యులు

*డా॥ తూమాటి దొణప్పగారికి*

సద్గురువు శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి జీవితం, రచనల పరిశీలన అనే అంశాన్ని సూచించి నాగార్జున విశ్వకళా పరిషత్తులో పరిశోధనావకాశం కల్పించి, విశ్వవిద్యాలయ గ్రాంట్ల సంఘం నుండి ఆర్థిక సహాయాన్ని ఇప్పించి, పరిశోధనా వ్యాసాన్ని చక్కగా తీర్చి దిద్దించి, నాకు బంగారు భవిష్యతును కలిగించిన మద్గురువు

**తెలుగు విశ్వవిద్యాలయ విశ్రాంత కులపతి**

***ఆచార్య డా॥ తూమాటి దొణప్పగారికి***

భక్త్యంజలి ఘటిస్తున్నాను.

— రాజమల్లాచారి

## గ్రంథ ముద్రణ సహాయకులు

1) శ్రీ వై. యం. బి. ఆచార్యులు
కంభంపాడు. కృష్ణా జిల్లా. రు. 116.00

2) శ్రీ నాగెండ్ల వెంకటేశ్వర్లు
బ్రిలియంట్ ట్యుటోరియల్స్, మార్కాపురం 116-00

3) శ్రీ మహేశ్వరపు లక్ష్మీనారాయణాచారి
గట్టుప్పల, నల్లగొండ జిల్లా 116.00

4) శ్రీ కాళ్ళ పెదకాశయ్య
టీచర్ – రావిపాడు 116-00

5) శ్రీ యస్. పాండురంగయ్య, M.A.,
తెలుగు పండితులు
Z. P. P. H. స్కూలు, మార్కాపురం. 116-00



శ్రీ ముత్తరాజు సుబ్బారావుగారు
మునిసిపల్ కమీషనరు రు. 1116-00 లు



శ్రీ రాచగుళ్ల పరమేశ్వరరావుగారు

వీరి ధర్మపత్ని శ్రీమతి భ్రమరాంబగారు

శ్రీశైల విశ్వబ్రాహ్మణ అన్నసత్రి కార్యదర్శి

మార్కాపురం విశ్వబ్రాహ్మణ సంఘ అధ్యక్షులు

మార్కాపురం శ్రీ జడల పిచ్చయానంద స్వాములవారి మఠాధ్యక్షులు

విరాళం రు. 1500/- లు

# ఆశీస్సు



'కలా ప్రపూర్ణ' 'దర్శనాచార్య'

డాక్టర్ కొండూరి వీరరాఘవాచార్యులు

'ప్రత్యూనంద'

తెనాలి

డాక్టర్ రాజమల్లాచారి గారికి ఆశీస్సులు.

మీ పుస్తకమును చదవడం పూర్తి అయినది. మీరు చేపట్టిన అంశములను జాగ్రత్తగాను, విద్వన్మనో రంజకంగాను పరిశీలించినారు. అవి నాకు సంతృప్తిని కలిగించినవి. ఇంతకాలానికి బ్రహ్మంగారిని గూర్చి విశ్వవిద్యాలయం పక్షాన ఒక పరిశోధన గ్రంథం వెలువడడం నాకెంతో సంతోషాన్ని కలిగించినది. ఆపనిచేసిన వ్యక్తి నా కవిమిత్రుల పుత్రులు మీరు కావడం ఇంకా ఎక్కువ ఆనందదాయకం అయినది. మీకా వీరబ్రహ్మేంద్ర స్వామి ఆయురారోగ్యాభ్యుదయాలను ప్రసాదించాలని ఆశిస్తున్నాను.

ఇట్లు,

తెనాలి, (సం.) కొండూరి వీరరాఘవాచార్యులు

15-6-88. 'ప్రత్యూనంద'

# అభినందన చందనం

డా॥ వి వి. యల్. నరసింహారావు,
ఎం. ఏ, పిహెచ్. డి.
డైరెక్టర్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత
గ్రంథాలయం - పరిశోధనాలయం,
హైదరాబాదు - 1.

బ్రహ్మంగారి జీవితం గూర్చి, రచనలగూర్చి విశ్వవిద్యాలయ స్థాయిలో పరిశోధన చేసి డాక్టరేట్ డిగ్రీ పొందిన ప్రప్రథమ వ్యక్తి డాక్టర్ కన్నెకంటి రాజమల్లాచారిగారే.

వృత్తివల్ల ఉపన్యాసకుడు, ప్రవృత్తివల్ల కవి గాయకుడు నటుడు ఇంకా ఇంకా ....

ప్రస్తుత గ్రంథంవల్ల పరిశోధకుడు. ఈ పరిశోధన నాగార్జున విశ్వవిద్యాలయంలో సాగింది అందులోను ఆచార్య తూమాటి దొణప్పగారి చోదకత్వంలో.

శ్రీ రాజమల్లాచారిగారు జీవితగమనంపట్లగాని సాహిత్యసృష్టి పట్లగాని చాల నిశితమైన చూపుగలవారు. అందులోనూ బ్రహ్మంగారి వంటి ఒక తాత్వికకవిని గూర్చి, యోగిని గూర్చి ద్రష్టను గూర్చి ప్రామాణిక పరిశోధన కృషికి పూనుకొన్నప్పుడు ఆయనదృష్టి మరింత నిశితమై సత్యసందర్శనకు అవిరళమైన కృషిచెయ్యటం అతి సహజం. ఆ లక్షణం ఈ పరిశోధన గ్రంథంలో అద్యంతం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది.

బ్రహ్మంగార్ని గూర్చి ఆయన రచనలను గూర్చి తెలుగులో గ్రంథాలు, వ్యాసాలు, ప్రసంగాలు కోకొల్లలు. ఇంగ్లిషులో కూడా

ఇటీవల ఆనందాశ్రమం (కడప జిల్లా మైదుకూరు దగ్గర) నుండి శ్రీ వీరబ్రహ్మేంద్ర మిషన్‌వారు ప్రచురిస్తున్న లఘుగ్రంథాలు, కర పత్రాలు బ్రహ్మంగార్ని గూర్చి అంతర్జాతీయ స్థాయిలో అందరికీ తెలిసేట్లు చేస్తున్నాయి. తెలుగులో బ్రహ్మంగారి జీవిత చరిత్రలు, యక్షగానాలు, హరికథలు, పద్యగేయ కావ్యగ్రంథాలు అనేకానేకం.

శ్రీ రాజమల్లాచారిగారు తెలుగులో వచ్చిన రచనల నన్నిటినీ సావధానంగా చూచినట్లే. కాకపోతే 1987 నవంబరులో ప్రచురించ బడిన డా॥ వేదవ్యాస్‌గారి "వీరబ్రహ్మేంద్రయోగిపై పరిశోధన" అనే తెలుగు పుస్తకం చూచివుండరు. ఆనందాశ్రమ ఆంగ్లరచనలు కూడా చూడలేదేమో ! నిజానికి ఆచారిగారి పరిశోధన జరుగుతున్న నాటికి ఇందులో కొన్ని వెలువడనే లేదు.

ఆచారిగారి పరిశోధన ప్రధానంగా రెండు అంశాలమీద సాగింది. మొదటిది బ్రహ్మంగారి జీవిత విశేషాలను గూర్చి. రెండవది బ్రహ్మంగారి రచనల తత్త్వంగూర్చి, భాషాదిక విశేషాలనుగూర్చి.

జీవిత విశేషాలలో బ్రహ్మంగారి కాలానికి సంబంధించిన అంశం అతి ముఖ్యమైంది. ఇది నిక్కచ్చిగా తేలితే తక్కిన అంశాలు దాదాపు ఒకదారికి వచ్చినట్లే.

బ్రహ్మంగారి కాలంగూర్చి విస్పష్టమైన చారిత్రక దృష్టితో తొట్టతొలిగా కృషి చేసినవారు శ్రీ తాటికొండ రాఘవాచార్యగారు. వీరి 'వీరాచార్య చరిత్ర' 1918 నాటికే సిద్ధమైంది. మఠంలోని సమాధులను బట్టి, బ్రహ్మంగారి వంశంలోని వ్యక్తుల జీవితకాలాలు పరిగణించుకుంటూ బ్రహ్మంగారి జీవితకాలాన్ని స్థూలంగా 17వ శతాబ్దిఅని ఆయన తేల్చగలిగారు. డా॥ కొండూరి వీరరాఘవాచార్యులుగారి లెక్క కూడా

ఇందుకు అనుగుణంగానే సాగింది. శ్రీ కొండాలి లక్ష్మీనారాయణగారు మాత్రం ఖండితంగా 1608 నుండి 1693 వరకు జీవించివుంటారని తేల్చి చెప్పారు. ఈ చివరి వాదాన్నే డా॥ రాజమల్లాచారిగారు మరింత స్పష్టంగా సప్రమాణంగా స్థిరీకరించారు. మొత్తంమీద బ్రహ్మంగారి జీవితకాలాన్ని 17వ శతాబ్దికి మాత్రమే పరిమితం చేయటం గుర్తించదగ్గ అంశం.

కొందరు పెద్దలు బ్రహ్మంగార్ని పన్నెండవ శతాబ్దిదాకా వెనక్కు లాక్కుపోవటం, మరికొందరు పెద్దలు 18వ శతాబ్ది చివరిదాకా ముందుకు లాక్కురావటం చేశారు. ఈ లాగులాటల్లో బ్రహ్మంగారి రూపురేఖలు చెదిరిపోయిన సందర్భాలు లేకపోలేదు.

ఈ ప్రమాదంనుంచి తప్పించి కాలజ్ఞాని అయిన బ్రహ్మంగార్ని స్థిరమైన ఒకకాలంలో నిలిపి విశదంగా పరిశీలించిన విశ్వవిద్యాలయ పరిశోధన గ్రంథం డా॥ రాజమల్లాచారి గారిదే.

అయితే ఇటీవల 1987లో - ప్రచురితమైన డా॥ వేదవ్యాసగారి "వీరబ్రహ్మేంద్రయోగిపై పరిశోధన" అనే గ్రంథంలో వీరబ్రహ్మేంద్ర స్వామి మహాసమాధి 17-4-1692న మధ్యాహ్నం 12 గంటలకు జరిగినట్లు స్పష్టంచేశారు. ఈతేది వైశాఖ శుద్ధ దశమి ఆదివారంతో సంప్రదిస్తుందనికూడా వివరించారు. (160వ పుట.) అదే గ్రంథంలోని 159వ పుటలో మరో చారిత్రకాధారాన్నిబట్టి బ్రహ్మంగారి కాలం 1700 - 1780 మధ్యకాలంలోనిదిగా తెలుస్తున్నదనికూడా వ్రాశారు. ఈ రెండింటిలో మహాసమాధికాలం 17వ శతాబ్ది చరమదశక యనేదా, సమంజసంగా కనిపిస్తున్నది.

బ్రహ్మంగారి పేరు ప్రశస్తులు ముఖ్యంగా ఆయన ప్రవచించిన కాలజ్ఞానంతో ముడివడి వున్నాయి.

ఆయన చెప్పిన భవిష్యద్విషయాలు అక్షరాల జరిగిన సందర్భాలు అనేకం ఉండటంవల్ల కాలజ్ఞానం మీద అధికసంఖ్యాకుల దృష్టి కేంద్రీకృతమైంది.

కాలజ్ఞాన ప్రతులలో - మఠంలో నేటికీ నిత్యపూజలందుకుంటున్న ప్రతి తక్కినవాటికంటె ప్రామాణికమనక తప్పదు. దానినే 1974లో కందిమల్లాయపల్లి రంగయ్య కృష్ణమూర్తి ప్రచురించారు. దీనినే ప్రస్తుత పరిశోధకులు ప్రమాణీకరించుకున్నారు.

చాటకొండ సుబ్బయ్యగారు 1933లో రచించి ప్రచురించిన 'వీరబ్రహ్మంగారి సంతాన చరిత్ర' గ్రంథంలో చెప్పినదాన్నిబట్టి కడప జిల్లా నగరిపాటి మఠంలో కొన్ని తాళపత్రాలు భద్రపరచ బడినట్లు తెలియవస్తుంది.

తిరుపతి శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయంలో "ఏష్య కాలజ్ఞానము" అనేపేరుతో ఒకప్రతి ఉంది. డి. 2311 నెంబరుగల ఈ తాళపత్ర ప్రతి మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంనుండి వచ్చింది. ఆరువేల వీరంభొట్లయ్య వ్రాయించినదిగా వున్న ఆర్. 1620 నెంబరుగల మరో కాగితపు ప్రతికూడా వుంది.

ఈ ప్రతులన్నిటి సేకరణకు కృతజ్ఞతా నమస్కృతు లందుకో వలసిన పుణ్యుడు బ్రౌను మహాశయుడే.

కాలజ్ఞానం బహురూపాలలో ఉన్నది. ప్రక్రియనుబట్టి కొంత ద్విపదరూపంలోను, కొంత సౌజన్యపత్రికల రూపంలోను కొంత గోవిందవాక్యాల రూపంలోను, కొంత కేవల తత్త్వరూపంలోను ఉంది.

ప్రత్యేకంగా "జీవైక్యబోధ కాలజ్ఞాన" మనే శీర్షికతోను ఉంది. సిద్ధ బోధ, పరమహంస కాళికాంబ అనేవి పద్యకృతులు. జీవైక్యబోధ కాలజ్ఞానం తత్త్వశాస్త్రాన్ని యోగశాస్త్రాన్ని సమ్మేళనంచేసి అనేక విషయాలు చెప్పే అద్భుత శాస్త్రగ్రంథం.

రాజమల్లాచారిగారు అన్నిటిని క్షోదక్రమంగా పరిశీలించి బ్రహ్మంగారి రచనల తత్త్వం సమగ్రంగానే ఆవిష్కరించారు.

బ్రహ్మంగారి పేర్లు 35 దాకా ఉన్నట్లు అందించిన సమాచారం (పుటలు 24-26) బ్రహ్మంగారి జీవితవిశేషాలు అనేకం అందిస్తుంది.

అట్లాగే బ్రహ్మంగారు సంచరించిన ప్రదేశాల పేర్ల పట్టిక కూడా పరమప్రయోజనకరంగా ఉంటుంది. కాని వీటిలో పుష్పగిరి పేరు జారిపోవటం ప్రామాదికం. అయితే బ్రహ్మంగారి మహిమల పట్టికలో పుష్పగిరి ప్రస్తావన (21వ క్రమసంఖ్య - పుట 47) ఉంది. కనుక ఇబ్బంది కలుగలేదు.

బ్రహ్మంగారి రచనల్లోని భాషాదిక విశేషాలు, వ్యావహారిక ప్రయోగాల పరమార్థం, ప్రజల భాషానాడి ప్రతిబింబితమైన తీరు పరిశోధకులు బహుజాగరూకంగా గుర్తించారు.

బ్రహ్మంగారి తత్త్వాలుగా చెప్పబడినవాటిలో కొన్ని ఇతరులవి ఉండవచ్చు. తత్త్వంలోని భావం బ్రహ్మంగారిని అనుసరించినది కావటంవల్ల వాటికి లోకంలో బ్రహ్మంగారి కాలజ్ఞాన తత్త్వాలనే పేరు వచ్చింది. పరిమి వీరాచార్యులుగారు సేకరించి ప్రచురించిన (యస్. వి. గోపాల్ అండ్ కో మద్రాసు 1976) తత్త్వాలు ఈ కోవకు చెందినవే.

ఈ తత్త్వాలలోని విషయంతోపాటు వీటి సంగీతపు బాణీలు ప్రత్యేకంగా పరిశీలించతగినవి. వీటికి రాగనిర్దేశంకూడా జన ప్రచారంలో ఉంది. బహుశః బ్రహ్మంగారి జీవితకాలంలోనే అవి ఆ బాణీలలో పాడబడివుంటాయనిపించేనిగా అనేక తత్త్వాలున్నాయి. సిద్దప్పగారి తత్త్వాలుకూడా అటువంటివే.

సంగీత రాగతాళ దృష్టితో వీటిని ప్రత్యేకంగా పరిశీలించటం ఎంతైనా అవసరమనుకుంటున్నాను.

డా॥ రాజమల్లాచారిగారు ఎంతో శ్రమకోర్చి ఎన్నో విశేషాలు సేకరించి, ఎన్నో ఛాయాచిత్రాలు ప్రచురించి తమ పరిశోధన గ్రంథాన్ని "బహుజన హితాయ" అన్నట్లుగా తీర్చిదిద్దారు.

ఇటీవలి కాలంలో డా॥ యన్. గోపిగారు వీరబ్రహ్మం వేమనలపై విపుల పరిశోధన జరిపి చర్చనీయమైన అనేకవిశేషాలు వెల్లడించారు. బ్రహ్మంగారి సమగ్ర రచనలను సంపాదించే ప్రయత్నం కూడా చేస్తున్నారు. అటు మద్రాసు విశ్వవిద్యాలయంలో, ఇటు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో కూడా పరిశోధకులు దీక్షతో బ్రహ్మంగారి రచనలను పరిశీలిస్తున్నారు. క్రొత్త సంగతులు వెలికి దీస్తున్నారు.

డా॥ రాజమల్లాచారిగారి పరిశోధన ఫలితాలు తక్కినవారికి కూడా ప్రయోజనకరంగా గలవు.

వీరబ్రహ్మేంద్రస్వామి - సర్వమానవ సమానత్వం, అస్పృశ్యతా నిరాసం, అద్వైత ప్రాధాన్యం, పండిత పామర వేద్యమైన భాషా

సాహిత్య సమాదరణ, భావికాల సూచన - మొదలైన అనేక లోక కళ్యాణదాయక సిద్ధాంత విషయాలు ఆచరణాత్మకంగా జనులకు బోధించారు.

అటువంటి చారిత్రిక మహాపురుషుడి జీవితంగూర్చి, రచనల తత్త్వంగూర్చి ఇంత ప్రామాణిక పరిశోధన గ్రంథాన్ని రచించిన డా॥ రాజమల్లాచారిగారు బహుధా అభినందనీయులు.

హైదరాబాద్, (సం.) పి. వి. యల్. నరసింహారావు
14-7-88.

# కృతజ్ఞతా నివేదనం

ఏదైనా ఒక విషయాన్ని గురించి పరిశోధన చేయాలనే సంకల్పం కలిగింది. నాకు కలిగిన ఈ కోరికను పూజ్యశ్రీ ఆచార్య డా॥ టి దోణప్పగారికి తెలియపరచాను. వారు నాపై అనురాగంతో అంగీకరించి ఆశీర్వదించారు. పోతులూరి వీరబ్రహ్మంగారి జీవితం – రచనల పరిశీలన అనే విషయాన్ని పరిశోధించడానికి అనుమతించారు.

నేను పరిశోధన చేయడానికి ప్రోత్సహించినవారు మార్కాపురం కళాశాల అధికారులు. తెలుగుశాఖలో పరిశోధక విద్యార్థిగా చేర్చుకొన్నవారు నాగార్జున విశ్వవిద్యాలయం అధికారులు.

నాగార్జున విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖలో పరిశోధక విద్యార్థిగా చేరి సిద్ధాంతవ్యాసం రాస్తున్నప్పుడు అడుగడుగునా అమూల్యమైన సలహాల నందిస్తూ వ్యాసాన్ని నిర్దిష్టంగా నిర్దుష్టంగా రాయగలగడానికి పర్యవేక్షించినవారు తెలుగు శాఖలో ప్రొఫెసర్ గౌరవార్హ శ్రీమతి డా॥ తమ్మారెడ్డి నిర్మలగారు.

ప్రకృత పరిశోధనలో ఉపకరించిన తాళపత్ర గ్రంథాలను అధ్యయనం చేయడానికి అనుమతించిన బ్రహ్మంగారి మఠాధిపతి శ్రీ వీరభోగ వసంత వేంకటేశ్వరస్వామిగారు, సిద్ధయ్యగారి మఠాధిపతి శ్రీ లక్ష్మీనరసయ్యగారు, తాళపత్రప్రతులను వెదకడానికి సహకరించిన మద్రాసు, మైసూరు, హైదరాబాదు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారాల అధిపతులు

పరిశోధనకు కావలసిన ముద్రిత గ్రంథాలను పెక్కింటిని అందించిన ఆత్మీయులు శ్రీ చిఱ్ఱావూరి నాగభూషణాచార్యులు,

కళాప్రపూర్ణ డా॥ రావూరి భరద్వాజ, శ్రీ ఆరెపాక సుబ్బారావు, డా॥ చిటిప్రోలు సుబ్బారావు, డా॥ వి. సుబ్రహ్మణ్యం మొదలైనవారు.

పరిశోధన కుపకరించిన ఛాయాచిత్రాల సేకరణలో సహకరించినవారు శ్రీ యన్. నవీన్‌కుమార్, శ్రీ కె. టి. మన్నార్, శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రిగార్లు.

ఇందరి సహకార ఫలమీ సిద్ధాంత వ్యాసం. వీరందరికీ పేరు పేరున కృతజ్ఞతాపూర్వక నమస్సు లందిస్తున్నాను.

కన్నెకంటి రాజమల్లాచారి.

# అవతారిక

బ్రహ్మంగారిని గురించి పరిశోధన చేయాలనే సంకల్పం ఈనాటిది కాదు. ఒక దశాబ్దం క్రిందటే ఈకోరిక నాలో కలిగింది. నా యీ కోరికను కొందరు పండితులకు నివేదించాను. కానీ వారు బ్రహ్మంగారిని గురించి చేయదగిన అంశం ఏమీలేదని నిరుత్సాహ పరచారు. బైరాగులు పాడుకొనే ఆ పదితత్త్వాలు తప్ప ఆయన రచన లేమున్నాయి? అన్నారు నిజమే ననుకొన్నాను. ఈఅంశాన్ని గురించి పరిశోధన చేయాలనే కోరికను దాదాపు ఉపసంహరించు కొన్నాను. 1980వ సంవత్సరాంతంలో నాగార్జున విశ్వవిద్యాలయంలో అప్పటి తెలుగు శాఖాధ్యక్షులు పూజ్యశ్రీ డా॥ తూమాటి దొణప్పగారిని కలుసుకొని నాయీ కోరికను విన్నవించాను. బ్రహ్మంగారిని గురించి ఇంతవరకూ ఎవ్వరూ పరిశోధన చేయలేదు. ఇది తప్పక పరిశోధించ దగిన అంశం అని వెన్నుతట్టి ప్రోత్సహించారు. నన్ను పరిశోధనా మార్గంలో నిలువబెట్టారు.

పరిశోధన కుపక్రమించాను. ఏ గ్రంథాలయాల్లోనూ బ్రహ్మం గారి గ్రంథాలు లేవు. మద్రాసు, మైసూరు మొదలైన నగరాల్లోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారాలను గాలించాను. బ్రహ్మంగారి తాళపత్ర గ్రంథాలు లభించలేదు. కడప జిల్లాలో ఉన్న బ్రహ్మంగారి మఠానికి సిద్ధయ్య మఠానికివెళ్ళి అక్కడ భద్రపరచిన తాళపత్ర గ్రంథాలు చదువుకొని నోట్సు రాసుకొన్నాను. ఆ పరిసర ప్రాంతాల్లో రప్యటించి నలభై సంవత్సరాలనాడు ముద్రించబడిన బ్రహ్మంగారి కాలజ్ఞానం, ఇతర గ్రంథాలను సేకరించాను. బ్రహ్మం గారి ఆ రచన లన్నింటినీ చదివిన తరువాత దుర్గమారణ్యంలో ప్రయా ణించి గమ్యం చేరడం లాంటిదే ఈ పరిశోధనమనిపించింది. అయినా

నాశక్తికొలది ప్రయత్నించి "పోతులూరి వీరబ్రహ్మంగారి జీవితం - రచనల పరిశీలన" అనే యీ సిద్ధాంతవ్యాసం రచించగలిగాను.

వీరబ్రహ్మం గారిని దేశవాసులంతా బ్రహ్మంగారు అంటూ ఉంటారు. ఆయనను గురించి రచయితలు అనేకులు గ్రంథాలు రాసినప్పటికీ వాటిలో ఎక్కువభాగం శాస్త్రీయమైనవి కావు. బ్రహ్మం గారి రచనలను మాత్రమే ప్రామాణికాలుగా గ్రహించి చేసిన పరిశోధన మిది.

బ్రహ్మంగారు తాత్వికుడు కావడానికి, రచనలు చేయడానికి హేతుభూతాలైన క్రీ॥ శ॥ 16వ శతాబ్ది రాజకీయ, మత, సామాజిక పరిస్థితులు, బ్రహ్మంగారిపై వెలువడిన శతాధిక రచనలు, కాలనిర్ణయం కాలజ్ఞాన రచన, జీవిత సంగ్రహం మొదలైన అంశాలు ప్రథమ ప్రకరణంలో చర్చించబడ్డాయి.

బ్రహ్మంగారు రచించిన కాలజ్ఞానపు గుజిలీ ప్రతుల విశేషాలు, స్వరూప స్వభావాలు, ఆ గ్రంథంలో ఉన్న వచన, ద్విపద, కాలజ్ఞానాలు, సౌజన్యపత్రికలు, జీవైక్యబోధ, సిద్ధబోధం, హంస కాళికాంబ పద్య రత్నాలు, గోవింద వచనాలు, కాలజ్ఞాన తత్వాలు, మొదలైన రచనల సారసంగ్రహ రచన, సమీక్ష, రాజకీయ మత సామాజికాలుగా విభజింపబడి ప్రదర్శింపబడిన బ్రహ్మంగారు చెప్పిన భూత భవిష్యద్వర్తమానాలు, బ్రహ్మంగారి తార్కికదృష్టి, ఆయన రచనలోని సందేశ సారాంశం, బ్రహ్మంగారి వేదాంతం, వేదాంత పారిభాషిక పదాలకు వివరణ, బ్రహ్మంగారివంటి సిద్ధపురుషులు మున్నగు విషయాలు ద్వితీయ ప్రకరణంలో పరిశీలించబడ్డాయి.

కాలజ్ఞాన గ్రంథంలోని భాషాదిక విశేషాలు బ్రహ్మంగారు ఉపయోగించిన ఛందస్సులు, అలంకారాలు, ఆయన రచనలోని

సంగీతం, జ్యోతిశ్శాస్త్ర సంబంధమైన అంశాలు, రచనలలో ఆయన ప్రయోగించిన వృత్తిసంబంధమైన పదాలు, జాతీయాలతో కూడిన వచనాలు, అర్వాచీనులపై బ్రహ్మంగారి ప్రభావం, ఉపసంహారం అనే విషయాలు తృతీయ ప్రకరణంలో వివరించబడ్డాయి.

జనశ్రుతిలో బ్రహ్మంగారి జీవిత చరిత్ర, ఆయన స్వరూప నిరూపణ, కలియుగ ప్రారంభానికి శాసనాధారం, తెలుగు సంవత్స రాలకు సరియైన ఆంగ్ల సంవత్సరాలను తెలియజేసే పట్టిక మున్నగు అంశాలు అనుబంధాల్లో చేర్చబడ్డాయి.

చివరగా ఈ పరిశోధనా వ్యాసానికి ఉపకరించిన ఆధార గ్రంథ సూచిక ఇవ్వబడింది.

— ర చ యి త.

# సంకేతాక్షర పట్టిక

| | | | |
|---|---|---|---|
| 1 | కాల. | : | కాలజ్ఞానము |
| 2. | కా. త. | : | కాలజ్ఞాన తత్వములు |
| 3. | ప్ర. ము. | : | ప్రథమ ముద్రణము |
| 4. | ద్వి. ము. | ; | ద్వితీయ ముద్రణము |
| 5. | సం. | : | సంపుటము |
| 6. | వ్యా. | : | వ్యాసము |
| 7. | అను. | : | అనువాదము |
| 8. | ప్రచు. | : | ప్రచురణ |
| 9. | గీ. మ. | : | గీతా మకరందము |

# ఆశీస్సులు



'సాహిత్యరత్న' 'శాస్త్రి'
బ్రహ్మశ్రీ పి. వి. రమణారెడ్డి, M. A.,
రిటైర్డు ప్రిన్సిపాల్,
నరసరావుపేట.

డాక్టర్ కన్నెకంటి రాజమల్లాచారి రచించిన పరిశోధక వ్యాస సంపుటిని చూచితిని. పోతులూరి వీరబ్రహ్మంగారి జీవితమును రచనలను గురించి చేసిన పరిపూర్ణ పరిశీలన ఇందులో ఉన్నది. బ్రహ్మంగారు వేదాంతి, సిద్ధాపరుడు, గురువుగా, వేదాంత ప్రచారకుడుగా ప్రజల హృదయములలో స్థిరస్థానమును పొందగలిగిన మహా సంఘ సంస్కర్త .... "సమానీప్రపా, సహవోన్నభాగః" అన్న వేదాదర్శమును నమ్మి అందరు సమానులని భావించి "సమంహి బ్రహ్మ" అన్న గీతా సిద్ధాంతమును ప్రజల కందించి సమదర్శిగా యథార్థ జీవితమును సాగించిన బోధగురువు. అందుకై వారు ఆ జీవనము సాధించిన వేదాంత విజ్ఞానమును తత్వములద్వారా, వివిధ సాహిత్య ప్రక్రియల ద్వారా ఆంధ్రదేశము నలుమూలల తిరిగి ప్రబోధించిన మహాయోగిగా నేటికిని కీర్తింపబడుచున్నారు.

ఇట్టి మహనీయుని జీవితము, బోధలు నేటికిన్ని చాలా అవసరములుగా నున్నవి. వీటిని మన కందించిన మా చిరంజీవి రాజమల్లాచారి ధన్యుడు. ఈ పరిశోధన ద్వారా పి. హెచ్. డి. పట్టాను పొంది కీర్తి ప్రతిష్ఠలను పొందుట మాకు ఎంతో ఆనందముగా నున్నది.

ఇతన్నికి సంగీత సాహిత్యములు కరతలామలకములు. "కవనంబున్ లిఖియింతు శక్తికొలదిన్ గానంబు గావింతు అష్టవధానం బొనరింతు ఆశువుగ మాటల్ కూర్పగా నేర్తు" నన్న పల్నాటి సోదరకవి మధ్యముడు కీ॥ శే॥ కన్నెకంటి చినలింగాచార్యులవారు ఇతనికి పితృపాదులు. ఆ వారసత్వమును పుణికిపుచ్చుకొని కవిగా, గాయకుడుగా, నవలా, గేయ రచయితగా, ఆచార్యుడుగా, పరిశోధకుడుగా పేరు ప్రఖ్యాతులు గడించి తండ్రిని మించిన కొడుకనిపించుకొని వంశ ప్రతిష్ఠను పెంపొందించిన వాడు మా రాజమల్లాచారి.

ఇతడు ఇంకను సారస్వతంలో వివిధ ప్రక్రియలలో నూతన గ్రంథాలను రచించి ఆంధ్ర సరస్వతికి నవ్యాతినవ్య భూషణములను తొడిగి కవిశేఖరుడుగా కీర్తిప్రతిష్ఠలను పొందాలని ఆశిస్తూ ఇతనికి ఆయురారోగ్యముల నిచ్చుగాక యని సర్వేశ్వరుని హృదయపూర్వకంగా ప్రార్థిస్తూ ఆశీర్వదించుచున్నాను.

మకాం ఇట్లు,

హైదరాబాదు మీ శ్రేయోభిలాషి,

29-7-88. (సం.) పి. వి. రమణారెడ్డి

**ఉపక్రమణిక :—** భారతావనిలో ప్రాచీన కాలంనుంచి అనేక రంగాల్లో విఖ్యాతి పొందిన మహాపురుషులెందరో ఉద్భవించారు. వేదాంత సాహిత్య విజ్ఞాన కళాప్రపంచంలో విశేషమైన కృషిచేసిన విశిష్టవ్యక్తులతో భారతచరిత్ర పూతమైంది. ఇటువంటివారిలో పోతులూరి వీరబ్రహ్మంగారు ఒకరు. వీరిని బ్రహ్మంగారని అంటూ ఉంటారు.1 బ్రహ్మంగారు ఆంధ్రదేశంలో నివసించారు.

ఇప్పటివరకు ఆంధ్ర సాహిత్యంలో అనేకులు కవిపండితులు వివిధ ప్రక్రియల్లో బ్రహ్మంగారి జీవితచరిత్రను రచించారు. ఇవి కావ్యాలు, కందార్థాలు, గేయాలు నాటకాలు, హరికథలు, బుర్ర కథలుగా ఉన్నాయి. వీటిలో కొండూరి వీరరాఘవాచార్యులు, కొడాలి లక్ష్మీనారాయణ వ్రాసిన గ్రంథాలు పరిశోధనా దృష్టితో రాయబడ్డాయి. ఇతర రచయితలు జనశ్రుతిలో ఉన్న గాథలను ఎత్తిరాశారే గాని బ్రహ్మంగారి రచనలను శాస్త్రీయ పద్ధతిలో అధ్యయనంచేసి పరిశోధనా గ్రంథాన్ని రచించలేదు. ప్రస్తుత సమాజం అనుష్ఠించ దగిన వర్ణవిభేదనిర్మూలన, అస్పృశ్యతా నివారణ, హిందూ మహమ్మదీయ సమైక్యత, సర్వమత సమ్మేళనం మొదలైన ధర్మాలను తన రచనలద్వారా బోధనద్వారా 17వ శతాబ్దిలోనే అందించిన బ్రహ్మం గారి జీవితచరిత్ర, రచనలు భారతీయులంతా చదువదగినవి. అందుకే బ్రహ్మంగారి కాలజ్ఞాన గ్రంథాన్ని ప్రామాణికమైన ఆధారంగా స్వీకరించి ఇతరగ్రంథాల తోడ్పాటుతో బ్రహ్మంగారి జీవిత, కవిత్వ తత్త్వాలను ఆవిష్కరించే చిన్నప్రయత్నమిది.

---

1. ఇకమీదట ఈగ్రంథంలో అంతటా "బ్రహ్మంగారు" అనే వ్రాయ బడింది.

**పూర్వరంగ ప్రస్తావన :—** బ్రహ్మంగారు క్రీ. శ. 1608 కీలక నామ సంవత్సరంలో ప్రభవించారు. 1 ఆయన తన సమకాలీన సమాజంలోని సాంఘిక మత దురాచారాలను, మూఢ విశ్వాసాలను. ఖండించి సరికొత్తతత్వాన్ని ప్రబోధించారు. బ్రహ్మంగారు ఈవిధంగా చేయడానికి ఆనాటి రాజకీయ, సాంఘిక, మత, స్థితిగతులకూ పరస్పర సంబంధం ఉంది. బ్రహ్మంగారి తాత్విక భావోత్పత్తికి మూలకందా లనదగిన ఆయా స్థితులు ఈక్రింద ఆవిష్కరించ బడుతున్నాయి.

**రాజకీయ పరిస్థితులు :-** బ్రహ్మంగారు ఇంకా మూడు సంవత్స రాలకు జన్మిస్తారనగా, అంటే క్రీ॥ శ॥ 1605లో అక్బరు కుమారుడు జహంగీరు ఢిల్లీ సింహాసనాన్ని ఎక్కాడు. భారతదేశం ముస్లిముల పాలనలో వుంది. ఆంధ్రదేశంలో విజయనగరరాజుల పాలన అంత రించింది. అప్పుడు ఆంధ్రదేశంలోని సంస్థానాలు నవాబుల ఏలుబడిలో ఉన్నాయి. అంటే యావద్భారత దేశంలోనూ ఆంధ్రదేశంలోనూ ముస్లిముల పాలన ముమ్మరంగా కొనసాగుతున్నది. బ్రహ్మంగారి పుట్టుకకు ముందరిశతాబ్దమూ (16వ శతాబ్దం) బ్రహ్మంగారు జీవించిన శతాబ్దమూ (17వ శతాబ్దం) ముస్లిములచేత పరిపాలించబడ్డాయి.

**సాంఘిక పరిస్థితులు:—** ముస్లిముల రాకతో భారతీయ సాంఘిక చరిత్రలో కొన్నిపరిణామాలు సంభవించాయి. ముస్లింలకు నిర్దిష్టమైన మతసంప్రదాయాలు నాగరకతా సంస్కృతులూ ఉండడంచేత వాళ్లు భారతీయుల్లో కలిసిపోకుండా తమ విలక్షణతను కాపాడుకొన్నారు.

---

1. బ్రహ్మంగారి కాలనిర్ణయిం గురించినచర్చ తరువాతి అధ్యాయింలో చేయబడింది.

హైందవసమాజంకూడా వైలక్షణ్యాన్ని కాపాడుకొంది. ఈపరిస్థితుల్లో మహమ్మదీయులు స్వీయమత విస్తరణ కార్యక్రమాన్ని చేపట్టారు. వీళ్లు హిందువులను కాఫిర్లు అని నిందించారు. హైందవులు కూడ స్వీయమత సంరక్షణ కార్యక్రమాన్ని ప్రారంభించారు. మహమ్మదీయులను మ్లేచ్ఛులని నిందించారు. ఇందువల్ల రెండు సాంఘిక విభాగాలమధ్య పరస్పర సంఘర్షణ ప్రారంభమైంది. ఈ యిరువర్గాల మధ్య స్నేహ సంబంధాలు సన్నగిల్లి శాశ్వితమైన వైషమ్యాలు ఏర్పడ్డాయి. హైందవ మహమ్మదీయ సమాజాలు రెండూ భిన్నాలయినప్పటికీ అజ్ఞానం సంప్రదాయ ప్రియత్వం అనేవి ఉభయుల్లోనూ సమానంగా ఉన్నాయి. ఉభయసంఘాలూ బహుభార్యాత్వాన్ని కలిగి ఉన్నాయి. రెండు సమాజాలూ శకునాలనూ తాయెత్తులనూ జాతకాలనూ విశేషంగా విశ్వసించాయి. యోగులూ మతగురువులూ మున్నగు వారిపట్ల భక్తిప్రపత్తులు పెరిగాయి. హిందువులలో శైవ వైష్ణవాది తెగలున్నట్లు మహమ్మదీయుల్లో సైతం సున్నీ, షియా, సూఫీ ప్రభృతి తెగలేర్పడ్డాయి.

**మత పరిస్థితులు :—** ఇస్లాం మత సంపర్క ఫలితంగా భారత దేశంలో గొప్ప సంస్కరణోద్యమాలు ఉద్భవించాయి. ఇస్లాంమతంలో ఉన్న ఏకేశ్వరారాధన, నిర్గుణోపాసన, నిరాడంబర పూజావిధానం సాంఘిక సమతాభావం హిందువులలో ఆలోచనను రేకెత్తించాయి. బహు దేవతారాధన, నిరర్థక కర్మకాండ, వర్ణ విభేదం, మున్నగు దొసగులే హైందవమతం నీరసించి అపజయం పొందడానికి హేతువులని హిందువులు గ్రహించారు. అగ్రవర్ణాలచేత నీచంగా చూడబడిన దిగువ వర్ణాలవారు సాంఘికగౌరవాన్ని సాధించడానికి అసంఖ్యాకంగా మహమ్మదీయ మతాన్ని స్వీకరించారు. ఇలాంటి పరిస్థితుల్లో హిందువులు స్వీయమతదోషాలను సంస్కరించడం అనివార్యమని భావించారు.

హైందవులతో చిరకాలం కలిసిమెలిసి జీవించడంవల్ల మహమ్మ దీయుల్లో సైతం కొంతమార్పు సంభవించింది. అప్పటికే వాళ్లలో సూఫీ సిద్ధాంతం అవతరించింది. సూఫీలు కర్మవాదులు. వాళ్లు కర్మ పునర్జన్మలను విశ్వసించారు. అన్యమత సహనాన్ని అవలంబించారు. సూఫీలు మాత్రమేకాక ముస్లిములలో మిగతాశాఖలుకూడా హైందవ మతంలోని సుగుణాలను అర్థంచేసికోవడం అవసరమనీ మతద్వేషం అర్థరహితమనీ అంగీకరించారు. ఈ అంశాన్ని అమీర్ ఖుస్రూ వంటి పండితులు ప్రచారం చేశారు. ఇలా ఉభయవర్గాలమధ్య లభించిన అనుభవాల ఫలితంగా నాటి మతప్రచారాల్లో సహనం, సమన్వయం మౌలికసూత్రాలయ్యాయి.

హిందువుల్లోని మతోద్యమం ద్విముఖంగా సాగింది. కొంత మంది హైందవ మతాధారాలయిన వేదాలకూ ధర్మశాస్త్రాలకూ వ్యాఖ్యానాలను రచించారు. ఈ రచనలద్వారా వైదిక ధర్మానక్తిని కలిగించడానికి ప్రయత్నించారు. హైందవులు వైదికధర్మ వైశిష్ట్యాన్ని గ్రహించగలిగితే ఆ ధర్మరక్షణకు వాళ్లే కంకణంధరించి ఇస్లాంమతం పట్ల వైముఖ్యాన్ని ప్రదర్శిస్తారని వారినమ్మకమై ఉండవచ్చు. బెంగాలు దేశంలో విశ్వేశ్వర కుల్లక పండితులు, విజయనగరంలో సాయణ మాధవాచార్యులు, వేదాలకు, స్మృతులకు, భాష్యాలు వ్రాశారు. ఇదేసమయంలో పురాణాలను ప్రాంతీయ భాషల్లోనికి అనువదించే కార్యక్రమం ఇబ్బడి ముబ్బడిగా సాగింది. ఈ గ్రంథాల వల్ల ప్రజలకు ధర్మానక్తి కలిగి తద్వారా హైందవమత రక్షణ జరుగు తుందని వారి విశ్వాసం.

ఆరోజుల్లో ఇంతకంటే ముఖ్యమైన ఉద్యమం ప్రభవించింది. ఇస్లాం మతంలోని సుగుణాన్ని గ్రహించి హైందవసమాజాన్ని సంస్క

చించే ప్రయత్నం జరిగింది. భక్తిమార్గంద్వారా ఈ సంస్కరణను సాధించడానికి ప్రయత్నించారు. దీనివల్ల హిందూమతోద్యమాల్లో భక్తి గణనీయమైన స్థానాన్ని ఆక్రమించింది. నిజానికి భక్తి హైందవ మతంలో ఉపనిషత్తుల కాలంనుంచే ఉంది. త్రిమతాచార్యులు భక్తికి అగ్రస్థానాన్ని కల్పించారు. భక్తిమార్గం, నిరాడంబర పూజావిధానం, వర్ణ రాహిత్యం, ఏకేశ్వరార్చన, నిర్గుణారాధన మున్నగు విషయాలపై ఆసక్తి ఇస్లాంమత ప్రభావమనే చెప్పవచ్చు. ఇంతేగాక రామానుజుడు సర్వం భగవదర్పితమనే భగవద్గీత భావాన్ని ప్రచారంచేసి దిగువ కులాలవారిలో చైతన్యాన్ని కలిగించాడు. మహమ్మదీయులచేత పరాజయంపొంది పరాభవాలకు గురిఅవుతూ నిస్సహాయులుగా ఉన్న హిందువులకు భక్తిప్రపత్తులు, పారలౌకిక చింతన, ముక్తిభావన ఉప శాంతిగా ఉపకరించాయి.

క్రీ॥శ॥ 16వ శతాబ్దినాటికి రాజకీయంగా భారతీయ సామ్రాజ్యాలు విచ్ఛిన్నమై చిన్న చిన్న రాజ్యాలుగా ఏర్పడ్డాయి. భరతావని అనైక్యానికి అశాంతికీ నిలయమైంది. అయినప్పటికీ ఈ శతాబ్దిలో సాంఘికంగా హిందూ ముస్లిం వర్గాలు సాన్నిహిత్యాన్ని సంతరించు కొన్నాయి. ముస్లిములకు తాము భారతీయులమనే భావం కలిగి వారిలో దేశాభిమానం అంకురించింది. భారత దేశాభిమానాన్ని స్పష్టంగా వ్యక్తీకరించిన ప్రథమముస్లిం అమీర్ఖుస్రూ. స్థానికమైన హైందవాచారాలను ముస్లిములు అనుసరించసాగారు. వారికి శకునా లలో, లగ్నాలలో, జాతకాలలో నమ్మకం పెరిగింది. మృత్యుముఖంలో ఉన్నవారిని భూశయనం చేయించడం, మృతులపట్ల గౌరవసూచకంగా జుట్టు తీసివేయడం, వైధవ్యం ప్రాప్తించిన వనితలు అలంకారాలు, రంగుబట్టలు, విసర్జించడం మున్నగు ఆచారాలను అనుసరించారు. ముస్లిములలో విగ్రహారాధనకూడా ప్రారంభమైంది. ముస్లింలు తమ

గురువులకు పాదాభివందనం చేయసాగారు. హిందూ సాధువులలాగా ముస్లిములలోకూడా బైరాగులు రూపొందారు. ఇలాంటి బైరాగులు తులసిపూసల మాలలు అలంకరించుకొని విభూతి ధారణ చేశారు. వీరిలో కొందరు శివార్చన చేస్తూ అహింసావ్రతాన్ని కూడా పాటించారు.

ఇలాంటి మత రాజకీయ సామాజిక స్థితిగతులలో బ్రహ్మంగారు పుట్టి పెరిగారు. ఆయన తాత్వికుడు కావడానికి తాను పుట్టి పెరిగిన శతాబ్దిలోని ఆయాపరిస్థితులు హేతుభూతాలయ్యాయని చెప్పవచ్చు.1

## బ్రహ్మంగారిని గురించిన రచనలు :-

పందొమ్మిదవ శతాబ్దం ప్రారంభదశవరకూ బ్రహ్మంగారి జీవిత చరిత్ర రచన జరుగలేదు. అంతవరకూ ఆయనచరిత్ర జనసందోహంలో మౌఖికప్రచారాన్ని మాత్రమే పొందిఉంది. ఈ శతాబ్ది మధ్యకాలంలో ఈయనచరిత్ర రచించినవారు అనుములకొండ శివరామ బ్రహ్మేంద్ర స్వామి. ఈయన రచించిన గ్రంథంపేరు "శ్రీ వీరబ్రహ్మేండ సర్వ శాస్త్రసమాధాన వ్యత్యయ నిత్య రత్నాకరము". దీని కడపటిభాగంలో బ్రహ్మంగారి చరిత్ర లిఖించబడింది. ఈ గ్రంథం సుమారు నూరు సంవత్సరాల క్రిందట ముద్రించబడిందని స్వామి లింగస్వామి.

1. ఈ పరిచ్ఛేదంలో చెప్పబడిన అంశాలు Dr. B. S. L. హనుమంత రావు రచించిన "భారతదేశ చరిత్ర — సంస్కృతి" అనే గ్రంథంలోని 23, 24, 25, 217, 219, 221 పుటలనుంచి గ్రహించబడ్డాయి

రాశాడు.[1] శివరామ బ్రహ్మేంద్రస్వామి రాసిందే బ్రహ్మంగారి జీవితాన్ని గురించిన ప్రథమ గ్రంథమని చెప్పవచ్చు. ఆ తరువాత హనుమయాచారి అనే రచయిత బ్రహ్మంగారి చరిత్రను హరికథగా రాశాడు. క్రీ॥ శ॥ 1929లో చాటకొండు సుబ్బయ్య బ్రహ్మంగారి జీవిత చరిత్రను గద్యంగా రాశాడు. క్రీ॥ శ॥ 1920లో తాటికొండ రాఘవాచార్య "వీరాచార్యచరిత్ర" అనే వచనగ్రంథాన్ని రచించాడు. తరువాత వడ్డెపాటి నిరంజనశాస్త్రి "కల్యంధ కౌముది" అనే కావ్యాన్ని కడియాల వీపూరయాచార్య "బ్రహ్మంగారి చరిత్ర" అనే యక్షగానాన్ని రచించారు. ఇంకా నాటినుంచి నేటివరకు బ్రహ్మంగారి జీవితంపై వెలువడిన వివిధసాహిత్య ప్రక్రియలలో ఉన్న గ్రంథాలు ప్రకృత పరిశోధనలో లభించిన మేరకు ఆధారగ్రంథ సూచికలో ప్రదర్శించబడ్డాయి.

***బ్రహ్మంగారి చరిత్ర రచనకు ఆధారాలు :—*** ప్రథమంగా బ్రహ్మంగారి చరిత్రను రాసినవారికి బ్రహ్మంగారు రచించిన కాలజ్ఞాన తాళపత్ర గ్రంథమే ఆధారం. అందులో విష్ణు బ్రహ్మ మహేశ్వరులు బ్రహ్మంగారుగానూ అన్నాజయ్యగానూ ఆనందభైరవయోగిగానూ అవతరించడం, బ్రహ్మంగారు ఉత్తరదేశంలో ఉద్భవించడం, బనగానపల్లెలో నివసించడం, కాలజ్ఞానం రచించడం, భైరవానందుడూ అన్నాజయ్యా మొదలైనవారు బ్రహ్మంగారిని కలుసుకోవడం, బ్రహ్మంగారు ఆసేతు

---

1. లింగస్వామి, స్వామి — యదార్థ కాలజ్ఞాన సహిత వీరబ్రహ్మేంద్ర జీవితచరిత్ర: ప్రచు: శ్రీ వీరభోగ వసంతరాయాశ్రమం, శాలిబండ, హైదరాబాదు, ఫిబ్రవరి, 1979, పీఠిక, పు. 2.

శీతనగ పర్యంతం పర్యటించడం, ప్రజలకు తత్వబోధలు చేయడం, జీవసమాధి నిష్ఠను పొందడం మున్నగు విషయాలకు కాలజ్ఞాన గ్రంథంలో ఆధారాలున్నాయి. మిగతా విషయాలకు అంటే బ్రహ్మం గారి తల్లిదండ్రులగురించి పెంపుడు తల్లిదండ్రులగురించి మహిమల గురించి చేసిన రచనలకు కాలజ్ఞానంలో ఆధారాలులేవు. వీటికి పరం పరగా పెద్దలూ బ్రహ్మంగారి వంశీయులూ చెప్పిన గాథలే ప్రమాణం. వీటికితోడు రచయితలు కొన్ని కల్పనలు చేశారు.

**కాలనిర్ణయం :—** బ్రహ్మంగారి కాలనిర్ణయం చేయడానికి ప్రథమంగా ప్రయత్నించినవారు కందిమల్లయపల్లె నివాసియైన చాటకొండు సుబ్బయ్య. ఈయన 1937లో "వీరబ్రహ్మముగారి సంతానచరిత్ర" ను రచించాడు. ఆయన ఆగ్రంథంలో బ్రహ్మంగారి మనుమరాలు ఈశ్వరమ్మ అనీ ఆమె శిష్యుడు చాటకొండు చెంగన్న అనీ అతని తమ్ముని కుమారుడు రామయ్యఅనీ ఆ రామయ్య కుమారు డను తాననీ చెబుతూ "ఈ చెంగన్న మా తండ్రిగారి తండ్రిగారికి జ్యేష్ఠుడు ఆపరిమాణము ననుసరించి ఈశ్వరమ్మగారు సమాధియై సుమారు నూటముప్పది ఏండ్లుగా నిర్ణయమేర్పడుచున్నది. అంతకు ముందు ఆమె జననము నూరు సంవత్సరములకు జరిగినది. అంతకు ముందు శ్రీ వీరబ్రహ్మముగారు సమాధియై సుమారు పదిసంవత్సరములు చేరి శాలివాహన శకాబ్దము 1854లకు సరియైన శ్రీముఖ నామ సంవత్సరమునకు రమారమి 240 సంవత్సరముల కాలమున"[1] అని రాశారు.

---

1. సుబ్బయ్య, చాటకొండు — వీరబ్రహ్మముగారి సంతానచరిత్ర, ప్రచు : శ్రీ వంకర వీరయ్యగారు, కందిమల్లాయపల్లె, 1929 పు. 73

చాటకొండు సుబ్బయ్య బ్రహ్మంగారి కాల నిర్ణయాన్ని స్పష్టంగా చేయలేదు. రమారమి లెక్కలు వేశాడు. ఈ నిర్ణయాన్ననుసరించి బ్రహ్మంగారు 17వశతాబ్దిలో శ్రీముఖనామ సంవత్సరంలో సమాధిప్రవేశం చేసినట్లు తెలుస్తుంది.

కొండూరి వీరరాఘవాచార్యులు 1952లో బ్రహ్మంగారి కాల నిర్ణయించేస్తూ భారతి మాసపత్రికలో వ్యాసం రాశారు. బ్రహ్మంగారి కాలజ్ఞాన తత్వాలనూ ఇతర సాహిత్యాన్ని ఆధారంగా చేసికొని బ్రహ్మంగారు సుమారు క్రీ॥ శ॥ 1604 సం॥లో జన్మించి క్రీ॥ శ॥ 1690 తరువాత సమాధిప్రవేశం చేసిఉంటారని ఆ వ్యాసంలో నిర్ణయించారు.

కొడాలి లక్ష్మీనారాయణ 1978వ సంవత్సరంలో "చారిత్రక దృక్పథంలో వీరబ్రహ్మేంద్రస్వామి" అనే గ్రంథాన్ని రచించారు. బ్రహ్మంగారి రచనలనూ ఇతర చారిత్రక గ్రంథాలనూ పరిశోధించి, ఆ గ్రంథంలో బ్రహ్మంగారి కాలనిర్ణయం చేశారు. ఈ నిర్ణయప్రకారం బ్రహ్మంగారు క్రీ॥ శ॥ 1608 కీలకనామ సంవత్సరంలో జన్మించి క్రీ॥ శ॥ 1693, శ్రీముఖనామ సంవత్సరంలో సమాధి ప్రవేశం చేశారని తెలుస్తుంది.

పూర్వ పరిశోధకుల్లో చాటకొండు సుబ్బయ్య రమారమి లెక్కలువేసి బ్రహ్మంగారు 17వ శతాబ్దిలో శ్రీముఖనామ సంవత్సరంలో సమాధిప్రవేశం చేసినట్లు నిర్ణయించారు. బ్రహ్మంగారి జన్మతిథిని గురించి ఆయన చెప్పలేదు. తరువాత వీరరాఘవాచార్యులు, లక్ష్మీనారాయణ ఇరువురూ నాలుగేండ్ల తేడాతో బ్రహ్మంగారు 17వ శతాబ్దిలో జీవించినవాడని అంగీకరించారు.

ఏకవి కాలాన్నయినా నిర్ణయించడానికి ఆ కవి కాలపు శాసనాలు, స్థానిక చరిత్రలు, ప్రామాణికాలు. కానీ బ్రహ్మంగారి కాలానికి సంబంధించిన శాసనాలు లేవు. మెకంజీ దొర సంపాదించిన స్థానికచరిత్రల్లో కూడా బ్రహ్మంగారికి సంబంధించిన అంశాలు లేవు. మైసూరు, మద్రాసు, హైదరాబాదు మున్నగు నగరాలలోని ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారాల్లో బ్రహ్మంగారి కాలజ్ఞాన తాళపత్ర గ్రంథాలు లేవు.

బ్రహ్మంగారి జన్మ తిథిని సమాధి తిథిని నిర్ణయించాలంటే ఆయన స్వయంగా చెప్పిన కాలజ్ఞానం ఇతర రచనలు ప్రామాణికాలు. ప్రస్తుతం బ్రహ్మంగారి మఠంలోఉన్న కాలజ్ఞాన తాళపత్ర గ్రంథాలను ప్రామాణికాలని చెప్పవచ్చు. పూర్వపరిశోధకులు రమారమిగా చేసిన కాలనిర్ణయం ఆధారంగానూ, బ్రహ్మంగారి కాలజ్ఞానాన్ని ఆధారంగానూ చేసుకొని బ్రహ్మంగారి కాలనిర్ణయం చేయబడింది.

## *బ్రహ్మంగారు 17వ శతాబ్దివాడు :—*

బ్రహ్మంగారు క్రీ॥ శ॥ 17వ శతాబ్దిలో జీవించి ఉన్నారనడానికి విశిష్టమైన ప్రమాణాలు కాలజ్ఞానంలో లభిస్తున్నాయి. ఈ క్రింద ఉదాహరింపబడుతున్న కాలజ్ఞాన వాక్యాలను పరిశీలిస్తే ఆయన 17వ శతాబ్దికి చెందినవాడని స్థూలంగా స్పష్టమవుతుంది. 1) "వేంకటపతి ఏలిన ఏండ్లు 28, నెలలు 7, దినములు 15, అమీఁదట సోమవంశం వారికి పట్నాలులేవు.[1]" ఆనెగొందిని హరిహరరాయలు పాలించినది మొదలు,

1. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానము,
ప్రచు : కృష్ణమూర్తి, రంగయ్య
కందిమల్లాయపల్లె, 1974, పు. 8

అంటే క్రీ॥ శ॥ 1326 నుంచి 1614 వరకు పాలించిన విజయనగర రాజుల కాలాన్ని బ్రహ్మంగారు వర్ణించారు. విజయనగర రాజులలో వేంకటపతిరాయలు కడపటివాడు. ఇది బ్రహ్మంగారు స్వయంగా చెప్పి రాయించిన పత్రిక. ఈ చారిత్రకాంశం 17వ శతాబ్దికి చెందింది.
2) "పెండారీ మరాఠీ బలాలు కపులన బడుదురు."1 ఈ కాలజ్ఞాన వచనంలో చెప్పబడినవారు శివాజీ సైన్యంలోని మరాఠీలు. శివాజీ మరణానంతరం మరాఠీ సైనికులకు వృత్తిలేక కోతుల గుంపుల్లాగా దోపిడీలు చేశారు. ఇది 17వ శతాబ్దికి చెందిన చారిత్రకాంశం.2
3) "కర్ణాటక రాజులు కారడవిలో బడిరి."3 అంటే విజయనగర రాజులకు రాజ్యం లేకుండా పోయిందని భావం. బ్రహ్మంగారు వేంకటపతిరాయల తరువాత వారికి రాజ్యంలేదని కాలజ్ఞాన ప్రథమాశ్వాసంలో చెప్పారు. వేంకటపతిరాయలు క్రీ॥ శ॥ 1614లో మరణించాడు. ఈ అంశం 17వ శతాబ్దికి సంబంధించింది.

పై కాలజ్ఞాన వచనాలు బ్రహ్మంగారు 17వ శతాబ్దిలో ఉన్నాడని చెప్పడానికి తార్కాణాలుగా కనిపిస్తున్నాయి. ఇక ఈ శతాబ్దంలో ఏసంవత్సరంలో జన్మించారో స్పష్టంగా తేల్చవలసిఉంది. బ్రహ్మంగారు కాలజ్ఞానంలో తమ జన్మతిథిని స్పష్టంగా చెప్పారు. ఈఅంశాన్ని

---

1. వీరబ్రహ్మము, పోతులూరి – Op cit, పు. 23.
2. ఖాసింలక్ష్మి, పాటిబండ్ల – భారతదేశ చరిత్ర – సంస్కృతి, సం॥ ఐజక్. ఎన్. ప్రచు : తెలుగు అకాడమీ, 1973. హైదరాబాదు, పు. 132
3. వీరబ్రహ్మము, పోతులూరి – కాలజ్ఞానము, ప్రచు : కృష్ణమూర్తి, రంగయ్య, కందిమల్లాయపల్లె, 1974, పు.23.

పూర్వపరిశోధకులు గమనించలేదు. ఈక్రింది కాలజ్ఞాన వచనంలో బ్రహ్మంగారు తన జన్మతిథిని చెప్పారు. "అక్బరి గుర్రాలు తుంగభద్ర నీళ్లు తాగినదే మొదలుగాను మూడుదినాలకు వచ్చేము - మూడు దినాలు అనగా మూడుఏండ్లు మూడునెలలు"1.

ఈ వచనాన్ని అనుసరించి బ్రహ్మంగారు అక్బరు గుర్రాలు తుంగభద్రనీళ్లు తాగిన (అంటే అక్బరుగాని లేక అతనిసైన్యం కాని విజయనగరం చేరడం) తరువాత మూడు సంవత్సరాల మూడు నెలలకు జన్మించినట్లు చెప్పవచ్చు. అక్బరి గుర్రాలు అంటే అతని రాయబార వర్గానికి సంబంధించినవి కావచ్చు. "అక్బర్ క్రీ॥ శ॥ 1599 నుండి క్రీ॥శ॥ 1600వరకు దక్షిణదేశదండయాత్రల్లో స్వయంగా పాల్గొన్నాడు.2 అని చరిత్రవల్ల తెలుస్తుంది. అక్బరు క్రీ॥శ॥ 1556 నుంచి క్రీ॥శ॥ 1605 వరకు పరిపాలన చేశాడు. చివరిదశలో దక్కనుమీద దండయాత్రలు చేశాడు. క్రీ॥ శ॥ 1600 సంవత్సరం వరకు స్వయంగా దండయాత్రల్లో పాల్గొన్నాడు. అతని రాయబారవర్గం క్రీ॥శ॥ 1600 లోనూ క్రీ॥ శ॥ 1604 లోనూ రెండుసార్లు వచ్చింది. ఇదే అక్బరి గుర్రాలు తుంగభద్ర నీళ్లు తాగడమంటే. అయితే బ్రహ్మంగారు క్రీ॥ శ॥ 1600 నుంచి 1604 వరకు ఉన్నసంవత్సరాల్లో ఏసంవత్సరం తరువాత మూడు సంవత్సరాల మూడు నెలలకు జన్మించారో తేల్చాలి.

---

1. పైది., పు. 94 - ఇక్కడ బ్రహ్మంగారు జరిగినదానిని జరుగబోతున్నట్లుగా వర్ణించారు.

2. ఝాన్సీలక్ష్మి, పోటిబండ్ల — భారతదేశ చరిత్ర - సంస్కృతి, సం॥ ఐజక్. ఎన్. ప్రచు : తెలుగు అకాడమీ, 1973 హైదరాబాదు, పు. 132.

ఈ విషయాన్ని తేల్చడానికి కాలజ్ఞానంలోనే ఇంకా ఆధారాలు ఉన్నాయి.

"నేను ఉత్తరమునుండి ఉద్భవమై పండ్రెండేండ్లు అజ్ఞాతవాసము చేసి ................ సూర్యమండలానకు వచ్చి".1

ఈ కాలజ్ఞాన వచనంలో బ్రహ్మంగారు తాను ఉత్తరదేశంలో జన్మించి పన్నెండు సంవత్సరరాలు అజ్ఞాతవాసం చేసి, బనగానపల్లె చేరినట్లు చెప్పారు. అంటే బనగానపల్లె చేరినప్పటికి బ్రహ్మంగారికి పన్నెండు ఏళ్లు ఉన్నాయన్నమాట.

బ్రహ్మంగారు చెప్పిన ద్విపదలో ఒకచోట ఇలా ఉంది.

"సిద్ధార్ది నామ సంవత్సరమందు
బనగానపల్లెలో పరగంగ నిలచి"2

దీన్ననుసరించి చూస్తే 17వ శతాబ్దిలో 1619వ సంవత్సరం సిద్ధార్ది అవుతుంది. అప్పటికి బ్రహ్మంగారికి పదకొండు సంవత్సరాలు నిండి పన్నెండవ సంవత్సరం వచ్చింది. క్రీ॥ శ॥ 1619లో పదకొండు

---

1. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానము,
   ప్రచు : కృష్ణమూర్తి, రంగయ్య
   కందిమల్లాయపల్లె, 1974, పు. 14.

2. వీరాచార్యులు, పరిమి - పోతులూరి వీరబ్రహ్మంగారి కాలజ్ఞాన తత్వములు, ప్రచు : ఎన్. వి. గోపాల్ అండ్ కో.,
   మద్రాసు, 1976 పు. 6

సంవత్సరాలు తీసివేస్తే క్రీ॥ శ॥ 1608 అవుతుంది. అది కీలకనామ సంవత్సరం.

దీన్నిబట్టి క్రీ॥ శ॥ 1604లో అక్బరి గుర్రాలు తుంగభద్ర నీళ్లు తాగిన తరువాత మూడు సంవత్సరాలు అంటే 1604 + 3 = 1607. ఆతరువాత మూడునెలలు అంటే 1608వ సంవత్సరంలో బ్రహ్మంగారు జన్మించారు.

## బ్రహ్మంగారు సమాధి ప్రవేశించిన తిథి :—

బ్రహ్మంగారు తన జన్మతిథిని చెప్పినట్లుగానే సమాధి ప్రవేశ తిథిని కూడా చెప్పారు. ఈక్రింది కాలజ్ఞాన వచనంలో బ్రహ్మంగారు సమాధిలో ప్రవేశించిన తిథి చెప్పబడింది.

"నందా నందన యోర్మధ్యే వీరభోగ వసుంధరా –
మరుగు చేసినాడు –
ఆది ఆనంద నందన యోర్మధ్యే."1

పై వచనంలో ఆనంద నందననామ సంవత్సరాల నడుమ, వీరభోగ వసుంధరా (బ్రహ్మంగారికి వీరభోగ వసుంధర అనే పేరుకూడా ఉంది. (కాల : పు. 106.) మరుగు చేసినాడు అంటే బ్రహ్మంగారు సమాధి లోనికి వెళ్లాడు అని అర్థం. ఇంకా ఈవిషయానికి వివరణ కూడా ఇచ్చారు బ్రహ్మంగారు.

---

1. వీరబ్రహ్మము, పోతులూరి – కాలజ్ఞానము,
ప్రచు : కృష్ణమూర్తి, రంగయ్య
కందిమల్లాయపల్లె, 1974, పు. 22.

"ఆనందకు నందనకు 39 ఏండ్లకు మధ్య శ్రీముఖ సంవత్సరం నిలిచె గనుక శ్రీముఖమని తెలియవలెనంటెను, మొగలాయి గుఱ్ఱము రామేశ్వరమంటెనా శ్రీముఖమని నిదానమాయెను."1

ఈవచనంలో బ్రహ్మంగారు శ్రీముఖ సంవత్సరంలో సమాధి ప్రవేశం చేస్తానని భవిష్యత్తును నిర్ణయించారు.* దానికొక గుర్తుకూడా చెప్పారు. ఆనంద మొదలుకొని సంవత్సరాలను లెక్కించడం ప్రారంభిస్తే నందననామ సంవత్సరం వరకు 39 సంవత్సరాలు ఉంటాయి. ఆ సంవత్సరాల మధ్యలో శ్రీముఖనామ సంవత్సరం ఉంటుంది. ఆ సంవత్సరం మొగలాయి గుఱ్ఱం రామేశ్వరం చేరిన సంవత్సరం. అదే శ్రీముఖనామ సంవత్సరం అవుతుందని చెప్పారు. ఈ వచనంలోని మొగలాయి గుఱ్ఱం ఔరంగజేబు సైన్యానికి చెందిందని చెప్పవచ్చు. "ఔరంగజేబు యుద్ధాలు ముగిసేనాటికి సామ్రాజ్య విస్తీర్ణం బాగా పెరిగింది. ఉత్తరాన కాశ్మీర్‌నుండి దక్షిణాన కన్యాకుమారి వరకు వ్యాపించింది."2 అని చారిత్రకులు రాశారు. ఔరంగజేబు క్రీ॥శ॥ 1682 నుండి 1707 వరకు దక్కను దండయాత్రలు నిర్వహించాడు. 1687లో గోల్కొండ ముస్లిగువాటిని జయించాడు. 1690 సం॥ తరువాత రామేశ్వరం వరకు అతని సేనలు వచ్చాయి. కనుక మొగలాయివారి గుఱ్ఱాలు రామేశ్వరం వరకూ వచ్చాయి.

---

* ఇక్కడ బ్రహ్మంగారు భవిష్యత్తును భూతంగా వర్ణించారు.

1. పైది.
2. ఝాన్సీలక్ష్మి., పాటిబండ్ల - భారతదేశ చరిత్ర - సంస్కృతి సం॥ ఐజక్. ఎన్. ప్రచు : తెలుగు అకాడమీ, 1978 సం॥ 3, పు. 182.

బ్రహ్మంగారి వ్రాతల ప్రకారం శ్రీముఖనామ సంవత్సరానికి ఔరంగజేబు సైన్యాలు రామేశ్వరంవరకు వచ్చాయి. ఈ శతాబ్దంలో 1693 శ్రీముఖనామ సంవత్సరమవుతుంది. ఇప్పుడు ప్రతిసంవత్సరం బ్రహ్మంగారి మఠంలో వైశాఖ శుద్ధ దశమికి బ్రహ్మంగారి ఆరాధన మహోత్సవం జరుగుతుంది. దీని ననుసరించి బ్రహ్మంగారు క్రీ॥ శ॥ 1693 శ్రీముఖనామ సంవత్సరం వైశాఖ శుద్ధ దశమికి జీవసమాధి ప్రవేశం చేశారు.

## *బ్రహ్మంగారి వంశ వృక్షం :—*

కందిమల్లయపల్లెలో ఉన్న బ్రహ్మంగారి మఠానికి ప్రస్తుత అధ్యక్షులు వీరభోగ వసంత వేంకటేశ్వర స్వాములు. వీరి తండ్రి శ్రీనివాస స్వాములు. తాత వేంకటేశ్వర స్వాములు. వీరి కాలంలోనే బ్రహ్మంగారి చరిత్ర వివిధ సాహిత్య ప్రక్రియల్లో రచింపబడింది. ఆంధ్రదేశంలో ప్రాచుర్యాన్ని పొందింది. కందిమల్లయపల్లె నివాసి చాటకొండు సుబ్బయ్య ఈ వేంకశ్వరస్వామికి సమకాలికుడు. బ్రహ్మంగారి భక్తుడు. వేంకటేశ్వరస్వామి ప్రోత్సాహంవల్ల ఈయన 1929వ సంవత్సరంలో "బ్రహ్మంగారి చరిత్ర" 1933వ సంవత్సరంలో "బ్రహ్మముగారి సంతానచరిత్రము" రచించి ముద్రించాడు. "సంతాన చరిత్రము" పీఠికలో చాటకొండు సుబ్బయ్య పద్యరూపంలో బ్రహ్మంగారి వంశవృక్షాన్ని చిత్రించాడు. అందులో బ్రహ్మంగారు మొదలుకొని ఇప్పటి పీఠాధిపతివరకు ఉన్నవారిని గురించి రాశారు. బ్రహ్మంగారి తల్లిదండ్రులను గురించిగాని పెంపుడు తలిదండ్రులను గురించి గానీ రాయలేదు. బ్రహ్మంగారు కాలజ్ఞాన గ్రంథంలో –

> "పూర్వమందు అయోని సంభవులమై అత్రి మహామునుల కుమారులమైన దత్తాత్రేయుల పేరు గలిగి"

అని చెప్పారు గాని తమ తలిదండ్రుల విషయాన్ని ప్రస్తావించలేదు. అందుచేతనే బ్రహ్మంగారి చరిత్ర లేఖకులెవ్వరూ వారి మాతాపితలను వంశవృక్షంలో చేర్చలేదు. చాటకొండు సుబ్బయ్య బ్రహ్మంగారి వంశవృక్షాన్ని ఇలా వర్ణించాడు.

శ్రీ విశ్వరూపమైన చిన్మయతత్వమే బ్రహ్మంగారి అవతరణకు కారణం. ఆయన గోవిందమ్మను వరించారు. ఆయనకు ఐదుగురు కుమారులు, ఒక్క కుమార్తె. వారిలో సిద్ధలింగయ్య జ్యేష్ఠుడు. గోవిందయ్య ద్వితీయుడు. పోతులూరయ్య తృతీయుడు. శివరామయ్య నాలుగవవాడు. ఓంకారమయ్య ఐదవవాడు. ఆరవ సంతానమైన కుమార్తె వీరనారాయణమ్మ. బ్రహ్మంగారి సంతానంలో సిద్ధలింగయ్య తాతగారి ఇంటికి దత్తుడుగా వెళ్లాడు. ఈయన భార్యపేరు శేషమ్మ. గోవిందయ్య గిరెమ్మను వివాహం చేసుకొని ఈశ్వరమ్మ, పార్వతమ్మ, శంకరమ్మ, గోవిందమ్మ, గిరిరాజమ్మ, సాంబమూర్తి, ఓంకారమయ్య అనే సంతానాన్ని పొందాడు. వీరిలో ఆడవారు అవివాహితులుగా ఉండిపోయారు. సాంబమూర్తి, ఓంకారమయ్యలకు సంతానం మిగులలేదు. అంతటితో గోవిందయ్యగారి సంతానం అంతరించింది. పోతులూరయ్య పార్వతమ్మను వివాహం చేసుకొన్నాడు. వీరి పుత్రిక నీలమ్మ పసితనంలోనే పరమపదించింది. శివరామయ్య పాపమ్మను పరిణయం చేసుకొని సర్వమ్మ, కాళమ్మ, అను పుత్రికలను, వెంకటాద్రియ్య. శంభులింగమయ్య, దక్షిణామూర్తి అనే కుమారులను కన్నాడు. వీరిలో ఓంకారమయ్య అవివాహితుడు.

బ్రహ్మంగారి కుమార్తె వీరనారాయణమ్మను నుసుము గ్రామ వాసి అయిన తిరుమలాచార్యులకిచ్చి వివాహం చేశారు. బ్రహ్మంగారి

పురుషసంతతి అంతరించిన తరువాత వీరనారాయణమ్మ పెద్దకుమారుడు పెద్దగోవిందయాచారి బ్రహ్మంగారి మఠానికి అధ్యక్షు డయ్యాడు. ఆ పెద్దగోవిందయాచారికి గోవిందయ్య, వెంకటాద్రి అనే ఇరువురు కుమారులు కలిగారు. గోవిందయ్య పాపమ్మను, వెంకటాద్రి లక్ష్మాంబా దేవిని వివాహం చేసుకొన్నారు. గోవిందయ్యకు పోలుబారు అనే కుమారుడు జన్మించాడు. వెంకటాద్రికి వీరయ్య, నారయ్య, వేంకటేశ్వరస్వామి, గోవిందయ్య అనే పుత్రులు కలిగారు. వీరిలో వీరయ్య చెంచమ్మను వివాహమాడి చిన్నవీరయ్యను కన్నాడు. చిన్న వీరయ్యకు నాగాంబకు వివాహం జరిగింది. వీరికి సంతానం లేదు. నారయాచారి నారమ్మను పెళ్ళిచేసుకొని వెంకమాంబ అనే కుమార్తెను కన్నాడు. వెంకటాద్రి పుత్రుల్లో మూడవవాడు వేంకటేశ్వరస్వామి. ఈయన బ్రహ్మచర్యవ్రత దీక్షను పొందాడు. కడమవాడు గోవిందయ్య. ఈయన రాజయోగాన్ని అనుష్ఠించి మఠాధ్యక్షుడై వెంకమాంబను వివాహం చేసికొన్నాడు. ఈ దంపతులకు వేంకటేశరస్వామి అనే కుమారుడు, శ్రీలక్ష్మీదేవి అనే కుమార్తె జన్మించారు. గోవిందయ్య తరువాత వేంకటేశ్వరస్వామి బ్రహ్మంగారి మఠానికి అధ్యక్షుడయ్యాడు. ఈ వేంకటేశ్వరస్వామి పిచ్చమాంబను (ప్రస్తుతం సజీవులు) వివాహ మాడారు. వేంకటేశ్వరస్వామి క్రీ॥ శ॥ 1932వ సంవత్సరం సెప్టెంబరు నెల 10వ తేదీన సరియైన అంగీరస సంవత్సర భాద్రపద శుద్ధ ౧౦లు శనివారం మధ్యాహ్నం కీర్తిశేషుడయ్యాడు. వేంకటేశ్వరస్వామి తరువాత ఆయన కుమారుడు శ్రీనివాసస్వామి బ్రహ్మంగారి మఠానికి అధ్యక్షుడయ్యాడు. ఈయన భాగీరథాంబను పెళ్లి చేసుకొన్నాడు. శ్రీనివాసస్వామి క్రీ॥శ॥ 1969లో పరమపదించాడు. ఈయన తరువాత ఈయన కుమారుడు వీరభోగ వసంత వేంకటేశ్వరస్వామి బ్రహ్మంగారి మఠానికి అధ్యక్షుడయ్యాడు.



ప్రస్తుత మఠాధిపతితో వ్యాసకర్త

### బ్రహ్మంగారి పుట్టుక :-

బ్రహ్మంగారు సరస్వతీ నదీ తీరంలో అత్రిమహర్షి ఆశ్రమ ప్రాంతంలో జన్మించారని బ్రహ్మంగారి చరిత్రలు రచించిన రచయితలు రాశారు. "ఆ తర్వాతను పూర్వభాగంబున సరస్వతీ నదీ తీరంబున ఒకపుణ్యుండు పుట్టీని" (కాల: పు. 88) అనే కాలజ్ఞాన వచనం పై రచనలకు ఆధారం. సరస్వతీ నదీతీరంలో ఉన్న అత్రి మహర్షి బ్రహ్మంగారిని పెంచాడు అనడానికి స్పష్టమైన ఆధారాలు లేవు. "పూర్వమందు అయోనిసంభవులమై అత్రి మహాముని కుమారులమైన దత్తాత్రేయులు పేరుకలిగి (కాల: పు. 94) అనే వచనంలో బ్రహ్మం గారు చెప్పింది ఆయన పూర్వజన్మ వృత్తం అని కొందరంటారు. ఈ వచనాన్ని ఆధారం చేసికొని రచయితలు బ్రహ్మగారు అత్రిముని చేత పెంచబడ్డారని రాశారు. పైనచెప్పిన వచనంలో పుట్టుక తెలియని తాను అత్రి మహామునులకు కుమారులమైనామని చెప్పాడు కనుక ఆయనను ఆత్రేయుడని ప్రజలు గుర్తించారని చెప్పవచ్చు.

### బ్రహ్మం గారిని కన్నవారు :-

బ్రహ్మంగారిని కన్న తల్లిదండ్రులు బ్రహ్మాండపుర నివాసులైన ప్రకృతాంబా పరిపూర్ణయాచార్య దంపతులని బ్రహ్మంగారి చరిత్ర రచయితలు రాశారు. ఈ పేర్లువింటే ఇవి కృతకంగా ఉన్నాయనిపిస్తుంది. బ్రహ్మాండం, పరిపూర్ణం, ప్రకృతి మొదలైన పదాలు వేదాంత సంప్రదాయానికి సంబంధించినవి. మరాధ్యక్షులకు సన్నిహితులైన చాటకొండు సుబ్బయ్య రచనలో ఈ పేర్లు కనిపించవు. బ్రహ్మంగారి తల్లి అత్రిమహర్షితో "మేము విశ్వబ్రాహ్మణ కుల సంజనితులము.

ఈ బాలకుని రక్షించు భారము మీాయది"1 అని చెప్పినట్లుంది. బ్రహ్మంగారి కాలజ్ఞానంలో కూడ ఆయన తలిదండ్రుల పేర్లు చెప్పబడ లేదు. "నేను ఉత్తరమునుండి ఉద్భవమై"2 అని మాత్రమే చెప్పారు గాని తలిదండ్రులు ఎవరో చెప్పలేదు.

## బ్రహ్మండపురం:—

బ్రహ్మండపుర మనేది రచయితల ఊహల్లో నిర్మించబడిందా? భారతదేశంలో అటువంటి నగరం ఉందా? ప్రకృతాంబా పరిపూర్ణ యాచార్య నామధేయాలు భక్తుల కల్పనలా? కేవలం రచయితల కల్పనలా? అనే సందేహ సందోహం సమాధానాన్ని అపేక్షిస్తుంది. బ్రహ్మండపురాన్ని గురించి వ్రాస్తూ "కాన్పూరు పట్టణమునకు పదునాలుగు మైళ్లదూరమునందు చిత్తూరను పట్టణమొండు గలదు. పూర్వము దానిని బ్రహ్మావర్తమనియు, బ్రహ్మండపురమనియు వ్యవహరించుచుండెడివారు"3 అని బ్రహ్మంగారి చరిత్ర రచయితలు రాశారు. కానీ దీనికి ఆధారాలు లేవు.

ఇక ప్రకృతాంబా పరిపూర్ణయాచార్య అనే పేర్లను పరిశీలిస్తే ఇవి కృతకంగానే కనిపిస్తాయి. పరిపూర్ణయాచార్య నామంలో కనిపించే 'అయ' అచ్చతెలుగు పదం. హిందీ మాతృభాషగా గల ఔత్తరాహుల

---

1. సుబ్బయ్య, చాటకొండు - వీరబ్రహ్మంగారి జీవితచరిత్ర, ప్రచు: రచయిత జానకీ ముద్రాక్షరశాల, ప్రొద్దుటూరు, 1933, 50. పు. 8.
2. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానం, ప్రచు. కృష్ణమూర్తి, రంగయ్య, కందిమల్లాయపల్లె 1974, పు. 14.
3. సీతారాం, ఏలూరి - వీరబ్రహ్మంగారి చరిత్ర, ప్రచు : శ్రీ లక్ష్మీనారాయణ బుక్ డిపో, రాజమండ్రి 1977, పు. 49.

పేరు ఇలా ఉండదు. పరిపూర్ణాచార్య అని ఉండాలి. ప్రకృతాంబ నామకరణ విషయమై అనుమానం లేదు. కాని వేదాంత సంబంధి నామాలే భార్యాభర్త లిరువురికీ ఉండడం విశేషం. ఆ దంపతులు రాజయోగాన్ని అనుష్ఠించిన తాత్వికులు కావడంవల్ల అలాంటి పేర్లు పెట్టుకొని ఉండవచ్చు.

వాస్తవానికి బ్రహ్మంగారి తల్లిదండ్రులపేర్లు మరొకవిధంగా ప్రచారం లోనికి వచ్చాయని ఊహించవచ్చు. బ్రహ్మంగారు బనగానపల్లెలో చేరిన రోజుల్లో తత్ప్రాంతీయులు ఆయనను 'నీ తల్లి దండ్రుల పేరేమిటి? నీ దే వూరు?' అని అడిగి ఉంటారు. అప్పుడాయన 'నా తల్లి ప్రకృతి, నా తండ్రి పరిపూర్ణం, నా వూరు బ్రహ్మాండం' అని చెప్పిఉంటాడు. అప్పటినుంచి ఆయన ఊరు బ్రహ్మాండపురమనీ తలిదండ్రులు ప్రకృతాంబా పరిపూర్ణయాచార్యులనీ వాడుకలోనికి వచ్చి ఉంటుంది. అంటే బ్రహ్మంగారి తల్లిదండ్రులు అజ్ఞాతవ్యక్తులని చెప్పాలి.

## పెంచుకొన్నవారు :—

బ్రహ్మంగారిని పెంచుకొన్న తల్లి-దండ్రులు యనమదల వీరపాపమాంబ వీరభోజయాచార్య దంపతులు. బ్రహ్మంగారి చరిత్ర రచయితలందరూ ఇలాగే రాశారు. ఈఅంశానికి ఆధారం. కాలజ్ఞానంలో రేఖామాత్రంగా కనిపిస్తుంది.

> "నందిమండల క్షేత్రమున పరబ్రహ్మ వంశమందు
> ప్రఖ్యాతమయ్యేము."1

---

1. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానము, ప్రచు: కృష్ణమూర్తి, రంగయ్య కందిమల్లాయపల్లె, 1974, పు 2.

అనే వచనంలో నందిమండల క్షేత్రం (అంటే మైసూరు రాష్ట్రంలో బెంగుళూరుకు నలభై మైళ్ళ దూరంలో ఉన్న స్థలం) లో విశ్వబ్రాహ్మణ వంశంలో ప్రసిద్ధి వహిస్తానని చెప్పారు గాని మాతాపితలెవరో చెప్పలేదు. కాలజ్ఞాన గ్రంథంలో బ్రహ్మంగారు తనను పెంచుకొన్న తల్లిదండ్రులపేర్లు చెప్పలేదు.

## నందిమండల క్షేత్రం :-

ఇది కర్ణాటక రాష్ట్రంలో బెంగుళూరుకు చేరువలో ఉంది. దీనినే నందిదుర్గమని కూడా అంటారు. ఇక్కడనే పాపఘ్ని నది పుట్టింది. ఈ నదీతీరంలో విశ్వకర్మలకు సంబంధించిన పాపఘ్ని మఠం ఉంది ఆ మఠాధ్యక్షులు వీరభోజయాచార్యులు. ఆయనభార్య వీరపాపమాంబ, బ్రహ్మంగారు నందిమండల క్షేత్రమని చెప్పారు. గనుక అక్కడి మఠాధిపతులైన విశ్వకర్మలు వీరేగనుక చరిత్రలు రాసినవారు ఈ దంపతులే బ్రహ్మంగారిని పెంచినవారని నిర్ణయించారు. కానీ బ్రహ్మం గారి కాలజ్ఞానంలో వీరిపేర్లు లేవు. ఈ పాపఘ్ని పీఠం ఇప్పటికీ ఉంది.

## బ్రహ్మంగారు అయోని సంభవులా ?

బ్రహ్మంగారి చరిత్ర రచయితలు ఆయనను అయోని సంభవుడుగా వర్ణించారు. ఈవిషయాన్ని రాస్తూ వడ్డెపాటి నిరంజనశాస్త్రి ఇలా చెప్పారు. "శూన్యోత్పత్తిం దత్తమతేర్బ్రహ్మహార్షే - తల్లిదండ్రు లెవ్వరో తెలియకుండ స్వయంభువైనవాడీ చిన్ని యర్భకుండు1." ఈవిషయం "మన గురుదేవుడు" అనే గ్రంథంలో ప్రస్తావించబడింది.

---

1. వీరరాఘవాచార్యులు, కొండూరి - మన గురుదేవుడు,
   ప్రచు : వీరరాఘవ గ్రంథావళి తెనాలి. 1963, 78, పి. 27.

దీనికి "పూర్వం అయోని సంభవులమై అత్రిమునులకు కుమారులమై (కాల: పు. 94) అనే బ్రహ్మంగారి కాలజ్ఞాన వచనం ఆధారం.

ప్రపంచంలోని మతగ్రంథా లన్నింటిలోనూ యీ అయోని సంభవులను గురించి రాశారు. ఇంతేగాక మనుష్య వీర్యంవల్ల జంతుపు లకు కూడా సంతానం కలిగినట్లు మనపురాణాలు వర్ణించాయి. కా అయోనిసంభవం అనేది అసంగతమైనది. యీ అంశాన్ని జీవశాస్త్రం అంగీకరించదు. రక్తమాంస మేధోస్థిమయమైన శరీరం యోనిసంభవ మనడమే సముచితం. ప్రవక్తలను, అవతార పురుషులను అయోని సంభవులని వర్ణించడం సంప్రదాయమై పోయింది. ఈ మార్గంలోనే బ్రహ్మంగారిని అయోనిసంభవుడు గానే వర్ణించారు.

## నా మ వి చా ర ణ :-

పోతులూరి వీరబ్రహ్మం గారిని (వ్యవహారంలో బ్రహ్మంగారని అంటారు.) భక్తులు శ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారని వ్యవహరిస్తారు. బ్రహ్మంగారికి వీరనారాయణ అనే పేరు కూడా రచయితలు రాశారు. దీనికి ఆధారం కాలజ్ఞానంలో ఉంది. బ్రహ్మంగారు ఆనందభైరవ యోగికి వీరనారాయణ మంత్రోపదేశం చేసి

"రక్త పుష్ప ములతో మా ముప్పదిరెండు నామములు పూజింపుమా!"1 అని అన్నారు. ఇక్కడ బ్రహ్మంగారు పేర్కొన్న నామాల్లో 18వ నామంగా "ఓం వీరనారాయణాయ నమః" అనేదాన్ని చెప్పారు. బ్రహ్మంగారి పేర్లను గురించి రాస్తూ "శైశవంలో

---

1. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానం, ప్రచు: కృష్ణమూర్తి రంగయ్య, కందిమల్లాయపల్లె 1974, పు. 11

ఈ బాలకునిపేర్లు వీరనారాయణ, వీరప్ప, వీరంభట్లు, వీరబ్రహ్మం అని చెప్పుచున్నారు. ఇవ్వన్నీ ఉత్తర హిందూదేశ నామావళిగా తోచవు."1 అని పరిశోధకులు అన్నారు. కానీ వీటిలో మొదటిపేరు మాత్రం ఉత్తర భారతానికి చెందినదే. "గోండ్వానా ప్రాంతానికి రాజధాని చూనార్ ఘర్. అక్కడి రాజైన దళపత్ చనిపోయినందువల్ల చిన్నవాడైన వీర నారాయణ పేర రాణి దుర్గావతి రాజ్యంచేసింది.2" అని చారిత్రకులు రాశారు. కనుక వీరనారాయణ అనే పేరు ఔత్తరాహిక మనడంలో సందేహం లేదు. ఇంతేకాదు సంస్కృత పదాలతో నిర్మించబడిన ఈ పేరు భారతదేశానికంతటికీ వర్తిస్తుంది.

బ్రహ్మంగారికి ఇంకా చాలాపేర్లు ఉన్నట్లు ఆయన కాలజ్ఞాన గ్రంథంవల్ల, తత్వాలవల్ల తెలుస్తున్నది. బ్రహ్మంగారికున్న మొత్తం పేర్లు వరుసగా ఈక్రింద ప్రదర్శించబడుతున్నాయి.

| | | |
|---|---|---|
| 1) | పోతులూరి వీరబ్రహ్మము | (కాల. త. పు. 4) |
| 2) | హరి పోతులూరయ్య | ( ,, ,, 4) |
| 3) | పోతులూరి సుబ్రహ్మణ్యము | ( ,, ,, 5) |
| 4) | శివ పోతులూరయ్య | ( ,, ,, 6) |
| 5) | బ్రహ్మము | ( ,, ,, 6) |

---

1. కోదండరామిరెడ్డి, మరుపూరు - విప్లవమత ప్రవక్త
ఆం - ప్ర - వా, 1-12-74.

2. ఝాన్సీలక్ష్మి, పాటిబండ్ల - భారతదేశ సంస్కృతి - చరిత్ర,
సం॥ ఐజక్. ఎన్. ప్రచు : తెలుగు అకాడమీ - 1973, పు. 59.

6) శివపోతులూరప్ప (కాల. త. పు. 7)
7) పోతులూరి వీరభోగ వసంతరాయలు ( ,, ,, 10)
8) పోతులూరయ్య ( ,, ,, 13)
9) పోతులూరి స్వామి ( ,, ,, 16)
10) వీరయ్య ( ,, ,, 16, 19)
11) వీరగురుడు ( ,, ,, 16, 40, 46)
12) వీరప్ప ( ,, ,, 17)
13) వీరన్న ( ,, ,, 35)
14) వీరగోవిందుడు ( ,, ,, 39)
15) వీరయ్య దాసు ( ,, ,, 42, 43)
16) పోతులూరి బ్రహ్మస్వామి ( ,, ,, 45)
17) వీరదాసు ( ,, ,, 45)
18) వీరపోతులూరు ( ,, ,, 45)
19) వీరప్పయ్య (కాల. పు. 23. 27, 40)
20) వీరంభట్లయ్య ( ,, ,, 9 )
21) వీరాచార్య ( ,, ,, 11 )
22) వీరబ్రహ్మేంద్ర యోగీంద్రుడు ( ,, ,, 16 )
23] వీరభోగ వసంతరాయలు [ ,, ,, 24 ]
24] వీరయోగి [ ,, ,, 8 ]
25] వీరనారాయణ [ ,, ,, 11 ]

26] వీర భోజుడు [ కాల. పు. 123, 134 ]

27] ఆదికేశవ [ ,, ,, 44 ]

28] వీరధర్మజ [ ,, ,, 102, 103, 133]

29] వీరగురుడు [ ,, ,, 133 ]

30] వీర వసంతరాయ [ ,, ,, 108 ]

31] వీరభోజ వసుంధర [ ,, ,, 108 ]

32] వీర శేఖర [ ,, ,, 108 ]

33] దత్తాత్రేయులు [ ,, ,, 108 ]

ఈ పేర్లలో కొన్ని కాలజ్ఞాన తత్వాల్లో ప్రతి తత్వం చివర అంకితంగా చెప్పబడినవి. కొన్ని కాలజ్ఞానంలో ఆయా సందర్భాల్లో చెప్పబడ్డాయి.

బ్రహ్మంగారికి ఇంకా బాలవీరప్ప, వీరప్ప, వెర్రివీరన్న అనే పేర్లుకూడా ఉన్నట్లు రచయితలు కొందరు రాశారు. కానీ బ్రహ్మం గారి రచనల్లో అవి కనిపించవు. బ్రహ్మంగారికున్న ఈ పేర్లను పరిశీలిస్తే మొదటిపేరు వీరనారాయణ అని చెప్పవచ్చు. ఎందుచేతంటే ఆయనకున్న పేర్లలో ఎక్కువపేర్లు వీరశబ్దంతో కూడినవి కనుక. అత్రి మహర్షికి దత్తుకుమారుడు గనుక దత్తాత్రేయులయ్యాడని చెప్పవచ్చు. పాపఘ్ని మఠానికి వచ్చినతరువాత అక్కడివారు తేలికగా పిలవడానికి వీరనారాయణ అనే పేరులోని నారాయణను తీసివేసి వాళ్ల దేశ సంప్రదాయాన్ననుసరించి వీరప్ప అని పిలిచిఉంటారు. అక్కడినుంచి ఆయన దేశసంచారానికి బయలుదేరి కర్నూలు జిల్లాలోని పోతులూరు అనే గ్రామానికి వచ్చాడు. అప్పుడు తెలుగు ప్రజలు తమపద్ధతి ననుస

రించి వీరప్పయ్య, వీరయ్య, వీరాచారి అని పిలిచిఉంటారు. అక్కడి నుంచి బనగానపల్లె వచ్చి గరిమరెడ్డి అచ్చమ్మ గారింట్లో పశుల కాపరిగా చేరాడు. అలౌకికుడుగా ఉన్న ఆయనను అక్కడివారు వెర్రి వీరయ్య, పిచ్చి వీరన్న అని పిలిచిఉంటారు. కాలజ్ఞానం రచించి మాహాత్మ్యం వెల్లడించిన తరువాత తత్వబోధలుచేసే సమయంలో వీరయోగి, వీరగురుడు అని పిలిచిఉంటారు. ప్రజలకు వేదాంతాన్ని బోధిస్తూ ఆయన "అహం బ్రహ్మాస్మి" అనే ఉపనిషత్ సందేశాన్ని సంస్కృతంరాని తెలుగువారికి తేటపరచి వివరించడానికి "నేనే బ్రహ్మమురా" అని చెప్పాడు. అందుకే ఆయనను బ్రహ్మం అని పిలిచి మొదటిపేర్లోఉన్న వీరశబ్దాన్ని చేర్చి 'వీరబ్రహ్మం' అని పిలిచి ఉంటారు. ఆయనను పోతులూరినుంచి వచ్చాడు గనుక పోతులూరి వీరబ్రహ్మం అని పిలిచిఉంటారు. ఆయనను దైవంగా విశ్వసించిన వాళ్లు 'శ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి' అని కొలిచి ఉంటారు. బ్రహ్మంగారు అనేది మిక్కిలి వాడుకలోఉన్న పేరు.

బ్రహ్మంగారికున్న పేర్లన్నీ ఒకఎత్తయితే 'జేజినాయన' అనే పేరు ఒక్కటీ ఒక్కఎత్తుగా చెప్పవచ్చు. జేజినాయన అంటే తాత అని అర్థం. ఇది రాయలసీమ మాండలికం. ఇప్పటికీ రాయలసీమలో ఈపదాన్ని వాడతారు. ఆ మహనీయుణ్ణి కులమత విచక్షణ లేకుండా దేశీయులంతా తాతగారుగా గుర్తించి ఆరాధిస్తున్నారు.

## గృహనామం :—

బ్రహ్మంగారి గృహనామం పోతులూరి అని ప్రతి చరిత్రలో ఉంది. కానీ ఆయనను పెంచుకొన్నవారి ఇంటిపేరు 'యనమదల' కనుక యనమదల బ్రహ్మంగారు అని ఉండాలిగదా ! అలా కానప్పుడు జన్మనిచ్చిన తల్లిదండ్రుల ఇంటిపేరైనా ఉండాలి. కాని బ్రహ్మంగారిని

కన్నవారి ఇంటిపేరు ఎవ్వరికీ తెలియదు. బ్రహ్మంగారి చరిత్ర లిఖించిన గ్రంథకర్తలలో ఏ ఒక్కరయినా ఆయన ఇంటిపేరు రాయి లేదు. విశ్వబ్రాహ్మణ దంపతులు తమ కుమారుని తనకు దత్తం చేశారని అత్రిమహర్షి చెప్పినట్లు రచయితలు రాశారు. కానీ ఇంటిపేరు రాయ లేదు. ఈ విషయం కాలజ్ఞానంలో కనిపించదు.

వీరప్పగా వ్యవహరింపబడుతున్న బ్రహ్మంగారు పన్నెండేళ్ల ప్రాయంలో పాపఘ్ని మఠాన్ని వదలి సంచారానికి బయలుదేరి పుణ్య తీర్థాలు సేవిస్తూ కర్నూలు మండలంలో ఉన్న పోతులూరు అనే గ్రామంలో నివసించాడు. ఆ పిమ్మట బనగానపల్లె, కందిమల్లాయ పల్లెల లో నివసించాడు. ఈయన పోతులూరు నుంచి వచ్చాడు గనుక ఇంటిపేరు పోతులూరు అయింది. ఈ అంశాన్ని గురించి రాస్తూ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ "ఈయన స్థలము పోతలూరు1" అని అన్నారు. ఇంతేగాక బ్రహ్మంగారు తమ రచించిన కాలజ్ఞాన తత్వాల్లో "శరణు పోతులూరి రామ శరణు వీరభద్రాయ శరణు ఓ దైవరాయ పోతులూరయ్యా2" అని రాశారు. ఈ పాటలో పేర్కొనబడిన దేవతలు పోతులూరులో ఉన్న దేవతలు. ఆ ఊరిలో స్వామి అనే ఉద్దేశ్యంతో వీరభద్రస్వామిని పోతులూరి వీరభద్రప్ప అని సంబోధించారు. కనుక బ్రహ్మంగారు పోతులూరినుంచి వచ్చాడని నిర్ణయించవచ్చును. ఆయన పోతులూరినుంచి వచ్చాడు గనుక గృహనామం పోతులూరి అని అయింది.

---

1. అనంతకృష్ణశర్మ, రాళ్లపల్లి - వేమన, ప్రచు : ఆంధ్రా యూనివర్సిటీ 1929, 1945, 1971, పు. 107.

2. ఎంచాచార్యులు, పరిమి - పోతులూరి వీరబ్రహ్మంగారి కాలజ్ఞాన తత్వములు ప్రచు : ఎం. వి. గోపాల్ & కో, మద్రాసు 1976. పు. 11.

దేశికుడు :—

బ్రహ్మంగారికి గురువు ఎవరు ? అనే విషయంపై వివిధాభిప్రాయాలున్నాయి. కాలజ్ఞానంలోని కొన్ని వచనాలు బ్రహ్మంగారి గురువు దత్తాత్రేయులు అనే భావాన్ని కలిగిస్తున్నాయి. కొందరు రచయితలు బ్రహ్మంగారి గురువు వీరభద్రస్వామి అని రచించారు. అయితే బ్రహ్మంగారి గురువు దత్తాత్రేయులా? లేక వీరభద్రస్వామియా ? లేక తనకుతానే గురువా ? అనే అంశాలను పరిశీలించాలి.

అల్లాడుపల్లెలో బ్రహ్మంగారిచేత తీర్చబడి ప్రతిష్ఠించబడిన వీరభద్రస్వామియే బ్రహ్మంగారికి గురువు అని విశ్వసించిన వారిలో కొండూరి వీరరాఘవాచార్యులొకరు. ఆయన రచించిన సుప్రభాతంలో ఇలా రాశారు.

"వీరభద్ర గురోరర్చా
కార్యేణాఖిల మానవాన్
విగ్రహారాధ నాధీనాన్
కుర్వతే తే నమో నమః"

వీరబ్రహ్మ సుప్రభాతమ్, పు. 8

"ఇంకో మనమెరిగినంతలో వీరదేశికుడు తనకు దేశికుడుగా భావించినది ఈ వీరభద్రస్వామినే. నేటికినీ ఈ వీరభద్రస్వామి అల్లాడుపల్లెలో పూజా పురస్కారముల నందుచు భక్తుల వాంఛితార్థములను తీర్చు

చున్నాడు.1" అని ఆయన రాశాడు. "పూర్వం నందికొండ యందు తపస్సుచేస్తూ యుండి అచటినుండి పోతులూరు అనే గ్రామమునకు వచ్చి వీరభద్రునిగూర్చి తపమాచరింపగా వీరభద్రస్వామి ప్రత్యక్షమై ప్రసన్న వదనాలు జ్ఞానోపదేశము చేసి2" అని ఈశ్వరీదేవి కాలజ్ఞానములో చెప్పబడింది. ఈ విషయాన్ని విశ్వసించిన స్వామి లింగస్వామి "అంత వీరబ్రహ్మము నిజగురుండగు వీరభద్రుని ఆలయమునకు పయన మయ్యెను3" అని రాశాడు. ఈ అంశాలు బ్రహ్మంగారి గురువు వీర భద్రస్వామి అని తెలుపుతున్నాయి.

ఇక బ్రహ్మంగారి గురువు దత్తాత్రేయులు అనేభావం కలిగించే వచనంలో కాలజ్ఞానంలో లభిస్తున్నాయి. "వీర వీరత్వముచేతను బ్రహ్మ బ్రహ్మత్వము చేతను దశావతారములు ఎత్తి ఆనందాశ్రమములకు శిష్యుండై 4" అని చెప్పి "దత్తాత్రేయులే ఆనందగురువులు (కాల, పు. 16) అని అన్నారు. సాంద్ర సింధువేదము చదివి బనగానపల్లె చేరి దత్తాత్రేయులకు శిష్యుండనై (కాల. పు. 8) అనికూడా అన్నారు.

---

1. వీరరాఘవాచార్యులు, కొండూరి - మన గురుదేవుడు, ప్రచు : వీరరాఘవ గ్రంథావళి తెనాలి. 1963, 78, పు. 44.
2. సుబ్రహ్మణ్యకవి, స్వర్ణ - ఈశ్వరీదేవి కాలజ్ఞానం, ప్రచు: విజయశేఖరాచార్య, తుమపాల, తెనాలి, 1979, పు. 73.
3. లింగస్వామి, స్వామి - యదార్థ కాలజ్ఞాన సహిత బ్రహ్మంగారి చరిత్ర, ప్రచు: వీరభోగ వసంతరాయాశ్రమం, శాలిబండ, హైదరాబాదు, 1979, పు. 114.
4. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానము, ప్రచు: కృష్ణమూర్తి, రంగయ్య నందిమల్లాయపల్లె, 1974, పు. 16



గర్భగుడి,  ముఖమండపం



కుముద్వతీ నదీ ప్రవాహం

ఈ వచనాలు బ్రహ్మంగారి గురువు దత్తాత్రేయులు అనే భావాన్ని కలిగిస్తున్నాయి. ఈ దత్తాత్రేయులు ఎవరు? అని ఆలోచిస్తే బ్రహ్మంగారే దత్తాత్రేయులు అనేఅంశం స్పష్టమవుతుంది. బ్రహ్మంగారు అత్రి మహర్షికి దత్తం చేయబడ్డాడు గనుక అపత్యార్థక తద్ధితరూపంలో ఆత్రేయులుగా పిలువబడ్డాడు. వీరపాపమాంబ వీరభోజయాచార్య దంపతులకు దత్తుడుగా అయ్యాడు గనుక దత్తాత్రేయు లయ్యాడు. "అత్రి మహామునుల కుమారులమై దత్తాత్రేయుల పేరు గలిగి1" అని బ్రహ్మంగారి కంఠోక్తి. కనుక బ్రహ్మంగారే దత్తాత్రేయులు అని చెప్పవచ్చు.

పై అంశాన్ని పరిశీలిస్తే బ్రహ్మంగారికి గురువు ఎవ్వరు లేరు. ఆయనకు ఆయనే గురువు అని అనిపిస్తుంది. "ప్రాంతమందు పాషాణ విగ్రహం చేసి నిలిపెను. అటుతరువాత పూజచేస్తూ తనరూపు తాను గైకొనెను.2" అని కాలజ్ఞానంలో బ్రహ్మంగారు చెప్పారు. అంటే వీరభద్రుని విగ్రహంచేసి భక్తిభావంతో పూజచేస్తూ తనను తాను తెలుసుకొన్నాడని అర్థం. కాలజ్ఞానం ప్రథమాశ్వాసంలో బ్రహ్మంగారు తన పూర్వజన్మల క్రమాన్ని వర్ణిస్తూ "ప్రథమావతారమున ఆనందాశ్రమమునకు శిష్యుండనైతి3" అంటూ ప్రారంభించి వరుసగా పదిజన్మలలో ఆనందాశ్రమాలకు తాను శిష్యుడనయ్యానని చెప్పారు. ఆనందాశ్రమ

---

1. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానం, ప్రచు. కృష్ణమూర్తి, రంగయ్య, కందిమల్లాయపల్లె 1974, పు. 16.
2. పైది పు. 33.
3. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానం, ప్రచు: కృష్ణమూర్తి, రంగయ్య, కందిమల్లాయపల్లె 1974, పు. 1.

మంటే పదిఅవతారాల్లోనూ అనంతమైన కాలచక్రంలో తిరిగిన ఆధ్యాత్మిక సిద్ధాంతమే ఆనందాశ్రమం. బ్రిహ్మంగారు తన ప్రతి జన్మలోనూ ఈ సిద్ధాంతానికి శిష్యుడై తనను తాను తెలుసుకొన్నాడు. ఈ పరిశీలనలో తేలిన అంశమేమిటంటే ఆనందాశ్రమానికి గురువు దత్తాత్రేయులు. ఆయనే బ్రహ్మంగారు. ఆనందాశ్రమాలకు శిష్యుడయ్యాడు. అంటే తనకుతానే గురువయ్యాడు.

*బనగానపల్లె నివాసం — కాలజ్ఞాన రచన :—*

బ్రహ్మంగారు బనగానపల్లెలో గరిమరెడ్డి అచ్చమ్మ గారింట్లో పశుపాలకుడుగా ఉండి కాలజ్ఞానం రచించాడని రచయితలు రాశారు. బ్రిహ్మంగారు బనగానపల్లెలో నివసించాడనటానికి —

1) "పదకొండవ అవతారం మనుష్యావతారమెత్తి బనగాన పల్లెలో 25 ఏండ్లు తపస్సుచేసి" (కాల: పు. 2)
2) "అంతర్భవిష్యమంతా సాంద్ర సింధువేదము చదివి బనగాన పల్లె చేరి" (కాల. పు. 16)
3) "బనగానపల్లె చేరి దత్తాత్రియులకు శిష్యుండనై" (కాల. పు. 60.)
4) "అనేక బ్రహ్మకల్పాలు తపస్సుచేసి బనగానపల్లె వచ్చి" (కాల. పు. 45)

మున్నగు కాలజ్ఞాన వచనాలు తార్కాణంగా కనిపిస్తున్నాయి. కానీ బ్రిహ్మంగారు బనగానపల్లెలో గరిమరెడ్డి అచ్చమ్మగారి గృహంలో పశుపాలన చేశాడని చెప్పడానికి ఆధారాలు లేవు. అసలు గరిమరెడ్డి అచ్చమ్మ అనే పేరు కాలజ్ఞానంలో కనిపించదు. ఈ అచ్చమ్మ విషయం జనశ్రుతినిబట్టి రాసిందే.



గర్భగుడి

బ్రహ్మంగారు కాలజ్ఞానం చెబుతూంటే బనగానపల్లె నివాసి బ్రహ్మం గారి శిష్యుడు అన్నాజయ్య తాటాకుల మీద రాశాడు. వ్యాసునకు గణపతిలా తిక్కనకు గురునాథునిలా బ్రహ్మం గారికి అన్నాజయ్య లేఖకుడయ్యాడు. ఇందుకు తార్కాణంగా -

'సిద్ధాద్రి నామ సంవత్సర మందు
బనగానపల్లెలో పరగంగ నిలిచి" కా. త. పు. 6
'నిర్మాణము చేసి ఇల యేడాశ్వాసములు
కాలజ్ఞాన పత్రిక కలయంగ బలికి' కా. త. పు. 5.
"శ్రీ వీరప్పయ్యగారు అన్నాజయ్యతో భూత భవిష్యత్
వర్తమానములు చెప్పిన క్రమము" కాల. పు. 1

పై కాలజ్ఞాన తత్వాలలోని పాదాలను, వచన కాలజ్ఞానంలోని వచనాన్ని చెప్పవచ్చు.

## గృహస్థాశ్రమం :-

బ్రహ్మంగారు పూర్వఋషులైన వశిష్ఠ, జమదగ్ని, గౌతమ, అత్రి, అంబరీష, జనక, రామానుజులు మున్నగువారి మార్గంలో నడిచి వివాహం చేసుకొన్నాడు. పెదకొమెర్ల నివాసి శివకోటయాచార్య కుమార్తె గోవిందమ్మను రజస్వలానంతర వివాహం చేసుకొన్నాడు. బ్రహ్మంగారు క్రీ॥శ॥ 1644 సంవత్సరం తరువాత కందిమల్లయపల్లెలో గృహాన్ని నిర్మించుకొన్నాడు. కందిమల్లయపల్లె కడపజిల్లా బద్వేలు తాలూకాలో ఉంది. ఈ గ్రామం బద్వేలు మైదుకూరు రాజమార్గంలో సగిలేరు దాటంగానే బద్వేలునుండి ఆరు కిలోమీటర్ల దూరంలో

ఉత్తరంగా ఉన్న చీలుదారికి ఇరవై నాలుగు కిలోమీటర్ల దూరంలో ఉంది. వనిపెంట నుంచి పోరుమామిళ్లకు పోయే మార్గంలో నుంచీ రాణీబావినుంచి కందిమల్లయపల్లెకు వెళ్ళవచ్చును. కందిమల్లయపల్లెలో బ్రహ్మంగారు కుటుంబసమేతంగా నివసించి వడ్రంగం, కమ్మరం, శిల్ప వృత్తులను చేసిన వారి స్వగృహం ఇప్పటికీ ఉంది.

## ఆ న ం దా శ్ర మ ం :—

ఆనందాశ్రమమంటే ఏమిటి? అనే సందేహం ప్రతివారికీ కలుగుతుంది. కొందరనుకొన్నట్లు ఆనందాశ్రమమంటే బ్రహ్మంగారు నివసించిన పర్ణశాలకు పెట్టినపేరు కాదు. అసలు ఆనందాశ్రమమంటే ఏమిటో తెలుసుకొనేముందు అనందంఅంటే ఏమిటో తెలుసుకోవాలి. ఆనందాన్ని ఉపనిషత్తులు ఇలా నిర్వచించాయి.

"యువాస్యాత్సాధు యువాధ్యాయికః
అశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః తస్యేయం పృథివీ
సర్వావిత్తస్య పూర్ణాస్యాత్ సఏకో మానుష ఆనందః.

(పడుచుదనం, సన్మార్గం, ధైర్యం, బలం, అధికారం, చక్రవర్తి పదవి గలవాని ఆనందం మనుష్యానందం.)

తే యే శతం మానుషా ఆనందాః
స ఏకో మనుష్య గంధర్వాణా మానందః.

(అట్టి మనుష్యానందాలు నూరైతే ఒక మనుష్య గంధర్వానంద మవుతుంది.)

తేయే శతం మనుష్య గంధర్వాణా మానందాః
స ఏకో దేవ గంధర్వాణా మానందః.

(అట్టివి నూరు మనుష్య గంధర్వానందాలు ఒక దేవ గంధర్వానంద మవుతుంది.)

తేయే శతం దేవగంధర్వాణా మానందాః
స ఏకః పితౄణాం చిరలోక లోకానామానందః.

(అలాంటివి నూరు దేవ గంధర్వానందాలు ఒక పితృ దేవతానంద మవుతుంది.)

తేయే శతమ్ పితౄణాం చిరలోక లోకానామానందః
స ఏకః ఆజాన జానాం దేవానా మానందః.

(ఇలాంటి పితృదేవతానందాలు నూరైతే ఒక్క ఆజానజ దేవానంద మవుతుంది.)

తేయే శత మాజాన జానాం దేవానా మానందాః
స ఏకః కర్మదేవానాం దేవానా మానందః.

(ఆజానజ దేవానందాలు నూరైతే ఒక్క కర్మదేవానంద మవుతుంది.)

తేయే శతం దేవానా మానందః
స ఏక ఇంద్రస్యానందః.

(అట్టి నూరు దేవానందాలు ఒక్క ఇంద్రానంద మవుతుంది.)

తేయే శత మింద్రస్యానందాః
స ఏకో బృహస్పతే రానందః

(నూరు ఇంద్రానందాలు బృహస్పతికొక్క ఆనందమవుతుంది.)

తేయే శతం బృహస్పతే రానందాః
స ఏకః ప్రజాపతే రానందః.

(నూరు దేవ గుర్వానందాలు ఒక ప్రజాపత్యానంద మవుతుంది.)

తేయే శతం ప్రజాపతే రానందాః
స యేకో బ్రాహ్మణ ఆనందః"1
(నూరు ప్రజాపత్యానందాలు బ్రహ్మకొక్క ఆనందమవుతుంది.)
ప్రాపంచి కానందాలనుంచి దృష్టి మరల్చేదే బ్రహ్మనందం.

కాలజ్ఞానంలో బ్రహ్మంగారు "ప్రథమావతారమున ఆనందాశ్రమమునకు శిష్యుడనై 999 కోట్లు 7665 బ్రహ్మకల్పము లుంటిమి. రెండవ అవతారమున ఆనందాశ్రమములకు శిష్యుడనై 765 బ్రహ్మకల్పము లుంటిమి. మూడవ అవతారమెత్తి ఆనందాశ్రమములకు శిష్యుడనై 18వేల ఏండ్లుంటిమి. నాలుగవ అవతారమెత్తి ఆనందాశ్రమములకు శిష్యుండనై 4 ఖర్వాలు 350 బ్రహ్మకల్పము లుంటిమి.2" అని వరుసగా 10 అవతారాలు ఆనందాశ్రమాలకు శిష్యుడ నయ్యానని చెప్పారు. ఇంకా ఈ ఆనందాశ్రమ ప్రసక్తి కాలజ్ఞానం 5, 11, 12, 27, 28, 32, 35, 37, 68, 227 పుటల్లో ఉంది.

పై అంశాలనుబట్టి చూస్తే ఆనందాశ్రమం అనేది భౌతికంగా నిర్మించిన ఒక పర్ణశాలకు పెట్టినపేరు కాదనీ ఈ ఆశ్రమం నిర్ణీత కాలంలో లేదనీ తెలుస్తుంది. బ్రహ్మంగారు చెప్పిన పదకొండు అవతారాల్లో అనంతమైన కాలచక్రంలో ప్రవహించిన ఒక ఆధ్యాత్మిక సిద్ధాంతమే ఆనందాశ్రమమని చెప్పవచ్చు. ఈ ఆనందాశ్రమాన్ని గురించి చాటకొండు సుబ్బయ్య ఇలా రాశాడు.

---

1. తైత్తిరీయోపనిషత్తు, అను: పండిత గోపదేవ్
ప్రచు: అంబాదర్శన గ్రంథమాల, కూచిపూడి, 1975.

2. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానం, ప్రచు: కృష్ణమూర్తి, రంగయ్య, కండిమల్లయపల్లె 1974, పు. 1, 3.

"పరబ్రహ్మమును తెలియుటకై ప్రయత్నపడుటయే శిష్యత్వము వహించుట. ఆ బ్రహ్మావలోకన మందుటయే ఆశ్రమము.1"
అంటే ఆయన ప్రతి అవతారంలో ఆనందాశ్రమాలకు శిష్యుడై తనను తాను తెలుసుకొన్నాడు. అని చెప్పాలి.

## బ్రహ్మంగారి దేశ సంచారం :—

బ్రహ్మంగారు బాల్యం మొదలుకొని క్రీ॥ శ॥ 1693వ సంవత్సరంలో సమాధి ప్రవేశించినంతవరకు ఆయన ఆసేతు శీతనగ పర్యంతం దేశసంచారం చేసినట్లుగా బ్రహ్మంగారి చరిత్ర రచించిన పండితులు అందరూ పేర్కొన్నారు. ఇందుకు ఆధారంగా ప్రస్తుతం లభిస్తున్న బ్రహ్మంగారి కాలజ్ఞానంలో గ్రామనామాలు కనిపిస్తున్నాయి. బ్రహ్మంగారు ఆయా గ్రామాల విషయాలను వర్ణించారు గనుక ఆ గ్రామాలను దర్శించారని చెప్పవచ్చు. కాలజ్ఞానంలో బ్రహ్మంగారు పేర్కొన్న గ్రామనామాలు ఈక్రింద ప్రదర్శించబడుతున్నాయి.

| | | |
|---|---|---|
| 1) | అలజాపురి | ( కాల. పు. 7 ) |
| 2) | అవుకువనం | ( ,, 52 ) |
| 3) | అహోబిలం | ( ,, 57, 58, 94, 97, 98, 125, 247, 248, |
| 4) | అరణి | ( ,, ,, 60, 249 ) |
| 5) | అలంపూరు | ( ,, ,, 97, 107, 260) |
| 6) | అగరాము | ( ,, ,, 229 ) |

1. సుబ్బయ్య, చాటకొండు - వీరబ్రహ్మంగారి జీవితచరిత్ర, ప్రచు: రచయిత జానకీ ముద్రాక్షరశాల, ప్రొద్దుటూరు, 1933, 50. పు. 27.

40) కొండవీడు ( కాల. పు. 60, 61, 106, 107 )

41) కొలుపుపాక ( ,, ,, 94 )

42) కోటకొండ ( ,, ,, 241 )

43) కోడుమూరు ( ,, ,, 241 )

44) కొత్తపేట ( ,, ,, 241 )

45) కోవెలకుంట ( ,, ,, 254 )

46) గండికోట ( ,, ,, 59, 60, 61, 98, 229 )

47 గజపురం ( ,, 77 )

48) గయ ( ,, ,, 246)

49) గుత్తి ( ,, ,, 41, 43, 49, 60, 61, 247, 252)

50) గురిజాల ( ,, ,, 15, 19)

51) గూడూరు ( ,, ,, 15, 19)

52) గుఱ్ఱంకొండ ( ,, ,, 60, 61, 254)

53) గోలకొండ ( ,, ,, 23, 61, 245, 246 )

54) ఘనడించినగరం ( ,, ,, 127 )

55) చెంగల్వకోట [ ,, ,, 17, 37, 54, 241 ]

పైన పేర్కొన్న గ్రామాలు, పట్టణాలు. ప్రదేశాలు భారత దేశానికి సంబంధించినవి. వీటిలో సగానికి పైగా దక్షిణ భారతానికి చెందినవే. కాలజ్ఞానంలో ఈ స్థలాలను బ్రహ్మంగారు వర్ణించారు. కనుక ఆయన ఆయా స్థలాలను చూసినట్లు రచయితలు రాశారు.

## బ్రహ్మంగారి మహిమలు :-

బ్రహ్మంగారి చరిత్రలన్నింటిలో రచయితలు బ్రహ్మంగారి మహిమలను గురించి రాశారు. ఆయా రచయితలు వారి రచనల్లో సందర్భానుసారంగా రాసిన బ్రహ్మంగారి మహిమలు ఇలా ఉన్నాయి.

1] బాల్యంలో ఒకరోజు ఆయన ఎండలో ఉండగా ఒక త్రాచు పాము పడగను నీడగా పట్టింది.

2] ద్వాదశవర్ష ప్రాయంలో తన పెంపుడుతల్లికి విశ్వరూపాన్ని చూపించాడు.

3] శ్రీశైలంలో యోగులకు తన మహిమ చూపించాడు.

4] నీటిలో మునిగిపోతున్న విద్యార్థులను రక్షించాడు.

5] అచ్చమ్మగారి ఆవులను గీచిన గిరలో నిలిపి ఎటూ వెళ్లకుండా చేశాడు.

6] బ్రహ్మంగారు కాలజ్ఞానాన్ని రచించడానికి తాటిచెట్లు తనంతట తాను వంగి ఆకులను ఇచ్చేటట్లు చేశాడు.

7] బ్రహ్మంగారు నుదుటిపై ధరించిన విభూతిరేఖలను తుడిచి వేయడానికి ప్రయత్నించిన సాహెబు చేయి కాలింది.

8] గరిమరెడ్డి అచ్చమ్మగారి కుమారుని అంధత్వాన్ని బ్రహ్మంగారు పోగొట్టరు.

9] నవాబు సమర్పించిన మాంసాహారాన్ని పూవులు, పండ్లుగా మార్చాడు.

10] సర్కారు ఉద్యోగికి ప్రాయశ్చిత్తం చేశాడు.

11] పోలేరమ్మ తో నిప్పు తెప్పించాడు.

12] కరుగుతున్న లోహద్రవాన్ని త్రాగాడు.

13] మరణించినవాణ్ణి బ్రతికించాడు.

14] చచ్చినట్లు నటించినవాణ్ణి నిజంగానే మరణించే విధంగా చేశాడు.

15] పాము కరచినవాణ్ణి బ్రతికించాడు.

16] ఆదిశక్తితో అతిథులకు ఆతిధ్యం ఇప్పించాడు.

17] భాగ్యనగరం నవాబు దర్బారులో నీటితో దీపం వెలిగించాడు.

18] ఒకవ్యక్తికి కుష్టురోగాన్ని నయం చేశాడు.

19] చనిపోయిన కక్కయ్య భార్యను బ్రతికించాడు.

20] బెజవాడలో కనకదుర్గను పిలిచి పువ్వులందించాడు.

21] పుష్పగిరి అగ్రహారాన్ని చూపులతోనే దగ్ధం చేశాడు.
22] మఠంలో పడిన దొంగలను కదలకుండా చేశాడు.
23] బ్రహ్మరాక్షసిని బంధించాడు.
24] చలిజ్వరాన్ని యోగదండం లోనికి రప్పించాడు.
25] గుజ్జం కడుపులో ఉన్న పిల్లను తీసి చూపించాడు.
26] నంద్యాలలో సిద్ధునితో పుట్టెడు బియ్యపు అన్నాన్ని తినిపించాడు.

పై అంశాలను జనశ్రుతి ఆధారంగా సేకరించి రచయితలు రచించారు. కానీ వీటికి బ్రహ్మంగారి కాలజ్ఞానంలో గానీ చరిత్రలో గానీ ప్రమాణాలు లభించవు.

## బ్రహ్మంగారి మార్గం :—

"యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం"
— గీత — జ్ఞాన — 7.

"ఎప్పుడెప్పుడు ధర్మం అంతరించి అధర్మం అభివృద్ధి చెందుతుందో అప్పుడప్పుడు నన్ను నేను సృజించుకొంటాను" అని శ్రీ కృష్ణుడు భగవద్గీతలో చెప్పాడు. కృష్ణునివంటి ప్రవక్తలు యోగులు ఆయా దేశాల్లో ఆయా సమయాల్లో అవతరించి మానవ లోకాన్ని కాపాడారు. ఇటువంటి ప్రవక్తలు, సిద్ధపురుషులు మరల మరల లోకకల్యాణం కోసం ఉద్భవిస్తుంటారనేది విశ్వవ్యాప్తంగా ఆస్తికులైనవారికి ఉన్న ప్రగాఢ విశ్వాసం. వీళ్లను లౌకికులు సంస్కర్తలని అంటారు. ఆస్తికులు అవతార పురుషులని అంటారు.

ఖువంటి ప్రవక్తల కోవకు చెందినవారే బ్రహ్మంగారు. ఈయన ా కాలానికి, భవిష్యత్ కాలానికి, అవసరమైన నూతన సిద్ధాంతాన్ని ిపించారు. మూఢాచారాలమీద మఠాధిపతుల, మఠస్వాముల త్తాధికారంపైన, సంకుచిత సిద్ధాంతాలపైన, సాంఘికవ్యవస్థ కుళ్లి యినందువలన ఏర్పడిన అంధవిశ్వాసాలపైన చేసిన తిరుగుబాటే నూతన సిద్ధాంతం.

పూర్వం బ్రాహ్మణాధిపత్యాన్ని విశ్వామిత్రుడు ఎదిరించాడు. ుజ్ఞవిధానంలో అసామంజస్యం ఆపాదించుకొన్న వైదికమతంపై ద్ధుడు తిరుగులేని తిరుగుబాటు చేశాడు. వైదికమత దురాచారాల ాద ధ్వజమెత్తినవారిలో చార్వాకుడు ప్రముఖుడు. తరువాత లంలో క్రీ॥ శ॥ 12వ శతాబ్దిలో కన్నడ దేశంలో బసవేశ్వరుడు ్వజనీనమైన ప్రవామతాన్ని స్థాపించి అద్వితీయ ప్రచారం చేశాడు. యన మార్గంలో రామానుజాచార్యులు నడిచాడు. మూఢ విశ్వాసా ో ప్రజలకు వేదాంతవిద్యను దూరంచేస్తున్న మఠాధికారులను తిరేకించాడు. వేదాంతరహస్యాలను సర్వజనులకూ అందించాడు. ువాత వేమన తన ఆటవెలది పద్యాలతో తేలికభాషలో సాధారణ జల గుండెల్లో విజ్ఞానదీపాలు వెలిగించాడు. ఈ మార్గంలోనే ిచాడు బ్రహ్మంగారు. వేమన చెప్పిన విషయాలను చేసి ాపించాడు. బ్రహ్మంగారు వేమన సిద్ధాంతాలకు వారసుడై వేమన ుగీతుల్లో చెప్పిన సిద్ధాంతాలను ప్రజాహృదయ కవాటాల దగ్గరకు ాలనే ఉద్దేశంతో వారికందుబాటులోవున్న జానపదరీతుల్లో తత్వాలు ుంచి ప్రబోధించాడు. వేదాలు, ఉపనిషత్తులు, బోధించిన శాశ్వత ్యం, సనాతన ధర్మం, మూఢవిశ్వాసాల అగాధంలో పడిపోయా ుని గ్రహించి వేదమత వైశిష్ట్యాన్ని ఉపనిషత్సారాన్ని ప్రజలకు ిరించాడు. విద్యను సామాన్యప్రజల వద్దకు నడిపించాడు. మఠాధి

పతుల గుత్తాధికారంలో ఉన్న భక్తి జ్ఞాన వైరాగ్యాలనూ వేదవిద్యనూ పంచములకూ స్త్రీలకూ పంచిపెట్టాడు. స్త్రీ జాతికి స్వాతంత్ర్యం అవసరమని ఎలుగెత్తి చాటాడు.

పూర్వప్రవక్తల్లో వేమన దోషనిరూపణలే ఎక్కువచేశాడు. కానీ బ్రహ్మంగారు ఆచరణతోపాటు భక్తిని జోడించి ప్రబోధించినందువల్ల ఈయన సిద్ధాంతానికి అంతులేని ప్రచారం లభించింది. కర్మకాండను నిరసించి భక్తిమార్గాన్ని అనుసరించడంవల్ల బ్రహ్మంగారి సిద్ధాంతం విజయశంఖాన్ని పూరించింది.

## జీవ సమాధి :-

బ్రహ్మంగారు క్రీ॥ శ॥ 1693 శ్రీముఖ నామ సంవత్సర వైశాఖ శుద్ధ దశమి భానువారంనాడు జీవసమాధి ప్రవేశం చేసినట్లుగా నిర్ణయించబడింది. ఆయన భక్తులను అనుగ్రహించడానికీ లోక కల్యాణార్థమూ సజీవసమాధిలో తపస్సు చేస్తున్నారనీ ఆస్తికుల విశ్వాసం. బ్రహ్మంగారు సమాధిప్రవేశం చేసి ఇప్పటికి దాదాపు 300 సంవత్సరాలు గడచిపోయాయి. ఇప్పటికీ ఆయన సశరీరులై తపోదీక్షలో ఉన్నారని భక్తుల నమ్మకం. ఇలా సజీవంగా సమాధి ప్రవేశం చేసినవాళ్లు ఎన్నివందల సంవత్సరాలైనా జీవించిఉంటారని ఆస్తికుల విశ్వాసం. కానీ ఈ అంశాన్ని ఋజువు చేయడానికి శాస్త్రీయమైన ఆధారాలు లేవని చెప్పవచ్చు. పతంజలి యోగశాస్త్రంలో జీవ సమాధిని గురించి చెప్పినట్లు బ్రహ్మంగారి చరిత్ర లిఖించిన కొందరు

రచయితలు రాశారు. కానీ పతంజలి యోగంలో జీవసమాధికి సంబం ధించిన అంశాలు లేవు. ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ "పతంజలి యోగములోకూడ జీవసమాధి గూర్చి సూత్రము లేమియును లేవు1" అని కొండూరి వీరరాఘవాచార్యు లన్నారు. సజీవంగా సమాధిలోనికి ప్రవేశించిన వ్యక్తి చిరకాలం జీవించిఉంటాడన్నది ఊహాగానం మాత్రమే. జరామరణాది విజయం యోగసాధ్యమని ఈదిగువ మంత్రంవల్ల తెలుస్తున్నది.

"న తస్య రోగో నజరా నమృత్యుః
ప్రాప్తస్య యోగాగ్నిమయం శరీరమ్"

— శ్వేతాశ్వతరోపనిషత్.
అధ్యాయం— 2. మంత్రం — 12.

యోగసాధనవల్ల జరామరణాదులపైన తాత్కాలిక విజయం సాధించ వచ్చునుగాని శాశ్వతవిజయం సాధించడం దుస్సాధమే. అయితే జీవసమాధిని గూర్చి ఇలా ఊహించవచ్చు.

సమాధి అంటే భావన అని అర్థం. అంటే ఇతర విషయాలను పరిహరించి భావింపదగిన వస్తువును మాత్రమే చిత్తంలో నిలపడమని అర్థం. భావింపదగిన విషయాన్ని మాత్రమే స్వీకరించి దానికి వ్యతిరేకమైన విషయాలను మనస్సులోనికి రానీయకుండా నిగ్రహించడమే సమాధి. బ్రహ్మంగారు లోక కల్యాణకారకమైన భావంపైన లక్ష్యాన్ని నిలిపి ముహూర్తాన్ని ముందుగా ప్రకటించి సజీవ సమాధి ప్రవేశం చేశారని చెప్పవచ్చును.

---

1, వీరరాఘవాచార్యులు వ్యాసకర్తకు రాసిన లేఖ ది. 20-7-83.

## వీరభోగ వసంతరాయలు :—

బ్రహ్మంగారు భూత భవిష్యత్ వర్తమానాలను కాలజ్ఞాన గ్రంథంలో చెప్పారు. కలియుగాంతంలో తాను వీరభోగ వసంత రాయలుగా అవతరిస్తానని భవిష్యత్తును చెప్పారు. ఈ పదానికి పర్యాయంగా —

| | | |
|---|---|---|
| 1] | వీరభోజ వసంతరాయలు | [కాల. పు. 5] |
| 2] | శ్రీరామ ధర్మజులు | [కాల. పు. 49, 68, 70] |
| 3] | రామావతారము | [కాల. పు. 31] |
| 4] | వీరబ్రహ్మయోగీంద్రుడు | [కాల. పు. 16] |
| 5] | రామధర్మజస్వామి | [కాల. పు. 260] |
| 6] | రామధర్మజమూర్తి | [కాల. పు. 34, 35] |
| 7] | వీరవసంతుడు | [కాల. పు. 256] |
| 8] | శ్రీరాములు | [కాల. పు. 8] |

అనే పదాలను ప్రయోగించారు. ఈ విషయం బ్రహ్మంగారే వీరభోగ వసంతరాయలుగా జన్మించబోతున్నారనే అంశాన్ని స్పష్టం చేస్తున్నది. వీరభోగవసంతరాయల ఉద్భవాన్ని వివరించే సంగ్రహ చరిత్రను బ్రహ్మంగారు కాలజ్ఞాన గ్రంథంలో ఏకాదశాశ్వాసంలో ప్రత్యేకంగా చెప్పారు. దీనిని వీరధర్మజచరిత్ర అని పేర్కొన్నారు.

## వీరధర్మజ చరిత్ర :—

వీరధర్మజచరిత్ర నాలుగు చిన్న అధ్యాయాలుగా చెప్పబడింది. దీనిలో వీరధర్మజుల ఉద్భవానికి ఆయన పాలనకు కొన్ని హేతువులను చెప్పారు. వీటిలో సూర్యచంద్ర గ్రహణాలు ప్రధానమైనవి. వీర ధర్మజచరిత్ర ప్రారంభంలో —

"గజ వేద నవాంబోధి కలివర్షగతే భువిః
ప్లవంగాబ్దే భానుబింబం కంకణాకార ముచ్యతే"

కాల. పు. 100

అని అన్నారు. శ్లోకం క్రింద వివరణఇస్తూ ఇలా అన్నారు.

"గజ = ౮ వేదాః = ౪ నవః = ౯ అంబోధి = ౪
౪౯౪౮ వెళ్లినమీాదట ప్లవంగనామ సంవత్సరమందు సూర్యబింబము కంకణాకారముగా అగుపడును." అంటే కలియుగ సంవత్సరాలు 4948 గడిచిన తరువాత వచ్చే ప్లవంగనామ సంవత్సరంలో చంద్ర గ్రహణం సంభవిస్తుంది. అప్పుడు సూర్యబింబం కంకణాకారంగా కనిపిస్తుంది అని భావం. బ్రహ్మంగారు వీరధర్మజులుగా అవతరించ బోయేముందు గ్రహ గతులను గ్రహణాల వివరాలనుఇస్తూ

"ప్లవంగే ద్విత్రి గ్రహణాః సూర్యాచంద్రమసోః క్రమాత్
ఇమే పంచగ్రహణాశ్చ కృష్ణవేణ్యాశ్చ దక్షిణే"

కాల. పు. 100

అని అన్నారు. దీనికి వివరణరాస్తూ "ప్లవంగ సంవత్సరమున సూర్య గ్రహణాలు ౨ చంద్రగ్రహణాలు ౩ ఈ అయిదు కృష్ణవేణికి దక్షిణ భాగమందు తెలియవచ్చును." అని అన్నారు. వీరభోగ వసంత రాయలు ఉద్భవించడానికి ముందు కనిపించే ప్రధానమైన గుర్తులుగా వీటిని అభివర్ణించారు. సూర్యచంద్ర గ్రహణాల వర్ణనతో ప్రథమా ధ్యాయం ముగిసింది. తక్కిన మూడధ్యాయాల్లో గ్రహ సంచారాన్ని గురించి వాటిఫలితాలను గురించి వర్ణించారు. కాలజ్ఞానంలో ఈ ఆశ్వాసంలో గాక మిగతా ఆశ్వాసాల్లోకూడా వీరభోగ వసంతరాయల

అవతరణను గురించి తత్కాలంలో కనిపించే హేతువులను, ఆయన ఉద్భవ కాలాన్ని, ఆయన స్వరూప స్వభావాలను, ఆశయాలను, పట్టాభిషేక సమయాన్ని పరిపాలనను అభివర్ణించారు.

## వీరభోగవసంతరాయల అవతరణకు హేతువులు :—

బ్రహ్మంగారు కాలజ్ఞానం ప్రథమాశ్వాసంలో భవిష్యత్తును వర్ణిస్తూ "వీరవసంతరాయలు వచ్చేటప్పుడు పుట్టే కార్యాలు" (కాల. పు. 6) అనే శీర్షిక క్రింద "సామవేద ఘోషణాలచేత బాల్య యౌవన ప్రౌఢలు వీరభోగ వసంతరాయల చారిత్రాలు పాడేరు. పువ్వులవాన కురిసీని. ఆమీదట అమావాస్యనాడు చంద్రోదయ మయ్యాని 1" అని అన్నారు. ఇదే సంపూర్ణ చంద్రగ్రహణం. దీనిని గురించి వివరిస్తూ "సూర్యమండలమందు చంద్రుడు అంతా ప్రవేశించివుండును. చుట్టువారా ఎక్కువగానున్న సూర్యబింబము వలయాకృతి అవును. నడుమ వున్నటువంటి చంద్రుడు విష్ణురూపం అగును. అదే అమావాస్య పూర్ణిమ.2" అని చెప్పారు. ఇవేకాక ఇంకా ఈక్రింది హేతువులను వర్ణించారు.

1. "ఆకాశము యర్రనయ్యాని"
2. ఆకాశమున భుగుళ్లు భుగుళ్లుమనే ధ్వని బుట్టీని"

---

1. వీరబ్రహ్మం, పోతులూరి - కాలజ్ఞానం, ప్రచు: కృష్ణమూర్తి, రంగయ్య, కందిమల్లాయపల్లె 1974, పు. 6.

2. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానం, ప్రచు. కృష్ణమూర్తి, రంగయ్య, కందిమల్లాయపల్లె 1974, పు. 102.

3. గ్రామాంతరాల పట్నాల లక్ష్మీదేవి యేడ్చీని."
4. "నెత్తురువాన కురిసీని"

కాల. పు. 6

5. "సూర్యకాంతి దీప్తి అణగిపోవును." (కాల. పు. 45)
6. "ఘోర దురితము లణగి
కుంభిని మీదను
పుష్పవర్షములు గురిసీనిమా."

కాల: పు. 232.

ఇటువంటి గుర్తులు వీరభోగ వసంతరాయలు ఉద్భవించబోయే ముందు కనిపిస్తాయి.

*వీరభోగ వసంతరాయల ఉద్భవం :—*

"కన్యారాశి గతే జీవే విక్రమో
వీరధర్మజ ప్రయాణో భవేత్"   కాల. పు. 103

అనే శ్లోకంలో బృహస్పతి రాశి కన్యారాశి లోనికి ప్రవేశించిన ముహూర్తంలో వీరధర్మజులు ఉద్భవమవుతారు. అనే విషయం చెప్పబడింది. వీరభోగ వసంతరాయలు కార్తీక మాసంలో శుద్ధ ద్వాదశి నాడు జన్మిస్తాడని బ్రహ్మంగారు

"కార్తీక శుద్ధ ౧౨లు నాటికి ఉద్భవమయ్యేను.1" అనే కాలజ్ఞానవచనంలో వివరించారు. అంటే ఆయన కార్తీక శుద్ధ ద్వాదశి నాడు బృహస్పతి కన్యారాశిలో ప్రవేశించినపుడు ఉద్భవిస్తాడని భావం.

---

1. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానము, ప్రచు: కృష్ణమూర్తి, రంగయ్య కందిమల్లాయపల్లె, 1974, పు. 70, 71.

## వీరభోగ వసంతరాయల స్వరూపం :-

1) **శృంగారమూర్తి :-** వీరభోగ వసంతరాయలు అందమైన స్వరూపం కలవాడు. అనే విషయం -

> "శ్రీరామ ధర్మజులు
> సృష్టిభారము దాల్ప
> శృంగారమూర్తులై వచ్చేరు మా"
>
> కాల. పు. 232

అనే హరిగోవిందవాక్యంలో చెప్పబడింది.

2) **సన్యాసి వేషం :-** భవిష్యత్తులో ఉద్భవించబోయే వీరభోగ వసంతరాయలు సన్యాసివేషంలో ఉంటాడని బ్రహ్మంగారు వర్ణించి చెప్పారు. అందుకు తార్కాణంగా కాలజ్ఞాన గ్రంథంలోని ఈక్రింది వచనాలను పేర్కొనవచ్చు.

1) "సన్యాసి వేషంబు సంతోషముమీద రామధర్మజమూర్తి వుద్భవం" (కాల. పు. 34, 35)

2) "సన్యాసివేషంబు చేత చాలగా ఉద్భవిల్లి" (కాల. పు. 30)

3) "సన్యాసివేషంబు సరిపోయె" (కాల. పు. 32

4) "సన్యాసి వేషంబు సర్వంబు ముగిసెను" (కాల. పు. 53)

పై ఉదాహరణలనుబట్టి వీరభోగవసంతరాయలు సన్యాసివేషంలో ఉంటాడని చెప్పవచ్చు.

**3) స్వ భా వం :-** వీరభోగ వసంతరాయలు సామగాన ప్రియుడై ఉంటాడు. ఈ అంశం

"మందార ధరుడైన
సుందరాంగుని మహిమ
మహిమీద ఎవరూను
యెరుగారుమా
సందేహాము లేదు
సామగాన ప్రియుడు
సాధూల రక్షింప వచ్చీనిమా"

కాల. పు. 2౫8

అనే కాలజ్ఞాన గోవిందవచనంలో చెప్పబడింది. మందర ధరుడైన సుందరాంగుడు అంటే శ్రీమహావిష్ణువు. ఆయన మహిమ ఎవరికి తెలియదనడంలో సందేహంలేదు. ఆ సామగానప్రియుడైన విష్ణువు వీరభోగవసంతరాయలుగా సాధువులను రక్షించడానికి వస్తాడని భావం.

**పట్టాభిషేకం :-** వీరభోగ వసంతరాయలకు మార్గశిరమాసంలో ఆదివారమురోజు పట్టాభిషేకం జరుగుతుంది. అనే విషయాన్ని బ్రహ్మంగారు

1) "మార్గశిర మాసానకు
మందిరము జేరిని" (కాల. పు. 7, 8)

2) సుకుమార దివ్యదేహంబు మీద
శ్రీరామమంత్రంబు మీద
ఆదివారము పట్టము గట్టేరు." (కాల. పు. 3౮)

అంటూ మున్నగు కాలజ్ఞానవచనాల్లో చెప్పారు. ఈయనకు పట్టాభిషేకం మీనరాశిలో బృహస్పతి ప్రవేశించిన ముహూర్తంలో అవుతుందని

"ఝషజ్యతే సురగురౌ కీర్తిమాం రామధర్మజా
పట్టాభిషేకం కుర్వంతి పాలయం ధరణీ సురాన్"1

అనే శ్లోకంలో వివరించారు. మీనరాశిలో బృహస్పతి ప్రవేశిస్తే కీర్తివంతులైన రామధర్మజులకు పట్టాభిషేకం చేస్తారని భావం.

**పరిపాలన :—** వీరభోగ వసంతరాయలు తన పరిపాలనలో

"కావరించిన నరుల
ఖండించి వేసేరు
కర్మనిష్ఠుల గౌరవించేరు మా"

కాల. పు. 256

అనీ,

"యాభై ఆరు రాజ్యంబు లన్నియు గట్టి
నిమిషమున దుష్టుల మొత్తివేసీని"

— కాల. పు. 53

అనీ చెప్పారు. ఆయనను దుష్టశిక్షకుడుగా శిష్టరక్షకుడుగా అభివర్ణించారు. అంతేగాక అయన పరిపాలిస్తున్న కాలంలో

---

1. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానము, ప్రచు : కృష్ణమూర్తి, రంగయ్య కందిమల్లాయపల్లె 1974, పు. 104:

"సావధానముగాను
సామ అథర్వణములు
సాంగమై ముందర నడిచీని మా"

— కాల. పు. 256

అనీ చెప్పారు. అంటే ఆయన పరిపాలనలో సామవేదానికీ అథర్వణ వేదానికీ ప్రాముఖ్యం ఉంటుందని భావం.

ఈవిధంగా భవిష్యత్తులో ఉద్భవించబోయే వీరభోగ వసంత రాయలను బ్రహ్మంగారు సుందరస్వరూపునిగా, సన్యాసివేష ధారునిగా, సామగాన ప్రియునిగా, దుష్టశిక్షకుడుగా, శిష్టరక్షకుడుగా వర్ణించారు.

## బ్రహ్మంగారి మఠం :—

ఆంధ్రదేశంలోని కడప జిల్లా బద్వేలు తాలూకాకు చెందిన కందిమల్లయపల్లె గ్రామమే ప్రస్తుతం "బ్రహ్మంగారి మఠం" అని పిలువబడుతున్నది. గ్రామానికి ఉత్తరదిశగా మఠం వుంది. బ్రహ్మంగారి సమాధీ, ఆయన సతీమణి గోవిందమ్మగారి సమాధీ పక్కపక్కనే ఉన్నాయి. ఆ సమాధులమీద గోవిందమ్మ బ్రహ్మంగారల సువర్ణ ముఖాకృతులు అలంకరింపబడి ఉన్నాయి. ఈ సమాధులపై ఉన్న గర్భగుడి, గుడిలోని ఉత్సవవిగ్రహాలు ముఖమంటపం, ఆలయ, గోపుర, ప్రాకారాలను బ్రహ్మంగారి భక్తులు నిర్మించారు. గోపురంచుట్టూ బ్రహ్మంగారి చరిత్రను విగ్రహాలుగా తీర్చి అమర్చారు. గర్భగుడి వెనుక అశ్వత్థనారాయణ వృక్షం ఉంది. ఆవెనుక మఠాధిపతుల నివాస గృహం ఉంది. మరొకప్రక్క బ్రహ్మంగారు నిర్మించిన ఒక చిన్న ఆలయం ఉంది. దక్షిణప్రాకారానికి సింహద్వారముంది. ఈ ద్వారానికి తూర్పుదిశన మరొకచోట రెండవద్వారముంది. దక్షిణంవైపు

అన్నదానసత్రాలు ఉన్నాయి. మఠాధిపతి గృహానికి వెనుక ఒక పెద్ద బావి ఉంది. గర్భగుడికి ముందున్న ముఖమండపంలో చుట్టూ బ్రహ్మంగారి వంశీకుల సమాధు లున్నాయి. ఉత్తర ప్రాకారానికి అవతల సింగరాయనది ప్రవహిస్తున్నది. దక్షిణదిశగా గ్రామం లోనికి ప్రవేశిస్తుంటే అక్కడ తిరుమల తిరుపతి దేవస్థానంవారు నిర్మించిన ధర్మసత్రం ఉంది. అదేమార్గంలో ఊళ్లోకి వెళితే బ్రహ్మంగారు నివసించిన గృహం కనిపిస్తుంది. బ్రహ్మంగారు సమాధిప్రవేశం చేసిన తరువాత ఆఇంట్లో ఎవ్వరూ నివసించలేదు. ఆయన జ్ఞాపకచిహ్నంగా ఆ యింటిని ఆలాగే ఉంచారు. ఆయన నివసించిన పర్ణశాలవంటి ఇల్లు శిథిలం కాగా పూర్వంఉన్న పద్ధతి ప్రకారంగానే గోడలు కట్టారు. ఆ యింటికి తూర్పున ప్రవేశద్వారం ఉంది. ఇల్లు ఉత్తర దక్షిణాలుగా ఉంది. ఇంటి పంచలో ఇరువైపులా రెండు పెద్దపెద్ద అరుగులు ఉన్నాయి. దక్షిణభాగాన సందు ఉంది. ప్రవేశద్వారానికి పశ్చిమ దిశగా మరొక ద్వారముంది. ఇంట్లో పూజామందిరముంది. బ్రహ్మంగారు సమాధిప్రవేశం చేసిన తరువాత ఎంతోకాలం ఆ యిల్లు పాడు బడి ఉంది. ఆయింటి పూజామందిరం లోపల ఒకపుట్ట పెరిగింది. అది ఇప్పటికీ అలాగే ఉంది. తరువాత కొంతకాలానికి మఠాధిపతులు ఆగృహాన్ని శుభ్రపరచి యాత్రీకులకు ప్రదర్శనయోగ్యంగా చేశారు. ఈనాడు బ్రహ్మంగారి మఠానికి వెళ్లే యాత్రికులంతా బ్రహ్మంగారి నివాసగృహాన్ని దర్శించివస్తారు. గృహానికి పడమర దిశగా ఆయన స్వయంగా త్రవ్వినట్లు చెప్పబడుతున్న బావి ఇప్పటికీ ఉంది.

బ్రహ్మంగారి మఠం ప్రక్కనే ఈశ్వరమ్మగారి మఠం కూడా ఉంది. గ్రామానికి తూర్పు దిశగా కొంత దూరంలో బ్రహ్మంగారి

హరిజన శిష్యుడు కక్కయ్య మఠం ఉంది. అదే మార్గంలో దాదాపు అరకిలోమీటరు దూరంలోనే "మలమీద పల్లె పోలేరమ్మ" ఉంది. బ్రహ్మంగారి కుమారుడు పోతులూరయ్య ఇక్కడ ఉన్న ఒక వేపచెట్టు దగ్గర ఆ గ్రామ దేవతను ప్రతిష్ట చేశాడు. ఈచెట్టు మూడువందల సంవత్సరాల నాటిదని చెప్పబడుతున్నది. ఈచెట్టు ఈనాటికీ ఉంది. యాత్రీకులు ఈరెండుస్థలాలను దర్శిస్తారు. కందిమల్లయపల్లె చుట్టూ దట్టంగా కొండలు నిండిఉన్నాయి. ఆ గ్రామం ప్రశాంతమైన ప్రకృతివాతావరణంతో నిండిఉంది.



బ్రహ్మంగారి మఠం దృశ్యాలు కందిమల్లయపల్లె గ్రామం



మఠ ప్రవేశద్వారం



మఠాన్ని చుట్టి ప్రవహిస్తున్న సింగరాయనది



బ్రహ్మంగారు నివసించిన గృహంలో ఆయన స్వయంగా త్రవ్విన బావి



పోలేరమ్మ విగ్రహం



బ్రహ్మంగారు ఈ రచ్చబండ దగ్గరే పోలేరమ్మతో నిప్పు తెప్పించారు



ఆలయ గోపురం మీద బ్రహ్మంగారి జీవిత చరిత్ర బొమ్మలు



మఠాధిపతుల నివాస గృహము



బ్రహ్మంగారు నివసించిన గృహం



మఠ ప్రాంగణంలోని సత్రాలు బావి



తిరుపతి దేవస్థానంవారు నిర్మించిన సత్రం

ప్రవేశిక :-

ఆంధ్రదేశంలో 17వ శతాబ్ది నడిమికాలం నుంచి బ్రహ్మంగారి కవిత్వం కాలజ్ఞాన వచనాలూ గోవిందనామాలూ కాలజ్ఞాన తత్త్వాలూ పద్యాలూ పాటలూ ద్విపదలూ కందార్థ దరువులూ మున్నగురూపాల్లో అబాలవృద్ధులను ఆకర్షిస్తూ తెలుగునేల నాలుగు చెరగులా ప్రవహిస్తున్నదని చెప్పడంలో అతిశయోక్తి లేదు. బ్రహ్మంగారి తత్త్వాలు దేశంలో అధికంగా వ్యాప్తిచెంది ఉన్నాయి. ఆంధ్రదేశంలో వాడవాడలా తిరిగే బైరాగుల, హరిదాసుల, రసనాగ్రాలపై తాండవిస్తూ ఎప్పటికప్పుడు నిత్యనూతనాలై తెలుగువారి కర్ణపుటాల్లో ప్రతిధ్వనిస్తున్నాయి. ఆ తత్త్వాల్లో ఉన్న ఆకర్షకమైన విషయమే దీనికి ప్రధాన కారణం. బ్రహ్మంగారి కవిత్వాన్ని ఏరాజూ పోషించనప్పటికీ మూడువందల సంవత్సరాల నుంచి శ్రుతిలా మౌఖికమైన ప్రచారాన్ని పొందుతూనే ఉంది.

తెలుగు సాహిత్యరంగంలో బ్రహ్మంగారి కాలం నాటికి మనుచరిత్రతో మొదలైన ప్రబంధకావ్య ప్రక్రియ వెర్రితలలు వేసింది. కావ్యాలలో శృంగారం ప్రధానాంగమై విషయవివేకం నశించింది. వచనగ్రంథాలూ శతకాలూ గేయాలూ యక్షగానాలూ విరివిగా రచించబడ్డాయి. ఈకాలపు కవులు గేయకవితకు పట్టం కట్టడం ప్రశంసనీయమైన అంశం.

ఇలాంటి పరిస్థితుల్లో ఈ యుగంలోనే అభ్యుదయభావాలు గల ఇద్దరు ప్రజాకవులు ఉద్భవించారు. వారు వేమన బ్రహ్మంగార్లు. వేమన తన సమకాలీనమైన సంఘంలో జరిగిన దురాచారాలను సూటిగా ఎత్తిచూపాడు. పచ్చి శృంగార భావంతో మూఢభక్తితో కవిత్వం

వ్రాస్తున్న ఆరోజుల్లో సంఘ సంస్కరణోద్దేశంతో కవిత్వం రాసాడు. భావంలో కొత్తపుంతలు తొక్కిన వేమన ఛందస్సు విషయంలో పాత రీతులే అనుసరించాడు.

ఈ యుగంలోనే నూతన భావాలతో బ్రహ్మంగారు రచనలు చేశాడు. వేదాంత సాహిత్యాలు సంఘంలో కొందరి స్వంతమని భావించే ఆ రోజులలోనే వాటిని కొల్లగొట్టి ప్రబోధనంగా పంచి పెట్టాడు. ఈయన వేమన కవిత్వానికి వారసుడయ్యాడు. కానీ ఛందస్సు విషయంలో ఒక్కడుగు ముందుకు వేశాడు. వేమన పద్యాలు మాత్రమే రాశాడు. బ్రహ్మంగారు కందార్ధాలు ద్విపదలూ గేయాలూ రచించి ప్రజల గుండెలకు దగ్గరగా వెళ్ళారు. పాటలు ప్రజలలో ఎక్కువ వ్యాప్తిచెందడానికీ మననం చేయడానికీ పనికివస్తాయనే విషయాన్ని బ్రహ్మంగారు గమనించాడు. తాను రచించిన గీతాలకు సంగీతాన్ని మేళవించి పలికించాడు. ఆయన కవితాధార వాడుకభాషను తరుశిఖరమెక్కించింది. బ్రహ్మంగారు సామాన్యుని గుండెను వేదాంతరంగంగా, నాలుకను కవితావేదికగా చేశాడు.

బ్రహ్మంగారి రచనల్లో సంఘానికి ఆరోగ్యం కలిగించే మార్పులు కావాలనే అంశం స్పష్టంగా కనిపిస్తుంది. ప్రస్తుత సమాజం ఆశిస్తున్న అస్పృశ్యతా నివారణ, మతసమన్వయం, మద్యపాన నిషేధం, ప్రజా భాషలో కవిత్వం రాయడం మొదలైనవి బ్రహ్మంగారి కవిత్వంలో కనిపిస్తాయి. ఆయన భవిష్యత్తు అని చెప్పిన అంశంలో ఆర్ధికమైన మార్పులు వస్తాయని ఇలా అన్నారు.

“అవనిలో గల బీద ధనవంతు లొకటీగ
అయ్యే యోగముకూడ వచ్చీని మా”[1]

బ్రహ్మంగారు ఆర్ధికసంబంధమైన మార్పు రావాలని ఆశించినట్లు పై గోవిందవచనం నిరూపిస్తుంది.

1. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానం, ప్రచు. కృష్ణమూర్తి, రంగయ్య, కందిమల్లాయపల్లె 1974, పు. 223.

## బ్రహ్మంగారి రచనల సమీక్ష :

కాలజ్ఞానం అనేమాట వినగానే తెలుగునాట బ్రహ్మంగారు గుర్తుకు వస్తారు. దేశంలో ఏవింత జరిగినా మనవాళ్లు బ్రహ్మంగారి కాలజ్ఞానాన్ని స్మరిస్తారు. బ్రహ్మంగారి రచనలన్నీ ప్రాయికంగా కా ల జ్ఞా న బోధాత్మకాలూ వేదాంత తత్వ ప్రతిపాదకాలుగా కనిపిస్తున్నాయి. కాలజ్ఞానగ్రంథంలో వచనంగా, ద్విపదగా, జీవైక్య బోధగా, సౌజన్య పత్రికలుగా, గోవింద వాక్యాలుగా, తత్వాలుగా బ్రహ్మంగారి రచనలున్నాయి. బ్రహ్మంగారి రచనలను సమీక్షించే ముందు కాలజ్ఞాన గ్రంథపు ప్రామాణిక ప్రతులను నిర్ణయించాలి.

## గుజిలీ ప్రతుల విశేషాలు :-

బ్రహ్మంగారి కాలజ్ఞాన తాళపత్ర గ్రంథాలు ప్రధానంగా మూడు స్థలాల్లో భద్రపరచబడి ఉన్నాయి. ఒకటి కందిమల్లయపల్లెలో బ్రహ్మం గారి సమాధిదగ్గర చెక్కపెట్టెలో, రెండు ముడుమాల గ్రామంలో సిద్ధయ్యమఠంలో గర్భగుడిలో బ్రహ్మంగారి పాదుకలచెంత చెక్క పెట్టెలో, మూడు కడప జిల్లా నగరిపాంటిలో రంగరాజు మఠంలోని గర్భ గుడిలో ఉన్నాయి. ఈ మూడుప్రతులూ ని త్య పూ జ లందు కొంటున్నాయి.

బ్రహ్మంగారి కాలజ్ఞానం బృహత్‌గ్రంథం. "భూత భవిష్యత్ వర్తమాన కాలానకున్నూ నానాదేశాలకున్నూ వ్రాయించినది మూడు లక్షల ముప్పైరెండువేల గ్రంథము1" అనే కాలజ్ఞాన వచనం ద్వారా కాలజ్ఞానంలోని శ్లోకాలసంఖ్య 332000 అని తెలుస్తుంది. ప్రస్తుతం

1. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానం, ప్రచు. కృష్ణమూర్తి, రంగయ్య, కందిమల్లాయపల్లె 1974, పు. 71.

లభించే కాలజ్ఞానం మొదట చెప్పిన బృహత్ గ్రంథానికి సంక్షిప్తరూప మనీ "ఈగ్రంథమంతా వ్రాయకూడదు కలగుమాత్రం వ్రాయించి మీా సమీపానకు పంపించినాము." (కాల. పు. 71) అనే కాలజ్ఞాన వచనంద్వారా తెలుస్తున్నది.

బ్రహ్మంగారు రచించిన కాలజ్ఞాన తాళపత్ర గ్రంథాలన్నీ ఇప్పటికీ బనగానపల్లె చింతచెట్టు పాతరలో ఉన్నాయని అంటారు. బ్రహ్మంగారి పెద్దకుమారుడు మఠాధ్యక్షుడుగా ఉన్న కాలంలో రంగరాజు అనే భక్తుడు మూడు గ్రంథాలను మాత్రం వెలికితీశాడు. రంగరాజు బ్రహ్మంగారివరంతో జన్మించాడు. రంగరాజు జన్మించకముందు బ్రహ్మం గారు రంగరాజు తండ్రికి ఒక రాగిశాసనం ఇచ్చాడు. దానిలో బ్రహ్మం గారి మనుమరాలు ఈశ్వరమ్మకూ రంగరాజుకూ వివాహం చేయాలని బ్రహ్మంగారు నిర్ణయించినట్లు భావించి రంగరాజు కందిమల్లయపల్లె వచ్చి ఈశ్వరమ్మను తనకిచ్చి వివాహం చేయవలసిందని అడిగాడు. బ్రహ్మంగారు ఏవిషయాన్నయినా కాలజ్ఞానంలో నిక్షేపిస్తాడు. కాల జ్ఞానంలో ఆధారం చూపించమని బ్రహ్మంగారి కుమారులు అడిగారు. అప్పుడు బనగానిపల్లె వెళ్లి చింతచెట్టు పాతర తెరచి మూడుగ్రంథాలను మాత్రం రంగరాజు బయటకు తీయగలిగాడు. దానిలో ఆధారాలు చూపించలేక నిర్ణయం ప్రకారం రంగరాజు నగరిపాటిలో అగ్నిప్రవేశం చేశాడు. ఆస్థలంలో ఒకమఠం నిర్మించారు. ఆ తాళపత్ర గ్రంథాలను ఆమఠంలోనే భద్రపరచారు. 1

---

1. సుబ్బయ్య, చాటకొండు - వీరబ్రహ్మంగారి సంతానచరిత్రము, ప్రచు: రచయిత, జానకీ ముద్రాక్షరశాల, ప్రొద్దుటూరు, 1933, 1950. పు. 48, 49, 50.

బ్రహ్మంగారి ప్రథమశిష్యుడు సిద్ధయ్య. ఈయనకు బ్రహ్మం గారు సమాధిలో ప్రవేశించే సమయంలో తాను ధరించిన బంగారపు ఉంగరము, పాదుకలు, యోగదండము, కాలజ్ఞాన తాళపత్రగ్రంథాలు, పూజాసామగ్రి, మున్నగువాటిని ఇచ్చారట.1 అవి ఇప్పటికి సిద్ధయ్య గారి మఠంలో సమాధికి ఎడమవైపుఉన్న మూలగదిలో ప్రత్యేకమైన పూజలను అందుకొంటున్నాయి. ప్రతిసంవత్సరం మూలా నక్షత్రంలో వీటిని తీసి ప్రదర్శిస్తారు. ఇక్కడ తాళపత్ర గ్రంథాలన్నీ ఒక పెద్ద చెక్కపెట్టెలో భద్రపరచబడి ఉన్నాయి.

ఈనాడు లభిస్తున్న తాళపత్ర గ్రంథాలు బ్రహ్మంగారు స్వహస్తంతో రాసినవి కావు. బ్రహ్మంగారు చెబుతూండగా అన్నాజయ్య అనే శిష్యుడు రాశాడని అంటారు. ఇందుకు కాలజ్ఞాన గ్రంథం ప్రథమాశ్వాసంలో ఉన్న "శ్రీ వీరప్పయ్యగారు అన్నాజయ్యతో భూత భవిష్యత్ వర్తమానములు చెప్పిన క్రమము." (పు. 1) అనే వచనాన్ని నిదర్శనంగా చూపిస్తారు. అయితే అన్నాజయ్యతో చెప్పిన క్రమము అనిఉంది కాని అన్నాజయ్య రాసిన క్రమము అని లేదు. అన్నాజయ్యతో చెబుతూండగా ఇతర శిష్యులు కూడా కొందరు రాసుకొని ఉండవచ్చు. కానీ ఇప్పుడు ఈ వ్యాసకర్తచేత పరిశీలించ బడిన తాళపత్రప్రతుల్లో లేఖకులపేర్లు లేవు.

ప్రస్తుత బ్రహ్మంగారి మఠాధ్యక్షుల తండ్రి శ్రీనివాసస్వామి 1941వ సంవత్సరంలో మఠంలోని తాళపత్ర గ్రంథాలకు నకలు ప్రతి తయారుచేశారు. ఒక పెద్ద తెల్లకాగితాల బౌండుపుస్తకంలో ముత్యాల

---

1. ది. 12-10-83న ముడుమాల గ్రామంలో సిద్ధయ్యగారి మఠంలో ప్రస్తుత మఠాధిపతి శ్రీ లక్ష్మీశ్వరయ్యగారు చెప్పిన విషయం.

కోవవంటి అక్షరాలతో కాలజ్ఞానం రాయబడింది.1 ఈ గ్రంథం అట్టల పైన అక్షరాలు ముద్రించబడి ఉన్నాయి. ఈ కాలజ్ఞానాన్ని ముద్రించే సమయంలో మఠంలోఉన్న కాలజ్ఞానం అసంపూర్ణంగా ఉండడంచేత సిద్ధయ్య మఠంనుంచి సంపూర్ణమైన ప్రతులను తెప్పించినట్లు బ్రహ్మం గారి పీఠాధిపతులు వ్యాసకర్తతో చెప్పారు. 2

బ్రహ్మంగారి మఠంలోనూ సిద్ధయ్యమఠంలోనూ పూజలందు కొంటున్న ఈ తాళపత్రాలు బ్రహ్మంగారి కాలంనాటివే ననీ ఆతరువాత కాలంలో రాయబడినవి కావనీ అవి గులజారీ ముళ్లతో రాయబడినవనీ బ్రహ్మంగారి మఠానికీ సిద్ధయ్యగారి మఠానికీ చెందిన అధిపతులు చెప్పారు. బ్రహ్మంగారు గులజారీ ముళ్లతో తాటియాకుల మీద రాశారని పండితులుకూడా అన్నారు. 3

తాళపత్రాలమీద రాయబడిన అక్షరాలు కుదిరికగా ముత్యాల కోవలా ఉన్నాయి. వ్రాత కొంచెం గొలుసుకట్టుగాఉంది. గ్రంథంలో రాయబడిన సంఖ్యావాచకాలు తెలుగులో ఉన్నాయి. వాక్యాలు ముగించబడినందుకు గుర్తుగా ఇలా "I" నిలువుగీతలు గీయబడ్డాయి. "బ్రహ్మము" అనే పదాన్ని "బ్రంహము" అని రాశారు. "క" అనే అక్షరస్వరూపం "ᥴ" ఇలా ఉంది. "సర్వము" అనే పదం "సర్వ" అనే

---

1. బ్రహ్మంగారి మఠంలో డి. 10-10-83న తేదీన మఠాధిపతి శ్రీ వీరభోగ వసంత వేంకటేశ్వరస్వామి ఈ వ్యాసకర్తకు పై గ్రంథాన్ని చూపించారు. దీని ఛాయాచిత్రం ప్రక్కపుటల్లో ప్రదర్శించబడింది.
2. డి. 11-10-83 నాటి సమావేశంలో,
3. డా॥ వీరభద్రరావు, కొత్తపల్లి - జేజినాయన తత్వాలు - ఒక పరిశీలన. ఆకాశవాణి ప్రసంగం, హైదరాబాదు, 6-9-80.



బ్రహ్మంగారి కాలజ్ఞాన తాళపత్రాలు భద్రపరచిన చెక్కపెట్టె

రూపంలో ఉంది. ప్రాచీన తెలుగు తాళపత్ర గ్రంథాలలో ఈపద్ధతే కనిపిస్తుంది. "న" వత్తు "్న" ఇలా "మ" వత్తు "్మ" ఇలా ఇప్పటి లాగే ఉన్నాయి. తాళపత్రాలు పాతబడి ఉన్నప్పటికీ స్పష్టంగా చదవడానికి అనుకూలంగా ఉన్నాయి. బ్రహ్మంగారి కాలజ్ఞాన తాళ పత్రాల ఛాయాచిత్రం ఈప్రక్కపుటలో ప్రదర్శించబడింది.

గత మూడువందల సంవత్సరాలుగా బ్రహ్మంగారిచేత చెప్పబడిన కాలజ్ఞాన తాళపత్ర గ్రంథాలు ఆయన సమాధిచెంత కొయ్యపెట్టెలో భద్రపరచబడి నిత్య నైవేద్య దీపారాధనలు అందుకుంటున్నాయి. ప్రస్తుత మఠాధిపతుల తండ్రి శ్రీనివాస స్వాములు ఈ తాళపత్ర గ్రంథాన్ని యథాతథంగా ఒకపుస్తకంలో రాసికొని దాన్ని తన పూజా మందిరంలో ఉంచుకొని నిత్యం పఠించేవారు. ఆయన శిష్యులుగా ఉన్నకొందరు తాముకూడా తమ పూజామందిరాల్లో ఉంచుకొని పూజిస్తామని చెప్పి ఈకాలజ్ఞాన గ్రంథానికి నకలు ప్రతులు తీసుకొని వెళ్లి ముద్రాపకులకు ప్రతులు తయారుచేసి ఇచ్చారు. ఇలా రాయడంలో కొంత తగ్గించడం కొన్నిచోట్ల పెంచడం జరిగింది. ఈవిధంగా బ్రహ్మంగారి పేరిట కాలజ్ఞాన గ్రంథ ప్రతులు దేశమంతా వ్యాపించాయి. కాలజ్ఞానంలో ఉన్నఅంశాలు ఏవి బ్రహ్మంగారివో ఏవి ఇతరులవో చెప్పలేని పరిస్థితి ఏర్పడింది. ఇలా దేశంలో అనేకులు ప్రకటించిన కాలజ్ఞానాలు ప్రచారంలో ఉన్నాయి. బ్రహ్మంగారి కాలజ్ఞానం మౌఖిక ప్రచారంలోనూ ఉంది. ప్రస్తుత పరిశోధనలో లభించిన కాలజ్ఞాన ప్రతులు ఈక్రింద సమీక్షించబడుతున్నాయి.

## *1) ర్యాలి వీరభద్రేశ్వరస్వామి సంపాదించిన ప్రతి :-*

పశ్చిమ గోదావరి మండలం కొవ్వూరు తాలూకా దేవరపల్లి

వీరబ్రహ్మానంద ఆశ్రమాధ్యక్షులు ర్యాలి వీరభద్రేశ్వరస్వామి. ఈయన ప్రభవ సంవత్సరం నుంచి అంటే క్రీ॥ శ॥ 1927 నుంచి బనగానపల్లి నేలమఠంలో అర్చకులుగా ఉండేవారు. అప్పుడు, వీరికి పది ఆశ్వాసాల కాలజ్ఞాన తాళపత్ర గ్రంథం లభించింది. అందులో కాలజ్ఞాన మహా సౌజన్య పత్రికను 1941వ సంవత్సరంలో ముద్రించారు. "మిగిలిన గ్రంథంలో ఆరాశ్వాసముల గ్రంథం ఈ సంవత్సరం (1945) ముద్రణ చేయించి ప్రకటన చేస్తిని"1 అని ఆయన రాశాడు. బ్రహ్మంగారు ఎలా రాశారో తానూ అదేవిధంగా రాశానని ఆయన చెప్పారు. వీరికి దొరికిన ప్రతిననుసరించి చూస్తే కాలజ్ఞానం పదిఆశ్వాసాలనీ ఒక సౌజన్య పత్రిక ఉందనీ తెలుస్తుంది. వీరికంటే ముందుగానే బ్రహ్మంగారు చెప్పిన కాలజ్ఞానాన్ని మార్చి ముద్రించినట్లు ఆయన ఈ గ్రంథానికి రాసిన ఉపోద్ఘాతంవల్ల తెలుస్తుంది. "ఇదివరలో వున్న వీరబ్రహ్మముగారి జీవితచరిత్ర, సంపూర్ణచరిత్ర, వగైరా గ్రంథములవలె తెలిసి తెలియని స్వకల్పన ఒక్క అక్కరమైనా రాయలేదు." అని ఆయన రాశాడు. ఇది వాస్తవమే. ప్రస్తుతం మఠంవారు ప్రామాణికమని ప్రచురించిన గ్రంథంలోని విషయాలే మార్పులేకుండా ఈ గ్రంథంలో కూడా ఉన్నాయి.

---

1, వీరభద్రేశ్వరస్వామి, ర్యాలి - శ్రీ మహత్కాలజ్ఞాన గ్రంథరాజము,
ప్రచు : శరభయ్యాచార్యులు, 1945,
ఐన్స్టీథర్ ముద్రణాలయం, హైదరాబాదు
ఉపోద్ఘాతము, పు. 1,

## 2) స్వర్ణ సుబ్రహ్మణ్యకవి సంగ్రహించిన ప్రతి :-

ఈ ప్రతి కలియుగము 3452లో (రాసిన) తాళపత్ర లిఖితము నకు సరియైన నకలు ది. 26-6-1912లో వ్రాయబడినది.1" అని స్వర్ణ సుబ్రహ్మణ్యకవి రాశాడు. ఈగ్రంథం 1979లో ముద్రించబడింది. ముఖపత్రంమీద "బ్రహ్మంగారి కాలజ్ఞానం - శ్రీ ఈశ్వరీదేవి చెప్పిన భూత భవిష్యద్వర్తమానములు" అని ఉంది. బ్రహ్మంగారి మనుమరాలు ఈశ్వరీదేవి తాను చెప్పిన కాలజ్ఞానంతోపాటు బ్రహ్మంగారి కాల జ్ఞానాన్ని కూడా చెప్పారు. ఈ గ్రంథం ప్రకారం బ్రహ్మంగారి కాలజ్ఞానం ఏడాశ్వాసాలు మాత్రమే. ఇది వాస్తవమే. బ్రహ్మంగారు ద్విపదలో "మేమును బనగానపల్లెలో నిలచినాము. నిర్మాణమును చేసి ఇల ఏడాశ్వాసములు"2 అనేదానితో సరిపోతున్నది. బ్రహ్మంగారి కాలజ్ఞానాన్ని ఈమె యథాతథంగా చెప్పలేదు. తన మాటలలో చెప్పింది గనుక ప్రస్తుతం మరంవారు ప్రామాణికమని చెప్పి ముద్రించిన దానితో ఇది సరిపోలడం లేదు.

---

1. సుబ్రహ్మణ్యకవి, స్వర్ణ - ఈశ్వరీదేవి కాలజ్ఞానం,
ప్రచు : విజయశేఖరాచార్య, తుమపాల
తెనాలి, 1979, పు. 2.

2. వీరాచార్యులు, పరిమి - వీరబ్రహ్మముగారి కాలజ్ఞాన తత్త్వములు,
ప్రచు : ఎం. వి. గోపాల్ & కో
మద్రాసు, 1974, పు. 5.

### 3) ఏలూరు వాస్తవ్యురాలు షరాబు గౌరమ్మ సంపాదించిన ప్రతి :—

ఈ కాలజ్ఞాన ప్రతి ఏలూరిలో గౌరమ్మగారి ఇంట్లో రెండు వందల ఏండ్లనుండి పూజాపీఠంమీద ఉంది. ఈ కాలజ్ఞానం పదునెనిమిది తాళపత్ర గ్రంథాలపై పుటకు 8 పంక్తులచొప్పున రాయబడి ఉంది. ఆ లిపి ముత్యాలకోవలా ఉంది. ఈ తాళపత్ర ప్రతిని నామగిరి గంగరాజు సంగ్రహించి ప్రకటించారు. గంగరాజు ది. 22-2-1964న ఈ ప్రతిని గౌరమ్మనుండి పొందారు. ముద్రించిన ఈ కాలజ్ఞాన గ్రంథంలో ఆశ్వాస విభాగం లేదు. మఠంవారు ప్రామాణికమని ముద్రించిన గ్రంథంలో నవమాశ్వాసంగా ఉన్న కన్నడ సర్వజ్ఞుని కాలజ్ఞానంలోని ఆరవ ఆశ్వాసం ఈ గ్రంథంలో మొదటనే చెప్పబడింది. మఠంవారు ప్రచురించిన కాలజ్ఞానానికీ ఈ ప్రతికీ విషయపరంగా భాషాపరంగా చాలా భేదాలున్నాయి.

### 4) మౌఖిక ప్రచారంలో ఉన్న కాలజ్ఞానం:—

బ్రహ్మంగారి కాలజ్ఞానాన్ని ఎందరోభక్తులు కంఠస్థం చేశారు. వీరబ్రహ్మంగారి చరిత్ర అనే గ్రంథం రాసిన ఏలూరి సీతారాం మౌఖిక ప్రచారంలోఉన్న కాలజ్ఞానాన్ని అక్షరబద్ధం చేశాడు. కాలజ్ఞాన ద్వితీయాశ్వాసాన్ని వానపల్లి గంగమ్మ చదువుతూంటే విని రాసుకొన్నారు. దాన్ని తన గ్రంథంలో ప్రచురించాడు. "ఈ కాలజ్ఞానము భక్తురాలగు కీ|| శే|| వానపల్లి గంగమ్మగారు పఠించిన విధముగనే వ్రాయబడినది. భాషాదోషములను సవరింపలేదు"1 అని రాశారు.

---

1. సీతారాం, ఏలూరి - వీరబ్రహ్మముగారి చరిత్ర, ప్రచు : శ్రీ లక్ష్మీనారాయణ బుక్ డిపో, రాజమండ్రి, 1977, పు. 177.

భాషాదోషా లనుకొన్నవాటిని సవరించక పోవడమే మేలైంది. ఈ కాలజ్ఞానం మఠంవారు ముద్రించిన కాలజ్ఞానంలోని అంశాలకు అక్షరాలా సరిపోతున్నది. దీన్ననుసరించిచూస్తే చదువు రానివారు భక్తితో కంఠతచేసిన కాలజ్ఞానంలోనే మార్పులు చేర్పులు లేవు. చదువుకొన్నవారు చూసి రాసుకొన్న ప్రతులలోనే మార్పులు చేర్పులు జరిగాయి. ఈ గ్రంథంలో ఇంకా మిగిలిన కాలజ్ఞానం కూడా ప్రచురించబడింది. మఠంవారు ప్రచురించిన కాలజ్ఞానంలోని నాలుగవ ఆశ్వాసంగా పేర్కొన్న "చీలంపాటి గుండాభట్లు కాలజ్ఞానం" తొమ్మిదవ ఆశ్వాసంగా చెప్పబడిన "సర్వజ్ఞుని కాలజ్ఞానం" ఇందులో లేవు. ఈ గ్రంథంలో చేర్చిన కాలజ్ఞానం ఉన్నంతవరకయినా మఠంవారి ప్రామాణిక ప్రతికి తేడాలేకుండా ఉంది.

## 5) మఠంవారు ప్రామాణికమని ప్రకటించిన ప్రతి :-

పైన చెప్పబడిన ప్రతులు మాత్రమే గాక దేశంలో బ్రహ్మంగారి పేరిట కాలజ్ఞానాలు అసంఖ్యాకంగా ప్రచారాన్ని పొందాయి. అయితే అవన్నీ ప్రామాణికాలు కావు. కనుక నేడు మఠంలోని సరియైన తాళపత్ర గ్రంథాన్ని యథాతథంగా అచ్చువేయించి ప్రజల కందించాలనే కొందరు పెద్దలభావంతో ప్రస్తుత మఠాధిపతులు ఏకీభవించారు. కానీ అంతకుముందు ఈ గ్రంథాన్ని అచ్చు వేయించ వచ్చా? లేదా? అనేవిషయంపై భేదాభిప్రాయాలున్నాయి. ఇది మహా పవిత్రగ్రంథం. కనుక అచ్చు వేయించకూడదని కొందరూ ఇది ప్రజోపయోగం కోసమే గనుక నిగూఢంగా ఉంచరాదని కొందరూ అభిప్రాయపడ్డారు. దేశంలో బ్రహ్మంగారి పేరుతో ఉన్న కాలజ్ఞాన

ప్రతులు అప్రామాణికాలనీ అసత్యైన కాలజ్ఞానం ప్రజల కందాలనీ తలంచి ప్రస్తుత మఠాధిపతి ఈ గ్రంథాన్ని 1974వ సంవత్సరంలో ముద్రించారు. ఇదే బ్రహ్మంగారి రచనల ప్రామాణిక ప్రతి. కనుక ప్రస్తుత పరిశోధనకు ఈ కాలజ్ఞాన గ్రంథం ప్రామాణికంగా స్వీకరించ బడింది.

## ప్రక్షిప్తాలు :—

బ్రహ్మంగారి కాలజ్ఞాన రచనలో ప్రక్షిప్తాలు చేరుతున్నాయనే భావంతో ప్రస్తుత మఠాధిపతి మఠంలోఉన్న తాళపత్రాలను యథా తథంగా అచ్చువేయించారు. కానీ ఈ మూడువందల సంవత్సరాల్లో ప్రక్షిప్తాలు చేరనేచేరాయి. కాలజ్ఞాన స్వరూపాన్ని గురించి అధ్యయనంచేస్తే కాలజ్ఞానగ్రంథంలోని ప్రక్షిప్తాలు ఏవి అనే విషయం తెలుస్తుంది.

## కాలజ్ఞాన స్వరూపం :—

బ్రహ్మంగారి మఠంవారు ముద్రించిన కాలజ్ఞాన గ్రంథంలో పన్నెండు ఆశ్వాసాలు ఉన్నాయి. కానీ బ్రహ్మంగారు ద్విపద కాల జ్ఞానంలో ఇలా రాశారు.

"ఆ రామయోగైన అయ్యవారున్ను
మేమును భైరవానందయోగిన్ని
వారును చిదంబర వర దీక్షితులను
మేమును బనగానపల్లెలో నిలిచి
నిర్మాణమును చేసి యిల ఏడాశ్వాసములు
కాలజ్ఞాన పత్రిక" (కాల. త. పు. 5)

దీన్ననుసరించి బ్రహ్మంగారి కాలజ్ఞానం ఏడాశ్వాసాలు మాత్రమే. ఈ గ్రంథంలోని నాలుగవ ఆశ్వాసం చీలంపాటి గుండాభట్లు రచించిన కాలజ్ఞానాన్ని గురించిన చర్చ. తొమ్మిదవ ఆశ్వాసం సర్వజ్ఞుని కాలజ్ఞానాన్ని గురించినది. ఇవి రెండుఆశ్వాసాలు పోగా మిగిలినవి పది ఆశ్వాసాలు. విషయాన్ని అనుసరించిచూస్తే ప్రథమాశ్వాసంలోని విషయాలే దశమాశ్వాసంలోనూ ఉన్నాయి. ఏకాదశాశ్వాసం శ్లోకాల రూపంలో ఉంది. ఈ రెండు ఆశ్వాసాలు తీసివేస్తే ఎనిమిది ఆశ్వాసాలుంటాయి. వీటిలో కూడా పునరుక్తులున్నాయి. తాళపత్రాలను ఎత్తి వ్రాయడంలో లేఖకులు ఆశ్వాసాల సంఖ్యను పెంచారు. కనుక బ్రహ్మంగారి వచన కాలజ్ఞానం ఏడాశ్వాసాలు మాత్రమే అనేది ప్రామాణికమైన అంశం.

కాలజ్ఞానంలోని వచనాలు దేనికవే విడివిడిగా ఉన్నాయి. ఒక్కొక్క వచనంలో ఒక్కొక్క విషయం నిక్షేపించబడింది. ఈ గ్రంథంలో మూడువంతుల వచనాలు ముక్తకాలుగానే ఉన్నాయి. విషయం ఒక్కవరుసలో చెప్పబడిలేదు. వచనాలు పునరుక్తులుగా ఉన్నాయి. మధ్యమధ్య శ్లోకాల రచన కూడా ఉంది.

## కాలజ్ఞాన స్వభావం :—

పదబంధ నిర్వచనం :- "కాలజ్ఞాన మనగా భూతమును భవిష్యత్తుగా చెప్పుట, జరిగినదానిని జరుగబోవునదిగా చెప్పి తన కాలమును తానే వెనుకకు ఈడ్చుకొనుట1" అని రాళ్లపల్లి అనంత

---

1. అనంతకృష్ణశర్మ. రాళ్ళపల్లి-వేమన ప్రచు: ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్, వాల్తేరు,
ప్ర. ము. 1929
ద్వి. ము. 1945
తృ. ము. 1971, పు, 107.

కృష్ణశర్మ కాలజ్ఞానానికి నిర్వచనం చెప్పారు. కానీ ఈ నిర్వచనం సమగ్రమైంది కాదు. జరిగినదాన్ని జరుగబోతున్నట్లు చెప్పడంలో విశేషమేమీ లేదు. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ చెప్పింది కాలజ్ఞాన నిర్వచనంలోని ఒక్క అంశం మాత్రమే. కాలజ్ఞానంలో

1) భూతకాలాన్ని భూతభవిష్యత్ వర్తమానాలుగా
2) భవిష్యత్ కాలాన్ని భూతభవిష్యత్ వర్తమానాలుగా
3) వర్తమాన కాలాన్ని భూతభవిష్యత్ వర్తమానాలుగా

బ్రహ్మంగారు చేప్పారు. జరుగబోయే విషయాన్ని చెప్పడం మాత్రమే కాలజ్ఞానమని వ్యవహారంలో భావించబడుతుంది.

పైన చెప్పిన కాలజ్ఞాన నిర్వచనానికి అనుగుణంగా వరుసగా కాలజ్ఞాన వచనాలు లక్ష్యాలుగా ఈక్రింద ఉదాహరించబడ్డాయి.

## *భూతాన్ని భూతంగా చెప్పినందుకు :-*

ఉదా : "శాలివాహన శకవర్షంబులు 1258 అగునేటికి ధాత నామ సంవత్సర వైశాఖ శు॥ ౧లు హరిహరరాయలు. ఆనగొంది 7 ఏండ్లు యేలెను." (కాల. పు. 2)

అని మొదలుపెట్టి "రామరాజుతో విజయనగర పాలనము కడ అయి పోయెను" (కాల. పు. 3) అని చెప్పిన చారిత్రక అంశమంతా జరిగింది జరిగినట్లుగానే చెప్పబడింది. అయితే ఇలా జరిగిపోయిన దాన్ని భూతకాలంగా వర్ణించిచెప్పడంలో విశేషమేముంది? ఏ చరిత్ర రచయితతైనా రాయవచ్చు. వాళ్లు త్రికాలవేదులు కానవసరంలేదు. కాని కాలజ్ఞానంలో బ్రహ్మంగారు తమకుముందు అనేక కల్పాలలోని

జన్మలను ఇలా వివరించారు. ముందు తాను బ్రహ్మలోకంలో 72 బ్రహ్మకల్పాలు రాజ్యంచేసింది మొదలుకొని "ప్రథమావతారమున ఆనందాశ్రమమునకు శిష్యుండనై 999 కోట్లు 7665 బ్రహ్మకల్పము లుంటిమి." (కాల. పు. 1) ఇది మొదలుకొని పదకొండవ అవతారం మనుష్యావతారమెత్తి బనగానపల్లెలో 25 ఏండ్లు తపస్సు చేసినంతవరకు ఆయన చెప్పారు. ఇవి కాలజ్ఞాని చెప్పవలసిన భూతకాలిక విషయాలు. ఈ విషయాలను బ్రహ్మంగారు చెప్పగలిగారు. ఈ పూర్వజన్మ స్మృతు లకు ఆయనమాటలే ప్రమాణాలు. వీటికి ఇతర తార్కాణాలను ఎవ్వరూ చెప్పలేరు. బ్రహ్మంగారు తన గత పదిజన్మల స్మృతులను వర్ణించడమే ఆయన చెప్పిన కాలజ్ఞానంలోని భూతకాలం.

### భూతాన్ని వర్తమానంగా చెప్పినందుకు :—

ఉదా: ఈశాన్యమునుండి పడమట సూర్యమందు వుద్భవమవుతూ వున్నాము." (కాల. పు. 49)

ఈ వచనంలో భూతకాలిక విషయం వర్తమానంగా చెప్పబడింది. ఇందులోని అంశం బ్రహ్మంగారి పుట్టుకకు సంబంధించింది. ఇదే విషయం "మరుగుకొండలు మూడు దాటి సూర్యమండలానకు వచ్చి (కాల. పు. 14) అనే వచనంలో కూడా చెప్పబడింది. బ్రహ్మంగారు నందిమండల క్షేత్రానికి దత్తుగా వచ్చాడు. జరిగిపోయిన ఈఅంశాన్నే "వుద్భవమవుతూ వున్నాము" అని వర్తమానకాలంలో చెప్పారు.

### భూతాన్ని భవిష్యత్తుగా చెప్పినందుకు :—

ఉదా : తిరుగా వీరభోగ వసంతరాయలదే సింహాసనమన్నారు గనుక నందిమండల క్షేత్రమున పరబ్రహ్మ వంశమందు ప్రఖ్యాత మయ్యేము." (కాల. పు. 2)

ఈ వచనంలోని అంశం భూతకాలికమైంది. ఉత్తర భారతదేశంనుంచి బ్రహ్మంగారు దత్తుడుగా దక్షిణభారతదేశంలోని నందికొండకు వచ్చారు. ఇక్కడ భూతాన్ని భవిష్యత్తుగాచెప్పి తనకాలాన్ని తానే వెనక్కు ఈడ్చుకోవడం జరిగింది. ఇలాంటి వాక్యాలు కాలజ్ఞానంలో ఇంకా కొన్ని ఉన్నాయి.

### భవిష్యత్తును భూతంగా చెప్పినందుకు :-

ఉదా :- "భ్రమర ముందటు బసవేశ్వరుడు తోక విదలించుకొన్నదే గుర్తు." (కాల. పు. 4)

పై కాలజ్ఞాన వచనంలో బ్రహ్మంగారు భవిష్యత్తును చెప్పారు. శ్రీశైలంలో భ్రమరాంబ ఆలయానికి ముందున్న నంది విగ్రహం తోక విదలించుకొంటుందని బ్రహ్మంగారు చెప్పారు. కానీ క్రియా స్వరూపం భూతకాలికంగా ఉంది. భవిష్యత్తును భూతంగా చెప్పినట్లు అనిపిస్తుంది.

### భవిష్యత్తును వర్తమానంగా చెప్పినందుకు :-

ఉదా :- నిర్ణయపరచుకొన్న వారెవరో ఆదివారంనాడు ఆరోఘుడియకు ఆవలవున్న పోగలరు. పోగానే ప్రాపుగతి ప్రాణాలు బయలై పోతూవున్నవి." (కాల. పు. 22)

ఈవచనంలో ఒక విషయాన్ని గురించి నిర్ణయించుకొన్నవారు ఆదివారం రోజు ఆరోఘుడియకు వెళతారని చెప్పారు. పోగానే ప్రాణాలు వెళ్లిపోతూవున్నవి అని చెప్పారు. ప్రాణాలు పోయేది భవిష్యత్తులోనే. కానీ పోతూఉన్నవి అనేది వర్తమాన క్రియ. ఈవచనంలో భవిష్యత్తు వర్తమానంగా చెప్పబడింది.

## భవిష్యత్‌ను భవిష్యత్‌గా చెప్పినందుకు :-

ఉదా :- "మా యింటి ప్రాకారాన ఆరెదొండచెట్టు పుట్టీని."1.

ఇది భవిష్యత్తును భవిష్యత్తుగా చెప్పిన ఘట్టం. ఎప్పుడో చెప్పిన విషయం ఈనాటికి ఫలించింది. ప్రస్తుతం బ్రహ్మంగారి మఠంలో ఈచెట్టు పుట్టిఉంది.

## వర్తమానాన్ని భూతంగా చెప్పినందుకు :-

ఉదా :- "ఎంతలేదని చూడవద్దు కస్తూరిరంగడు కట్టడి చేసెను."

(కాల. పు. 30)

ఈ వచనంలో 'కస్తూరి రంగడు, అంటే విష్ణువు. అంటే బ్రహ్మంగారి భావనలో తానే విష్ణువునని కట్టడిచేసెను. అంటే ముందు జరుగబోయే విషయాన్ని నిర్ణయించాడని అర్థం. ఈ నిర్ణయం అప్పటికప్పుడు జరిగిందే. అంటే అది అప్పటికి వర్తమానంలో జరిగిన నిర్ణయమే. ప్రస్తుతం ఒకగంటలో జరుగుతున్నది వర్తమానం. గంటక్రింద జరిగింది భూతం. గంట తరువాత జరుగబోయేది భవిష్యత్తు. కనుక పై వచనంలో వర్తమానకాలం భూతకాలంగా చెప్పబడింది.

## వర్తమానాన్ని భవిష్యత్తుగా చెప్పినందుకు :-

ఉదా :- "గుత్తి పెనుగొండ బెబ్బులి జొచ్చును."

(కాల పు. 49)

---

1, ఈ వ్యాసకర్త 1981 లో బ్రహ్మంగారి ఆరాధనకు వెళ్ళినపుడు ప్రస్తుత మఠాధిపతులు ఈ చెట్టును చూపించారు. దీని పెరుగుదల విపరీతంగా ఉంది.

క్రీ. శ. 1630 – 1642 మధ్యకాలంలో పెనుగొండ ముట్టడి జరిగింది. ఈ దండయాత్రలవల్ల రాజధానుల మార్పు జరిగింది. గుత్తి, పెనుగొండ అనే రెండు నగరాలూ కొంతకాలం పాడుబడిపోయాయి. అప్పుడు ఆనగరాల్లో పెద్దపులులు ప్రవేశించాయి. ఇది బ్రహ్మంగారికి వర్తమానవిషయం. దీనిని ఆయన భవిష్యత్తుగా వర్ణించారు.

## వర్తమానాన్ని వర్తమానంగాచెప్పినందుకు :-

ఉదా :- "కర్ణాటక రాజులు కారడవిన బడిరి" (కాల. పు. 41) ఈ వచనంలోని అంశం కూడా బ్రహ్మంగారికి సమకాలీనమైంది. క్రీ॥శ॥ 1652 నాటికి విజయనగర రాజులకు రాజ్యం లేదు. ఈఅంశాన్ని ప్రథమాశ్వాసంలోనే బ్రహ్మంగారు చెప్పారు. ఇక్కడ వర్తమానం వర్తమానంగా చెప్పబడింది.

బ్రహ్మంగారి కాలజ్ఞాన వచనాల్లోని క్రియలను అన్వయించుకొనేటప్పుడు ఒక్కఅంశాన్ని దృష్టిలో పెట్టుకోవాలి. బ్రహ్మంగారు పుట్టకముందు అంటే క్రీ॥ శ॥ 1608వ సంవత్సరానికి పూర్వవిషయాలను భూతకాలికాలనీ ఆయన జన్మించినదాది 1693లో సమాధిప్రవేశం చేసిన కాలంవరకూ ఆయనకు వర్తమానమనీ ఆయన సమాధిప్రవేశం చేసిన తరువాతకాలాన్ని భవిష్యత్తనీ అనుకోవాలి. ఈ పద్ధతి ప్రకారమే కాలజ్ఞాన వచనాలకు వివరణ ఇవ్వబడింది.

పాఠకుల కిక్కడ ఒక సందేహం కలుగవచ్చు. ఇలా ఒకే కాలాన్ని త్రికాలాల్లో ఎందుకు చెప్పాలి? ఏకాలాన్ని ఆకాలంలో చెప్పవచ్చు గదా! అని. కానీ త్రికాలాబాధ్యమైన ధర్మరక్షణకు ఉద్భవించే మహాపురుషులు మూడు కాలాలకూ అతీతులే. భూత

భవిష్యత్ వర్తమానకాలాలను వారు సమానంగానే దర్శిస్తారు. అటు వంటి సర్వకాలాల్లో వారు జీవిస్తూనే ఉంటారు. ఈ మూడుకాలాల చక్రం వారికళ్ళముందు తిరుగుతూనే ఉంటుంది. వారి దృష్టిలో భావంలో మూడుకాలాలకూ తేడా లేదు. అందుకే ఒకే కాలాన్ని త్రికాలాల్లోనూ వర్ణిస్తారు.

కనుక కాలజ్ఞానమంటే జరిగినదాన్ని జరుగబోయేదిగా వర్ణించి తనకాలాన్ని తానే వెనక్కు ఈడ్చుకోవడం కాదు. భక్తి జ్ఞాన యోగాలనూ త్రికాలాబాధ్యమైన సకల ధర్మాలనూ వర్తమాన భవిష్యత్ కాలాలవారికి బోధించినదే కాలజ్ఞానం.

## విషయానుక్రమణిక - రచనా ప్రణాళిక :-

ప్రతి గ్రంథానికీ విషయానుక్రమణిక ఉంటుంది. అదేవిధంగా కాలజ్ఞాన రచనకు కూడా విషయానుక్రమణిక ఉంది. ప్రథమా శ్వాసంలో అవతారిక ముగిసిన వెంటనే విషయానుక్రమణిక చెప్పడం పూర్వకవుల పద్దతి. ఆంధ్ర మహాభారతంలో పర్వానుక్రమణికను ఇలా రాశాడు ఆదికవి నన్నయ్యభట్టు.

"అదియనుం బౌష్యంబు పౌలోమం బాస్తీకం బాది వంశావ తారంబు సంభవపర్వంబు జతుగృహదాహంబు ........................................................................................................................................................ పుత్ర సందర్శనంబు, నారదా గమనంబు, మౌసలంబు, మహాప్రస్థానికంబు, స్వర్గారోహణంబు,

హరివంశంబు, భవిష్యత్ పర్వంబు నను శతపర్వంబులు గలిగి1"
ఇదే పద్ధతిలో ఆశ్వాసానుక్రమణికను రచించారు బ్రహ్మంగారు. కాలజ్ఞాన గ్రంథంలో ద్వితీయాశ్వాసం చివర విషయసూచిక పొందు పరచబడింది. విషయసూచిక ఉన్న వచనం ఈక్రింద ఉదాహరించ బడుతున్నది.

"నేనున్ను నిజభక్త హృదయాంతరాళమందు నిలిచి నిఖిల వేదరహస్య, తత్వ, మహాతత్వ, ఆదికాలాన కథా సందర్భమున్ను అఖిల యోగజ్ఞాన, భక్తిజ్ఞాన, గత, ఏష్యజ్ఞానంబులున్ను గ్రంథరీత్యా బంధురమైన బోధకముగా బోధిస్తూ వున్నాము2"

పై కాలజ్ఞాన వచనంలో చెప్పినట్లుగానే వరుసగా ఆయా విషయాలు ఈగ్రంథంలో ఉన్నాయి. కాలజ్ఞానం కొంత వచనంగా, కొంత ద్విపదలుగా, గోవిందనామాలుగా, పద్యాలుగా, వివిధ ప్రక్రియల్లో రచించబడింది. ఈ ప్రక్రియలన్నింటికి పై విషయ సూచిక అన్వయిస్తుంది.

ఒక నిర్ణీతమైన ప్రణాళిక వేసుకొని బ్రహ్మంగారు కాలజ్ఞాన రచన చేశారు. ఆ రచనా ప్రణాళిక ఈక్రింది కాలజ్ఞాన వచనంలో కనిపిస్తుంది.

---

1. నన్నయ్యభట్టు – ఆంధ్ర మహాభారతము, ఆది పర్వము, ప్రచు : వావిళ్ల రామస్వామి శాస్త్రులు & సన్స్, మద్రాసు, పు. 13.

2. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానం, ప్రచు : కృష్ణమూర్తి, రంగయ్య, కందిమల్లాయ పల్లె 1974. పు. 8

"యిదిగాక మాయొక్క మర్మవేదాంత రహస్యమున్నూ విజ్ఞాన సంపద యిప్పుడు యోగగ్రంథ రూపకముగానూ వాక్యసరణిగానూ గద్యపద్య ప్రభావముగానూ వేదాంతవాక్యాలుగానూ అనంత వేదాంత రహస్యమును వెదజల్లినాము." కాల. పు. 63.

బ్రహ్మంగారు కాలజ్ఞాన రచనను వివిధ ప్రక్రియల్లో చేయాలని ప్రణాళిక వేసుకొన్నట్లు పై వచనంవల్ల తెలుస్తుంది. ఇదే సందర్భంలో బ్రహ్మంగారు తన వచన రచనా విన్యాసం ఎలా ఉంటుందో కూడా ఇలా చెప్పారు.

"ఇది రాజు సవారీ చేసేటప్పుడు భట్వంగము చేసే బిరుదు గద్యపద్యాల పద్ధతి. ఇదిగాక తెలియని రహస్యము చూపి చెప్పినాము. ఇది ఆరాజు రాజవీథిన తర్లివచ్చేటప్పుడు పురస్త్రీలు సౌధాగ్రముల నుంచి ముత్యాలసేసలు చల్లినరీతులు చిత్కళంబులైన జ్యోతులు ఆ సంబంధులకు కానబడీని1"

తన వచన రచన రాజు సవారీ చేసేటప్పుడు వంది మాగధులు కైవారం చదివే పద్ధతిలో ఉంటుందని చెప్పారు. ఇందుకు

> "శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర రాజేశ్వర రాజ చూడామణి పంచరాజ బహురాజ పరమరాజ" (కాల. పు. 6)
>
> "ఏకాదశేంద్రియ పారంపరివాసమైన దివసం కల్గీని. విలయ కాలానకు గుణ్యమైన కార్యాలు కలిగీని." (కాల. పు. 7)

---

1. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానము, ప్రచు : కృష్ణమూర్తి, రంగయ్య కందిమల్లాయ పల్లె, 1974 పు. 63

మొదలైన వచనాలను ఉదాహరించవచ్చును. ఈ ఘట్టంలోనే చెప్పిన

"కళల నోలలాడరాదో మిమ్ము నందుంచరాదో సొమ్ము
హెచ్చింపరాదో చూచి వలపించరాదో" (కాల. పు. 66)

అనే వచనంలో పురస్త్రీలు సౌధాగ్రములనుంచి ముత్యాలుచల్లిన గతులు కనిపిస్తాయి. 'కళలు, అన్నంతవరకు ఒడిలోని ముత్యాలు చేతిలోనికి తీసుకోవడం, 'నోలలాడరాదొ, అన్నంతవరకు ముత్యాలు వెదజల్లిన గతులు కనిపిస్తాయి. కాలజ్ఞానంలోని వచనాలన్నీ వందిమాగధులు కైవారం చేసిన పద్ధతిలోనే నడిచాయి.

కొందరికి వచనం రుచిగా ఉంటుందనీ కొందరికి ద్విపద నచ్చుతుందనీ కొందరికి పద్యాలు హృద్యంగా ఉంటాయనీ కొందరి తత్త్వానికి తత్త్వాలు నచ్చుతాయనీ బ్రహ్మంగారు ఆయా ప్రక్రియల్లో రచన చేయడానికి ప్రణాళికను వేసుకొన్నారు.

## కాలజ్ఞాన గ్రంథ సారాంశం.

### వచన కాలజ్ఞానం :—

**ప్రథమాశ్వాసం :—** వచన కాలజ్ఞానం పన్నెండు ఆశ్వాసాలుగా ఉంది. ప్రథమాశ్వాసం ప్రారంభంలో బ్రహ్మంగారు తన పూర్వజన్మ వృత్తాంతాలను చెప్పారు. "రాయపట్నాల వివరం" అనే శీర్షికక్రింద విజయనగర సామ్రాజ్య స్థాపన మొదలుకొని, విజయనగర పతనం వరకు పరిపాలించిన రాజుల వివరాలు చెప్పబడ్డాయి. ఆ తరువాత బహుధాన్య నందన సంవత్సరాల మధ్య పుట్టబోయే ఉత్పాలు వర్ణించబడ్డాయి. "వీర వసంతరాయులు వచ్చేటప్పుడు పుట్టే

కార్యాలు" అనే శీర్షిక క్రింద వీరభోగ వసంతరాయలు అవతరించ బోయేముందు జరుగబోయే కొన్ని కార్యాలను బ్రహ్మంగారు గుర్తుగా చెప్పారు. అటు తరువాత భూత భవిష్యత్ వర్తమాన కాలాలకు నానా దేశాలకు మూడులక్షల ముప్పైరెండు గ్రంథాలు రాయించినట్లు చెప్పారు. వీరభోగ వసంతరాయలు వచ్చి 100 సంవత్సరాలు పరి పాలిస్తాడని, అయన సాంప్రదాయకంవారు 1000 సంవత్సరాలు పరిపాలిస్తారనీ చెప్పారు. ఈవిధంగా ఈ కాలజ్ఞాన ప్రథమాశ్వాస పత్రిక లిఖించి ఆనందాశ్రమాలకు వినిపించి బ్రహ్మంగారు సంతోషచిత్తు డైనట్లు చెప్పబడింది.1

**ద్వితీయాశ్వాసం :—** ఈ ఆశ్వాసం ఒక గురుస్తుతితో ప్రారం భించబడింది. ఇది దురితహర పుర నివాసులైన భూసురలకు రాయ బడిన ముఖ్యమైన లేఖగా చెప్పబడింది. ఈ లేఖలో భవిష్యత్తులో జరుగబోయే కొన్ని ఉత్పాతాలు వర్ణించబడ్డాయి. తదుపరి బ్రహ్మం గారు అవతరించ బోయేముందు పుట్టేకార్యాలు చెప్పబడ్డాయి. ఆయన కాలజ్ఞాన గ్రంథంలో చెప్పిన అంశాలకు విషయసూచిక ఇవ్వబడింది. తరువాత కొన్ని భవిష్యదుత్పాతాలను చెప్పి అప్పుడు తన నామాన్ని పఠిస్తూ ఆనందంతో ఉండవలసిందని బ్రహ్మంగారు చెప్పడంతో ఒక లేఖారూపంగాఉన్న ఈ ద్వితీయాశ్వాసం ముగిసింది.

**తృతీయాశ్వాసం :—** ఈ ఆశ్వాసంలో బ్రహ్మంగారు తన పూర్వజన్మ వృత్తాంతాన్ని చెప్పారు. తాను విష్ణువుగా వైకుంఠంలో ఉండి ఒక సమావేశం ఏర్పాటుచేసి దానికి బ్రహ్మను, ఈశ్వరుణ్ణి ఆహ్వా నించి దుష్టశిక్షణ శిష్టరక్షణార్థం భూలోకంలో అవతరిస్తాననీ చెప్పాడు.

---

1. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానము, ప్రచు : కృష్ణమూర్తి, రంగయ్య కందిమల్లాయ పల్లె. 1974. పు. 1, 2, 3, 4, 5,

అందుకు శంకర బ్రహ్మలు అంగీకరించారు. అప్పుడు ఆయన "శ్రీ వీరనారాయణ మహామంత్రా" న్ని ధ్యానశ్లోకాన్ని పూజా ప్రకారాన్ని చెప్పారు. పూజా విధానంలో చదువవలసిన తన ముప్పదిరెండు పేర్లను చెప్పారు. ఈ మంత్రాన్ని దూషించినవారికి కలిగే నష్టాలను అనుష్ఠానం చేసేవారికి కలిగే లాభాలను ఫలశ్రుతిగా చెప్పారు.

తరువాత "సంకర్షణ మార్కండేయ సంవాదము" అనే శీర్షిక క్రింద ప్రారంభంలో ఒకస్తుతి చేయబడింది. ఈ ఘట్టంలో ఆయన ఉత్తరదేశాన ఉద్భవించినట్లు చెప్పారు. అపైన కొన్ని భవిష్యదంశాలు చెప్పబడ్డాయి. కొన్ని సిద్ధాంతవచనాలు ఇక్కడ మర్మపద్ధతిలో చెప్పబడ్డాయి. వీరబ్రహ్మ యోగీంద్రుడు అనే తనపేరుకు నిర్వచనం చెప్పారు. బ్రహ్మంగారు తాను బనగానపల్లె చేరి దివ్యదేహం పొందినట్లు ఇక్కడ చెప్పబడింది. తరువాత భవిష్యత్తు వర్ణించబడింది. తుదకు గురు నమస్కారంతో ఈ ఆశ్వాసం ముగించబడింది.1

**చతుర్థాశ్వాసం :—** బ్రహ్మంగారి కాలజ్ఞానంలోని చతుర్థాశ్వాసం "చీలంపాటి గుండాభట్లు కాలజ్ఞానం" అనే శీర్షికతో ఉంది. ఈ శీర్షిక వల్ల ఈ ఆశ్వాసమంతా గుండాభట్లు కాలజ్ఞానమేమోనని అనిపిస్తుంది. కానీ ఈ ఆశ్వాసం మొత్తం గుండాభట్లు చెప్పిన కాలజ్ఞానం మాత్రం కాదు. దానితోపాటు ఇందులో బ్రహ్మంగారు చెప్పిన కాలజ్ఞాన వచనాలు చాలా ఉన్నాయి. ఇంకా విద్యారణ్యుడు, రెట్టుడు, కృష్ణమాచార్యుల కాలజ్ఞానవచనాలు కూడా ఉన్నాయి. ఈ ఆశ్వాసం సరస

---

1. వీరబ్రహ్మము,. పోతులూరి - కాలజ్ఞానము, ప్రచు : కృష్ణమూర్తి, రంగయ్య కందిమల్లాయపల్లె, 1974. పు. 9 నుండి 18

శేఖరు లయ్యావారికి బ్రహ్మంగారు రాసిన పత్రిక. కాలజ్ఞాన రచనా విధానాన్ని గురించి నాటి వేదాంతులమధ్య చర్చ జరిగినట్లుగా ఈ ఆశ్వాసంవల్ల తెలుస్తుంది. భూగోళం గోపాలయ్య, కోనూరి ఓబులయ్య, పార్లపల్లె పాపరాజు, అయ్యన్నమయ్య, పసురుపాటి రామిరెడ్డి, కడమల్లకాలవ కాచిభట్లు, చెన్నంపల్లె చెన్నారెడ్డి, తాడిపర్తి తిమ్మిశెట్టి భళ్లాపురం భోగీశ్వరయ్య మొదలైనవారు పై చర్చలో పాల్గొన్నారు. బ్రహ్మంగారిని ఈ వేదాంతులు కొన్ని ప్రశ్నలడిగారు. అందుకు సమాధానంగా బ్రహ్మంగారు మర్మపద్ధతితోగల వచనాలతో చెప్పారు. బ్రహ్మంగారు చెప్పిన ఆ వచనాలను పై వేదాంతులు మరుగువాక్యాలని అన్నారు. ఈ ఘట్టంలోనే బ్రహ్మంగారు తాను సమాధిప్రవేశం చేయబోయే ముహూర్తాన్ని ఆనంద నందన సంవత్సరాల మధ్య అని ప్రకటించారు. తన రాకడను గురించి విద్యారణ్యుడు, రెట్టుడు, శ్రీకృష్ణమాచార్యులు నిర్ణయించినట్లు చెప్పారు. తరువాత కొంత భవిష్యత్ కథనం జరిగింది. ఈ సందర్భంలో బ్రహ్మంగారు లంకయొక్క భౌగోళిక స్వరూపాన్ని నిర్ణయించి మన దాక్షిణాత్యులంతా రాక్షసులనబడ్డారని చెప్పారు. ఈ ఆశ్వాసం చివర బీజాక్షరాలతో కూడిన ఒక మంత్రాన్ని ఒక దండకన్యాయ వచనాన్ని చెప్పారు. ఈ వచనాన్ని పఠిస్తే కలిగే మేలును గురించి చెప్పి గురుస్తుతితో నిండిన శ్లోకంతో చతుర్థాశ్వాసాన్ని ముగించారు.1

**పంచమాశ్వాసం :—** ఈ ఆశ్వాసం భవిష్యత్ కథనంతో ప్రారంభమైంది. భవిష్యత్తులో ఉద్భవించబోయే వీరభోగ వసంతరాయల

---

1. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానము, ప్రచు : కృష్ణమూర్తి, రంగయ్య కందిమల్లాయపల్లె, 1974. పు. 19 నుండి 26.

ప్రస్తావన ఈ ఆశ్వాసంలో అక్కడక్కడా ఉంది. శ్రీరాముని మహిమ కొన్ని వచనాల్లో వర్ణించబడింది. ఉద్భవించబోయే వీరభోగ వసంత రాయల వర్ణన ఇవ్వబడింది. ఆయన సన్యాసి వేషంలో వస్తాడని చెప్పారు. ఈ కాలజ్ఞానం సాంద్రసింధు వేదమనీ ఈ గ్రంథ సారాన్ని పానంచేస్తే అమృతపానంతో సమానమనీ ఫలశ్రుతి చెప్పబడింది. ఈ ఆశ్వాసమంతటా అయా సందర్భాల్లో శ్రీరంగని మహిమ వర్ణించ బడింది. ఈ ఆశ్వాసంలోకూడా తాను ఉత్తరాన ఉద్భవించినట్లు చెప్పారు. శ్రీ వీరయోగి అనే పదానికి నిర్వచనం చెప్పారు. బనగాన పల్లె చేరి దత్తాత్రేయులకు శిష్యుడనయ్యానని చెప్పారు. ఈ ఘట్టంలో కొన్ని వర్తమాన కాలిక రాజకీయాంశాలను సామాజికాంశాలను ప్రవచించారు. భూమిమీద ఉన్న ఒక ప్రతిమలో తన రూపాన్ని ప్రక్షిప్తం చేసినట్లు బ్రహ్మంగారు చెప్పారు. నృసింహస్వామి నామ నిర్వచనం చేసి ఆయన మహిమను వర్ణించారు. జనార్ధన శబ్దానికి నిర్వచనం చెప్పి ఆయన మహిమను వర్ణించారు. సౌందర్య సింధు వేదమనే ఈ కాలజ్ఞానం వేయి కల్పవృక్షాలతో సమానమని చెప్పి పంచమాశ్వాసాన్ని ముగించారు.1

షష్ఠాశ్వాసం — ఈ ఆశ్వాసం గురుస్తుతితో ప్రారంభమైంది. ఇదికూడా ఒక లేఖారూపంలోనే ఉంది. రాజకీయ, మత, సామాజిక సంబంధులైన భూతభవిష్యద్వర్తమాన అంశాలు ఇందులో చెప్పబడ్డాయి. ఇంకా భవిష్యదుత్పాతాలు వర్ణించబడ్డాయి. ఆశ్వాసం చివర తాను వీరభోగ వసంతరాయులుగా అవతరిస్తానని, అప్పుడు నాలుగు పాదాలు

---

1. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానము, ప్రచు : కృష్ణమూర్తి, రంగయ్య కందిమల్లాయ పల్లె, 1974. పు. 27 నుండి 55.

ధర్మం తప్పకుండా రాజ్యపరిపాలన చేస్తానని చెప్పారు. చివరకు గురుస్తుతితో ఆశ్వాసం ముగించబడింది.1

సప్తమాశ్వాసం :— ఇది విజయనగర ప్రాంత పట్టణ బ్రాహ్మణులకు వ్రాసిన లేఖ. ఆ బ్రాహ్మణులు తన కాలజ్ఞానాన్ని విమర్శించగా ఆ గ్రంథ విశేషాలు తెలుపుతూ వ్రాసిన లేఖగా ఈ ఆశ్వాసం కనిపిస్తుంది. కాలజ్ఞాన గ్రంథం గద్య పద్యాలుగా, వచనంగా, వాక్యాలుగా ఉన్నట్లు చెప్పబడింది. శైలీ విన్యాసం వివరించబడింది. గ్రంథాన్ని గురించి ఈ వివరాలు చెబుతూ ఇక్కడ కొంచెం భవిష్యదుత్పాతాలను చెప్పారు. ఈ చెప్పిన వాక్యార్థం గీతార్థంతో సమానమని చెప్పడంతో ఈ లేఖ ముగిసింది.

ఈ ఆశ్వాసంలోనే మరొక్క లేఖకూడా ఉంది. పరమనగర వాసులైన భూసుర బాలకులను ఉద్దేశించి ఈలేఖ రాయబడింది. బ్రహ్మంగారు ఆ బ్రాహ్మణుల గ్రామానికి వెళ్లినపుడు మిన్నకుండి తరువాత దూషించగా వారిని హెచ్చరిస్తూ వారికి జ్ఞానాన్ని బోధిస్తూ ఈలేఖ రాయబడినట్లుగా ఉంది. తాను చెప్పిన కాలజ్ఞానాన్ని భక్తితో పూజిస్తూ వీరభోగ వసంతరాయుల రాకకై ఎదురుచూస్తూ ఉండండని ఆశీర్వదించారు. ఈ ఆశ్వాసం చివరలో రెండు శ్లోకాలున్నాయి. వీటిలో మొదటిశ్లోకంలో బ్రహ్మంగారి జన్మం, సమాధిప్రవేశం వర్ణించబడ్డాయి. రెండవ శ్లోకం తుంగభద్రా తీరంలో విరూపాక్షస్వామి

---

1. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానము, ప్రచు : కృష్ణమూర్తి, రంగయ్య కందిమల్లాయ పల్లె, 1974. పు. 58 నుండి 62.

సన్నిధిలో వేయబడిన శాసనాంశ సంబంధమైంది. ఇందులో వీరభోగ వసంతరాయల అవతరణ నిర్ణయించబడింది. ఇవి అక్షర పరతత్వ శ్లోకాలనీ సాంద్రసింధు వేదంనుండి ఇవి ఎత్తివ్రాయబడి పంపించ బడ్డాయని చెప్పారు. అక్షర పరతత్వ లక్షణం తెలియక దూషించేవారు నశిస్తారనీ తెలిసికొని ఎవరు తనను భజిస్తారో వారు ఆచంద్రస్థాయిగా ఉంటారని ఫలశ్రుతిని చెప్పి ఈ ఆశ్వాసాన్ని ముగించారు.1.

**అష్టమాశ్వాసం :-** ఈ ఆశ్వాసం వీరభోగ వసంతరాయల అవతరణ తిధిని నిర్ణయిస్తూ చెప్పిన అంశంతో ప్రారంభమైంది. తరువాత ఈ ఆశ్వాసమంతటా భవిష్యదుత్పాతాలు వర్ణించబడ్డాయి. ఈ భూత భవిష్యద్వర్తమానాలు మూడు లక్షల ముప్పై రెండువేల గ్రంథాలుగా రాయబడ్డాయనీ గ్రంథమంతా వ్రాయకూడదు కాబట్టి తగుమాత్రం వ్రాయించి పంపిస్తున్నామని బ్రహ్మంగారు చెప్పారు. ఆశ్వాసాంతాన గురుస్తుతి రూపకమైన వచనన్యాయ దండకం చెప్పబడింది.2

**నవమాశ్వాసము :–**

**సర్వజ్ఞుని కాలజ్ఞానము :** నవమాశ్వాసంలో బ్రహ్మంగారు సర్వజ్ఞుడు కన్నడభాషలో రచించిన కాలజ్ఞానంలోని కొన్ని అంశాలను తెలుగులో చెప్పారు. సర్వజ్ఞుడు కన్నడదేశానికి చెందినవాడు. బ్రహ్మం

---

1. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానము, ప్రచు : కృష్ణమూర్తి, రంగయ్య కందిమల్లాయ పల్లె, 1974 పు. 63 నుంచి 69,

2. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానము, ప్రచు : కృష్ణమూర్తి, రంగయ్య. కందిమల్లాయ పల్లె. 1974. పు. 70 నుంచి 73,

గారికి ప్రాచీనుడు. కల్యాణకటకాన్ని బిజ్జలుడు పరిపాలించే రోజుల్లో ఆతనిమంత్రి బసవేశ్వరుడు నిర్మించిన అనుభవ మంటపంలో కూర్చొని సర్వజ్ఞుడు ఈ కాలజ్ఞానాన్ని చెప్పాడు. కలియుగం 2000 సంవత్స రాలు మొదలుకొని నాలుగులక్షల ముప్పదిరెండువేల సంవత్సరాల మధ్యవచ్చే భవిష్యత్తును సర్వజ్ఞుడు వర్ణించాడు. ఇందులో చెన్న బసవన్న, మడియాలయ్య, బింబిచాచయ్య, మాదిగ మాచయ్య మొదలైన భక్తుల విషయాలు ప్రస్తావించబడ్డాయి. బ్రహ్మంగారు అవతరించబోయే వరకు జరిగే భవిష్యత్తును సర్వజ్ఞుడు వర్ణించినట్లు బ్రహ్మంగారు చెప్పారు. సర్వజ్ఞుని కాలజ్ఞానంలో చెప్పబడిన భవిష్యదంశాలలో కొన్ని ఈక్రింద వివరించబడ్డాయి.

బిజ్జలుని తరువాత కల్యాణం పాడై పోతుంది. తరువాత బోయ కంపీరుడు పరిపాలిస్తాడు. ఆ తరువాత మేదరివాడు పరిపాలిస్తాడు. వాని వంశంవాళ్ళు రెండువందల యేండ్లు పరిపాలిస్తారు. తరువాత యవనులు పాలిస్తారు. వారి తరువాత భోగంస్త్రీ పరిపాలిస్తుంది. తరువాత ప్రౌఢదేవరాయలు పరిపాలిస్తాడు. అని చెప్పాడు. అటుపై విజయనగర వైభవాన్ని వర్ణించాడు. విద్యారణ్యుడు కట్టిన పట్టణం కనుక విద్యానగరంగా పిలువబడిందని చెప్పాడు. రాయ సంతతిలో కుమారరాముడనేవాడు పుట్టి విష్ణ్వంశగా భావింపబడతాడనీ వాని తరువాత క్రిష్ణరాయలు, చెన్నరాయలు, ముకుందరాయలు మున్నగు వారు పరిపాలిస్తారనీ విజయనగరరాజుల వృత్తాంతాన్ని చెప్పాడు. తరువాత భవిష్యత్తులో జరుగబోయే కొన్ని రాజకీయ, సాంఘిక, మత, పరిణామాలను తెలిపాడు. తురకలు విజయనగరాన్ని ఆక్ర మిస్తారనీ అప్పుడుపుట్టే ఉత్పాతాలను వర్ణించాడు. కలియుగం ౪౨౯౪ సంవత్సరాల మీదట సరస్వతీ నదీతీరంలో విశ్వకర్మ జాతంలో ఒక పుణ్యుడు జన్మిస్తాడని చెప్పాడు. అప్పుడు జరుగబోయే ఉత్పాతాలను

వర్ణించి చెప్పాడు. వీరభోగ వసంతరాయలు ఉద్భవించి పరిపాలిస్తాడని చెప్పాడు. ఆశ్వాసం చివర ఈ కాలజ్ఞానం విన్నందువలన దీనిని నమ్మినందువలన లాభం కలుగుతుందని ఫలశ్రుతి చెప్పబడింది.1

**దశమాశ్వాసం :–** కాలజ్ఞానంలోని దశమాశ్వాసం వీరధర్మజులయ్యవార్లు కుమారునిచేత వ్రాయించబడిందిగా చెప్పబడింది. ఆశ్వాస ప్రారంభంలో వీరధర్మజులయ్యవారు (అంటే బ్రహ్మంగారే) సమస్త ప్రపంచంలో నిండివున్నవారుగా, నిత్యకర్మిష్ఠులుగా, తంత్రజ్ఞానులుగా విశ్వప్రతిష్ఠాపనా చార్యులుగా, దశావతార మూర్తులుగా, తపోనిష్ఠా గరిష్ఠులుగా వర్ణించబడ్డారు. ఇందులో బ్రహ్మంగారు తమ పుట్టుకను గురించి చెప్పారు. అక్బరి గుర్రాలు తుంగభద్రనీళ్లు తాగిన తరువాత తాను ఉద్భవించినట్లు చెప్పారు. తరువాత ప్రథమాశ్వాసంలో చెప్పినట్లు తన పూర్వజన్మల వృత్తాంతాలను చెప్పారు. బనగానపల్లెలో ఉండి సాంద్రసింధువనే వేదాలు అరవైఆరులక్షల తొంబైమూడువేల గ్రంథం ప్రమాదీచనామ సంవత్సరం మొదలుకొని మూడుసంవత్సరాల తొమ్మిదినెలలు వ్రాయించినట్లు చెప్పారు. కలియుగాంతాన కల్క్యవతారం కలుగుతుందని వివరించారు. తన అవతార మహిమ శ్రుతి స్మృతి పురాణేతిహాసాల్లో పూర్వమునులు ఆనతిచ్చారని, వ్యాసుడు శాంతిపర్వంలోను, విద్యారణ్యుడు విజయర్లక్ష గ్రంథంలోను, శంకరుడు శృంగేరీ పీఠంలోని శాసనాల్లోను, కృష్ణమాచార్యులు చాతుర్లక్ష సంకీర్తనల్లోను, తనరాకడను నిర్ణయించారని చెప్పారు. అటు తరువాత

---

1. వీరబ్రహ్మము,. పోతులూరి - కాలజ్ఞానము, ప్రచు : కృష్ణమూర్తి, రంగయ్య కందిమల్లాయపల్లె, 1974. పు. 74 నుండి 92.

భవిష్యదుత్పాతాలు వర్ణించబడ్డాయి. ఇంతటితో ఈ ఆశ్వాసం ముగించబడింది.1

**ఏకాదశాశ్వాసం:** ఈ ఆశ్వాసం ప్రత్యేకంగా వీరధర్మజ చరిత్రగా పేర్కొనబడింది. ఈ చరిత్ర నాలుగు చిన్న చిన్న అధ్యాయాలుగా విభజింపబడింది. ఆ నాలుగధ్యాయాలలో ఉన్న విషయాలు విడివిడిగా ఈక్రింద ప్రదర్శించబడుతున్నాయి.

ప్రథమాధ్యాయం :- ఇందులో వీరభోగ వసంతరాయలు ఉద్భవించడానికి ముందు హేతువులు వర్ణించబడ్డాయి. కలియుగం 4948 సంవత్సరాలు గడచిన మీాదట ప్లవంగ నామ సంవత్సరంలో సూర్యబింబం కంకణాకారంగా కనిపిస్తుంది. ఈ సంవత్సరంలో రెండు సూర్య గ్రహణాలు, మూడు చంద్ర గ్రహణాలు, మొత్తం ఐదు గ్రహణాలు కృష్ణానదికి దక్షిణభాగంలో కనిపిస్తాయి. కృష్ణవేణికి ఉత్తరభాగంలో ఒక సూర్యగ్రహణం దృశ్యాదృశ్యంగా కనిపిస్తుంది. తక్కిన నాలుగు బాగా కనిపించవచ్చు. పగలు నక్షత్రాలు కనిపిస్తాయి. అప్పుడు సూర్యునినడుమ చంద్రుడు ప్రవేశించి ఉంటాడు. సూర్యబింబం ముక్కాణిబింబంగా కనిపిస్తుంది. ఈ గ్రహణాలలో ఒక సూర్యగ్రహణం వలయాకృతిగా కనిపిస్తుంది. అమావాస్య రోజున చంద్రుడుదయించడమంటే ఇదే. అప్పుడు పువ్వులవాన కురుస్తుంది. ఇదే వీరభోగ వసంతరాయలు జన్మించడానికి హేతువు. అని చెప్పడంతో ప్రథమాధ్యాయం ముగిసింది.

---

1. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానము, ప్రచు: కృష్ణమూర్తి, రంగయ్య. కందిమల్లాయపల్లె, 1974. పు. 93 నుండి 99.

**ద్వితీయాధ్యాయం :—** ఈ అధ్యాయం గురుచారం అని పేర్కొనబడింది. ప్లవంగ సంవత్సరం మొదలుకొని ఎనిమిది సంవత్సరాలకు వృషభరాశి మొదలు పదిరాసుల దాకా బృహస్పతి రాశిత్రయాలుగా సంచరిస్తాడు. బృహస్పతిరాశి సంవత్సరానికి మూడు రాశులు త్రొక్కి నడుస్తుంది. కర్కాటకం మొదలుకొని ఒకరాశిలో సంవత్సరం ప్రకారం మూడురాశులు మూడుసంవత్సరా లుంటాయి. తక్కిన సంవత్సరాలు అతిచారంగా నడుస్తుంది. అందువల్ల రాజులకు భయం కలుగుతుంది. అని చెప్పడంతో ద్వితీయాధ్యాయం ముగిసింది.

**తృతీయాధ్యాయం :-** ఈ అధ్యాయం శనిచారమని పేర్కొనబడింది.

"కీలకాబ్దే ప్రవిష్టే తు మీన రాశిం శనైశ్చరే
మేషే సాధారణాబ్దాన్తే గ్రాం ప్రమాదీచ వత్సరే
రాక్షసే యుగ్మరాశిం స్యాత్ ప్రవేశో భాస్కరాత్మజా
ఛాయా సూనుం ప్రవేశం స్యాత్ పింగళాబ్దేతు కర్కటే"
(కాల. పు. 103)

కీలకనామ సంవత్సరంలో శని మీనరాశి లోనికి, సాధారణనామ సంవత్సరంలో మేషరాశి లోనికి, ప్రమాదీచ వత్సరంలో కర్కటరాశి లోనికి ప్రవేశిస్తాడు. అని చెప్పడంతో తృతీయాధ్యాయం ముగిసింది.

**చతుర్థాధ్యాయం :—** ఈ అధ్యాయంలో భవిష్యత్తు ఇలా చెప్పబడింది. కన్యారాశికి బృహస్పతి వచ్చేటప్పటికి వీరధర్మజులు వస్తారు. బృహస్పతి తులారాశిలో ప్రవేశిస్తే ధూమకేతువు ఉద్భవిస్తుంది. వృశ్చికరాశి లోనికి ప్రవేశిస్తే అధికవృష్టితో ఫలవృద్ధి అవుతుంది. ధనుస్సులోనికి ప్రవేశిస్తే వీరధర్మజులు పుణ్యాలను

రక్షిస్తారు. దుష్టులను నిగ్రహిస్తారు. మకరరాశిలోనికి ప్రవేశిస్తే వీరధర్మజులు సకలపరాక్రమం కలిగిన సైన్యంతో పినాకినీ తీరానికి వచ్చి శ్రీశైలానికి వస్తారు. కుంభరాశి లోనికి ప్రవేశిస్తే భూమికి శుభం కలుగుతుంది. మీనరాశి లోనికి బృహస్పతి ప్రవేశిస్తే కీర్తి వంతులైన రామధర్మజుల వారికి పట్టాభిషేకం జరుగుతుంది. మీనరాశి లోనికి శని ప్రవేశిస్తే మ్లేచ్ఛులు నశిస్తారు. మేషరాశి లోనికి ప్రవేశిస్తే జగత్తుకు సౌఖ్యం కలుగుతుంది. వృషభరాశి లోనికి శని ప్రవేశిస్తే ఈశాన్యమూలన విషగాలిపుట్టి విపరీత నరులను యమలోకానికి తీసుకొని వెళుతుంది. శనైశ్చరుడు మిధునరాశికి ప్రవేశింపగానే భూభారం నాశనమవుతుంది. ఆనంద రాక్షస సంవత్సరాల మధ్య లోకంలో కలియుగధర్మం నశిస్తుంది. ఆనంద సంవత్సరం పుట్టగానే యమ దూతలు నాట్యమాడుతారు. భేతాళ పంపులచేత ప్రజలు నాశన మవుతారు. అనే విషయాలు వీరధర్మజచరిత్ర అనే చతుర్ధాధ్యాయంలో చెప్పబడ్డాయి.1

ద్వాదశాశ్వాసం :— ఈ ఆశ్వాసం "శ్రీ వీరప్పయ్యగారి కాల జ్ఞానం" అనే శీర్షికతో ప్రారంభమైంది. ఈ కాలజ్ఞానంలో కలియుగం 4508 ఏండ్లమీదట కలిగే భ వి ష్య ద ం శా లు చెప్పబడ్డాయి. ఆశ్వాసాంతాన వీరభోగ వసంతరాయలుగా తాను అవతరిస్తాననే అంశాన్ని బ్రహ్మంగారు చెప్పారు. ఇంతటితో ఈ ద్వాదశాశ్వాసం ముగిసింది.2

---

1. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానం, ప్రచు : కృష్ణమూర్తి, రంగయ్య, కందిమల్లాయపల్లె 1974. పు. 103, 104.
2. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానం, ప్రచు : కృష్ణమూర్తి, రంగయ్య కందిమల్లాయపల్లె, 3974, పు. 105 నుండి 110.

## ద్విపద కాలజ్ఞానం:-

తెలుగు సాహిత్యంలో కావ్యరచనకు ద్విపదఛందాన్ని ఉపయోగించిన మొదటికవి పాల్కురికి సోమనాథుడు. తరువాత ఎందరో కవులు ఆయనమార్గంలో నడిచారు దేశి సంప్రదాయజ్ఞులైన కవులు కావ్యం సర్వజన సుబోధంగా ఉండాలని భావించారు. అందుకే సరస ప్రసన్నమైన తెనుగు నుడికారంతో జానుగు తెనుగులో గానయోగ్యమైన ద్విపదలో కావ్యరచన చేశారు. ఈ ఆశయంతోనే ఈ మార్గంలోనే నడిచి బ్రహ్మంగారు ద్విపద ఛందాన్ని స్వీకరించారు. ప్రజా బాహుళ్యానికి అందుబాటులో ఉండేలా సులభగ్రాహ్యమైన ద్విపదలో కాలజ్ఞానాన్ని చెప్పారు. మతం సామాన్యప్రజల్లో వ్యాపించాలనే ఉద్దేశంతో కూర్చబడే సారస్వతం ప్రౌఢకావ్య కళాసృష్టికంటే ప్రజాదరణ పాత్రం కావాలన్న దృక్పథమే అధికంగా కలిగి ఉంటుంది ఈ దృష్టితోనే బ్రహ్మంగారు ఈ ఛందస్సును స్వీకరించారు.

బ్రహ్మంగారి కాలజ్ఞాన గ్రంథంలో ద్విపదకాలజ్ఞానం రెండు భాగాలుగా ఉంది. మొదటిభాగం 114వ పుటనుండి 132వ పుటవరకు ఉంది. రెండవభాగం 133వ పుటనుండి 134వ పుటవరకు ఉంది. ద్విపద కాలజ్ఞాన సారాంశం ఈక్రింద ఇవ్వబడింది.

కపిలమహర్షి వచ్చి హోమం చేశాడు. పెడబొబ్బలు పెడుతూ భీమదేశంలో సంచరించడానికి ఒక నిశాచరుని పుట్టించాడు. మనుష్యులను భక్షించమని వాణ్ణి పంపాడు. వాడు భాద్రపద మాసంలో పడమటికి రౌద్రంతో వచ్చాడు. ప్రజలంతా భయపడ్డారు. వరుణుని దగ్గరకు వచ్చారు. వరుణుడు హోమంచేశాడు. హోమగుండం నుండి ముప్పదిరెండు మోముల శక్తి పుట్టింది. దేవతావిభుడు మానవులను భక్షింపుమని పంపాడు. ఆశక్తి పటురౌద్రలీలగా మేటిజీవులను బట్టి

మింగాలని ఊహించగా యుగాంతమై తోచింది. అప్పుడు వరుణ దేవునితో వసుధేశుడు "నీవు లింగాల కొండకు పోయి భైరవునితో ఈ విషయమంతా చెప్పి ఆదానవిని పశ్చిమదిశకు పంపి స్వామిపనులు నెరవేర్చునట్లు ఆజ్ఞాపింపజేయుము. కాదంటివా నిన్ను సంహ రించెదను." అనగా ఆ ఉగ్రవాక్యాలకు వరుణదేవుడు భయపడి "మీరు సెలవిచ్చినట్లు చేస్తాన"ని అన్నాడు. అంకాళశక్తిని పంపే ఏర్పాట్లు చేశాడు. ఆశక్తి బయలుదేరింది. అప్పుడు మహాకల్పాంత మయింది.

అప్పుడు మానవులు పడి ఏడ్చారు. భ్రమ చెందారు. నేలపై బడి దుమ్ముగరచారు. బెదరి పోయారు. తబ్బిబ్బు మాటల వారయ్యారు. పిచ్చిగా మాట్లాడారు. కొందరు పలవించారు. కొందరు మరణించారు. గుండె పగిలి కొందరు కూలిపోయారు. కొందరు పెదవులు తడుపుకొన్నారు. కొందరు భక్తజనుల మందిరా లకు శరణార్థులుగా వచ్చారు. ప్రపంచమంతా భీతిల్లింది. ప్రజలంతా తహతహలాడుతూ "ఏడి నారాయణుడు? ఏడి రక్షకుడు? ఏడి రాజోత్తముడు? ఏడి సుమంతుడు? ఏడి సంక్రందనుడు? ఏడి గురుడు? శివుడేడి? మనమొరలు విని సంరక్షించడానికి ఎక్కడ ఉన్నారు? మన కెవ్వరు దిక్కు? రామధర్మజులకు మనపై కరుణ లేకపోయింది. వరుణ దేవుడు మనకిచ్చిన అభయం ఏమయింది? చచ్చిన తరువాత సుఖా లెందుకు? కుశలవ క్ష్మాపాలకుడు మహాత్ముడు మనను పరిపాలిస్తా డనుకొన్నాము. ఆశలన్నీ అడియాసలయ్యాయి. సురపతి మనను దయ చూడలేదు. మన యువరాజు మనను మరచిపోయాడు. మన ధర్మజుని దయాహృదయం ఏమయింది? కారణం ఏవిధంగా అవు తుందో?" అని భక్తవరులు భయపడి చింతించారు. అప్పుడు "భక్తుల

విన్నపములు వినరావా? శక్తి ఉపద్రవంవల్ల ప్రజలు యుక్తితప్పి వున్నారు. మన సురపతి అశ్వనితోకూడి సకల కార్యాలను మరచి పోయాడు. చండార్చి, శమనుడు సతులతో కూడుకొని పౌరుష మతిశయించి వున్నారు. అప్పుడాల రీతిగా ఆరగించడానికి ప్రయత్నించు. వరుణదేవుడు, వాయుదేవుడు, కుబేరుడు, వామదేవుడు న్యాయం తప్పి వున్నారు." అని రామధర్మజుడు చెప్పగా విని నృపాలుడు గడగడ వణకి కపిలమునీంద్రుణ్ణి అడుగగా అతడు కరుణించి రాజును తన కౌగిట చేర్చాడు. సురపతితో భక్తులను రక్షించే ప్రయత్నం చేయమని చెబునానన్నాడు. "వరుణదేవుణ్ణి పశ్చిమానికి సేనాధిపతిని దక్షిణానికి సుమంతుని పూర్వదిశకు వాయుదేవుని ఉత్తరదిశకు పంపించు. మధ్య ప్రదేశానికి నీవు, నేను కపిలుడు అందరం వెళ్లాలి" అని రాజేంద్రుడు చెప్పాడు. కనకాంబరాలు ఘనమైన రథం ఇప్పించాడు. అవి తీసుకొని రామధర్మజుడు కృపారసంతో వెళ్లాడు.

అప్పుడు ఉత్తరదిశన ఆపదలు కలిగాయి. మూడు నక్షత్రాలు పుట్టాయి. అప్పుడు ఉత్తరాన గోదావరి వరకున్న భువిలో విపరీత వృత్తులు పుట్టాయి. ఒక్కొక్క తిథిలో ఉగ్రరాక్షసులు ఒక్కొక్క కోటిమంది నశించారు. అన్యోన్య కలహాలతో క్రూరస్వభావులై కూలి పోయారు. విషవాయులవల్ల విషయవాంఛలవల్ల అసంఖ్యాకంగా మరణించారు. అప్పుడు మాధవుడు బడబాగ్ని దగ్గరకు వెళ్లి "ఇది సమయం నీవు వెళ్లు" అని అన్నాడు. అంతట బడబాగ్ని బొబ్బలు పెట్టింది. పావకజ్వాలలు దశదిశలా వ్యాపించాయి. భయంకరమైన కోరలతో భయంకరమైన మోతలు భూమిఅంతటా నిండాయి. శత యోజన విస్తారంగల జూలును విదలించి దిగ్గనలేచి గర్జించి "లోకైక రక్షకుడా! ఇప్పుడు ఏమిటి మార్గం?" అని అడుగగా ఆదిదేవుడిలా అన్నాడు. "రాక్షస గణాలను పట్టణాల్లో పల్లెల్లోవున్న సంకరజాతు

లను పద్నాలుగు లోకాల్లో ఉన్న సకలచరాచర జంతు సంతతులను దండించి ఖండించి తలలు నరికి గుండెలు పగలగొట్టి గుడ్లు పొడిచి చెండాడు." ఇలా ఆశక్తికి చెప్పి పుండరీకాక్షుడు "బలపడి జీవులను భక్షించేటప్పుడు ఆలోచనలేక నా భక్తుల్లో ఒక్కరినైనా భక్షిస్తే నా కుమారుడు నీతలలు ఖండిస్తాడు. కనుక రాజునుచూసి ఆజ్ఞ పొంది ఎక్కడికైనా వెళ్ళు. రాజుకు యువరాజుకు మావిషయం తెలియజెప్పు. వైశాఖమాసం వెళ్ళకముందే అష్టమంత్రులను చూసి ఈవార్తలు చెప్పి రాక్షసుల సకలజీవులను విరిచి భక్షించు. ఏజాతివారైనా ఎక్కడి వారైనా ఎవరైనా భక్తులనువదలిపెట్టు భక్తులుకాని పలుకాకి జనాన్ని బ్రతుకనీయవద్దు. వెంటనే కాంచీపురందాకా వెళ్ళు." అంటూ భువన రక్షకుడైన విష్ణువు తుమ్మరపుర వీరదుర్గితో "నీవు సేనతో బయలుదేరి దిగంబరివై కాశీపట్టణందాకా వెళ్ళు. ఆలసించక భూములన్నీ వెదకి సముద్రాలవరకు ఉన్న భూమిపై జీవులన్నింటినీ గడియకు పదికోట్ల చొప్పున భక్షించు. ఆలస్యం చేయరాదు. నెల్లూరును భేదించాలి. శ్రీరంగపట్నంనుండి బందరుదాక వున్న కుటిలులను ఖండించి కొండల పొడవున మొండేలను తోళ్ళను వేయాలి." అని అన్నాడు.

అప్పటికి సంవత్సరం గడిచిపోయింది. వైకుంఠుడు తన వర కుమారునితో ఇలా అన్నాడు. "మనం పలువిధాల శంకింపరాదు. జయం చేకూరింది. కేశవస్వామితో విషయాలన్నీ చెప్పు. నీ ప్రియ భార్యలతో భాసించవలసినది. యువరాజును మెప్పించి దత్తాత్రేయ ముని దగ్గరకు వెళ్ళి కపిల మహామునిని చూసి విశ్వామిత్రఋషితో పదికోట్లఋషులతో కలిసి ఒకహోమం చేస్తే హోమగుండంలో కామేశ్వరి అనే ఒకశక్తి ఉద్భవిస్తుంది. ఫెళఫెళ ఆర్భాటంచేస్తూ భేతాళసమితితో ఉదయిస్తుంది. కపిలునిదగ్గర శలవు తీసుకొని ఒకరాత్రి అత్యుగ్రంగా

ఘోటకపర్వతాలదాగా వెళ్లి ఖలుల నందరినీ భక్షిస్తుంది. భక్తగణాలు బాధపడతారు. బలభద్రుడనేవాణ్ణి బాడబపురికి పంపించు. మువ్వర సేనుడనేవాణ్ణి లంకకు పంపించు. కుల్బుడు అనే రాక్షసుడు పదికోట్ల భటులతోవచ్చి క్రోధంతో అగ్నికణాలు రాలేటట్లు కదనరంగంలో సేనాధిపతివైపు చూసి సైన్యాన్ని నడిపించి దైత్యుల నందరిని సంహరిస్తాడు.

అషాఢమాసం రాగానే భూ మి పై బహుజీవకోటికి బాధ మెండయింది. పిడుగుల వర్షం కురిసింది. రాజులు కడు మూర్ఖులై అన్యోన్యం కలహించుకొని కదనరంగంలో కూలిపోయారు. భూమిపై నెత్తురువర్షం కురిసింది. వావివరుసలు తప్పిపోయాయి. భక్తులను పిలిపించి "జలజలోచనుని కడకు వెళ్లాలి ఇక ఆలస్యం చేయకూడదు. రేపే శుభముహూర్తం బయలుదేరండి." అని అన్నాడు. అప్పుడు రాజు వైశాఖంలో సైన్యంతో గౌరిదగ్గరకు వెళ్లాడు. దండప్రణామాలు చేశాడు. భక్తితో సన్నుతించాడు. అప్పుడు వనజలోచనుడు మను, మయ, త్వష్ఠృ, శిల్పి, దైవజ్ఞులు చేరి సేవింపగా, మునివరులు, వి బు ధు లు, చతురంగబలాలు వెంట నడువగా మంగళతూర్యాలు మ్రోయగా కదలి, అక్కడక్కడ భక్తులుసేవింపగా వారిని శీఘ్రంగా కరుణించి, దినకర శతకోటి దేదీప్యమానమైన గుఱ్ఱాన్ని ఎక్కి, ఖడ్గం ధరించి బయలుదేరాడు. అలా వీరధర్మజుడు వేంచేసేటప్పుడు శౌరి కుమారుడు ఆయన సన్నిధికి చేరాడు. ముత్యాలగొడుగు పట్టాడు. యువరాజు చామరం వీచాడు. దేవేంద్రుడు సురటి పట్టుకొని నడిచాడు. అనలుడు పాదుకల నందించాడు. దినకర సుతుడు దివ్యమైన వస్త్రాలు తెచ్చాడు. నైఋతి పాదుకలు పట్టుకొని నడిచాడు. అనిలుడు పార్శ్వాన నడిచి స్తుతించాడు. అసమానమైన భక్తితో వరుణుడు నడువగా పవనుడు సేవించాడు. కుబేరుడు చండ

కోదండాన్ని ధరించి ముందు నడిచాడు. ఘనమైన గదాదండాన్ని ధరించి ఈశానుడు వెంట నడిచాడు. భక్తగణం వెనకా ముందూ నడిచారు. కపిలాది మహర్షులు వేదాలు పఠించారు. మనుమయాదులు కాలమర్మాన్ని లెక్కిస్తున్నారు. బ్రహ్మదేవుడు బహుశాస్త్ర పద్ధతులను స్మరించాడు. సేనాధిపతి నెమలిపై వచ్చాడు. విద్యాధరులు ఇంపుగా సంగీతం పాడారు. అరుంధతి మున్నగు ముత్తయిదువులు మంగళ గీతాలు పాడారు. వంది బృందాలు కైవారం చేశారు. స్వామి వస్తున్నాడు హెచ్చరిక అని వెండిబెత్తాలవారు నడిచారు. రాజ కుమారులు, వృషసేనుడు, సాందీపుడు, చిత్రాంగదుడు, బలభద్రుడు మొదలైనవారు ఆయుధాలు ధరించి వెంటనడిచారు. పర్జన్యుడు, కార్తికేయుడు, సులభుడు, రంభుడు, సోమశేఖరుడు, పదునాలుగువేల సైన్యంతో వెంట నడువగా మాధవుడు మహనంది చేరాడు. సాధుజన రక్షణోత్సాహి అయ్యాడు. సిరిదేవి శిఖరాన్ని ఎక్కి హరి వచ్చాడని అతివలందరూ కొలిచారు. నమస్కరించి విందుచేశారు. గోవిందుడు అప్పుడు కందర్పవైరిని కరుణతో మన్నించాడు. కరవాలంతో శక్తిని ఖండించాడు. వాద భేదులను త్రుంచాడు. షణ్మతాల వారిని రావించాడు. వారిని విచారించాడు. కొందరిని లోబరచుకొన్నాడు. కొందరిని కొట్టాడు. కొందరిని దూషించాడు. చిందరవందర చేశాడు. చివరకు అందరిని తనభక్తులుగా మార్చాడు. నడిరాత్రికి నందేల వచ్చాడు. దైత్యుల తాళ్లు తెంచాడు. శిరువెళ్ల కానాల సీమల వారందరిని భక్తులను చేశాడు. అహోబిళానికి వెళ్లి నరసింహస్వామిని చూశాడు. కర్లపాలానికి వెళ్లి మయుని పూజలు చేయించాడు. అక్కడ మూడురోజులున్నాడు. కపిల మునిని రప్పించాడు. కలహచూత పురానికి వెళ్లాడు. చెండిచెర్లను చేరాడు. అక్కడి భక్తుల్లను మన్నించాడు. ఘనడించి, సరింబాక నగరాల్లో ఉ[illegible]చకూతను

రక్షించాడు. కృష్ణానదిని చూశాడు. నెమిలిగూడానికి, భూసుర నగరానికి వెళ్లాడు. అక్కడినుంచి కపిలమహర్షి స్థానానికి వెళ్లి విశ్రాంతి తీసుకొన్నాడు. మరునాడు పాళేనికి వెళ్లి అక్కడినుండి పుష్పగిరి చేరాడు. అంతటు శ్రీరమాధీశుడు కార్యకారణ సంకల్పం ఊహించి సకల దిక్పతులు, సన్మునీశ్వరులు, సకలభక్తులు సందడితో సేవించగా మనుమయ త్వష్టాది మంత్రిపుంగవుల అనుమతితో భావి కార్యాన్ని ఊహించాడు. తన కుమారునకు నూటొక్క భావ లక్షణాలను తెలిపాడు. శ్రావణ శుద్ధ షష్టి భృగువారం మంగళస్నానం చేసి దీక్ష వహించడానికి మంచిరోజని మయుడు చెప్పాడు. పంచమి నాడు అఖిల దిక్పతుం౹ భార్యలతో ప్రకటిత భూషణాలతో సకల వైభవాలతో బయలుదేరాలి, రప్పించమన్నాడు. అప్పుడు రాజ నందనుడు ఆ సుమంతావనీ నాథుణ్ణి చూసి "మన పరోక్షుడు ఘనుడు కార్యఘటన చేయగల సమర్థుడు. భుజబలం కలవాడు. తేజస్సు కలవాడు. కపిల మహాముని కరుణ గొన్న వివేకి. వాని మహత్తు నీకు తెలియదు. విష్ణుదేవునకు నాకు తెలుసు, వినిపిస్తాను. విన వలసింది. వాడు పూర్వం తన తపస్సుతో ముగ్గురు మూర్తులను మెప్పించాడు. దివ్య వరాలు సంపాదించాడు. సకల దేవతలను సమయోచితంగా సాధించగలడు. మిక్కిలి భక్తితో ఆకాశగంగలో మునిగి స్నానకృత్యాలు ముగించి బంగారు కొండపైకెక్కి నిశ్చల చిత్తంతో హరినిగురించి తపస్సుచేశాడు. ముల్లోకాలు గడగడలాడాయి. దేవతలు భీతిల్లారు. విష్ణువుతో చెప్పారు. విష్ణువు ప్రత్యక్షమై ఏమివరం కావాలో కోరుకొమన్నాడు. అకలంకపతి నయ్యేవరం ఇమ్మని అడిగాడు. విష్ణువు పరిపూర్ణ కృపతో వరమిచ్చాడు. అందుచేత ఇప్పుడితడు భూమిమీద అవతరించాడు. మా తల్లి సీతాదేవి ఈ విషయాలన్నీ చెప్పింది. అందుచేత ఇతని విషయం తెలిసింది. ఇతణ్ణి మానవమాత్రుడుగా నిర్ణయించవద్దు. వీడు స్వామికార్యాన్ని

సాధించగలడు. ఇది ఈ పరోక్షుని అవతార మహిమ." అని అన్నాడు, ఈ మాటలు విని సుమంతుడు రాజుకు నమస్కరించాడు. పరోక్షుణ్ణి ఆలింగనం చేసుకొన్నాడు. తాపసులకైనా దుస్తరమైన కార్యాన్ని నెరవేర్చు. అని అనుకొనివచ్చి రాజుముందు నిలిపాడు. అప్పుడు కుశుడు సంతోషించి బంగారు పచ్చల పాలకి బంగారు భూషణాలు ఇచ్చి "అనఘాత్మా! చెన్నమాంబ మొదలైన వనితలతో నీవు శీఘ్రంగా రావలసినది. వెళ్లు అని అనగా ఇంటికి వెళ్లాడు. తన అతివలకు ఆవిషయమంతా చెప్పాడు. అప్పుడు యువరాజు తాపసులను, భక్తులను రప్పించాడు. పెద్దలను పిలిచాడు. పదికోట్ల దేవతా భటులను పిలిపించాడు. ఆలస్యమైతే దండిస్తానని పరోక్షుడు బ్రహ్మతో అన్నాడు. నీ పుత్ర పౌత్ర బంధు జనాలతో భార్యతోరమ్మని గద్దించి పిలిచాడు. అప్పుడు అఖిలలోక సంఘాలు పదపదండని కదిలాయి. ఎన్నాళ్లకు మాకిహము పరము కలిగాయని సంతోషించారు. అంతా కలిసి కపిలముని దగ్గరకు వెళ్లారు. అతడు శతయోజన విస్తారమైన హోమగుండం వెలిగించాడు. అగ్ని చిటచిటార్భటులతో బ్రహ్మాండం పగిలేటట్లుగా కొండలు కంపించేటట్లుగా భూనభోంతరాలమధ్య వ్యాపించింది. సత్యలోకాన్ని దాటి వెళ్లింది. నాలుకలు కోసి మంటలు నిఖిల లోకాల్లో వ్యాపించాయి.

అంతట గోవిందుడు ఖడ్గం ధరించి గుఱ్ఱాన్ని ఎక్కి బయలుదేరి భక్తజనులు జయజయధ్వనులు చేస్తుండగా తన కుమారులతో "మంగళ స్నానాలు చేయాలి. తపస్సు చేయాలి." అని అనగా నమస్కరిస్తూ ఇంద్రుడు, అగ్ని, యముడు, నైఋతి, వరుణుడు, కుబేరుడు, ఈశానుడు, వారిపత్నులు, స్నేహితులు, మంత్రులు, సేనాధిపతులు వచ్చారు. అనలుడు బ్రహ్మాండమంటి మండుతున్నాడు. యువరాజైన

కుశుణ్ణి చూసి వీడు హరికుమారుడు అలవిగాని వాడనుకొని అగ్నిచల్ల బడింది. మంటలలో ప్రవేశించిన వారికి నీళ్లలో ఈదినట్లు ఉంది. కొంతసేపు వారా అగ్నిమధ్య గడిపారు. అప్పుడక్కడికి విష్ణువు వచ్చి తన కుమారుణ్ణి ఆలింగనం చేసుకొన్నాడు. శీలవంతులైన సుమంతాది భక్తులను కటాక్షించాడు. సపరివారంగా వెళ్లాడు.

పై విషయాలతో బ్రహ్మంగారి కాలజ్ఞానంలో ఉన్న ద్విపద కాలజ్ఞానంలోని మొదటిభాగం పూర్తయింది. ఇక ద్విపద కాలజ్ఞానం రెండవ భాగంలోని అంశాలిలా ఉన్నాయి.

వైకుంఠం వీడి కమలనాభుడు వీరధర్మజ నామంతో కల్క్యావ తారుడుగా కదలివస్తాడు. ముల్లోకాలు ఆనందిస్తాయి. పదునెనిమిదికోట్ల మంది భటులు వెంటనడుస్తారు. ముప్పదిమూడు కోట్ల మంది పద్మినీ స్త్రీలు పాటలు పాడుతారు. ముత్యాల గొడుగులు పట్టగా వీరగురుడు తరలివస్తాడు. సత్యాత్ములు ఆయన్ను చూసి త్రొట్రుపడుతారు. భీకరంగా భేరి వేయిస్తారు. భక్తవత్సలుడు భానునందికి వస్తాడు. జగత్తును పాలిస్తాడు. కృతయుగధర్మాన్ని స్థాపిస్తాడు. అని చెప్పడంతో ద్వితీయభాగంగాఉన్న ద్విపద ముగిసింది.

బ్రహ్మంగారీ ద్విపద రచనలో ఉత్తమపురుషలో చెప్పవలసింది ప్రథమపురుషలో చెప్పారు. ఈ రచనలో అంతటా శ్రీమన్నారాయ ణుడు, మనుమయాది పంచబ్రహ్మలు దేవేంద్రాది దేవతలు, కపిలాది మహర్షులు దర్శనమిస్తారు. కానీ ఈ ఘట్టంలో చెప్పబడిన "మహా నంది, నందేల (కాల. పు. 124) "శిరువెళ్ల, కానాల, అహోబిలం, కర్లపాలెం, కలహచూతపురం" (కాల. పు. 125) మొదలైన గ్రామ

నామాలనుబట్టి రామధర్మజుడు, పుండరీకాక్షుడు, శౌరి, శ్రీరమాధీశుడు, గోవిందుడు, కమలనాభుడు మొదలైన విష్ణుసంబంధ నామాలు ప్రయోగించడాన్నిబట్టి ఆ అవతరించబోయే కల్క్యవతారుడు బ్రహ్మంగారేనని స్పష్టమవుతుంది.

## కాలజ్ఞాన సౌజన్య పత్రికలు:-

కాలజ్ఞాన గ్రంథంలో ద్విపద కాలజ్ఞానం తరువాత రెండు కాలజ్ఞాన సౌజన్య పత్రికలు ఉన్నాయి. ఇందులో ఒకటి బ్రహ్మంగారి సంసారగృహంలో పుట్టమీద పీఠంలో పరీధావి సంవత్సరం, అంటే క్రీ॥ శ॥ 1912వ సంవత్సరం కార్తీక బహుళ త్రయోదశి శుక్రవారం నాడు పూజ చేస్తూండగా పూజారి రామయ్యగారికి దొరికింది. "ఈ పత్రిక రక్తాక్షినామ సంవత్సరం ఆశ్వయుజ శుద్ధ ౧౦లు నాడు ఉత్పత్తి అయినది."1 అని ఈ సౌజన్యపత్రిక ప్రారంభంలో కనిపిస్తుంది. రక్తాక్షినామ సంవత్సరం అంటే క్రీ॥ శ॥ 1684.

రెండవ సౌజన్యపత్రిక ప్లవనామ సంవత్సరం అంటే క్రీ॥ శ॥ 1961 చైత్ర శుద్ధ నవమి సౌమ్యవారం పగలు మూడు గంటలకు కందిమల్లాయపల్లె బ్రహ్మంగారి సమాధికి ఉత్తరభాగంలో వారి పాదుకల సన్నిధానంలో అప్పటి మఠాధిపతులు శ్రీనివాసస్వాములకు లభించింది.

"సౌజన్యం అంటే సుజనత్వం. పత్రిక అంటే వ్యవహారము

---

1. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానము, ప్రచు : కృష్ణమూర్తి, రంగయ్య. కందిమల్లాయపల్లె, 1974. పు. 137.

యొక్క చెల్లుబడికై యొకరొకరు వ్రాసికొను పత్రము.” అని నైఘంటికార్థం. మంచివిషయాన్ని ప్రతివ్యక్తీ పరస్పరంగా వ్రాసుకొనే పత్రిక అని భావం. “ఈపత్రిక చూచిన తక్షణమందు కన్నుల కద్దుకొని ........... ఊరేగింపు చేయించి, బదులు పత్రికలు వ్రాసి వుంచుకొని ఆవల గ్రామాదులకు పంపించేది,1” అనేవాక్యం సౌజన్య పత్రిక అనేపదాన్ని అర్థవంతం చేస్తున్నది. ముద్రణాయంత్రాలూ కాగితాలూలేని ఆరోజుల్లో ఈ సౌజన్య పత్రికలను ప్రచారం చేయాలంటే ఒక్కచేతిమీదుగా వ్రాయడం సాధ్యంకాదు. అందుచేత ఎక్కువ పత్రికలను ఉత్పత్తి చేయించాలనే ఉద్దేశంతో “ఈ పత్రికను వ్రాయక పాలుమాలి చదువక వూరికెయున్న కనకదుర్గాంబ దండించును. ఈప్రకారం ఎవరు పూజలు చేస్తూవున్నారో వారికి పుష్పమిచ్చిన జోడుపుష్పములవును.2” అని వ్రాయబడింది. ఇది పురాణాల్లో ఫలశ్రుతి వంటిది.

ఈ సౌజన్యపత్రికలు రెండింటిలోను, కాలజ్ఞాన వచనాల్లో, తత్వాల్లో, గోవిందనామాల్లో చెప్పబడిన విషయాలే ఉన్నాయి. మొత్తంమీద ఈ సౌజన్య పత్రికలు కాలజ్ఞాన గ్రంథ సారాంశమని చెప్పవచ్చు.

## జీవైక్య బోధ కాలజ్ఞానం:-

కాలజ్ఞాన గ్రంథంలో రెండు సౌజన్యపత్రికల తరువాత జీవైక్య

---

1. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానము, ప్రచు : కృష్ణమూర్తి, రంగయ్య. కందిమల్లాయపల్లె. 1974. పు. 141.

2 పైది పు. 148

బోధ కాలజ్ఞానం ఉంది. జీవశబ్దానికి భూమి, ప్రాణం, తత్వం, స్వరూపం, పరమాత్మ అనే అర్థాలున్నాయని నిఘంటువు చెబుతున్నది. ఐక్యమంటే ఏకీభావం లేక ఒద్దికగా ఉండడం. జీవాత్మ పరమాత్మలో ఐక్యమయ్యే విధానాన్ని బోధించేది జీవైక్య బోధ. ప్రాణం పరమాత్మలో ఎలా లీనమవుతుందో చెప్పడంకూడా భవిష్యత్ కథనమే. అందుకే దీన్ని జీవైక్యబోధ కాలజ్ఞానం అన్నారు. జీవైక్య బోధ కాలజ్ఞాన విషయసంగ్రహం ఈక్రింద పొందుపరచబడింది.

*సృష్టిక్రమం* :— ఆకాశంలో వాయువు; వాయువులో అగ్ని, అగ్నిలో ఉదకం, ఉదకంలో పృథ్వి, పృథ్విలో ఓషధులు, ఓషధులవల్ల అన్నం, అన్నంవల్ల నర మృగ పక్షి స్థావర జంగమాదులు ఉద్భవిస్తాయి. ఉద్భవించిన క్రమంలోనే ఐక్యమవుతాయి.

*మానవ శరీరం* :— ప్రతిమనిషీ తన అంగుళంతో 96 అంగుళాల పొడవు, 7 జానెల ప్రమాణం, 4 జానెల వలయం, 33 కోట్ల రోమనాళాలు, 33 మూళ్ల ప్రేవులు, 62 సంధులు, 90 పెద్దఎముకలు, 8 ఫలముల ఎత్తుగుండెలు, 4 ఫలాల రుధిరం. 260 ఫలాల మాంసం, సోలెడు పైత్యం, అరసోలెడు శ్లేష్మం, కూడుకొని ఉంటాడు.

*శరీర తత్వాలు* :— ఈ శరీరంలో 96 తత్వాలు ఉన్నాయి. అవి ఏమిటంటే 9 రంధ్రాలు, 5 శోత్రాదులు, 5 వాగ్వాదులు, 5 వచనాదులు, 5 అంతఃకరణాలు, 5 పృథ్వీ సంబంధాలు, 5 ఉదక సంబంధాలు, 5 అగ్నిసంబంధాలు, 5 ఆకాశ సంబంధాలు, 10 వాయువులు, 10 నాడులు, 7 ధాతువులు, 8 రాగాదులు, 6 ఆధారాలు.

## తత్వాల రూపనామ క్రియలు :-

**నవరంధ్రాలు :-** చెవుల ద్వారాలు 2, కన్నుల ద్వారాలు 2, మలమూత్ర ద్వారాలు 2, ముక్కుద్వారాలు 2, నోటి ద్వారం 1.

**శ్రోత్రాదులు :-** అంటే జ్ఞానేంద్రియాలు. ఇవి ఐదు. 1) చెవులు 2) చర్మం 3) నాలుక 4) ముక్కు 5) కళ్లు. వీటికి విషయాలు 3. ఇవి 1) ఆధ్యాత్మ 2) అధిభూతం 3) అధిదైవతం.

| ఆధ్యాత్మ | | అధిభూతం | | అధిదైవతం |
|---|---|---|---|---|
| చెవులు | - | వినడం | - | గాలితోకూడిన ఆకాశం |
| చర్మం | - | స్పర్శ | - | వాయువు |
| కళ్లు | - | చూడటం | - | సూర్యుడు |
| నాలుక | - | రుచిచూడటం | - | వరుణుడు |
| ముక్కు | - | వాసనచూడటం | - | భూమి |

ఇవి జ్ఞానేంద్రియ పంచకాలని చెప్పబడ్డాయి.

**కర్మేంద్రియాలు :-** ఇవి ఐదు. 1) నోరు 2) చేతులు 3) పాదాలు 4) గుదం 5) శిశ్నం. వీటికి ఆధ్యాత్మ, అధిభూతం, అధిదైవతం అనేవి మూడువిషయాలు.

| ఆధ్యాత్మ | | అధిభూతం | | అధిదైవతం |
|---|---|---|---|---|
| పాదాలు | - | నడవడం | - | విష్ణువు |
| గుదస్థానం | - | మల విసర్జన | - | మృత్యువు |
| శిశ్నం | - | సంగమంతో కలిగే ఆనందం | - | ప్రజాపతి |
| నోరు | - | పలకడం | - | అగ్ని |
| చేతులు | - | పనిచేయడం | - | ఇంద్రుడు |

అంతఃకరణ చతుష్టయం :— మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం అనేవి శరీరంలో ఉంటాయి. బుద్ధి బొడ్డుదగ్గర ఉంటుంది. హృదయంలో మనస్సు ఉంటుంది. పరంలో చిత్తం ఉంటుంది. నేనులో అహంకారం ఉంటుంది. వీటికి విషయాలు 3.

| ఆధ్యాత్మ | | ఆధిభూతం | | ఆధిదైవతం |
|---|---|---|---|---|
| మనస్సు | – | ఒకవస్తువును మరొకవస్తువని సంశయించడం | – | చంద్రుడు |
| బుద్ధి | – | సంశయించిన వస్తువును ధ్రువపరచడం | – | పరబ్రహ్మ |
| చిత్తం | – | అనేకవిధాలుగా చింతించడం | – | బ్రహ్మ |
| అహంకారం | – | సర్వకార్యాలు తనవల్ల జరిగినవని అనుకోవడం | – | రుద్రుడు |

## జ్ఞాతృత్వం అంటే ఏమిటి?

మానవుడు పైనచెప్పిన సకలేంద్రియాలకు శాంతి కల్పించి ఇంద్రియాలతో పాపపుణ్యాలు చేయిస్తూ ఆత్మకు ఒక్కకర్మకూడా అంటకుండా సాక్షిమాత్రమై ధర్మచింతనతో జీవించడం తెలుసుకోవడమే జ్ఞాతృత్వం. అనేక చేష్టలు కలిగిన శరీరంలో జీవుడే బలమైనవాడు. కాబట్టి శరీరమే జీవుడనే భ్రాంతి కలుగుతుంది. దీనివల్ల అనేక జన్మాలెత్తి సుఖదుఃఖాలను అనుభవింపవలసివస్తుంది. సత్పురుషుడు కారణగురువును సేవిస్తే పరబ్రహ్మ ప్రత్యక్షమవుతాడు. జననమరణాలను జయించి బ్రహ్మానందాన్ని పొందుతాడు.

## శారీరక చేష్టలు:—

చెవులకు విషయం శబ్దం. ఆకాశంతో కలిసి సకల శబ్దాలను వింటాయి.

చర్మానికి విషయం స్పర్శ. వాయువుతో కలిసి సకల స్పర్శ భేదాలు తెలుసుకొంటుంది.

కళ్లకు విషయం రూపం. అగ్నితోకలిసి సకల స్వరూప భేదాలు తెలిసికొంటుంది.

నాలుకకు విషయం రసం. నీళ్లతో కలిసి షడ్రుచులను తెలుసుకొంటుంది.

మనిషికి ఈవిషయాలలో వైరాగ్యం కలిగితే మోక్షం లభిస్తుంది. మనిషి విషయాసక్తుడైతే సంసారబంధంలో చిక్కుకొంటాడు.

**పృధ్వీ సంబంధాలు :-** ఇవి ఐదు. 1) ఎముకలు 2) నరాలు 3) మాంసం 4) చర్మం 5) వెంట్రుకలు.

**జల సంబంధాలు :-** ఇవి ఐదు. 1) నెత్తురు 2) మూత్రం 3) శుక్లం 4) శ్లేష్మం 5) మేధస్సు.

**అగ్ని సంబంధాలు :-** ఇవి పది. 1) ఆకలి 2) దప్పిక 3) నిద్ర 4) ఆలస్యం 5) సంగమం 6) చలనం 7) గమనం 8) ప్రసారణం 9) అకుంచన 10) ఆకర్షణ.

**ఆకాశ సంబంధాలు :-** ఇవి ఆరు. 1) కామం 2) క్రోధం 3) లోభం 4) మోహం 5) మదం 6) మాత్సర్యం.

## అవయవాల జన్మస్థానాలు :-

ఆకాశంలో జ్ఞానం ప్రాణవాయువు. చెవులు, శబ్దం, నోరు జన్మిస్తాయి.

వాయువులో మనస్సు, వ్యానవాయువు, చర్మం, స్పర్శ, కాళ్లు జన్మిస్తాయి.

అగ్నిలో బుద్ధి, ఉదానవాయువు, కన్నులు, రూపాలు, చేతులు జన్మిస్తాయి.

నీళ్లలో సమాన వాయువు, నోరు, రసం, గుదస్థానం జన్మిస్తాయి.

## కర్మేంద్రియ చేష్టలు :-

ముక్కుకు విషయం వాసన. భూమి సంబంధంతో సుగంధ దుర్గంధాలను తెలుసుకొంటుంది.

నోటికి విషయం వచనం. ఆకాశంతో కలిసి సకల వచనాలను పలుకుతుంది.

కాళ్లకు విషయం గమనం. గాలితోకూడి సంచారం చేస్తాయి.

చేతులకు విషయం దానం. అగ్నితో కలిసి ఇచ్చి పుచ్చుకుంటాయి.

పాయువుకు విషయం మలవిసర్జనం. అది ఉదకంతో కలిసి మలాన్ని విసర్జిస్తుంది.

శిశ్నానికి విషయం సంగమం. భూమితో కలిసి ఆనందిస్తుంది.

## అంతఃకరణాల చేష్టలు :-

మనస్సు సంశయిస్తుంది. బుద్ధి నిశ్చయిస్తుంది. చిత్తం ఆలోచిస్తుంది. అహంకారం నేనంటుంది. ఇవ్వన్నీ ఎక్కడ జన్మిస్తాయో అక్కడే అణగిపోతాయి.

శబ్దం ఆకాశ సంబంధమైన చెవుల్లో అణగిపోతుంది.

స్పర్శ వాయుసంబంధమైన చర్మంలో అణగిపోతుంది.

విసర్జన ఉదకసంబంధమైన గుదంలో అణగిపోతుంది.

ఆనందం భూమి సంబంధమైన శిశ్నంలో అణగిపోతుంది.

గమనం వాయుసంబంధమైన పాదాల్లో అణగిపోతుంది.

అహంకారం భూమిసంబంధమైన అపానవాయువు. ముక్కు గంధాలలో అణగిపోతుంది.

| పంచభూతాలు | వర్ణాలు | అధిపతులు | స్థలాలు |
|---|---|---|---|
| భూమి | పసుపు | శివుడు | పాదాలు మొదలు పిక్కల వరకు |
| నీరు | తెలుపు | విష్ణువు | పిక్కలు మొదలు తొడల వరకు |
| నిప్పు | నలుపు | రుద్రుడు | తొడలు మొదలు పొట్టవరకు |
| గాలి | ధూమవర్ణం | రుద్రుడు | పొట్ట మొదలు కన్నుల వరకు |
| నింగి | ఇంద్రనీలం | బ్రహ్మ | మెడమొదలు ముఖం వరకు |

**పంచ భూతాలు - తన్మాత్రలు :** శబ్ద, స్పర్శ, రూప, రసగంధాదులు తన్మాత్రలు, అని నిఘంటువు చెబుతున్నది.

నేలకు శబ్ద, స్పర్శ, రూప, రసగంధాలు అనే గుణాలు 5.

నీటికి శబ్ద, స్పర్శ, రూప, రసాలు అనే గుణాలు 4.

నిప్పుకు శబ్ద, స్పర్శ, రూపాలు అనే గుణాలు 3.

గాలికి శబ్ద, స్పర్శ అనే గుణాలు 2.

నింగికి శబ్దమనే గుణం 1.

## పంచభూతాలలోని మాతృకలు - శక్తులు :

మాతృక అంటే తల్లి, దాది, పార్వతి, వర్ణమాల అని నైఘంటి కార్థాలు ఉన్నాయి.1 శక్తులు అంటే ఆదిశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, పరాశక్తి. ఇక్కడ మాతృకకు వర్ణమాల అనే అర్థం గ్రహించబడింది. బీజాక్షరాలు మాతృకలన బడతాయి.

| పంచభూతాలు | మాతృకలు | శక్తులు |
|---|---|---|
| భూమి | 'ల' కారం | ఆదిశక్తి |
| వాయువు | "య" కారం | క్రియాశక్తి |
| ఉదకం | "వ" కారం | జ్ఞానశక్తి |
| అగ్ని | "ర" కారం | ఇచ్ఛాశక్తి |
| ఆకాశం | "అ" కారం | పరాశక్తి |

పరబ్రహ్మాన్ని దర్శించే విధానం ఈక్రింద చెప్పబడింది.

**షట్చక్రాల వివరణ :-** మానవ శరీరంలో ఆరు చక్రాలు ఉన్నాయి. ఇవి 1) ఆధారచక్రం 2) స్వాధిష్ఠాన చక్రం 3) మణిపూరక చక్రం, 4) అనాహత చక్రం, 5) విశుద్ధ చక్రం, 6) ఆజ్ఞాచక్రం.

**ఆధార చక్రం :-** కాలి ఎముకలు రెండు కుదురు ఎముకలు రెండు కలిసినచోట శిశ్నముంటుంది. శిశ్నానికి గుదస్థానానికి మధ్య

---

1. సీతారామాచార్యులు. బహుజనపల్లి - శబ్దరత్నాకరము,
ప్రచు : చెన్నపట్టణపు దేశభాషా గ్రంథకరణ సభ
1969, పు. 613.

నలుచదరంగా ఉంటుంది. ఇక్కడ ఆధారచక్రం ఉంటుంది. ఈ చక్రానికి నాలుగు దళాలుంటాయి. ఆ నాలుగు దళాలమీద "వ, శ, ష, స" అనే అక్షరాలుంటాయి. ఇది పసుపువర్ణంగా ఉంటుంది. దీనిది భూముద్ర. దీనికి గణపతి అధిదేవత. ఇది భూచక్రం.

స్వాధిష్ఠ చక్రం :- ఆధారచక్రానికి పైన స్వాధిష్ఠాన చక్రముంటుంది. ఈ చక్రానికి ఆరుదళాలుంటాయి. ఈ దళాలమీద "బ, భ, మ, య, ర, ల" అనే అక్షరాలుంటాయి. ఇది తెల్లగా ఉంటుంది. దీనిది పక్షి ముద్ర. దీనికి అధిపతి బ్రహ్మ. ఇది ఉదకచక్రం.

మణిపూరక చక్రం :- స్వాధిష్ఠాన చక్రానికి ఎనిమిది అంగుళాలపైన మణిపూరకచక్రం ఉంటుంది. ఇది కోడిగ్రుడ్డు ఆకారంలో ఉంటుంది. ఈ చక్రంమీద 72 వేల సూక్ష్మాతిసూక్ష్మమైన నాడులు వ్యాపించిఉంటాయి. ఈ చక్రానికి పదిదళాలు ఉంటాయి. ఈ దళాలమీద "డ, ఢ, ణ, త, థ, ద, ధ, న. ప, ఫ" అనే అక్షరాలుంటాయి. దీనిది పీఠముద్ర. దీనికి అధిపతి విష్ణువు. ఇది అగ్నిచక్రం.

అనాహత చక్రం :- మణిపూరక చక్రానికి పదిఅంగుళాల పైన అనాహత చక్రముంటుంది. ఇదే హృదయకమలం. దీనికి పన్నెండు దళాలుంటాయి. ఈ దళాలమీద "క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ" అనే అక్షరాలుంటాయి. దీనిది లింగముద్ర. దీనికి అధిపతి శివుడు. ఇది వాయుచక్రం.

విశుద్ధ చక్రం :- అనాహత చక్రానికి 12 అంగుళాల పైన విశుద్ధచక్రం ఉంటుంది. గొంతుదగ్గర ఉండే ఈ చక్రానికి పదహారు దళాలుంటాయి. ఈ దళాలమీద "అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ, అం, అః" అక్షరాలుంటాయి.

దీనిది మత్స్యముద్ర. దీనికి అధిపతి జీవుడు. దీనిది జ్యోతివర్ణం. ఇది ఆకాశచక్రం.

**ఆగ్నేయ చక్రం :-** విశుద్ధచక్రానికి పది అంగుళాల పైన కనుబొమలమధ్య ఆగ్నేయచక్రం ఉంటుంది. ఈ చక్రానికి రెండు దళాలు ఉంటాయి. ఈ దళాలమీద "హం, క్షం" అనే అక్షరాలుంటాయి. దీనిది ప్రకాశముద్ర. దీనిది స్వర్ణవర్ణం. దీనికి అధిపతి పరమాత్మ. ఇది మనోచక్రం.

ఈ చక్రం మీదినుండి కపాలం వరకు సహస్రార చక్రం ఉంటుంది. ఇది వేయిదళాల పద్మం. ఈచక్రంమీది అక్షరాలు "అ, వ, ర, వ, లు" మొదలుగా ఉంటాయి. దీనిది ఆకాశముద్ర. ఇదే మేరు శిఖరం. దీనికి అధిపతి గురుడు.

## మండలత్రయ వివరణ :-

మానవ శరీరంలో 3 మండలాలుంటాయి. అవి 1) అగ్ని మండలం 2) సూర్య మండలం 3) చంద్ర మండలం. ఈ మూడు మండలాలిలా ఉంటాయి.

**అగ్ని మండలం –** భూమి నీరు కలిసినచోట నలుచదరంగా ఉంటుంది. దానిమీద త్రికోణాకారంగా ఉంటుంది. అక్కడ నాలుగు దళాల పద్మంమీద పంచాక్షరీ మంత్రం ఉంటుంది. "ఐం, హ్రీం, హ్రాం, సం" అనే బీజాక్షరాలుంటాయి. దీన్నే అగ్నిమండలం అంటారు.

**సూర్య మండలం :-** ఇది ఎనిమిదిదళాల పద్మంగా ఉంటుంది. అరటిమొగ్గలా అథోముఖంగా ఉంటుంది. బంగారు రంగులో ఉంటుంది.

ఆ దళాలపైన "య, ర, ల, వ, శ, ష, హ" అనే అక్షరాలుంటాయి. ఈమండలం మధ్యభాగంలో మనోన్మణి అనే శక్తి ఆవాసమై ఉంటుంది. దీన్ని సూర్యమండలమని అంటారు.

**చంద్ర మండలం :-** ఈ మండలం సూర్యచంద్రుల కాంతి కలిగి శిరస్సునడుమ ఉంటుంది. ఇది అమృతకళ. అగ్నిమండలం మీద ఎడతెగకుండా అమృతవర్షం కురిపిస్తూ ఉంటుంది. ఈ కమలం మీద పరాశక్తి ఆవాసమై ఉంటుంది.

## నాడులు - వాటి వివరాలు :-

మానవ శరీరంలో 72 వేల నాడులున్నాయి. వీటిలో పది నాడులు పరిశుద్ధమైనవి. ఇవి 1) ఇడా 2) పింగళ 3) గాంధారి 4) హస్తి 5) జిహ్వా 6) ఆలంబ 7) పుష 8) క్రుకుర 9) దేవదత్త 10) ధనంజయ 11) సుషుమ్న. వీటిలో ఇడా, పింగళ; సుషుమ్న అనేవి ప్రసిద్ధమైనవి. ఈ మూడింటిలో సుషుమ్ననాడి ప్రముఖమైంది.

శరీరంలోని సప్తకమలాలు గుదస్థానం నుండి కపాలం వరకు వీణాదండంలా ఒకదాని వెనుక ఒకటి ఉంటాయి. వెన్నెముకలో రంధ్రం ఉంటుంది. వెన్నెముక గుదస్థానం మొదలు కపాలం వరకు వీణకుండే సొరకాయల్లాగ వరుసగా షట్కమలా లుంటాయి. ఆ వెన్నెముక రంధ్రంలో ఉక్కుతంత్రిలాగా సుషుమ్ననాడి ఉంటుంది. ఈనాడి గుదస్థానంనుంచి కపాలం వరకు ఉంటుంది. సుషుమ్నా నాడికి కుడిదిక్కున పింగళనాడి ఉంటుంది. ఈ నాడి మూలాధారం నుంచి కపాలం వరకు వచ్చి తాకి అక్కడ అగ్నిమండలంలో వ్యాపించి అక్కడినుంచి కుడిముక్కుగుండా వెళుతుంది. సుషుమ్నానాడికి ఎడమ దిక్కున ఇడానాడి ఉంటుంది. ఈ నాడి మూలాధారంనుంచి బయలు

దేరి కపాలాన్ని తాకుతుంది. అక్కడ చంద్రమండలంలో వ్యాపిస్తుంది. అక్కడనుండి ఎడముక్కుద్వారా వెళుతుంది.

**యోగ మార్గం :-** సుషుమ్న నాడిని బ్రహ్మనాడి అనికూడా అంటారు. మూలాధారం నుంచి కపాలం వరకు పచ్చిపగడపు తీగెలా బంగారుతీగెలా కోటిసూర్యప్రకాశ భాసమానంగా వెలుగుతూంటుంది ఈనాడి.

**మూలవిద్య :-** సకలలోకాలకు ఆధారం త్రిమూర్తి స్వరూపం. సుషుమ్ననాడి సూర్యమండలందాకా వచ్చి, అక్కడ నిలిచి ఉంటుంది. ఇదే దశమరంధ్రం. దీనినే బ్రహ్మరంధ్రమంటారు. దీనిలో బ్రహ్మాండ మంతా వ్యాపించి ఉంటుంది. అని సకలవేదాలు ఉద్ఘోషిస్తున్నాయి.

**కుండలి :—** సూర్యుడు, చంద్రుడు, అగ్ని, పరమేశ్వరుడు, పంచభూతాలు, చతుర్దశ భువనాలు, కాశి మున్నగు పుణ్యక్షేత్రాలు, సప్తసముద్రాలు, గంగాది మహానదులు, సప్తద్వీపాలు, చతుర్వేదాలు, మీమాంసాదిశాస్త్రాలు, అరువదినాలుగు కళలు, పంచాశద్వర్ణాలు, షోడశ స్వరాలు, గాయత్రాది సప్తకోటి మంత్రాలు, అష్టాదశ పురాణాలు, సత్వరజస్తమోగుణాలు, మూలప్రకృతి, చతుర్వింశతితత్వాలు, దశప్రాణ వాయువులు, జీవుడు, సమస్తం సుషుమ్నానాడి చివర ఉంటాయి. ఇదే కుండలినీశక్తి. ఇది సర్వతో ముఖంగా ఉంటుంది.

**బ్రహ్మరంధ్ర స్థానం -** చంద్రుడు, గంగానది, ఇడా ఈ మూడు ఎడముక్కునుండి నడిచే ఊపిరిపేర్లు. సూర్యుడు, యమునా నది, పింగళ, ఈమూడు కుడిముక్కునుండి నడిచే ఊపిరిపేర్లు. అగ్ని, సరస్వతి, సుషుమ్న ఈమూడు బ్రహ్మనాడికి పేర్లు. ఈ మూడునాడులు నాసిక చివర ఉంటాయి. చెవుల ద్వారాలు రెండు నాసిక ద్వారాలు

రెండు నోటిద్వారం ఒకటి ఇవ్వన్నీ ఒకచోట కలుసుకొంటాయి. ఇక్కడే ఆజ్ఞాచక్రానికి పన్నెండంగుళాల దూరంలో ఉంటుంది. అందు చేత దీనిని ద్వాదశాంతం అంటారు. ఇక్కడఉండే ద్విదళ చక్రంలో హంసరూపమైన పరమాత్మ ఉంటాడు. కనుక దీనిని హంస స్థలమని వేదాలు చెప్పాయి. శిరస్సులో వేయిరేకుల కమలం ఉంటుంది. ఆ కమలంలో బ్రహ్మస్వరూప ముంటుంది.

**ముక్తిపొందే విధం :-** యోగసాధకులు పరబ్రహ్మను దర్శించే నిమిత్తం నాలుగు యుగాలు, నాలుగు యోగాలు, నాలుగు ముద్రలు, 1) షణ్ముఖి, 2) ధ్యాన 3) శాంభవి 4) రాధ అనేవాటిని 1) మంత్ర 2) లయ 3) హఠ 4) రాజయోగాలను ఏర్పరచారు.

**యోగసాధన :-** పై నాలుగు యోగాలను సాధించే పద్ధతిని బ్రహ్మంగారీ క్రిందివిధంగా చెప్పారు.

**మంత్ర యోగం :-** సాధకుడు శుభ్రమైన స్థలంలో పద్మాసనంవేసి కూర్చోవాలి. చూపులు రెండు నాసికపైన నిలపాలి. కళ్లు మూసుకొని ఇష్టదేవతాధ్యానం చేయాలి. గాయత్రీ మొదలైన మహామంత్రాలను జపించి బ్రహ్మార్పణం చేయాలి. ఇది మంత్ర యోగం. ఇదే ధ్యానముద్ర. మంత్రయోగి మిగతా యోగులకంటే అధముడు.

**లయ యోగం :-** దిగువ నాసికాగ్రాన్ని చూస్తూ పైదాన్ని సాధించాలి. పై నాసికాగ్రాన్ని చూస్తూ క్రిందిదాన్ని సాధించాలి. రెండు చూపుడువేళ్లతో రెండుచెవులను మూసివేస్తే అక్కడ మహాధ్వని వినపడుతుంది. ఆశబ్దం వినగా వినగా, చిరుగజ్జెల నాదం, పెద్దగజ్జెల

నాదం, ఘంటానాదం, శంఖనాదం, వీణానాదం, తాళనాదం, వేణు నాదం, మృదంగనాదం వినిపిస్తాయి. వీటిలో తొమ్మిది నాదాలను త్యజించి మేఘనాదాన్ని అభ్యసించి వింటే మనస్సు అక్కడ లీన మవుతుంది. ఈ నాదమే మోక్షానికి కారణం. ఇదే ప్రణవ నాదం. "అ"కార "ఉ"కార "మ"కారాలతో కూడి ప్రణవరూపమై అనాహత చక్రంలోపుట్టి అక్కడినుంచి ప్రజ్వలించి కపాలంలో మహాధ్వనిగా మ్రోగుతూ ఉంటుంది. ఇదే లయయోగం.

హఠయోగం :- ఎడమకాలి మెడిమలను రెండు పిరుదుల నడుమ ఉంచి కుడికాలి మెడిమ బొడ్డుదగ్గరఉంచి గడ్డాన్ని రొమ్ము మీద ఉంచి బొటనవేళ్లతో రెండుచెవులుమూసి గాలిని రేచక, పూరక, కుంభకాలతో సాధించాలి. మూల, బంధోధ్యాన, జాలాధ్రంబులు అనే మూడుగ్రంధులను బేధించి షట్కమలాలను శోధించాలి. గాలిని సుషుమ్నా నాడిద్వారా సహస్రారానికిచేర్చి అక్కడి జ్యోతిస్వరూపంలో జీవుణ్ణి కలపాలి. ఇదే హఠయోగం.

రాజయోగం :- ఇది సాంఖ్య, తారక, అమనస్క మనే మూడు భేదాలుగా ఉంది. ఆ మూడు బేధాలు వరుసగా ఈక్రింద వివరింపబడ్డాయి.

సాంఖ్య యోగం :- సంఖ్యయే సాంఖ్యం. అంటే లెక్క యని అర్థం. మానవ శరీరంలోని చతుర్వింశతి తత్వాలు ప్రకృతి అన బడతాయి. పంచవింశతి తత్వాలు కలవాడు జీవుడు. షడ్వింశతి తత్వాలు గలవాడు ఈశ్వరుడు. జీవేశ్వర సమ్మేళనమే సప్తవింశతి తత్వాలుగల పరబ్రహ్మ. ఆ పరబ్రహ్మమే నేనని అనుసంధానం చేయడమే సాంఖ్యయోగ మనబడుతుంది.

తారక యోగం :- సాధకుడు రెండుకన్నుల దృష్టిచేత వెలుపలి నాసికాగ్రంమీద కనుబొమల నడుమ ఉంచి క్రమంగా రోజూ చూస్తే చంద్రమండలం, ఇంద్రధనుస్సు, మాణిక్య దీపాలు, అగ్ని మిణుగురులు, ధూమకింజర్లు, ఇంకా విచిత్రాలు కనిపిస్తాయి. ఇవి అన్నీ ఆత్మ ప్రయత్నాలు. ఇవన్నీ మరుగైపోయి చూచేకొద్దీ వెన్నెల కనిపిస్తుంది. ఆవెన్నెల్లో చిన్మయరూపం కనిపిస్తుంది. అదే పరబ్రహ్మం అని సకల స్మృతి, పురాణాలు చెబుతున్నాయి. ఇదే తారకయోగం.

అమనస్క యోగం :- అమనస్కమంటే మనోలయం. అంటే మనస్సులేక పోవడం. అంటే ఎల్లవేళలందు మనస్సు పరబ్రహ్మలో ఐక్యం కావడం. అలా వృత్తిరహితంగా మనస్సును ఉంచడమే అమనస్కం. అలాకాక పశువుల్లా కందమూలాలు భక్షించినా సర్పాల్లా వాయుభక్షణ చేసినా గానుగెద్దుల్లా దేవాలయాలు ప్రదక్షిణ చేసినా తాబేలు అవయవాలు కుంచించినట్లు ఇంద్రియనిగ్రహం చేసినా గబ్బిలంలా తలక్రిందులుగా వేలాడినా, పందికొక్కుల్లా గుహల్లో తపస్సుచేసినా మర్రిఊడల్లా జడలు పెంచుకొన్నా ముక్తి లభించదు. హంసనాద బిందు కళలలో మనస్సు ప్రాణం లయమయ్యే అవస్థ తురీయమని ఉన్మణియని అమనస్కమని నిర్వికల్ప సమాధి అని అనబడుతుంది.

రేచక పూరకాత్మకమైన హంసమంత్రాన్ని రాత్రిం బవళ్లు ధ్యానిస్తే బుద్ధి కదలకుండా ఉంటుంది. ప్రణవ నాదాలు వినగా చివర ఘంటానాదం వినబడుతుంది. లక్ష్యంచేత స్వయంజ్యోతి కనబడుతుంది. రెండు ఝాములు నాద బిందుకళలను ధ్యానిస్తే తన్మయత్వం కలుగుతుంది. మనస్సును అందులో నిలపడమే అమనస్కయోగం. సాంఖ్య తారక యోగోపాసకులకు మనశ్శుద్ధి పరబ్రహ్మ స్వరూపనిర్ణయం

లభించినట్లుగా అమనస్కయోగులకు నిరతిశయ బ్రహ్మానందం కలుగుతుంది. కొట్టకనే మ్రోగే అనాహతంలో శబ్దం పుడుతుంది. ధ్వనిలో వెలుగు వెలుగులో మనస్సు ఉంటాయి. మనోలీనమైతే ముక్తి కలుగుతుంది. దీన్నే అమనస్కయోగ మంటారు. 1) చూచేవాడు 2) చూపు 3) చూడబడేది. ఈ మూడింటిని విశ్రాంతిపొందే స్థలం లోనే నిలపాలిగాని అభ్యాసకుల మాదిరిగా భ్రూమధ్యంలో నిలపకూడదు. నిలకడ చిక్కిన తరువాత పరబ్రహ్మలోనే నిలపాలి. ఇదే అమనస్క రాజయోగ లక్షణం. అచలమని, పరిపూర్ణమని, సచ్చిదానందమని, పరబ్రహ్మమని మాటలే వేరుగాని అర్థంఒక్కటే. దీన్నే నిర్గుణపరబ్రహ్మ సాక్షాత్కారమని చెప్పవచ్చు.

## శరీరంలో నుండి జీవుడు వెళ్లిపోయే విధం :-

అహింసారూపమైన బ్రహ్మయజ్ఞం మొదలు షట్కర్మలు చేసిన మహా పుణ్యపురుషులకు కుడిపక్కు పింగళానాడి మార్గంలో బ్రహ్మలోకం చేరి బ్రహ్మతోకూడి ముక్తి లభిస్తుంది. దీన్నే దేవమార్గమంటారు. ఇంకా క్రమముక్తిమార్గం, అర్చనాదిమార్గాలనికూడా ఉన్నాయి. ఈ మార్గంలో వెళ్లేదినాలు, ఉత్తరాయణం, శుక్లపక్షం, పగలు, పున్నమ మొదలైనవి. ఇది పునరావృత్తి మార్గం. మరొక్కటి ధూమమార్గం, పితుర్యానం. ఈమార్గాన వెళ్లేదినాలు దక్షిణాయనం, కృష్ణపక్షం, దశమి, అమావాస్య మొదలైనవి. దీన్ని సద్యోముక్తిమార్గ మంటారు.

## బ్రహ్మాండంలో పిండాండం :-

బ్రహ్మాండంలో ఎన్ని అంశాలున్నాయో పిండాండంలో కూడా అన్నిఅంశాలు ఉన్నాయి. నాసాగ్ర ప్రదేశానికి తూర్పుదిశగా ఇంద్ర

లోకముంటుంది. కళ్లలో తేజోలోక ముంటుంది. కుడిచెవి యమ నగరం. వీపు వరుణనగరం. కంఠంలో వాయునగరం. ఎడమచెవి వామభాగం కుబేర నగరం. ఎడమకన్ను శివలోకం. శిరస్సు బ్రహ్మలోకం. అడుగులు శేషులు. అరికాళ్లు అతలం. పిక్కలు రసా తలం. మోకాళ్లు మహాతలం. తొడలు తలాతలం. కటి పాతాళం. ఈ నడుముదగ్గరే ఆధారచక్ర ముంటుంది. ఆ చక్రంమీద ఆదిశేషుడు పడగనుఉంచి తోకను సహస్రారపర్యంతం ఉంచి బ్రహ్మరంధ్రంలో నిలిచి పాతాళాన్ని పరిపాలిస్తూ ఉంటాడు. అదే ఘోరమైన నరకం. ఆపడగ అథోకుండలి. అదే జీవుడనే పేరుతో పాతాళమంతా వ్యాపించి ఉంటుంది. సూర్యుడు మొదలు ధృవమండలంవరకు స్వర్లోకం. బొడ్డు దగ్గర భూలోకం. పొట్ట భువర్లోకం. హృదయం సువర్లోకం. కంఠం జనర్లోకం. కనుబొమలసందు తపోలోకం. శిరస్సు బ్రహ్మలోకం. ఇలా బ్రహ్మాండమంతా పిండాండంలో నిండివుంది.

**నాడుల స్థానాలు:—** నాడులలో ప్రధానమైన మూడిం టిని గురించి ఇంతకుముందే చెప్పడంజరిగింది. మిగతా నాడుల్లో అస్తి, జిహ్వికలు రెండుకళ్లల్లో ఉంటాయి. క్రుకుర, దేవదత్త, నాభీస్థానంలో ఉంటాయి. ఇడ, నాగ, మలమూత్రద్వారాల్లో ఉంటాయి.

**దశవిధ వాయువులు —** వాయువులు పది విధా లున్నాయి. అవి 1) ప్రాణ 2) అపాన 3) వ్యాన 4) ఉదాన 5) సమాన 6) నాగ 7) కూర్మ 8) క్రుకుర 9) దేవదత్త 10) ధనంజయ అనేవి. ఇవిగాక వజ్రుడు, ముఖ్యుడు, అంతర్యామి, ప్రాపంచికుడు అనేవి ఉన్నాయి.

**ప్రాణ వాయువు :-** ప్రాణవాయువు 72వేల నాడుల చుట్టుకొని మూలాధారంలో ఓం అని బయలుదేరి నాభీచక్రాన్ని "హం" అని తాకి, "సం" అని ఇడా పింగళ గుండా కపాలానికివెళ్లి అక్కడి నుంచి నాసికానికి 12 అంగుళాలు వెళ్లి 4అంగుళాల ప్రమాణం లయమై 8 అంగుళాల ప్రమాణం లోపలికి వెళ్లిపోతుంది. కనుబొమలమధ్య లయమవుతుంది. ఇలా 60 ఘడియలకు (ఘడియ=24 నిమిషాలు) 216000 శ్వాసలు నడుస్తాయి. వీటిలో 7200 శ్వాసలు లయమవుతాయి. 14400 శ్వాసలు నడుస్తాయి. ఇలా జీవులఆయుష్షు క్షీణిస్తుంది.

**అపాన వాయువు :-** గుదస్థానంలో ఉండి మలమూత్రాదులను విసర్జిస్తుంది.

**వ్యాన వాయువు :-** చర్మంలోఉండి స్పర్శను తెలుపుతూ కలలు పండిస్తుంది.

**ఉదాన వాయువు :-** ఉదరంలో అగ్ని రేపి కడుపులో చేరిన అన్నోదకాలను అరిగించి నాడుల కన్నింటికి పంచిపెట్టి పోషిస్తుంది.

**సమాన వాయువు :-** అన్నింటిని సమానంగా నడిపిస్తుంది.

**నాగ వాయువు :-** దుఃఖాన్ని, తుమ్మును, కళ్లుతెరవడాన్ని, ఎక్కిళ్లను, వాకరింతను కలిగిస్తుంది.

**కూర్మ వాయువు :-** ముఖ వికాసాన్ని, కళ్ల మూతలను, గగుర్పాటును, ఆవలింతలను కలిగిస్తుంది.

**దేవదత్త వాయువు :-** పరుగెత్తడం, తిరగడం, యుద్ధం చేయడాలను కలిగిస్తుంది.

**క్రుకుర వాయువు :-** హాస్యాన్ని కలిగిస్తుంది.

**ధనంజయ వాయువు :-** శరీరాన్ని విడిచి ప్రాణం పోయిన పిదప మూడురోజులుండి శరీరమంతటా వ్యాపించి దేహం చెడిన తరువాత తానుకూడా పోతుంది.

**వజ్రుడు :-** అనే వాయువు కాళ్ళ ఎముకలు రెండు కుదురు ఎముకలు రెండు ఉన్నచోట నిలిచి శరీరానికి వాతం, దగ్గు, చిక్కిపోవడం ఇంకా అనేకమైన వ్యాధులను కలిగిస్తుంది.

**ముఖ్యుడు :-** అనే వాయువు చేతులఎముకలు రెండు కూడిన చోట నిలిచి భుజంలోఉండి శరీరంలోఉండే తత్వాలన్నింటిని ఒకచోటికి తెస్తుంది.

**అంతర్యామి :-** అనేవాయువు పురుషునకు సోపేషణమై నిలిచి ప్రాణవాయువును ప్రేరేపిస్తుంది.

**ప్రాపంచికుడు :-** అనే వాయువు శరీరానికి అచ్చుచీలను బిగించినట్లుగా ఉంటుంది. శరీరం చెడితే ఈ వాయువు చెడుతుంది.

## సప్తధాతువులు :-

ఈ శరీరంలో 1) రసం 2) రుధిరం 3) మాంసం 4) మేధస్సు 5) అస్థి 6) మస్తిష్కం 7) శుక్లం అనే సప్తధాతువులు ఉన్నాయి.

## పంచకోశాలు:-

ఈశరీరంలో 1) అన్నమయ 2) ప్రాణమయ 3) మనోమయ 4) విజ్ఞానమయ 5) ఆనందమయ అనే కోశాలు ఉన్నాయి.

**అన్నమయ కోశం :-** అన్నమయం అంటే సప్తమయ ధాతువులతోకూడి స్థూలశరీరంలో ఉండే అన్నరసంతోకూడి జీవుడయింది. కాబట్టి అన్నమయ కోశమైంది.

**ప్రాణమయ కోశం :-** పంచప్రాణాలు కర్మేందిర్రియాలతో కలవడంవల్ల ఇది ఏర్పడుతుంది.

**మనోమయ కోశం :-** పంచప్రాణాలను కర్మేంద్రియాలను వేరుచేస్తే మనోమయకోశం ఏర్పడుతుంది.

**విజ్ఞానమయ కోశం :-** మనస్సు జ్ఞానేంద్రియాలతో కూడుకొని విజ్ఞానమయకోశం ఏర్పడుతుంది. జీవుడు సుషుమ్నలో అవిద్యతో లీనమవుతున్నాడు. కాబట్టి ఆ అవిద్యయే **ఆనందమయ కోశం.** ఈ పంచకోశాలు ఆత్మను తెలియకుండా పొదలా కప్పిఉంటాయి. ఇది కోశాల వివరం.

## దశావస్థలు :—

అవస్థలు పది. 1) జాగ్రత 2) స్వప్న 3) సుషుప్తి 4) తుర్య 5) తుర్యాతీత 6) జాగ్రతలో జాగ్రత 7) జాగ్రతలో స్వప్నం 8) జాగ్రతలో సుషుప్తి 9) జాగ్రతలో తుర్యం 10) జాగ్రతలో తుర్యాతీతం.

జాగ్రదవస్థ :- జీవుడు భ్రూమధ్యంలో నిలువబడి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులు ఐదు, వచన, దాన, గమన, విసర్జన ఆనంద అనేవి ఐదు, మనోబుద్ధి చిత్తాహంకారాలు నాలుగు ఈ పదునాలుగు విషయాలను సేవకులుగా చేసికొని పరమాత్ముని అనుగ్రహంతో జీవుడు సుఖదుఃఖాలనుచూస్తూ రాజుగా వ్యవహరించేది జాగ్రదావస్థ.

స్వప్న, సుషుప్తులు :- స్వప్నమంటే అంతఃకరణాలు నాలుగు తీసుకొని మిగతా పదింటిని మధ్యలోనిలిపి జీవుడు ఈ నాలుగింటితో

కంఠస్థానంలో ఉంచి, మనోబుద్ధులు రెండింటిని తీసుకొని వేరేస్థలానికి చేరి కార్యమవుతూండగా సుషుప్తి తప్పించుకొంటుంది.

తుర్యం :— ఆ రెండింటిలో మనస్సును అక్కడుంచి జీవుడు మరొక ప్రదేశానికి వెళ్లడమే తుర్యం. ఈ అవస్థలో శ్వాసలు త్వరగా వస్తాయి.

తుర్యాతీతం :— ఈ అవస్థలో పాము శరీరంమీద ప్రాకినా తెలియదు.

ఇవిగాక మధ్యావస్థలు ఉన్నాయి. వాటికి కూడా జాగ్రత్, స్వప్న, సుషుప్తావస్థలు ఉన్నాయి.

తుర్యావస్థ :— పూర్వం పరిచయమున్న ఒకవ్యక్తి కొన్ని రోజుల తరువాత వచ్చి నేను తెలుసా? అంటే తెలుసు అని చెప్పేది తుర్యావస్థ.

సుషుప్తి :— ఇతనెవరో అని చెప్పేది సుషుప్త్యవస్థ.

జాగ్రదవస్థ :— కొంతసేపటికి అతనిపేరు పూర్వ సంఘటనలు చెప్పేది జాగ్రదవస్థ.

జాగ్రతలో జాగ్రత :— అంతఃకరణాలు నాలుగు పంచేంద్రియాలు ఈ తొమ్మిదింటిని అనుభవిస్తూ జ్ఞానంతో ఉండేది జాగ్రతలో జాగ్రదావస్థ.

జాగ్రతలో స్వప్నం :— మునుపు ఒకరికి ఒకమాటచెప్పి అతను అడిగినప్పుడు మరచిపోయి, మళ్లీ అవుననేది జాగ్రతలో స్వప్నం.

జాగ్రతలో సుషుప్తి:— ఈ అవస్థ మరచిపోయి నాకు తెలియదు అని చెప్పేది జాగ్రతలో సుషుప్త్యవస్థ.

జాగ్రతలో తుర్యం :— సకల తలపులు అణగిపోయి బ్రహ్మ మయంగా ఉండేది జాగ్రతలో తుర్యావస్థ.

తుర్యాతీతం :— కళ్లు తేలవేసి తూగువచ్చేది తుర్యాతీతం.

**అవస్థల స్థలాలు** :— భ్రూ మధ్యంలో జాగ్రదవస్థ ఉంటుంది. దానికి రెండంగుళాలమీద తుర్యం ఉంటుంది. ఇవి గాక కేవలావస్థ, సకలావస్థ, సిద్ధావస్థ అని మూడువిధాల అవస్థలున్నాయి. వీటిలో కేవలావస్థ మూలాధారంలోపడి సర్వాంగాలు తెలియక అణవ మలమనేది కప్పుకొని ఉంటుంది. అంతఃకరణాలను ప్రాపుగా చూసేది సిద్ధావస్థ.1

**సిద్ధబోధం** :— కాలజ్ఞానంలో "సిద్ధ బోధము" అనే శీర్షికతో 55 పద్యాలున్నాయి. ఈ పద్యాలు "సిద్ధా!" అనే మకుటంతో రచించబడ్డాయి. ఇందులో కొన్ని కందపద్యాలూ, కొన్ని గీతాలూ ఉన్నాయి. అయితే బ్రహ్మంగారు రచించిన గీతపద్యాలు విలక్షణంగా ఉన్నాయి. బ్రహ్మంగారి రచనలలోని ఛందోవిశేషాలు అనే అధ్యాయంలో పై అంశం సోదాహరణంగా వివరింపబడింది.

**మకుటం** :— ఈ పద్యాల చివర కనిపిస్తున్న సంబుద్ధి బ్రహ్మంగారి శిష్యుడైన సిద్ధయ్య నుద్దేశించి చేసిందనే విషయం వాడుకలో ఉంది. కానీ సిద్ధయ్యకు చేసిన బోధగనుక "సిద్ధబోధము" అన్నారనడం సమంజసం కాదు. సిద్ధిఅన్నా సిద్ధముఅన్నా ఈడేరినది,

---

1. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానము, ప్రచు : కృష్ణమూర్తి, రంగయ్య. కందిమల్లాయపల్లె, 1974. పుట 151 నుండి 173.

ఎడతెగనిది, గ్రహయోగము అని అర్థాలున్నాయి. గ్రహయోగమంటే అపూర్వవస్తుప్రాప్తి అని నిఘంటువు చెబుతున్నది. బ్రహ్మజ్ఞానం కూడా అపూర్వవస్తువే. ఈ బ్రహ్మజ్ఞానాన్ని పొందడమే సిద్ధి. ఇటువంటి సిద్ధిని గురించిన బోధయే సిద్ధబోదం. సిద్ధిపొందిన ప్రతివాడు సిద్ధుడే. కనుక మకుటంలోని సంబుద్ధి సిద్ధులందరికీ వర్తిస్తుంది.

## కృత్యారంభం -

శ్రీకరముగ శివ కవులకు
ప్రాకటముగ భక్తులకును భావజ్ఞులకున్
లోకములోన వెల్గుని
రాకారమునకు శరణు జాయర సిద్ధా!

- కాల. పు. 175.

ఈ పద్యంతో సిద్ధబోధం ప్రారంభించబడింది. పూర్వకావ్యాల పద్ధతిలో శ్రీకారంతో పద్యాన్ని మొదలుబెట్టారు బ్రహ్మంగారు. దీన్లో శివకవులు, భక్తులు, భావజ్ఞులు లోకాలలో నిండి వెలుగుతున్న నిరాకార నిర్గుణ బ్రహ్మ, స్తుతించబడ్డారు. గ్రంథంలో ఇది యిష్టదేవతా స్తుతి.

**కవి స్తుతి :-** ప్రాచీన కావ్యాల మార్గంలో సిద్ధబోధంలో కవి స్తుతి చేయబడింది. "పండితకవులకు నెల్లను దండంబొనరింతు" (కాల. పు. 175) అని కవులను స్తుతించారు. బ్రహ్మంగారు ఈ ఘట్టంలో ఉన్న పద్యాలలో కవులు కవిత్వం అనే అంశంపై తమకుగల అభిప్రాయాలను వ్యక్తంచేశారు. దాదాపు 17 పద్యాల్లోఉన్న ఆయన భావాలిలా ఉన్నాయి.

కని విని కాననివారు కవులు కారు. కవి నేర్పులన్నీ కాళికే. కవికన్య మహామాయి. కవి ఎంత ఘనుడైనా మయబ్రహ్మకు

సాటిరాడు. పట్టులేని కవితను భజింపరాదు. పట్టిన దివ్యగురుని పదమే కవిత. నేర్పుకవులు నెరయోధుల మనుకొంటారు. జ్ఞానకవులను చూసి ఆగ్రహిస్తారు. ఈ ఇరువురు కవులను త్రాసులో పెట్టి తూస్తే జ్ఞానకవులే మోక్షంవైపు మొగ్గుతారు. దబ్బర కవులకు యమధర్మరాజు దెబ్బలు తప్పవు. గొప్పకవులే అజ్ఞానంలో పడిపోయారు. నేను కవులకెల్లా కవిని. అని చెబుతూ –

"కవులకు ఈవుల నిచ్చుట
నయమే ఈ సభలకెల్ల నన్నెన్న రహో
రస కవులకు రభస కవులకు
సరిగా యీవిచ్చి పంపు జాణర సిద్ధా!"

కాల. పు. 177,

అని అన్నాడు. శృంగారాన్ని ఆరాధించే నాటి రసికసభల్లో బ్రహ్మం గారికి స్థానం ఇవ్వలేదు కాబోలు. తాను మాత్రం రసకవులకూ రభస కవులకూ బహుమాన మిస్తానన్నాడు.

## పరమహంస కాళికాంబ పద్యరత్నాలు :–

కాలజ్ఞాన గ్రంథంలో 185వ పుట నుంచి 218వ పుట వరకు పరమహంస కాళికాంబ పద్యరత్నాలున్నాయి. "కాళీ" అనే సంబోధన గల కందపద్యాలూ "కాళికాంబ హంసకాళికాంబ" అనే మకుటం గల గీతపద్యాలూ ఉన్నాయి. ఈ పద్యాలసంఖ్య రెండువందలకు మించి ఉంది. వీటిలో భక్తి, జ్ఞాన, యోగాలను గురించి చెప్పబడింది.

అక్కడక్కడ సాంఘిక దురాచారాల ఖండన, మూఢభక్తిపై నిరసన మున్నగు విషయాలు ఉన్నాయి.

**మకుటం :-** "కాళికాంబ హంస కాళికాంబ" అనేది బ్రహ్మంగారి పద్యాల మకుటం. ఈ మకుటం మిక్కిలి అర్థంతో కూడి ఉంది. బ్రహ్మంగారి వేదాంతధోరణి ఇందులో గోచరిస్తున్నది. కాళికాంబ అంటే పార్వతీదేవి. కానీ ఈపద్యాల్లో సంబోధించబడింది ఆమె కాదు. హంస కాళికాంబ అంటే హంస అనే కాళికాంబ. హంస అంటే ఉచ్ఛ్వాస, నిశ్వాసలు. దీన్నే ప్రాణమనికూడా అంటారు. హకార బిందు సకారాలే హంస. "సో" అనేది పైకిపీల్చే శ్వాస. "హం" అనేది వదలిపెట్టే శ్వాస. హకారం శివబీజం సకారం శక్తిబీజం. శిరస్సులో బ్రహ్మరంధ్రంలో వేయిదళాల సహస్రారచక్రం ఉంటుంది. ఇదే శివశక్తులకు ఐక్యస్థానం. దీన్ని తెలిసికొని దృష్టి నిలిపేవారే పరమహంసలు. ఉచ్ఛ్వాస, నిశ్వాసలు శివశక్తులు గనుక శివశక్తుల ఐక్యస్వరూపమే కాళికాంబ గనుక హంసకాళికాంబ అన్నారు. ఈ కాళికాంబ స్వరూపం తెలుసుకో గలిగేవారు పరమహంసలు గనుక పరమహంస కాళికాంబ పద్యరత్నాలని బ్రహ్మంగారు చెప్పారు. ఇలా బ్రహ్మంగారి పద్యరత్నాల శీర్షిక భావగర్భితంగా ఉంది. ఈ పద్యాల్లోని ముఖ్యాంశాలిలా ఉన్నాయి.

**ఆత్మజ్యోతి :-** మానవుడు ఆత్మజ్యోతిని చూసి ఆరగించాలి. ప్రాణలింగాన్ని చూసి బ్రతకాలి. విజ్ఞానంతో ప్రకృతిని చూడాలి.

**ధ్యానం :-** నారాయణుని ధ్యానం చేయాలి. కానీ కొందరు తమనోటికీ నాలుకకూ మధ్య రోకలి అడ్డంగాఉన్నట్లు రామ అని పలుకలేరు.

దివ్యస్థలం :- ఒకపెదవి భూమి మరొక పెదవి ఆకాశం. పెదవులు రెండిటికి మధ్య పదునాలుగు భువనభాండాలు ఉన్నాయి. ఈలోకాలున్న ఈనోరే దివ్యస్థలం.

త్రిమూర్తులు :- వాక్కు బ్రహ్మదేవుడు. చూపు శివుడు. కోరిక విష్ణువు.

బ్రహ్మం :- బ్రహ్మం అంటే ఎక్కడో పరదేశంలో లేడు. బ్రహ్మమంటే విజ్ఞానం. ఈ బ్రహ్మం మానవదేహంలో శిరస్సులో సహస్రారచక్రంలో ఉన్నాడు. జ్ఞానదృష్టితో చూస్తే కనిపిస్తాడు.

ఈత సూత్రం :— బ్రహ్మాన్ని తెప్పగా చేసుకొని ప్రకృతిని ఈదాలి. అంటే విజ్ఞానంతో తరించాలని భావం.

మనస్సు :- మనస్సుకంటే వేరేమహిమ లేదు. మనస్సు శుద్ధిగాఉంటే నమస్కారంతో పనిలేదు. మనస్సులోనే మంచి చెడులు ఉన్నాయి. మనస్సే గొప్పది. సుఖదుఃఖాలు మనస్సులోనే ఉన్నాయి. ఈమర్మం తెలుసుకొంటే సుఖదుఃఖాలు లేవు.

ఇంకా ఈగ్రంథంలోని మిగతావిషయాలు బ్రహ్మంగారి సందేశ సారాంశం అనే శీర్షికలో ప్రత్యేకంగా వివరించబడ్డాయి.

## కాలజ్ఞాన గోవింద వాక్యాలు :-

బ్రహ్మంగారి కాలజ్ఞాన గ్రంథంలో 221వ పుటనుండి చివరి వరకూ ఉన్న గోవిందవాక్యాలు మొత్తం 325 ఉన్నాయి. ఈ గోవింద వాక్యాలు జనశ్రుతిలో గోవిందవచనాలు, గోవిందనామాలు, అని వ్యవహరింపబడుతున్నాయి.

శీర్షిక :- "వాక్యము" అంటే పద పదార్థాల పరస్పర సంబంధం చెడకుండా ఏకార్థత్వం కలిగి క్రియతోగానీ తదితరాలతో గానీ ముగిసే పదసముదాయమని నైఘంటికార్థం.

"వచనము" అంటే మాట, పదం, వృత్తాంతం, ప్రతిజ్ఞావచనం అని అర్థాలున్నాయి.

"పదము" అంటే గేయం, పద్యపాదం, పాదచిహ్నం, చిహ్నం శబ్దం, వాక్యం ప్రయత్నం అనే అర్థాలున్నాయి.

పై అర్థాల ననుసరించి చూస్తే గోవిందవాక్యాలన్నా గోవింద వచనాలన్నా గోవింద నామాలన్నా అన్నీ అర్థవంతమైన శీర్షికలే బ్రహ్మంగారి గోవిందవాక్యాలు పదాలయొక్క వాటి అర్థంయొక్క పరస్పర సంబంధం చెడిపోకుండా క్రియలతో ముగుస్తున్నాయి. కనుక వాక్యం అనే పదంయొక్క నైఘంటికార్థం గోవిందవాక్యాలపట్ల సార్థక మవుతున్నది.

వచనాలు అంటే మంచిమాటలనీ విశ్వశ్రేయమైన వృత్తాంతం గలవనీ కాలజ్ఞాన వచనాలు గనుక భవిష్యత్తులో ఇలా జరుగుతుందని చెప్పే ప్రతిజ్ఞావచనాలనీ చెప్పవచ్చు. పదము అంటే ఉన్నఅర్థాలను బట్టి గేయాలనీ హరిగోవింద శివగోవింద అనే చిహ్నాలు గలవనీ పాదచిహ్నము (ముద్ర) అనే అర్థాన్ననుసరించి "శివగోవింద" అనే ముద్రాంకితాలని చెప్పవచ్చు.

మకుటం - "కాలజ్ఞాన గోవింద వాక్యములు" అనబడే రచనను 325 పాదాలుగల ఒక గేయమాలికగా చెప్పవచ్చు. "శివ గోవింద గోవింద హరిగోవింద గోవింద" అనేది ప్రతిపాదం చివర పునరావృతమవుతుంది.

"శివాయ శివరూపాయ విష్ణవే"

— శ్రీసూక్తం

అనే అద్వైతభావాన్ని పై మకుటంలో స్థాపించారు.

కాలజ్ఞాన గోవిందవాక్యాల్లో బ్రహ్మంగారు భవిష్యత్‌ను చెప్పారు. ఈ భవిష్యత్ కథనాన్ని విని ఇదంతా బూటకమని కొందరు ఆధునికులంటారు. ఈ అంశాన్ని కూడా ప్రస్తావిస్తూ

"పొగరుబోతులంత భవిష్యమంతాయు
బూటకామని పల్కుచుండేరుమా
కాగల కార్యముల్ కనురెప్పపాటులో
జాగులేకను వేగ జరిగేనుమా"

కాల. పు. 222

అని చెప్పారు. కాలజ్ఞాన గోవిందవాక్యాల్లో బ్రహ్మంగారు కలియుగాంతం వరకు జరిగే భవిష్యత్తును వర్ణించారు. బ్రహ్మంగారు భవిష్యత్తుగా పలికిన కొన్ని ముఖ్యమైన వచనాలు ప్రత్యేక శీర్షికలో వివరించబడ్డాయి.

## కాలజ్ఞాన తత్త్వాలు:—

ఆంధ్రదేశంలో బ్రహ్మంగారు చెప్పిన కాలజ్ఞాన తత్త్వాలకు అంతులేని ఆదరణ ఉంది. వ్యావహారిక భాషలో రచించబడిన ఈ తత్త్వాలు దేశమంతటా మౌఖిక ప్రచారాన్ని పొందిఉన్నాయి. పందొమ్మిదవ శతాబ్ది చరమభాగంలో పరిమి వీరాచార్యులు బ్రహ్మం గారి తత్త్వాలను సేకరించాడు. ఇవి బ్రహ్మంగారి తత్త్వాలనిచెప్పి

లిఖితపూర్వకంగా భద్రపరచాడు. ఇవి "పోతులూరి వీరబ్రహ్మముగారి తత్వములు" అనే శీర్షికతో ముద్రించబడ్డాయి. పేరుకు బ్రహ్మంగారి తత్త్వాలని ఉన్నా ఈ గ్రంథంలో ఇంకా సిద్ధయ్య, ఆగంటి లక్ష్మప్ప, నాసరయ్య, చలమయ్య, నరసింహదాసు మున్నగువారి తత్త్వాలు కూడా ఉన్నాయి. ఈ సంకలన గ్రంథంలో పరిమి వీరాచార్యులు ఈ క్రిందివిధంగా గద్యను రచించారు.

''పరిమి వీరాచార్యులయ్యగారు నిత్యసేవానిరతులు. ఆడి తప్పనివారు, పలికి బొంకనివారు, శివపూజా దురంధరులు, సత్యవ్రతులని పెద్దలు నిశ్చయించిరి.1"

పై గద్యలో చెప్పిన లక్షణాలు కలవాడు కనుకనే పరిమి వీరాచార్యులు తాను సేకరించిన తత్త్వాలన్నీ బ్రహ్మంగారివేనని రాయకుండా ఆయా తత్త్వాల రచయిత లెవరో చెప్పాడు. కనుక ఇప్పటికి ఈ గ్రంథంలో దొరికిన తత్త్వాలు ప్రామాణికాలని నిర్ణయించవచ్చు.

"తత్వం" అంటే పరమాత్మ అనీ స్వభావమనీ అర్థాలున్నాయి. బ్రహ్మంగారి గేయాల్లో పరమాత్మను గురించిన బోధయే ఎక్కువగా కనిపిస్తుంది. కనుక బ్రహ్మంగారి గేయాలను తత్త్వాలు అనడం సముచితమే. "పోతులూరి వీరబ్రహ్మముగారి కాలజ్ఞాన తత్వములు" అనే ఈ సంకలన గ్రంథంలో బ్రహ్మంగారి తత్త్వాలు ఒకచోట ఒక క్రమంలో లేవు. ఇతర రచయితల తత్త్వాలతోపాటు మధ్యమధ్యలో ఉన్నాయి. ఈ తత్త్వాలకు సంఖ్యలేదు. ఈగ్రంథంలో బ్రహ్మంగారి

---

1. వీరాచార్యులు, పరిమి — పోతులూరి వీరబ్రహ్మముగారి కాలజ్ఞానతత్వములు, ప్రచు : ఎం. వి. గోపాల్ & కో, మద్రాసు, 1976, పు. 1,

పేరుతో ఉన్న తత్త్వాలు ఆయా పుటల వరుస ననుసరించి వరుసగా ఈక్రింద సమీక్షించబడుతున్నాయి.

**ఒకటవ తత్త్వం :—** (పు. 3)

పూజకు నేనోస్తి బ్రహ్మపూజకు నేనోస్తి
పూజకు నేనోస్తి పున్నమవెన్నెల కాయము
సిద్ధిని కలిపేటి వస్తువ ॥పూజకు॥
మనసునకు ఒకము మాయరూపము
అగ్నిక్రోధము బుద్ధిగంధము చిత్తము
శిలాక్షతలు తీసుకురమ్మని ఘనుడు
వీరబ్రహ్మమునకు ॥పూజకు॥
ఏడు బుర్రనిచ్చెన వెనుక వెలుగుదాటి
పువ్వులు కోసుక అఖండతేజము వెలిగే
గురునికి ఆత్మపూజలు చేసేటందుకు ॥పూజకు॥
మొదలును కాళ్లు కొమ్మలు చేసేటందుకు
చెవులు ముక్కులు మొగ్గకన్నులు నాగమల్లె
పువ్వులు తీసుక ॥పూజకు॥
నమ్మక నాగాభరణము తీసుక
నాలుక నాగాపాశము చేసుక
వేడుక మంగళహారతి తీసుక
చూపు రూపు నైవేద్యము తీసుక ॥పూజకు॥
పలుకు గంట ప్రాణముల జంట
ప్రపంచమంత అఖండ పోతులూరు వీరబ్రహ్మము

ఈ తత్త్వంలో ఆత్మపూజా విధానం చెప్పబడింది. పున్నమి దృష్టి ఈ శరీరానికి సిద్ధికలిగించే వస్తువు. ఈ పూజకు కావలసిన పూజా

ద్రవ్యాలన్నీ శరీరంలోనే ఉన్నాయి. పూజలుపొందే గురువు ఏడ మెట్ల నిచ్చెనపై (అంటే సహస్రారంలో) వెలిగే పరంజ్యోతి. ఈ పూజకు నమ్మకమనేది నాగాభరణం. నాలుక నాగాపాశం. వేడుకయే మంగళ హారతి. చెవులు, ముక్కులు, మొగ్గకళ్లు (అంటే అర్ధనిమీలిత నేత్రాలు) పూజాద్రవ్యాలు, చూపు రూపులే నైవేద్యాలు. ఈ పూజ చేసేటప్పుడు మ్రోగే గంటే ప్రాణముల జంట (అంటే ఉచ్ఛ్వాస నిశ్వాసలు) ఈగేయంలో రాజయోగం చెప్పబడింది. కుండలిని లేపి సహస్రారానికి చేర్చడమే ఈ ఆత్మపూజకు ఫలితం. తత్వం చివరఉన్న "ప్రపంచ మంత అఖండ పోతులూరి వీరబ్రహ్మము" అనేది రచయిత అంకితముద్ర.

*రెండవ తత్వం :—* (పు. 4.)

నే జూచినానె బ్రహ్మము నాలో
నే జూచినానే సద్గురు నాలో
నే జూచినానే ॥నే॥

నే జూచినానమ్మ నెలతరో
తారక రాజయోగము నందు
రంజిల్లు నా గురుని ॥నే॥
కన్నుల నడుమాను సన్నపు దిడ్డినా
తిన్నగా వెలిగేటి
పున్నమ చంద్రుని ॥నే॥
ఫాల భాగమునందు
నీల జ్యోతుల నడుమను
ఓలలాడుచు నున్న
వర లింగమూర్తిని ॥నే॥

చూపుల లోపల
పాపల నడుమను
వ్యాపించి వెలిగేటి
ఆ పరంజ్యోతిని ॥నే॥

చక్షురాగ్రము నందు
పశ్చిమ వీధిని
నిక్షేపమై వెలుగు
సాక్షిభూతుని నాలో ॥నే॥

చందమామకు నడుమను
కుండలాకృతి యని
ఆనందముగ నేడు
హరి పోతులూరయ్య ॥నే॥

బ్రహ్మంగారి తత్వంలో తాను తనలో దర్శించిన బ్రహ్మం అనే సద్గురువును గురించి చెప్పారు. ఉపనిషత్తులో "ప్రజ్ఞానం బ్రహ్మ1" అని చెప్పబడింది. ప్రజ్ఞాన స్వరూపమే బ్రహ్మయని పై వాక్యానికి అర్థం. తారక రాజయోగంలో రంజిల్లేవాడే తన గురువని బ్రహ్మం గారు చెప్పారు. "సాంఖ్య, తారక, అమనస్క యోగములను రాజ యోగముగా శాస్త్రము పేర్కొనుచున్నది2". అని పండితులు

---

1. ఐతరేయోపనిషత్, తృతీయాధ్యాయం, పు, 48,
అను: పండిత గోపదేవ్, ఆంబాదర్శన గ్రంథమాల, కూచిపూడి 1982.
2. వీరరాఘవాచార్యులు, కొండూరి - యోగదర్శనం,
ప్రచు: వీరరాఘవ గ్రంధావళి తెనాలి, పు. 28.

పేర్కొన్నారు. ఈ యోగం భగవద్గీత ఆరవ అధ్యాయంలో ఆత్మ సంయమయోగంగా చెప్పబడింది. రెండు కనుబొమల మధ్య చూపును నిలిపితే కనిపించే వెలుగులో ఉన్నవాడే తన గురువనీ ఆ గురువును తాను చూశాననీ బ్రహ్మంగారు చెప్పారు. తత్వం చివరిలో "ఆనంద ముగ నేడు హరి పోతులూరయ్యా" అనేది అంకిత ముద్ర.

*మూడవ తత్వం :—* (పు. 4)

పాలోయమ్మ పాలు నా దేహమెరుగని పాలు
పాలు పాలు యని ప్రణవం పట్టుక
ధారణచేసే ధీరులకెల్లను ॥పా॥
పెరుగోయమ్మ పెరుగు సద్గురునికృపచే గల్గు
పెరుగు ఆయిదింటను తరచిన ముక్తికాంత
ముదమున జిలికిన ॥పా॥
చల్లోయమ్మ చల్ల సద్గురువాక్యంబు నెగజల్ల
చల్ల చిలికి ఖేచరి ముద్రయు సత్కళవీథిని
సమరసమైన ॥పా॥
వెన్నోయమ్మ వెన్న సద్గురువాక్యములే విన్న
వెన్న శశికన్న శిఖామణియున్న శివపరులైన
వారికి ॥పా॥
నెయ్యోయమ్మ నెయ్యి మన వీరబ్రహ్మముపై నెయ్యి
నెయ్యి నెయ్యి ఆరింట మూడింటను ఆపోజ్యోతి
అనుభవ పరులకు ॥పా॥

"పాలోయమ్మ పాలు" అని చెప్పిన ఈతత్వంలో బ్రహ్మంగారు భగవంతుని స్వరూపాన్ని తరచి చూపించారు. పాలు తోడువేస్తే పెరుగై, పెరుగు చిలికితే చల్లై, చల్లనుంచి వెన్నవచ్చి, వెన్నను కానితే నెయ్యి

వస్తుంది. ఇదేవిధంగా తరచిచూస్తే దేవుడు కనిపిస్తాడు. అనే భావాన్ని చెప్పారు బ్రహ్మంగారు

ఈ తత్వంలో "ఖేచరి" "సత్కళ" "ఆపోజ్యోతి" అనే వేదాంత సంబంధమైన పదాలు ఉపయోగించబడ్డాయి. ఖేచరి అంటే రాజ యోగులుపట్టే అయిదుముద్రలలో ఒకటి. దీన్నిగురించి సీతారామాంజ నేయ సంవాదంలో ఇలా ఉంది.

"కనులు మూసియైన కడు విచ్చియైన
భ్రూమధ్యమున చూపు మలచి నిలిపి
ఊర్ధ్వముఖముగాగ నొనర జూచినది
ఖేచరి యను ముద్ర కీశవర్య"

ఆశ్వాసం, 1. పు. 104

సత్కళ అంటే శాశ్వతమైనకళ యని అర్థం. అదే పరమాత్మ, అదే పరంజ్యోతి. అంటే దేవుడని భావం. ఈపదాన్ని ఇదేఅర్థంలో పోతన ఇలా ప్రయోగించాడు.

"పరంజ్యోతికి సర్వజ్ఞునకు కృపాశాంత మతికి
గడగియు బ్రకృతి పురుషుల కంటె
బరముడైన వానికి మ్రొక్కెద"

భాగవతం - తృతీయ స్కంధం
ప. 986, పు. 291.

పోతన ఈ పద్యంలో విష్ణువును పరంజ్యోతిగా వర్ణించి ఆయనకు నమస్కరించాడు.

నాలుగవ తత్వం :- (పు. 5)

పనికి మాలిన బ్రహ్మజ్ఞానము
పలికితె బ్రహ్మం బయ్యేనా
బూది పూయగా పూర్వకాలంబున
బూడిదయై పుట్టేనా ॥పని॥

తత్తరపడి యా చదువుల్చదివితె
తత్వవిచారం బయ్యేనా
ఉత్తమమైన నూరేండ్లు దాటిన
ఉత్తమ పురుషుం డయ్యేనా ॥పని॥

జాడెరుగకను జడలను దాల్చితె
జన్మరహితం బయ్యేనా
నాడు నేడు నొక నాణ్యము లోపల
మేడల కాంతియు చేరవలెన్ ॥పని॥

రంగుగ గడ్డము పెంచుకయుంటే
రాజయోగి కాబోయెనా
శృంగారమని పోతులూరి
సుబ్రహ్మణ్యమును చేరవలెన్ ॥పని॥

బ్రహ్మజ్ఞానాన్ని గురించి బోధించినంత మాత్రాన ప్రయోజనం లేదు. బూడిద శరీరానికి పూసుకొన్నంత మాత్రాన లాభంలేదు. చదువులు చదివినంతమాత్రాన మంచిస్వభావం కలుగదు. వంద సంవత్సరాలు బ్రతికినా ఉత్తమపురుషుడు కాజాలడు. బ్రహ్మజ్ఞానం పొందే మార్గం తెలిసికోకుండా జడలు పెంచుకొంటే మోక్షం లభించదు. గడ్డం పెంచుకొన్న వాళ్లంతా రాజయోగులు కాజాలరు. అని ఈ తత్వంలో బ్రహ్మంగారు చెప్పారు.

ఈ తత్వంలో బ్రహ్మజ్ఞానము అనే వేదాంత సంబంధమైన పారిభాషికపదం వాడబడింది. బ్రహ్మజ్ఞానాన్ని గురించి తైత్తిరీయోపనిషత్తు ఇలా చెప్పింది.

"సత్యం జ్ఞానమనంతం బ్రహ్మయో వేద
నిహితం గుహాయాం పరమే వ్యోమన్"

ప్రథమోనువాకః వాక్యం 1. పు. 35.

సత్యస్వరూపం గలది, జ్ఞానస్వరూపం గలది, అంతం లేనిది, ఉత్కృష్టమైన హృదయాకాశంలో దాగిఉన్నదానిని అయిన బ్రహ్మను ఎవరు తెలుసుకొంటారో వారు బ్రహ్మజ్ఞానం గలవారని పైవాక్యంలో చెప్పబడింది. "పోతులూరి సుబ్రహ్మణ్యమును చేరవలెన్" అనేది అంకితముద్ర.

*ఐదవ తత్వం :-*

ఇదిగో కాలంబు వచ్చెనూ హెచ్చరిక హెచ్చరిక
మున్నదిగో ప్రభువు మెచ్చునూ ॥ఇ॥
ఇదిగో కాలంబువచ్చె అదియేమో యని మీరు
మదిలోనె అనుమాన మేలనయ్యా ॥ఇ॥
పదిలాము భేతాళ పంపు బాధలను
చెదరాక మీరు గురుధ్యానంబు చేసికోరయ్యా ॥ఇ॥
ఇన మండలంబులనుండి ఇనబేజులిద్దరు
ఇనపరూప అస్త్రాద్రి కేగినారయ్యా ॥ఇ॥
మననేల భూభారమణచిన సిద్ధాము
ఘనులచే పట్టితే కడతేరరయ్యా ॥ఇ॥
బంగారము రెక్కల పక్షులైతే రెండు
భావంబులో దృష్టమాయెనయ్యా ॥ఇ॥

సంగతి దప్పిన నరులను బట్టియు
నెల్లభంగుల చేరి వుండరోరయ్యా ॥ఇ॥
తండ్రికొడుకులున్న తావునకు బోయి
దండము తీసుక తిరిగిరారయ్యా ॥ఇ॥
కండగల వారికి కండాలు తిరిగెను
కారణ పురుషుల కని తిరిగిరయ్యా ॥ఇ॥
పదియేడింటీవార్ని పట్టుకొనిపోయి
భాషింప బ్రాహ్మణుల జంపితిరయ్యా ॥ఇ॥
వేడుకతో శివపోతులూరి
పట్టాభిషేకము సత్యమేనయ్యా ॥ఇ॥

ప్రభువు మెచ్చేకాలం వచ్చింది. అది ఏమోలే అని అనుమానపడవద్దు. పిశాచుల ఆజ్ఞచేత చెదరిపోక ధ్యానం చేసుకోండి. అని బ్రహ్మంగారు ప్రభువు వచ్చేకాలం వచ్చిందని ప్రజలను హెచ్చరించారు. ఈ తత్వం చెప్పిన పద్ధతి మిక్కిలి మర్మంగా ఉంది. ఈతత్వంలో బ్రహ్మంగారు

"బంగారము రెక్కల పక్షులైతే రెండు
భావంబులో దృష్టమాయెనయ్యా"

అని అన్నారు. ఈ రెండుపక్షులు జీవుడికీ ఈశ్వరుడికీ సంకేతాలని వేదాంతులు చెబుతారు. ఇటువంటి సంకేతాలు ఉపనిషత్తులలో ఉపయోగించబడ్డాయి. ఈక్రింది శ్లోకంలోని సంకేతాలను పరిశీలించండి.

"ద్వాసుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిష స్వజాతే
తయోరన్యః పిప్పలం స్వాద్వ
త్త్యనశ్నన్నన్యోऽభి చాకశీతి"

— శ్వేతాశ్వతరోపనిషత్తు
అధ్యాయము 4.
శ్లో - 6, పు. 63, 64.

రెండుపక్షులు జంటతై ఒకచెట్టు నాశ్రయించి ఉన్నవి. అందులో ఒకటి ఆవృక్ష ఫలాలను తింటున్నది. రెండవది పండ్లజోలికి పోక పండ్లను తినే పక్షిని చూస్తున్నది అని పై శ్లోకానికి అర్థం. ఈ రెండు పక్షులు జీవేశ్వరులకు సంకేతాలు. వృక్షం సంసారానికి సంకేతం. ఇటువంటి భావమే బ్రహ్మంగారి తత్వంలో చెప్పారు.

ఆరవ తత్వం :- (పు. 6)

మద కావరములారా గురుని మరచియున్నారె
తల్లి మరవక ఈశ్వరమ్మను మతిలో నుంచండి ॥తల్లి॥
మాటి నాటికి హరుని నామము
మాట మీరిన సాటుకున్న
నిశాటుల గోటమీటి త్రోయు గురుడు ॥తల్లి॥
చేరుకొంటె మనమున నాగురు
బాగా నున్నవారిని పట్టి
చెట్ల కేలదీతురట్టి జీవులాను మీరు ॥తల్లి॥
మిక్కిలిగా చక్కగా తూర్పున నొక్కటి
చుక్కబుట్టి రక్కసి భూతములెల్ల
గ్రక్కున కూల లయము చేయుదురు ॥తల్లి॥
నందికొండ లోపలను నాదమైన కత్తిపట్టి
దండి భూతములాడుచున్న
నిండు వేడుకల గాను తల్లీ ॥తల్లి॥
ఒప్పుగా శివపోతులూరప్పాను
మదినుంచితేను నొప్పుగా స్థిరసంపదాలు
ఎప్పటికిని నిచ్చు గురుడు ॥తల్లి॥

ఈ తత్వంలో బ్రహ్మంగారు గురువును మరువవద్దనీ తల్లియైన పార్వతిని మదిలో ధ్యానించండనీ బోధించారు. శివుని నామాన్ని జపిస్తే నిశాటు లను త్రోసివేస్తాడు. అని చెప్పారు. "ఒప్పుగా శివపోతులూరప్పాను మదినుంచితేను ఒప్పుగా స్థిరసంపదాలు ఎప్పటికిని ఇచ్చుగురుడు" అనే చరణంలో అంకితముద్ర ఉంది.

## *ఏడవ తత్వం :-* (పు. 7)

రాక్షసుల కులములను నీరు చేయ
శ్రీరాములు జనసం బైనాడు
అక్షయముగ నా దివ్య వత్సరంబందు
ప్రకాశంబైనాడు ॥రాక్ష॥

శిక్షసేయు దుర్మార్గుల మీద
శక్తులు పంపిస్తున్నాడు
ఈక్షితి లోపల మానవ కోటికి
వింతలు వివరిస్తున్నాడు ॥రాక్ష॥

రక్షించెదనని కొందరి తోడను
రహస్యము లాడుచున్నాడు
అన్నాతికి తానిచ్చిన మాటకు
ఆలోచించుచున్నాడు ॥రాక్ష॥

పన్నగేంద్ర భృగు పాశాంకుశధరు
లన్నిట నిలిచేనన్నాడు
ఆకాశంబున ధర్మదేవత
ఆర్భాటించు నిజమన్నాడు ॥రాక్ష॥

జోకతొ ఆధ్వని లోకములో విని
చీకాకౌతుందన్నాడు
ముందు మార్గశిరాష్టమిలో
యుగసంధి బుట్టు నిజమన్నాడు ॥రాక్ష॥

ఇందుకు మర్మము మానవ లోకము
నందున లేదన్నాడు
అందుకు దప్పితె హీనజాతి వా
రింటను బుట్టేనన్నాడు ॥రాక్ష॥

తుచ్ఛ కులము ముసల్మానిం
ముచ్చటులడుగు మన్నాడు
తప్పుగాదిది విశ్వకర్మలకె
ధారబోస్తి నిజమన్నాడు ॥రాక్ష॥

నూట యెనిమిది కోట్లు కృతయుగ
ధర్మము నడిచే నన్నాడు
వేడుకతో శివ పోతులూరిలో
వెలుగుచునుండే నన్నాడు ॥రాక్ష॥

రాక్షస కులాన్ని బూడిద చేయడానికి శ్రీరాముడు జననమయ్యాడని ఈ తత్వంలో బ్రహ్మంగారన్నారు. శ్రీరాముడు అంటే బ్రహ్మంగారే. ఆయన దుష్టులను శిక్షించడానికి శిష్టులను రక్షించడానికి రాబోయే వింతలను వివరించడానికి అంటే కాలజ్ఞానం చెప్పడానికీ తానవతరించా నని చెప్పారు. "వేడుకతో శివపోతులూరిలో వెలుగుచునుండే నన్నాడు" అనేది అంకితముద్ర.

ఎనిమిదవ తత్వం :—

దండి వాడవురా పోతులూరయ్యా
దండి వాడవురా
దండి వాడవు వీరప్రచండుడ
నిండులోకమున నిలిచి వెలుగుదువుర ॥దం॥

దండకారణ్య బ్రహ్మాండమైన
అడవి దండి పాములగన్న
గుండమురా నీవు ॥దం॥

గుండాము గడిచి లో
కుండలిపై లేపి
గుంటమీాదికి లేచి
యుండే ఘనుడవు నీవు ॥దం॥

ఎంతవాడవు నీవు
అంతరంగుండావు
ఇంత నిర్మల దేహము
వీరబ్రహ్మమురా ॥దం॥

ఈ తత్వంలో బ్రహ్మంగారు కుండలినీశక్తిని సహస్రారానికి చేర్చే అంశాన్ని మర్మపద్ధతిలో చెప్పారు. ఈ కుండలినీశక్తి సహస్రారానికి చేర్చే పద్ధతిని "యోగదర్శనం" అనే గ్రంథం ఇలా వివరించింది. "వెన్నెముకకు మూలమునకు కొంచెముపైన కుండలినీశక్తి నిద్రించుచుండును. అది యోగులకు మోక్షహేతువును, మూఢులకు బంధకారణమును అగుచున్నది. ఈ కుండలిని వంకరలు తిరిగి ఉండు సర్పమువంటిదని చెప్పబడినది. ఎవ్వడు ఈ కుండలినీశక్తిని యోగాది సాధనములచే కదిలించి ఊర్ధ్వశీర్షము నొనరింపజాలునో అట్టివాడు

ప్రకృతి బంధములనుండి విముక్తుడగును.1" ఈ కుండలినీ శక్తినే "పాము" అని కూడా వేదాంతులంటారు. ఈతత్వంలో బ్రహ్మంగారు "పాము" అనే పదాన్ని కుండలినికి మారుగా ప్రయోగించారు. "ఇంత నిర్మలదేహము వీరబ్రహ్మమురా" అనేది అంకితముద్రం.

## తొమ్మిదవ తత్వం :— (పు. 8.)

అగ్గ్రాజు నెదుట వీరబ్రహ్మ ఆగ్రహుడై పలికె
అగ్గ్రాజు నెదుట వీరాగ్రహుడై పలుక
అపవర్గ సధాముడే మానుమన్నాడు ॥అగ్ర॥
నిగ్రహానుగ్రహశక్తి జాగారిగల
సింహవ్యాఘ్రముడై అపుడు పరాక్రముడనెడి ॥అగ్ర॥
కదలనిచ్చి లోన పవన వీధిని
ఆధార చక్ర పుర ధారూడనని ॥అగ్ర॥
శీఘ్రము గురుని ననుగ్రహము వచ్చి
నీలాంగుదు అపుడు పరాక్రముడనె ॥అగ్ర॥

ఈ తత్వంలో బ్రహ్మంగారు తాను ఆధారచక్ర పురధారుణ్ణి అని చెప్పాడు. అంటే ఆధారచక్రము అనే పురాన్ని ధరించినవాణ్ణి అని అర్థం. ఈ ఆధారచక్రాన్ని యోగదర్శనం ఇలా వర్ణించింది. "ఇది మూడుకోణములు గలిగి గుదస్థానమునకును, నడుమ అధఃకోణము కలదై యుండును. తక్కిన రెండుకోణములును ఊర్ధ్వాభిముఖములై యుండును. ............ పంచభూతములలో పృధివీభూతమునకు ఇది

---

1. వీరరాఘవాచార్యులు, కొండూరి - యోగదర్శనం, ప్రచు: వీరరాఘవ గ్రంధావళి తెనాలి, పు. 285.

నివాసము" దీని ననుసరించి ఆధారచక్రపురం భూమిఅని ఆ భూమిని ధరించినవాడను తాననీ బ్రహ్మంగారి అభిప్రాయం. అంటే భూమిని రక్షించడానికి వచ్చిన విష్ణువును తానేననే అభిప్రాయాన్ని ఈతత్వంలో బ్రహ్మంగారు ప్రకటించారు.

## పదవ తత్వం :- (పు. 9)

వినుడి బ్రహ్మముమాయ వినుడి వినుడీ జనులారా
దుడుకూలు విడువండి తడవులేదు.
వీరగురుడు పలికిన వాక్యం ॥వినుడి॥

శంకాలు జేసేటి కుంకాల నందరిని
లంకిణీపల్లెకు చాటించ జూచుచు ॥విను॥

రండి రాజ్యమునుంచి దండమారివచ్చి
చెండి వేసేటివేళ అండాయె మీకు ॥విను॥

ఆకాశ వీధిలో రాకాసి గుంపులు
కేకలు బెట్టుచూ వచ్చు కాలమాయె ॥విను॥

పోతూలవలె వారు హేతువు దెలియక
పోతులూరి గురుడు హేతువు దెలిపెను ॥విను॥

ఒప్పుగాను శివ పోతులూరి గురుడు
ఎప్పుడో ఏవేళ వచ్చియున్నాడని ॥విను॥

ఈ తత్వంలో బ్రహ్మంగారు ఆకాశవీధిలో రాక్షసులు వచ్చే కాలం వచ్చిందనీ దుడుకు పనులు విడువండనీ హెచ్చరించారు. "ఒప్పుగా శివపోతులూరి గురుడు ఎప్పుడో ఏవేళ వచ్చియున్నాడు" అనే చివరి చరణంలో అంకితముద్ర వేశారు.

పదకొండవ తత్వం:— (పు. 9)

చెప్ప లేదంటనగ బోయేరు నరులార గురుని
చేరి మ్రొక్కితె బ్రతుకనేర్చేరు
చెప్ప లేదంటనగ బోయెరు
తప్పదిదిగో గురుని వాక్యము
తప్పదోవన బోవువారల
చప్పరించి మ్రింగు శక్తులు ॥చెప్ప॥
మొప్పె తనమున మోసపోయేరు అదిగాక కొందరు
గొప్ప తనమున గోసుమీరేరు
ఇప్పుడప్పుడనగ రాదు
ఎప్పుడో ఏవేళనో మరి
గుప్పుగుప్పున దాటిపోయెడు
గుర్రపడుగులు ఏరుపడును ॥చెప్ప॥
తమ తప్పులు తలచకున్నారు తార్కాణమైతే
ఎక్కువతో తెలియనేర్తురు
జోక తోడుత తల్లిపిల్లలు
జోడు బాసి అడవులందు
కాకిశోకము జేసి ప్రజలు
కాయ కసరుల నమలి చత్తురు ॥చెప్ప॥
కేక వేసియు ప్రాణమిడిచేరు రాకాసి మూకలు
కాక బుట్టి కలువరించేరు
ఆకాశము ఎర్రనౌను
ఆరుమతము లొక్కటౌను
లోకమందు జనులు అందరు
నీరు నిప్పున మునిగిపోదురు ॥చెప్ప॥

అగలు విడిచి పొగలుదాటేరు అదిగాక పట్టి
పగలు చుక్కలుచూసి భ్రమసేరు
భుగులు భుగులు ధ్వనులు మింటను
పుట్టి యేగిన పిమ్మటాను
రామ రామ అననివారలు
రాలిపోదురు తెలిసికోండి ॥చెప్ప॥
ఏమొ ఏమో ఎరుగకున్నారు ఎందెందు జూచిన
యముని పురికే నడువమందూరు
భూతలంబున ఇట్టి వింతలు
పుట్టి పెరిగిన పిమ్మటాను
నీతి కృతయుగ ధర్మమప్పుడు
నిజము నిలకడమీ తెలియును ॥చెప్ప॥
ముందువెనుకలు గానకున్నారు మూర్ఖులై భువిలో
ముందు గతియు నెరుగకున్నారు
కండకోవతొ పిన్న పెద్దని
కన్ను గానక గర్వములచే
మందెమేళము లాడువారిని
బందు బందుగ కోతురక్కడ ॥చెప్ప॥
కీడుతైనను కూడవందూరు ఒనగూడినప్పుడు
ఏడజూచిన వాడు కొందూరు
వేడుకాతో పోతులూరి
వీరభోగ వసంతరాయలు
ఏడు దీవుల ఏక చక్రము
ఏలునూ బ్రహ్మాండమంతా ॥చెప్ప॥

ఈ తత్వం బ్రహ్మంగారు చెప్పినపాటిలో విశేషమైన

ప్రాచుర్యాన్ని పొందింది. ఇందులో భవిష్యత్తు వర్ణించబడింది. రాబోవు కాలంలో ఉత్పాతాలు కలిగి ప్రజలు నష్టపడతారనీ ఆరు మతాలు ఒక్కటవుతాయనీ లోకంలో ప్రజలంతా నీటిలో నిప్పులో మునిగి పోతారనీ వర్ణించారు. గురునిచేరి మొక్కితే సుఖంగా బ్రతుకుతారనీ చెప్పారు. "వేడుకతో శ్రీ పోతులూరి వీరభోగ వసంతరాయులు ఏడు దీవుల ఏకచక్రము ఏలును బ్రహ్మాండమంతా" అనేది తత్వాంకిత ముద్ర.

## *పన్నెండవ తత్వం :-*

ఇంతటును విడిస్థలంబిది ఎవరి కలవి యగును
సంతతము శివధ్యాన పరులకే గాక ॥ఇంత॥
ఏడుచుట్లకోట ఏకచక్రాధీశు మాయ
యని తెలియక మగువగూడి చూడ చూడతరము
ఏస్వామి వీధులు గలవు పండువెన్నెల కాంతి
నిండిన గురుడు ॥ఇంత॥
నలుగురు మంత్రులు నాయకు లేడుగురు
కరణాలు ఆరుగురు ఘనముగాను
నలువదెనిమిది పదులు నరులు చెప్పేటివారు
ముప్పదియైదుగురు మునద్దీలు గలరు ॥ఇంత॥
ఎనిమిది మదకరులు ఏడువేల రథాలు
పదహారు లొటిపిటల్ బారు గొలువగను
ఏనూరు అశ్వములు ఏవేళ కొలువగను
ఎప్పుడు డెబ్బదివేల కాల్బలమూ ॥ఇంత॥
ఎంత యేనిన్ని ఐదుగురు మావటీలు
సామంతులు పదునూరు తలవర్లు
ప్రహరి దిరుగగను

ప్రణవభేరి మృదంగ పంచమ ధ్వనులచే
పగలు రేయును మహాప్రభల గోష్టులు ॥ఇంత॥
పశ్చిమ ద్వారము పద్మరాగపు కాంతి
పదియారు స్థంభాల బారు మండపము
పరమగురుడై లింగభావ సిద్ధేశ్వరం పటిష్ట
పోతులూరి శుభకల్యాణి గృహము ॥ఇంత॥

ఈ తత్వంలో బ్రహ్మంగారు మానవశరీరాన్ని ఒక రాజభవనంతో పోల్చారు. శరీరంలోని వివిధ తత్వాలను మంత్రులతో సేనాధిపతులతో భటులతో పోల్చారు. ఈ శరీరం ఏడుచుట్ల కోటఅనీ ఏడవచక్రంలో అంటే సహస్రారంలో పరమాత్ముడుంటాడనీ అతడే ఈ శరీరాన్ని పరిపాలిస్తూ ఉంటాడనీ తెలిపారు. ఈ సహస్రారాన్ని గురించి యోగదర్శనానికి వ్రాసిన సంగ్రహ రచనలో ఇలా వ్రాయబడింది. **"In the lotus of this Chakra each petal consists of 125 smaller petals. Its petal altogether come to 1000 The light of this centre is as bright as sun rays. Paramatma or Sadguru is the Lord of this centre."** మానవుని శిరస్సులో వేయిరేకుల పద్మం ఉంటుంది. దీనికాంతి సూర్యకాంతికంటె మిన్నగా ఉంటుంది. పరమాత్మ లేక సద్గురువు ఈకమలంలో ఉంటాడని భావం.

*పదమూడవ తత్వం :- (పు. 11)*

శరణు పోతులూరి రామ శరణు వీరభద్రాయ
శరణు ఓ దైవరాయ పోతులూరయా
కరుణతో ఏలయ్యా యేలర ॥శరణు॥
సూక్ష్మమైన తనువులోన శూరుడేడ వున్నాడయో
శూరుడున్న దారితెలిసితే ఓ పోతులూరయ్య
మోక్షద్వారము కనుల చూచేన ॥శరణు॥

కాయము జూచి కనులచే కాముడేడ వున్నాడయో
కాముడున్నదారి తెలిసితే ఓ పోతులూరయ్య
కామజుని కన్నతండ్రివి ॥శరణు॥
యౌవనంపు నీటివొడ్డునా జవ్వనంపు జాజితోట
యౌవన నరుడు ఏతామెత్తగా ఓ పోతులూరయ్య
చూచి వేడుక దానగునయ్య ॥శరణు॥
ఇప్పవేరు దాటుటచే తెప్పించినా యుక్తిమంత్రము
నిల్వలేరు నీరుజేసుక ఓ పోతులూరయ్య
తెప్పవేసుక తేలివత్తునా ॥శరణు॥
అష్టాక్షరి గండిలోనా చతురాక్షరి చీరదీసి
ధర్మరాజు దారితెలిసితె ఓ పోతులూరయ్య
చూచి నేను కనుగొంటిరా ॥శరణు॥
తెలిసితెలియని వారినెల్ల యాలవొడ్డు తోచునట్లు
బాలురకు నేమి తెలియురా ఓ పోతులూరయ్య
బ్రహ్మజ్ఞానులైతె తెలుసురా ॥శరణు॥

ఈతత్వంలో బ్రహ్మంగారు సూక్ష్మమైన తనువులో దేవుడున్నాడనీ అతనిదారి తెలిసికొంటే మోక్షద్వారాన్ని చూడవచ్చుననీ చెప్పారు. ఈ శరీరంలో కాముడున్నాడనీ "యవ్వన" మనే నీటి వొడ్డును దాటాలంటే అష్టాక్షరి అనే పడవ వేసుకోవాలనీ ధర్మరాజు దారిన నడవాలనీ చెప్పారు. అష్టాక్షరి అంటే "ఓం నమోనారాయణాయ" అనే అష్టాక్షరిమంత్రం. ధర్మరాజుదారి అంటే మంచినడవడి అని అర్థం. ఈతత్వం చివర "బాలురకు నేమితెలియురా ఓ పోతులూరయ్య" అనేది అంకితముద్ర.

## పదునాలుగవ తత్వం :- (పు. 12)

ఓం నమశ్శివాయ సిద్ధమైన పదవి
ఓంకార మేదిరా ఓరీ
ఒనరుగా త్రికూట భ్రూమధ్యమందున్న
వాడెవ్వడో చూడరోరీ ॥ఓం॥
అ ఆ లు ఎనిమిది అక్షరములకును మూల
హారుడెవ్వరో చూడరోరీ
ఆ కారమను చిలుక హంసతో గూడుకొని
ఆడిస్తునున్నాడు రోరీ ॥ఓం॥
కఖాలు పదిరెండు పర్వములు జేసుకొని
కన్నుమూసుక చూడరోరీ
కలరేకుతైదునా కాంత యొకటున్నదీ
కరకంథు డెరుగుర్రా యోరీ ॥ఓం॥
తథ దధా యని పర్వములు తానెరిగి
తలుపు దీసియు చూడరోరీ
తెర తేరకాడునై దేవాలయములోన
తేటగానున్నాడు రోరీ ॥ఓం॥
య, ర, ల, వా యని నారాయణ బ్రహ్మ
రుద్రులెవ్వరొ చూడిరోరీ
శషసహా యని శివపోతులూరయ్య
సాక్షిగా నున్నాడు రోరీ ॥ఓం॥

ఈ తత్వంలో బ్రహ్మంగారు యోగవిద్యను బోధించారు. "ఓం నమశ్శివాయ" అనే మంత్రాన్ని పఠించి భ్రూమధ్య స్థానంలో వ్యవస్థితుడై ఉన్న పరమాత్మను గురువుగా చేసికొమ్మని అ పరమాత్ముడే

ఈ మానవ శరీరాన్ని హంసతో కూడుకొని ఆడిస్తున్నాడనీ చెప్పారు. ఈ తత్వంలో "త్రికూటం" "హంస" అనే వేదాంత సంబంధ పదాలు వాడబడ్డాయి. త్రికూటమంటే భ్రూమధ్యస్థానం. భగవద్గీతలో భ్రూమధ్యాన్ని గురించి ఇలా చెప్పబడింది.

"ప్రయాణకాలే మనసా చలేన
భక్త్యాయుక్తో యోగబలేన చైవ
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్
సతం పరం పురుష ముపైతి దివ్యమ్"

— గీ. మ. అధ్యాయం 8; శ్లో. 10, పు. 620.

అంత్యకాలంలో యోగబలంతో ప్రాణవాయువును కనుబొమలమధ్య నిలిపి పరమాత్మను పొందగలడని పై శ్లోకానికి అర్థం. ఈ విషయాన్నే బ్రహ్మంగారు పై తత్వంలో చెప్పారు. ఇంకా ఈతత్వంలో వాడబడిన "హంస" అనే పదానికి ఉచ్ఛ్వాస నిశ్వాసలని అర్థం. ఈ హంసను గురించి ఉపనిషత్తు ఇలా చెప్పింది.

"సర్వా జీవే సర్వసంస్థే బృహంతే
తస్మిన్ హంసో భ్రామ్యతే బ్రహ్మచక్రే
పృథగాత్మానం ప్రేరితారం చమత్వా
జుష్ట స్తతస్తేనా మృతత్వ మేతి"

— శ్వేతాశ్వతరోపనిషత్తు
అధ్యాయం 1, శ్లో. 6, పు. 14.

సర్వప్రాణులకు జననమరణాలు కలిగించేది గొప్పది అయిన బ్రహ్మాండ చక్రంలో నిర్మలమైన హంస త్రిప్పబడుచున్నాడు. (హంస అంటే

జీవుడు) తనకు ప్రేరకుడైన దేవునికి, తనకు భేదం తెలుసుకొని సేవించి తద్వారా మోక్షాన్ని పొందుతున్నాడు. అని పై శ్లోకానికి అర్థం.

పదునైదవ తత్వం :- (పు. 13)

ముట్టుముట్టనియేరు ముట్టుగాదనియేరు
ఈ ముట్టురక్తంబు ఈ శరీరంబు ॥ము॥
కమలములో నా ముట్టు కమలమని వెలసింది
కమలములోపల కాంతిగా దుమికె ॥ము॥
మూన్నాళ్ల ముచ్చటలు ముట్టని తొలిగుంటె
ముట్టు లోపల ముట్టు అది ఏల సమసెన్ ॥ము॥
నెలకొక్క దినమాయె నేర్పుతో యీముట్టు
పొదుతెలియక ముట్టు పొరాడసాగెన్ ॥ము॥
రెన్నెల్ల కొక దినము అండబాయక రాత్రి
శ్రీహరిని వెదకుటకు చిలుకవలె తిరిగెన్ ॥ము॥
మూడునెల కొకదినము మురికి గర్భములోను
మర్మస్థానము లందు ముద్దేరుపరచెన్ ॥ము॥
నాల్గునెల లొకదినము నాగకంఠుండొచ్చి
నవ మూత్రద్వారముల క్రమమేరుపరచెన్ ॥ము॥
అయిదునెల లొక దినము ఆ సదాశివుడొచ్చి
కంఠస్థానము శిరను క్రమమేరు పరచెన్ ॥ము॥
ఆరునెల లొకదినము ఆ రుద్ర బ్రహ్మలు
అభయహస్తము లిచ్చి ఆయుష్షు పోసెన్ ॥ము॥
ఏడునెల లొక దినము ఎరుకాయె జీవునకు
మనసులో నూకొట్టి మనసు తా దెలిసెన్ ॥ము॥

ఎనిమిది నెలలకు ఏర్పడి పిండంబు
కొంతశ్రీ గర్భమున కదలుచు నుండెన్ ॥ము॥
తొమ్మిది నెలలకు ద్వారములు విడువుమని
ఉత్పత్తి ఆయెను ఈ పృధివిలోను ॥ము॥
ఈ పిండ వచనమ్ము ఈ పిండశాస్త్రమ్ము
కాని పిండము చేత కలిసీళ్లు చల్లెన్ ॥ము॥
మాయ మంత్రసాని మరి పోతులూరయ్య
మంత్రములు చదువుచు మరి బొడ్డుగోసెన్ ॥ము॥

బ్రహ్మంగారు ఈ తత్వంలో పిండోత్పత్తి క్రమాన్ని చెప్పారు. గర్భం నిలిచిన తరువాత మూడునెలల ఒకరోజుకు పిండం ముద్దగా ఏర్పడుతుంది. నాలుగునెలల ఒకరోజుకు నవద్వారాలు ఏర్పడతాయి. ఐదు నెలల ఒకరోజుకు శిరస్సు ఏర్పడుతుంది. ఆరునెలల ఒకరోజుకు ఆయుష్షు వస్తుంది. ఏడునెలల ఒకరోజుకు ఎరుక కలుగుతుంది. ఎనిమిది నెలలకు పిండం కదులుతుంది. తొమ్మిది నెలలకు బయటపడుతుందని చెప్పారు.

ఈ పిండోత్పత్తి క్రమం ఉపనిషత్తుల్లో పురాణాల్లో చెప్పబడింది. ఐతరేయోపనిషత్తులో జీవుడు శరీరంలోనికి ప్రవేశించేక్రమం ఇలా చెప్పబడింది.

"సఏత మేవ సీమానం విదార్యైతయా
ద్వారా ప్రాపద్యత"

ప్రథమాధ్యాయం, శ్లో. 12, పు. 28.

ఆజీవుడు ఆలోచించి శిరస్సును చీల్చి దానిలో ప్రవేశించాడు. అంటే గర్భస్థంగా వున్న శిశువు శిరస్సును చీల్చి అందులో ప్రవేశించాడని అర్థం.

భాగవతంలో తృతీయ స్కంధంలో కపిలుడు తన తల్లియైన దేవహూతికి పిండోత్పత్తి క్రమాన్ని వివరిచాడు. ఈ అంశం

"దొరకొని పురుషరేతో బిందు సంబంధియై
వధూ గర్భంబునందు జొచ్చి"

ప. 982, పు. 290.

ఈఘట్టంలో పురుషుని రేతస్సు స్త్రీ గర్భంలో ప్రవేశించింది మొదలు శిశువై జన్మించేవరకు ఉన్న క్రమం వర్ణించబడింది. ఇదే పద్ధతిలో బ్రహ్మంగారు పిండోత్పత్తి క్రమాన్ని వర్ణించారు.

**పదహారవ తత్త్వం :- (పు. 16)**

చెడుగుడాడెనే బ్రహ్మము బలిగుడాడెనే
చెడుగుడు గుడుగుడు గుమ్మన్నాదం
కలుష బిందెల కనుల గూడుక ॥చెడు॥
నడవడి మంచి వడిగల తనయుని
చైత్రామించిన నిండుపౌర్ణమి వెన్నెల గాయగ
ఈకడ ముగ్గురు ఆకడ నలుగురు
నడుమన్నె నలుపైన బుజ్జి వకడు
చెట్టు గొట్టంగా పోలు గారంగా ॥చెడు॥
ముప్పై రెండు అక్షరంబుల మేత్తైన నొక అక్షరంబై
గుబిక్కై గుబ్బబట్టి నాలుగు మొగములె
నలుగురిని తరిమివది
దిక్కుల నెవరు గుర్తించి చేకొని
అయ్యు చూచెను ఆనందించెను
వింతలు తెలిసిన వీరబ్రహ్మము ॥చెడు॥

ఈ తత్వంలో బ్రహ్మంగారు యోగసాధనకూ చెడుగుడు ఆటకు అభేదాన్ని వర్ణించారు. ఒక మంత్రాన్ని అనిరళంగా జపించడం చెడుగుడుఆటలో గుక్కపట్టి కూతపెట్టడం లాంటిది. కుండలినీ శక్తిని తేపడం సహస్రారానికి చేర్చడమే ఆట గెలవడం. "ఇంతలు తెలిసిన వీరబ్రహ్మము" అనేది తత్వాంకితముద్ర.

*పదిహేడవ తత్వం :—* (పు. 15.)

ప్రభువు వచ్చె వేళాయె ప్రజలార ఇకనైనను
భక్తితోను పూర్వభవంబు నుడిగి
గురుని పంచ జేరితేనూ శుభములేనూ ॥ప్ర॥

ఖండితంబుగా నంది మండల క్షేత్రధాముడు
రెండుయేండ్లు నిండిన నుదయింతు నన్నాడు
అన్నాజితోను తోడుగానే ॥ప్ర॥

గుత్తి ఆదవాని కోట కొమ్మల సందున
గుకుడు జోడూ జేసి అత్తిగా నున్నా
మాయరమ్మను జూతురు అల్లనాడు ॥ప్ర॥

తుంగభద్రలో నాల్గు బారిగుఱ్ఱాలు దుముకు
లాడునట్లు దుమికినా మూనాళ్ల ఆదోవ పోనన్నాది ॥ప్ర॥

కృతయుగ ధర్మము నడిపిస్తు వాని హితులా
కొనగినాడు వేగనత తాను పోతులూరి
సుబ్రహ్మణ్యము వాడు ॥ప్ర॥

ఈతత్వంలో బ్రహ్మంగారు తమరాకడను గుర్తించమనీ భక్తితో ఉండమనీ తాను కృతయుగ ధర్మం నడిపిస్తాననీ చెప్పారు. తుంగ భద్రలో నాలుగు గుఱ్ఱాలు దుమికిన మూన్నాళ్లకు తాను జన్మించినట్లు

బ్రహ్మంగారు చెప్పారు. ఇదేవిషయాన్ని వచన కా. జ్ఞానంలో "అక్బరు గుర్రాలు తుంగభద్రనీళ్లు తాగినదే మొదలుగాను మూడుదినాలకు వచ్చేము. మూడు దినాలు అనగా మూడేండ్లు మూడునెలలు." అని చెప్పారు. ఈ అంశం బ్రహ్మంగారి కాలనిర్ణయం అనే శీర్షికలో విపులంగా వివరించబడింది.

## పద్దెనిమిదవ తత్వం :— (పు. 16)

రమ్మనే మన వీరగురుని రమ్మనే
ఉపదేశమిమ్మని కమ్ముకొని
కనుబొమ్మల నడుమను
బొమ్మలాట లాడే గురుని ||రమ్మ||

నాదబిందు కళల చేత
ఆడుచుండగాను నేను గూడి
కుండలి నట్టనడుమను చూడు
సుందరమైన గురుని ||రమ్మ||

ఆరు మతములందు గురుడు
ఆగ్రహించి యున్న గురుడు
ఆరు మూడు తెంచి వేసి
మూడువేత్తైయున్న గురుని ||రమ్మ||

అందమై యున్నట్టి గురుని కనుబొమ్మలపైనా
కోరగాను బయలుగాచి
పండు వెన్నెలలో అంటి
అంటుకున్నా గురుని ||రమ్మ||

ఎన్నికతో శివపోతులూరి
వీరభోగ వసంతరాయలు
ఏడు దీవుల ఏడురాజ్యము
లేలబోయే వీరగురుని ||రమ్మ||

ఈ తత్వంలో కనుబొమలమధ్య బొమ్మలాటలాడే గురుని గురించి చెప్పారు బ్రహ్మంగారు. భ్రూమధ్యంలో కనిపించే వెలుగులో వివిధ దేవతా రూపాలు కనిపించడమే బొమ్మలాట. భ్రూమధ్యంలో గురువు నాదబిందు కళలతో ఆటలాడుతూ ఉంటాడని చెప్పారు. "నాద బిందు కళలు" అనేది వేదాంత పారిభాషిక పదం. నాదమంటే "అ" కారం. బిందువంటే "ఉ" కారం. కళ అంటే "మ" కారం. అ + ఉ + మ, అనే ఈ మూడక్షరాలు కలిసి "ఓం" అవుతుంది. ఈ ఓంకారమే సద్గురువు, బ్రహ్మం.

"ఓమితిబ్రహ్మ ఓ మితీదం సర్వమ్"

తైత్తిరీయోపనిషత్తు, 1వ వాక్యం, పు. 23

ఓం అనేది బ్రహ్మ. ఓం అనే బ్రహ్మచేత ప్రపంచమంతా వ్యాపించి ఉంది. అని పై వచనానికి అర్థం. నాదబిందు కళలు అనే పదం సీతారామాంజనేయ సంవాదంలో —

"నాదబిందు కళల నయమొప్ప జూచుచు
ఇంద్రియముల మనము నిగురజేసి"

1వ ఆశ్వాసం, 110వ పద్యం.

నాదబిందు కళలను చూసే యోగి మోక్షాన్ని పొందుతాడని చెప్ప బడింది.

**పందొమ్మిదవ తత్వం :- (పు. 16)**

వస్తాడయ్యా వీరబ్రహ్మాం వస్తాడయ్యా
వస్తాడు వీరయ్య తెస్తాడు
తగవూలు తగ్రదుంచి
ముల్లోకమున కాది
మూలమైన గురుడు ॥వస్తా॥
అల్ల మా ప్రభురాయ
డెల్ల లోకములో
కల్లా నరులను
గర్వమణచే గురుడు ॥వస్తా॥
పెద్దాల దూషించె
బుద్ధి మాలిన జనుల
గద్దించె బల్లెముల
దిగ గుమ్మే వాడు ॥వస్తా॥
వర భక్తులనెల్ల
పరిపాలన సేయా
స్థిరముగ వీరయ్య
గురుడు ఈ జగమేల ॥వస్తా॥

"వస్తాడయ్యా వీరబ్రహ్మాం" అనే ఈ తత్వంలో వీరబ్రహ్మాం బుద్ధి మాలిన జనులను గద్దించి బల్లెముల గుమ్మి దుష్టశిక్షణ చేస్తాడనే విషయం చెప్పబడింది. "వీరయ్యా గురుడు జగమేల" అనేది అంకిత ముద్ర.

**ఇరువదవ తత్వం :— (పు. 16.)**

వచ్చినాడు వీరబ్రహ్మాం ఓహో జనులారా
మీరు చింతాలు మాని గురుని కోరుకోరయ్యా ॥వచ్చి॥

మొదటి యుగధర్మమునకు మొదటా
గోల్కొండ ఆదవాని గుత్తి గండికోటా
కంచి కాలావశము తట్టూబడు మూలము వినరయ్యా ॥వచ్చి॥
కంనూరు దొరలు యింతా కారడపులుబడి తిరిగేరయ్యా
సందేహమెందుకు కాలము సమకూడినాది ॥వచ్చి॥

అంత సత్యమునాయున్నా ఇంతలేదు అనేవారిని
పంతగించి శివభక్తులు భక్షించిరయ్యా ॥వచ్చి॥

అన్ని అనుకూలమాయెను ఆడరాదంట కొన్నిమాటలు
కన్నులార పండువుగా కనుపించిరయ్యా ॥వచ్చి॥

తారక శివపోతులూరు వీరబ్రాహ్మణ్యల నిపుడు
కోరి కొలిచినవారికి నేరము లేదయ్యా ॥వచ్చి॥

ఈతత్వంలో కాలజ్ఞానం చెప్పబడింది. కలియుగంలో ముందు కలుగ బోయే ఉత్పాతాలు చెప్పి చింతలు మాని గురుని కోరుకొనండని చెప్పాడు. "తారక శివపోతులూరు వీరబ్రాహ్మణ్యల నిపుడు కోరి కొలిచినవారికి నేరము లేదయ్యా" అనేది అంకితముద్ర

## ఇరువదిఒకటవ తత్వం :- (పు. 17)

చెప్పెద గురుమహిమా తెలిసినంతట
గురుని తెలిసికోండి విప్పి చెప్పాను
నేనెంతవాడ మన్ననతోనంటి నొప్పుకొంటి ॥చె॥

గుడిముంతరా నొక్క గుడ్డిముండున్నాది
దొడ్డముండ దోవ కడ్డముంది
దాని ఖండించి అఖండపదవిలో కలిసికొండి ॥చె॥

బూరుగా మానిక్రింద రెండుపుట్టలుగలవు తెలిసికొొండి
అపుట్టలో రెండు పెనుబాములున్నవి పట్టుకొొండి ॥చె॥
పట్టుకున్నావాంౘపయిని రెండుగ్రుడ్లు తెలిసికోండి
ఏడుకొండల నడుమ ఎద్దు కూతవేసినది తెలిసికోండి ॥చె॥
ఆఎద్దు కూతవిని యముడు యొద్దికిరాడు తెలిసికోండి
మూడుమూలల పెట్టె మూతదీసే నేర్పు తెలిసికోండి ॥చె॥
మూతదీసితె పెద్దభూతములు గనపడును తెలిసికోండి
భూతాల మరి ఆపోజ్యోతి యొక్కటిగలదు తెలిసికోండి
ఆజ్యోతి వీరబ్రహ్మ శివపోతులూరయ్య తెలిసికోండి ॥చె॥

ఈ తత్వంలో యోగసాధనా విధానాన్ని బ్రహ్మంగారు మర్మపద్ధతిలో చెప్పారు. ఒక గుడి, గుడ్డిముండ, దొడ్డముండ వంటి సంకేతాలను ఈ తత్వంలో ప్రయోగించారు బ్రహ్మంగారు. ఇక్కడ గుడి పరమాత్మ వుండే సహస్రారం, దొడ్డముండ దేవుణ్ణి చేరాలనుకొనే జీవుడు. గుడ్డిముండ అజ్ఞానం, అజ్ఞానాన్ని ఖండిస్తే అఖండపదవి లభిస్తుందని బ్రహ్మంగారు చెప్పారు. ఈ తత్వంలోనే మానవ దేహాన్ని బూరుగ మానితో పోల్చారు. ఇటువంటి పోలికలు ఉపనిషత్తుల్లో కూడా చెప్పబడ్డాయి.

"ఊర్ధ్వమూలో౽ వాక్ శాఖ ఏషోశ్వత్థః"
— కఠోపనిషత్తు,
షష్టివల్లి, 1వ వాక్యం, పు. 99.

పైకి వేరులు కలిగి క్రిందికి కొమ్మలుగల ఈ మానవదేహ రూప వృక్షం రేపటికి ఉంటుందో ఉండదో తెలియదు అని పైవచనానికి భావం. ఇటువంటి పద్ధతినే అనుసరించి బ్రహ్మంగారు తన తత్వరచనలో సంకేతాలను ప్రయోగించారు. ఈ సంకేతాలకు అర్థం చెప్పడం మిక్కిలి కష్టం.

ఇరువదిరెండవ తత్వం :- (పు. 18)

బ్రహ్మమయమందు రోరన్న హరహర శివశివ
పోతులూరయ్యా

పంచాక్షరీ మంత్రం పఠనం చేయుమన్న
పఠన చేసితె యముడు పరముడోయన్న ॥బ్ర॥

ఆరు నదులమీద అంటియుండన్నా
అంబలో దుర్గాంబ ఆట్లాడునన్నా
ఆట్లాడితె నందె అర్థముందన్న
అర్థమెరిగినవాడు హరి యతండన్నా ॥బ్ర॥

నాసికముపై చూపు నడిపించుమన్నా
నడిపించి సద్గురుని నమ్మియుండన్నా
పిలిచినపుడె నీవు నిలిచి యుండన్నా
నిలిచియుండిన యిల శివుడో యన్నా ॥బ్ర॥

మూడారు వాకిళ్లు మూతవేయన్నా
ముక్తివాకిట నిలచి తలుపు తీయన్నా
తలుపు తీసితె అంబ తా పలుక్కనవ్న
తేజమందినవాడు తా శివుడౌ యన్నా ॥బ్ర॥

జంట గ్రోవులు రెండింటి యూదన్నా
అట్టులూదిన పాము ఝుంటించునన్నా
ఝుంటించి ఘంటనా దంటించునన్నా
అంటి మంట ధ్వని నట్టెమరవన్నా
అట్టె మరిచితె బట్టబయలు చూడన్నా
బయలులో వీరగురు బ్రహ్మమౌయన్నా ॥బ్ర॥

పంచాక్షరీ మంత్రాన్ని పఠించి నాసికపై చూపు నిలిపి నవరంధ్రాలను మూసివేసి భ్రూమధ్యంలో ఉండే జ్ఞాననేత్రాన్ని తెరచి ఇడా పింగళ

వాయువులను సమానంగా నడిపించి కుండలిని సహస్రారానికి చేరిస్తే బ్రహ్మపదార్థాని తెలిసికోవచ్చు. అనేది ఈ తత్వ సారాంశం.

## ఇరువదిమూడవ తత్వం :— (పు. 18)

తియ్యని మామిడిపండు
తినబోతె దొరకదు తీపులు మెండు
పండుకు వృక్షము ప్రజలెవ్వరెరుగరు
పరమాత్ముడనె పయినుండగా
పండు కెనుబదినాల్గు
పర్వాము లయి యుండు
బరులకు నీపండు వశము గాకుండు ॥తి॥

విత్తులేని పండు విశ్వములో నుండు
సత్యము ఈమాట నిత్యమయా
అత్తుగ తల్లికి బిడ్డ మగడైతే
సత్యము ఈమాట నిత్యము వినుడీ ॥తి॥

ఆలుమగలూ డుండు ఆదిలేనివాడు
కొడుకు కూతురు గన్న కొడుకేడిరా
అల్లుని కల్లోక హరిహరాదులందు
ముల్లోకమున తల్లి ముగ్గిరిని మింగెన్ ॥తి॥

చెరువులో దావానల జ్యోతులై పొయ్యేరు
జనన మరణము లేని జాతిపండూ
వాదభేదము ఓంకారమై యుండు
మాతల్లి మహమ్మాయి మర్మమీపండు ॥తి॥

బరులకు నీపండు ఒక దినుసుగా నుండు
నరులకు నీపండు నమ్మకుండు
ధరలోన నీ పండు దాసులకె యుండు
పరమ గురుధ్యాన పరులకు పండు ॥తి॥

బ్రహ్మంగారు ఈ తత్వంలో బ్రహ్మజ్ఞానాన్ని తీయని మామిడిపండుతో పోల్చారు. ఈపండు పరమాత్ముడనే ఆకుమీద ఉంటుంది. ఈపండుకు జనన మరణాలు ఉండవు. నరులు ఈ పండును నమ్మరు. నమ్మిన వారికి ఈపండు అందుతుంది. బ్రహ్మజ్ఞాన మనేది మామిడిపండు. బ్రహ్మజ్ఞాన పదాన్ని ఉపనిషత్తు ఇలా నిర్వచించింది.

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"

— తైత్తిరీయోపనిషత్తు
బ్రహ్మానందవల్లి, ప్రథమోనువాకః
వాక్యం-1, పు. 35.

సత్యస్వరూపమే జ్ఞానస్వరూపమే బ్రహ్మం. బ్రహ్మకు సంబంధించిన జ్ఞానమే బ్రహ్మజ్ఞానం.

## ఇరువది నాలుగవ తత్వం :— (పు. 19)

మూడు కాల్వలు దాటలేరయ్యా ఇల మూఢజనులు
మూడుకాల్వలు దాటలేరయ్యా
మూడుకాల్వల తోన గూడుక
ఇడా పింగళ మధ్యమంబున
గూడి పాడి సరస్వతిని విననాడి
ఆవల మూఢులెల్లను ॥మూడు॥

వోడ లేకను నీదబోయేరు సంసారవార్ధి
జాడ తెలియక మునిగిపొయ్యేరు
వేడుకతో హరినామ మను నౌక
ఓడ జేసుక మూతి గడుపుచు
నేడుకొండలు దాటి పోగలవాడు
ఎవ్వడో నూటి కొక్కడు ॥మూడు॥

తన్ను తెలియక యున్నవారితో విన్న
సుజ్ఞానమును దెలుపుచు
కన్నులట్టే మూసి జ్యోతిని కంటిమనుచు
తల్లడము బలికే దున్నపోతుల కేమితెలియును ?
సన్మార్గమహిమ విన్న పురుషుల కేమిగల్గును
తన్ను తాను తెలిసియున్న సంగతి
వేమన్న పద్యములోని భావము
కన్న గురువుల చేత మరి తా వినన్
పురుషుడు నూటికొక్కడు ॥మూడు॥

గంగా యమునా సరస్వతులు
నుప్పొంగుచు పారంగ నేరులు
తుంగభద్రా కృష్ణా కాళింది మొదలుగ
నదులలోపల పొంగి స్నానము సేయబోయేరు
ఊరికెపట్టి జంగరాళ్లకు పూజచేసేరు
సంగతిగ షడంగంబులు చెలగి ముద్రికపట్టి గట్టి
సంగమున పరలింగ మెరిగేన పుంగవుడు తా
నూటి కొక్కడు ॥మూడు॥

బాధ గురువుల బోధ వినుకొని
పాదతీర్థ ప్రసాదములచే
మోసమందుచు వేదవేత్తల
మీదికెని కాలూనుచును మరి
వాదులాడక ఉదబోయేరు
ఏవాగు ముందర పాదుకొని నేరస్తులయ్యేరు
నాదమై యిల గురుని చిదంబరు
పాదములు గని ఆసపడి
ప్రసాదములచే తృప్తుడైన
వినోద పురుషుడు నూటికొక్కడు

ఈ ప్రపంచంలో వున్న మూఢజనులు మూడు కాల్వలను దాటలేరు. అంటే ఈషణత్రయాన్ని అధిగమించలేరు. దారేషణ, ధనేషణ, పుత్రేషణ అనేవి ఈషణత్రయం. సంసార సముద్రాన్ని దాటాలంటే హరినామం అనే ఓడ అవసరం. విషయం తెలియకుండా ఊరకే కళ్లు మూసుకొని భగవంతుణ్ణి చూశామని చెప్పేవారికి ఏమీ తెలియదు. గంగా మొదలైన నదుల్లో స్నానం చేయడానికి వెళతారు. కాని కళ్లలో ఉన్న త్రివేణీ సంగమాన్ని గ్రహించలేరు. ఊరకే రాళ్లకు పూజలుచేస్తూ ఉంటారు. బాధగురువుల బోధవిని మోసపోతారు. భగవంతుని పాదాల నాశ్రయించి తృప్తిపడేవాడు నూటికొక్కడే. అని ప్రస్తుత తత్వంలో బ్రహ్మంగారు చెప్పారు.

ఇరువది ఐదవ తత్త్వం :— (పు. 25)

నడివీధినా ముందు నాటింతురా కొల్మి
నడి మండలమందు నాటింతురా
సంధి తెలియనట్టి ఒద్దెకుక్కల బట్టి
బంధించి బాకుల కుమ్మింతురా శివ గోవింద గోవింద
ఏడు తిత్తులు బట్టి పూరింతురా
నాడుల మండలంబు నడిమింట భేదింతురా
దండైన నాగురు నంటజేరుక పెద్ద
కొండలన్నియు పిండి గొట్టింతురా ॥శివ॥
కోపమానె బొగ్గుల్ కొల్మిలో బోయించి
చాపమానె యినుము బెట్టింతురా
చాపమంటి అగ్గిచూపులో వెలిగిన
దీపమంటి జ్యోతి వంటిదిరా ॥శివ॥
నాలుగు సందులు నాటింతురా
శివనామధారుల బట్టి సాటింతురా
నాణె మెరుగని జనుల భూమిపాల జేసి
హోమ ముందర నాటు నాడింతురా ॥శివ॥
ఆరు మతములారు ఆరెండు నాకొల్మి
ఏడు లోకములను వెలుగు
ముందువాడలో నా కొల్మి జాడతెలిసియుండె
నీడ లేని చోట నిలిచితిరా ॥శివ॥
మతము తెలియనట్టి మాయగుంపుల బట్టి
మాను మానుకు వేలగట్టింతురా
నాడు పోతులూరి వీరవాక్యము
నా మాట గూడి వాడల నోలలాడింతురా ॥శివ॥

మూడు మొనల మీద నాడింతురా
లోకము ముగ్గురు మూర్తు లాడింతురా
షేఏము సేయ హరి పోతులూరయ్యా
పాదము బట్టి నే బల్కితిరా ॥శివ॥

ముప్పై రెండు బిరుదులంపితిరా నేను
మూలమైనా చోట చెంపితిరా
కాలయముని నెమ్మకట్టి
చెంగునదాటి నోలలాడె బ్రహ్మవంశమురా ॥శివ॥

నాకొల్మి కాకాలా కాకొని లోకము
లోకాలవలె తిరిగె కూక చేసుకొని
పోతులూరు భీకరా కారమునెత్తి
కాకుల మీదికి గదలింతురా ॥శివ॥

"నడివీధినా కొల్మి నాటింతురా" అనే పల్లవితో ప్రారంభ మవుతుంది ఈ తత్వం. దీనిలో దుష్టశిక్షణ అనేది ఉగ్రంగా చెప్పబడింది. "పోతులూరు భీకరాకారమునెత్తి కాకులమీదికి గదలింతురా" అనే పాదంలో అంకితముద్ర ఉంది. ఈ తత్వంలోని "శివ గోవింద గోవింద" అనే అను పల్లవి అద్వైతభావాన్ని బోధిస్తున్నది.

## ఇరువది ఆరవ తత్వం :- (పు. 38)

ఎంత మంచిగురుడు దొరికె ఓ యమ్మలార
ఎంత మంచి గురుడు దొరికె
అంతరంగ మందున్న
చింతలేక గురుని పాదము
చెంతజేరి యుండు మనెను ॥ఎంత॥

కన్నులు వీనులు మూసి గాలి
రాక పోక దెలిసి
పున్నమ వెన్నెల బైట
కన్ను దెరచి చూడమనెనే ॥ఎంత॥
పంచ కోశములు బాసి
పంచ వింశతి తత్త్వమావల
బట్టబయట జేరమనెనే ॥ఎంత॥
ఎంత మర్మమును
మహమ్మదు హుసేన్‌దాసః
బ్రహ్మమే నారాయణుడు
ధరణిలో శివ పోతులూరి
దైవరాయు డొక్కడనెనే ॥ఎంత॥

"ఎంత మంచి గురుడు దొరికెనే" అనే ఈ తత్త్వంలో కన్నులు మూసి గాలి రాకపోకలు తెలిసికోవాలని బ్రహ్మంగారన్నారు. అంటే ఇడా పింగళ స్వరాలను తెలుసుకోవాలని అర్థం. ఈ నాడులను గురించి "యోగదర్శనం" గ్రంథ ఆంగ్ల సంగ్రహ రచన ఇలా వివరిస్తున్నది. **"According to Yogasastra and Ayurveda there are as many as 72,000 nadis in the humanbody and the most important of them are three namely Ida (left nostril), Pingala (right nostril), and Sushumna (in Brahmanadi"1.)** మానవ శరీరంలో 72 వేలకు పైబడి నాడులు ఉన్నాయి. వాటిలో ఇడా (ఎడమ నాసిక) పింగళ (కుడి నాసిక) సుషుమ్న (బ్రహ్మదండికి, అంటే వెన్నెముకకు అగ్రభాగంలో ఉంటుంది.) అనే నాడులు ప్రధానమైనవి. వీటిని తెలిసికొని సక్రమ

---

1. R. K. PAGADALA, YOGADARSANAM A SUMMARY P. XXV.

మార్గంలో శ్వాసలు నడిపిస్తే ముక్తి పొందవచ్చునని బ్రహ్మంగారు చెప్పారు.

ఇరువది ఏడవ తత్త్వం :- (పు. 38)

చెప్పెద గురుమహిమ తెలిసినంతట మీరు తెలిసికోండి
విప్పి చెప్పగ నేనెంతవాడను శరణంటి నొప్పుకొంటి ॥చె॥
చింతమాని మీద చేమంతి పూసెను తెలిసికోండి
ఆ చేమంతి మీదను చెంగల్వ పూసెను తెలిసికోండి ॥చె॥
భూరుహమున రెండు పుట్టలు గలవయ్య తెలిసికోండి
ఆపుట్టల్లో రెండు పెనుబాము లున్నవి పట్టుకోండి ॥చె॥
పట్టుకొనిన మీద రెండుగుడ్లు తెలిసికోండి
ఆ గుడ్లమీద నొక్క గూబ కూర్చున్నది తెలిసికోండి ॥చె॥
మూడు అరల పెట్టె మూత దీసేది నేర్చుకోండి
ఆ మూత దీసితె పెద్ద భూతమగపడును తెలిసికోండి ॥చె॥
భూతము నెత్తిపై జ్యోతి యొక్కటిగలదు తెలిసికోండి
ఆజ్యోతి వీరబ్రహ్మ శివపోతులూరయ్య తెలిసికోండి ॥చె॥
తెలిసినవారికి తేనె మామిడిపండు తెలుసుకోండి
తెలియని వారికి విషముష్టిపండని తెలుసుకోండి ॥చె॥

ఈతత్త్వం పూర్తిగా మర్మపద్ధతిలో చెప్పబడింది. భ్రూమధ్యంలో చూపు నిలిపితే వెలుగు కనిపిస్తుందనీ ఆజ్యోతే పరమాత్మఅనీ బ్రహ్మంగారు చెప్పారు. ఈ తత్త్వంలో ఉన్న

1) చింతమాని మీద చేమంతి పూసెను
2) చేమంతి మీదను చెంగల్వ పూసెను
3) భూరుహమున రెండుపుట్టలు గలవయ్య.

ఇటువంటి వాక్యాలు మిక్కిలి మర్మంగా ఉన్నాయి. వీటికి అర్థం తెలియదు.

## ఇరువది ఎనిమిదవ తత్వం:- (పు. 38)

ఊదే తిత్తుల పైగా నుండే
ఉన్నతి తెలియర ఓరన్నా
తిత్తుల నడుమను చక్షుల మీదను
చీకటి గొట్టర ఓరన్నా ॥ఊదే॥
చీకటి గొట్టను తోకనాలుక
తీసుక లేపర ఓరన్నా
తీసుక లేపిన కాకకు పాము
చిర్రున లేచుర ఓరన్నా ॥ఊదే॥
శంఖ చక్రముల నట్టనడుమను
ఆదిశేషుని లేపర ఓరన్నా
ఓంకరించుక యున్నది పాము
కొరకక లేపర ఓరన్నా ॥ఊదే॥
ఆరు చక్రముల కావల ఈవల
లోపల వెలుపల ఓరన్నా
ఆరు చక్రముల పెనుచుక పాములు
అధోముఖంబై ఓరన్నా ॥ఊదే॥
రెండు చక్రములు విడివడి యున్నవి
కుండలి లేపర ఓరన్నా
రెంటికి సూత్రము మలిచుట్టుండె
వీర పోతులూరి వీరన్నా ॥ఊదే॥

ఈతత్వం యోగసాధనా విధానాన్ని బోధిస్తున్నది. దీన్లో "ఊదే తిత్తుల పైగానుండే ఉన్నతి తెలియర ఓరన్నా" అని అన్నారు బ్రహ్మం గారు. అంటే కమ్మరి కొలిమి దగ్గర తోలుతిత్తులను సమానంగా ఆడిస్తే

సక్రమంగా మంటవచ్చినట్లు ఇడా పింగళ స్వరాలను నడిపించాలని అర్థం తరువాత "చక్షుల మీదను చీకటిగొట్టర ఓరన్నా." అని అన్నారు. అంటే కనులు మూసుకోవాలని అర్థం. ఇలా యోగసాధన చేస్తే కలిగిన కాకకు పాము ఒక్రున లేస్తుందని బ్రహ్మంగారు చెప్పారు. పాము అంటే కుండలినీ శక్తి. ఈ కుండలినీ శక్తిని గురించి యోగ దర్శనంలో ఇలా రాయబడింది "వెన్నెముక మూలమునకు కొంచెము పైన కుండలినీ శక్తి నిద్రించుచుండును................ ఈ కుండలిని వంకరలు తిరిగిఉండు సర్పము వంటిదని చెప్పబడినది1." ఈతత్వంలో చివర "వీరపోతులూరి వీరన్నా" అనేది అంకితముద్ర.

## ఇరువది తొమ్మిదవ తత్వం :- (పు. 39)

చిల్లర రాళ్లకు మ్రొక్కుచునుంటే
చిత్తము చెడిపో నోరే యొరే
చిత్తము నందున చిన్మయ జ్యోతిని
చూచుచు నుండుట సరే సరే ॥చిల్లర॥

ఒక్కప్రొద్దులని యెన్నుచునుంటే
ఒనరుగ చెడుదువు ఒరే యొరే
ఏకమైన ఆ వైభవమూర్తిని
చూచుచు నుండుట సరే సరే ॥చిల్లర॥

నీళ్లలో మునిగి గొణుగుచు నుంటే
నిలకడ చెడునుర ఒరే యొరే
నీలో నుండే నిర్మల జ్యోతిని
చూచుచు నుండుట సరే సరే ॥చిల్లర॥

---

1. వీరరాఘవాచార్యులు, కొండూరి - యోగదర్శనం,
ప్రచు: వీరరాఘవ గ్రంధావళి తెనాలి, పు. 285.

బాధ గురువుల పంచను జేరితె
భావము చెడునుర ఒరే ఒరే
బుద్ధిలో నుండే పున్నమ చంద్రుని
చూచుచు నుండుట సరే సరే ॥చిల్లర॥
వీరయ చెప్పిన వాక్కును నమ్మితె
వివరము తెలియుర ఒరే ఒరే
వివరమందుండే విగ్రహ మూర్తిని
చూచుచు నుండుట సరే సరే ॥చిల్లర॥

ఇది బ్రహ్మంగారి తత్వాల్లో అత్యంత ప్రసిద్ధమైంది. రాళ్లకు మొక్కితే చిత్తం చెడిపోతుంది. చిత్తంలో ఉన్న దేవుణ్ణి దర్శించాలి. ఒక్కపొద్దు ఉంటే దేహం నీరసిస్తుంది. నీళ్లలో మునిగి జపిస్తే నిలకడ కుదరదు. మనస్సులో ఉన్న దేవుని చూడాలి. బాధగురువులు భావాన్ని చెడగొడతారు. అడవుల్లో తిరిగితే భగవంతుడు కనిపించడు. సహస్రారంలో ఉన్న పరమాత్మను చూడాలి. అని బ్రహ్మంగారు బోధించారీ తత్వంలో. తత్వం చివరలో "వీరయ చెప్పిన వాక్కును వింటే వివరము తెలియుర ఒరే ఒరే" అనేది అంకితముద్ర.

### ముప్పదియవ తత్వం :— (పు. 39.)

కాశికి పోవలెనా తీర్థము
మోసుక రావలెనా
కాశీ తీర్థము కన్నుల నున్నది
చేసి కన్ను శివ కాశిగ నున్నది ॥కాశికి॥
అంగము లోపలను కుండలి
సంగము దాపునను
గంగా యమున పొంగుచు పారగ
రంగుగ నడుమను లింగమలుండగను ॥కాశికి॥

కోన పైనగాను తీర్థపు
వాన గురియగాను
మేను మరచి నీవు కానక తిరిగేవు
లోన వెదకి శివధ్యానము సేయక ॥కాశికి॥

భావము లోపలను జీవుని
తావు తెలియకను
జీవగుణంబుల చిక్కువిడిచి తా
జీవబ్రహ్మము తావు దెలిసిన ॥కాశికి॥

వాసిగ ధరలోను కాశి ని
వాసుం డుండగను
చేసిన పాపము బాసిపోవునని
కాశికి పోదురు వాసుని గానక ॥కాశికి॥

పొందుగ ధరలోను వీర గో
విందుం డుండగను
అందమైన గురు ఈశ్వరి పాదము
అందితె కైలాసమందే యున్నది ॥కాశికి॥

ఈ తత్వంలో తీర్థయాత్రలు సేవించడాన్ని నిరసించారు బ్రహ్మంగారు. కాశీకివెళ్లి గంగాజలం తీసుకొని రావలసిన అవసరం లేదనీ కాశీ తీర్థం మన కన్నులలోనే ఉందనీ చెప్పారు. కాశీకి వెళ్లినంత మాత్రాన చేసిన పాపము పోదని చెప్పారు. "పొందుగ ధరలోను వీరగోవిందు డుండగను" అనేది తత్వం చివర అంకితముద్ర.

### ముప్పది ఒకటవ తత్వం :- (పు. 40)

యజ్ఞము చేసే సుజ్ఞానులకు
వేదోక్తపు విధి తెలియరయ్యా
ఆగమ సారముచే శబ్దము
లన్నియు మున్ను తా నెరుగవలెన్ ॥యజ్ఞ॥

అగ్ర జన్మమైనందుకు తనలో
అగ్నిని లేపి కూర్చుండవలెన్
ముగ్గురి హితముగ మూడు జన్మములు
ఫాలమందె శోధింప వలెన్ ॥యజ్ఞ॥

ఊది యూది పొయ్యూదేటప్పుడు
ఊపిరి సమరస మెరుగవలెన్
సారంబగు సంసార సాధనుతై
చవిలో చవిగని తిరుగవలెన్ ॥యజ్ఞ॥

కామ క్రోధమను పశువును బట్టి
కర్మద్వారమున కట్టవలెన్
కాకోజ్వాలల ఓలలాడుచును
ఏల బాడుచు నుండవలెన్ ॥యజ్ఞ॥

మనోబుద్ధి చిత్తాహంకారంబున
మరిగిన కండల తరుగవలెన్
సుద్ది సుక్కగా సుడిబడి కన్నుల
చూపుల మంటలు ప్రేల్చవలెన్ ॥యజ్ఞ॥

మగ్నత్వంబున నగ్నిలొ పేల్చే
మనసు కొవ్వు సాగదీయవలెన్
సుజ్ఞానంబను సుబ్రహ్మణ్యుల
సుషుప్నమందు సుర తాగవలెన్ ॥యజ్ఞ॥

సత్తు చిత్తు ఆనందం బనియెడి
చవిలో చవిగని తిరుగవలెన్
జాతి నీతులు జరా మరణములు
బూతి దోపితో కొట్టవలెన్ ॥యజ్ఞ॥

అండ పిండ బ్రహ్మాండంబులు మూడు
కుండలి యని తా నెరుగవలెన్
అంబర వీధిని రంభ ఊర్వశి
దాటి వీరగురు చేరవలెన్ ॥యజ్ఞ॥

ఈ తత్వంలో యోగసాధనను ఒకయజ్ఞంతో పోల్చారు బ్రహ్మంగారు. కుండలినీశక్తిని లేపడమే యజ్ఞగుండాన్ని వెలిగించడం. ఈ గుండం వెలిగి అగ్ని పైకిలేవడానికి ఇడా పింగళా స్వరాలను సక్రమమార్గంలో పొయ్యి ఊదినట్లు నడిపించాలి. ఈ యజ్ఞంలో కామ క్రోధాలనే పశువులను వధించాలి. మంత్రాలుగా తత్వాలను పాడాలి. ఈ యజ్ఞానికి ఫలితంగా సుషుమ్నానాడి నుంచి అమృతం స్రవిస్తుంది. ఆ అమృతాన్నే సేవించాలి. దానివలన సచ్చిదానందం కలుగుతుంది. అని బ్రహ్మంగారు చెప్పారు. సచ్చిదానందమంటే పరమాత్మ అని అర్థం. శాశ్వతంగా ప్రకాశించి బహిరంతర దృశ్యాలను ప్రకాశింపజేసేది జ్ఞానం. ఇదే ఆత్మలక్షణం. ఆనందం కూడా ఆత్మలోనే ఉంది. ఈ అంశాన్ని

1) "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"
— తైత్తిరీయోపనిషత్
ప్రథమోను వాకః
1వ వాక్యం, పు 35.

2) "ఆనందో బ్రహ్మేతి వ్యజనాత్"

— తైత్తిరీయోపనిషత్

షష్ఠోనువాకః

6వ వాక్యం, పు. 73.

అనే ఉపనిషత్ వాక్యాలు నిరూపిస్తున్నాయి. ఈ సచ్చిదానంద స్వరూపాన్ని గురించి శంకరాచార్యులు

"అఖండే సచ్చిదానందే నిర్వికల్పైక రూపిణి
స్థితేఽద్వితీయో భావేఽస్మిన్ కథం పూజావిధేయతే"

— ఆత్మపూజాగ్రంథం, శ్లో. 1

ఏకరూపం, అద్వితీయం, నిర్వికల్పం, అయిన సచ్చిదానంద స్వరూపాన్ని ఎలా పూజించాలి. అని పైశ్లోకానికి అర్థం.

## ముప్పదిరెండవ తత్వం :— (పు. 40)

మనో నిరంజనమైతేను మాటలేల మనకు
మనోనిరంజనమైతే మాటలాడ నెవ్వరితోను
ఊరికే కొన్నాళ్లుండి దినములు అంతెపోవలెను ||మనో||

కండలు ఎముకలు కాయము తోలు
శివునికి హారమాయెనయా
వెడలు దేహమిది సతమని నమ్మితె
ముందరగతి మనకెట్లనయా ||మనో||

కల్లు భంగి సారాయి తాగి యిల
ఒళ్లు మరచి పడ నేలనయా
తాగినప్పుడే తప్పు పూనుకొని
నొప్పి పడను మనకేలనయా ||మనో||

తిండిబోతు ముండల కెల్లను
తిరుపతి యాత్రలు ఏలనయా
త్రాగుబోతు ముండల కెల్లను
పారమార్థిక మేలనయా ॥మనో॥
గద్దరి తనమున పురుషులదిట్టే
గయ్యాళుల జోలి మనకేలనయా
హద్దుమీరి తిరిగే ముండకు
బుద్ధి చెప్ప మన కేలనయా ॥మనో॥
టక్కు పిక్కు రెండబద్ధమాడి
దినము గడుప మనకేలనయా
మూడు దినంబులు బ్రతికే జీవుని
కబద్ధమాడ నేలనయా ॥మనో॥
ఉత్తమ గురువుల పాదము బట్టితె
ఉన్న మతి పోనేలనయా
సత్యవాక్యమే నిత్యం బనుకొని
సద్గురు భజనలు సేయరయా ॥మనో॥
గురు సూత్రాకారుండయితె
గురుని గురుతే ఎరుగరయా
హరుడే శివపోతులూరి వీరబ్రహ్మము
చేర తగునని ఎరుగుడయా ॥మనో॥

బ్రహ్మంగారీ తత్వంలో ఈ దేహం అశాశ్వతమైందనీ ముందు ఆలోచించాలనీ కల్లు, బంగి, సారాయి తాగరాదనీ తిండిబోతులు తిరుపతి యాత్రలు సేవిస్తే లాభంలేదనీ తాగుబోతులకు పారమార్థిచింత అనవసరమనీ అబద్ధాలాడరాదనీ సత్యవాక్యమే నిత్యమని నమ్మాలనీ సద్గురువులను సేవించాలనీ మనోనిరంజనం కావాలనీ అంటే మనస్సులో దోషంలేకుండా చేసుకోవాలనీ ప్రబోధించారు.

## ముప్పది మూడవ తత్వం :- (పు. 41)

పాదసేవకుడ పాదరక్షకుడ గురు
పాదరేణువున కర్తుడ
విన్న మాత్రమున చెప్పవచ్చితి
అన్నలార మీకు తెలియరయా ॥పాద॥
ఆగమతంబిది యోగమతంబిది
భోగమతంబిది యోగమయా
ఈదరాదు సంసార భారముల
ఇరువు గాను పదమెదుకరయా ॥పాద॥
తెలివి లోపల తెలివై యున్నది
వేద బ్రహ్మతై తెలియరయా
అలయుచు సొలయుచు కామయోగుతై
రంభ కళలపై చిక్కరయా ॥పాద॥
సప్తకోటి మహా మంత్రములకు
సారమసారములో చవి జూడరయా
సారము తెలిసినవారే బ్రహ్మ
స్థానమందు నిలిచి యుందురయా ॥పాద॥
ఉపశ్రుతి వాక్యము లుండ జూచుకొని
మంత్రము మీరు పలుకరయా
జాతి నీతులు జనన మరణాదులు
వూచి వూచి జోకొట్టరయా ॥పాద॥
వీరవాక్యమిది ధారబోసితే
ఇందును కొందరి కందదయా
సంధి తెలియని పందమానవులు
బారి కొయ్యతై చిక్కరయా ॥పాద॥

ఈ తత్వంలో "పాదసేవకుడ పాదరక్షకుడ గురుపాదరేణువున కర్పూండ విన్నమాత్రము చెప్పవచ్చితి అన్నలార" అని బ్రహ్మంగారు చెప్పడం ఆయన వినయ గుణానికి నిదర్శనం. ఈ తత్వంలో నిష్కామ కర్మ యోగాన్ని సాధించండని ఉపదేశించారు. ఉపశ్రుతి వాక్యాలను చదవమన్నారు. ఉపనిషత్ మహావాక్యాలు నాలుగు

| | | |
|---|---|---|
| 1) | "ప్రజ్ఞానం బ్రహ్మ" | ఋగ్వేదం<br>ఐతరేయోపనిషత్<br>తృతీయాధ్యాయం, పు. 48. |
| 2) | "అహం బ్రహ్మాస్మి" | యజుర్వేదం<br>బృహదారణ్యకోపనిషత్<br>ప్రథమాధ్యాయం, పు. 27. |
| 3) | "తత్వమసి" | సామవేదం<br>ఛాందోగ్య శ్రుతి<br>షష్ఠప్రపాఠకం,<br>అష్టమ ఖండం, పు. 293. |
| 4) | "అయమాత్మాబ్రహ్మ" | అథర్వ వేదం<br>మాండూక్యోపనిషత్<br>శ్లోకం 2, పు. 24. |

ఈ నాలుగు వాక్యాలు అద్వైత సిద్ధాంతాన్ని బోధిస్తున్నాయి. ఈ మార్గంలో నడవండని బ్రహ్మంగారు బోధించారు.

## ముప్పది నాలుగవ తత్వం :— (పు. 41, 42)

కనకము దగ్గరికే పోయి కదలకే మనసా
కనకము దాటితే కలుగునే సేవా
చెడుగుణంబుల చిక్కి చెడిపోకె మనసా
చేరి సద్గురుని సేవింపవే మనసా ॥కన॥

అలుబిడ్డల నమ్మి అల్లాడకే మనసా
ఆనందమై యింటిలో ఆట్లాడవే మనసా ॥కన॥
సంత కూటమిది సంతసించకె మనసా
సాగిపొయ్యేదారి సాధించవే మనసా ॥కన॥
నీవు నేను అని నిక్కకే మనసా
నీలతోయద మధ్య నిలువవే మనసా ॥కన॥
మూన్నాళ్ల బ్రతుకిది మురియకే మనసా
ముక్తికాంత నంటి ముద్దాడవే మనసా ॥కన॥
మట్టికుండ యిది మది చెడకె మనసా
మహనీయ జ్యోతిని మరువకే మనసా ॥కన॥
ఎప్పుడో ఏవేళో ఎరుగవే మనసా
ఎరుకలోని ఎరుక ఎరుగవే మనసా ॥కన॥
వీరయ్య దాసుని వినవె ఓ మనసా
వివరమెరిగి నీవు వింతగను మనసా ॥కన॥

"మనసా" అనే సంబుద్ధితో బ్రహ్మంగారి తత్వంలో బోధించారు. ధనేషణ కూడదనీ చెడుగుణాలకు చిక్కవద్దనీ సద్గురువులను సేవించమనీ ఈ సంసారమనేది సంతలాంటిదనీ అలుబిడ్డలు అశాశ్వతమైనవారనీ ఈ సంసారం మాయ అనీ భగవంతునిచేరే మార్గంలో పయనించండనీ మూన్నాళ్ల బ్రతుకునకు మురియవద్దనీ అన్నారు. చివరకు "నీల తోయద మధ్య నిలువవే మనసా!" అని అన్నారు. "నీలతోయద మధ్య" అనే పదం ఈక్రింది మంత్రంలో ఉంది.

"తస్య మధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః
నీలతోయద మధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా"
— యజుర్వేదం, నారాయణసూక్తం.

జఠరాగ్నికిమధ్య సూక్ష్మమైన అగ్నిజ్వాల పైకి ఎగురుతూ ఉంటుంది. అది నల్లని మేఘంలోని మెరుపులా ప్రకాశిస్తూ ఉంటుందని పైమంత్రానికి అర్థం. నల్లని మేఘంలో ఉండే మెరపులాంటి శక్తి మానవ శరీరంలో ఉందనీ ఆ జ్యోతిలో నిలువుమనీ బ్రహ్మంగారు ఈ తత్వంలో ప్రబోధించారు.

## ముప్పది ఐదవ తత్వం :- (పు. 42)

ప్రపంచ నడత జూడా మన
పెద్దల వాక్యము బాటా
ముగ్గురు మూర్తులు జూటా
మూలము ఎరుగుట బాటా ॥ప్రపం॥

చదువు శాస్త్రములు జూటా ఒరె
సద్గతి ఎరుగుట బాటా ॥ప్రపం॥

అన్నిటి గొల్చుట జూటా తన
ఆత్మలో ఎరుగుట బాటా ॥ప్రపం॥

మంత్ర తంత్రములు జూటా మరి
మదిలో ఎరుగుట బాటా ॥ప్రపం॥

ఎగ్గులుచేయుట జూటా రాజ
యోగము నెరుగుట బాటా ॥ప్రపం॥

కొండలు తిరుగుట జూటా ఈ
కోటులు ఎరుగుట బాటా ॥ప్రపం॥

కాశికి పొయ్యేది జూటా మన
కంటిలో నెరుగుట బాటా ॥ప్రపం॥

గురువులేని బాటా జూటా గురు
కీలక మెరుగుట బాటా ॥ప్రపం॥
పరులను ఎరుగుట జూటా గురు
పాదము లెరుగుట బాటా ॥ప్రపం॥
వీరయ దాసుని మాట దాని
వివరము నెరుగుట బాటా ॥ప్రపం॥
నమ్మనివారికి జూటా గురు
నమ్మిన వారికి బాటా ॥ప్రపం॥

ఈ తత్వంలో బ్రహ్మంగారు పెద్దల వాక్యాలను అనుసరించాలనీ మంచిమార్గాన్ని అనుసరించాలనీ దేవతలందరినీ పూజించడం కాదు. ఆత్మలో తెలుసుకోవాలనీ మంత్రతంత్రాలు అబద్ధాలనీ కొండలు తిరగడం అనవసరమనీ కాశీకి పోవడం వ్యర్ధమనీ గురువులేని బాటన నడువవద్దనీ రాజయోగాన్ని అనుసరించడం మంచిదనీ బోధించారు. రాజయోగాన్ని సాంఖ్య. తారక, అమనస్క అని మూడు శాఖలుగా విభజింపవచ్చు. ఈ యోగాన్ని గురించి సీతా రామాంజనేయ సంవాదం అనే వేదాంత గ్రంథంలో పరశురామపంతుల లింగమూర్తి ఇలా రాశాడు.

"రాజయోగంబు బూని నిరంతరంబు
పట్టుగా నభ్యసింపంగ బ్రాలుమాలి
కొన్ని వేదాంత యుక్తులు కూడబెట్టి
పలుక నేర్చిన బ్రహ్మానుభవము గలదె"

ప్రథమాశ్వాసం, ప. 93

రాజయోగాన్ని సాధించకుండా కొన్ని వేదాంతపు మాటలు నేర్చుకొంటే బ్రహ్మజ్ఞానం కలుగదనీ పై పద్యానికి తాత్పర్యం. ఇటువంటి

రాజయోగాన్ని సాధించడం ఉత్తమమైన బాట అని బ్రహ్మంగారు చెప్పారు.

ముప్పది ఆరవ తత్వం :— (పు. 43.)

ఈ జన్మమిక దుర్లభమురా ఓరి
సాజన్మ సాకార సద్గురుని గనరా
పంచాక్షరీ మంత్ర పఠన చేయన్నా
పఠన జేసిన యముడు పారిపోవు నన్నా ॥ఈ॥

పారిపోతే అంబ ఫలమిచ్చు నన్నా
ఫలము నందినవాడు పరమ గురుడన్నా ॥ఈ॥
మూడారు వాకిళ్లు మూయవలె నన్నా
ముక్తివాకిట నిలచి తలుపు దీయన్నా ॥ఈ॥
తలుపు తీసిన అంబ తేజమిచ్చునన్న
తేజమందిన వాడు తా గురుడో యన్నా ॥ఈ॥

ఆరు నదులమీద అంబ యుందన్నా
అంబతో దుర్గాంబ ఆట్లాడునన్న ॥ఈ॥
ఆట్లాటలో మంచి అర్థముందన్న
అర్థమెరిగినవాడు హరి గురుడన్నా ॥ఈ॥
నాసికములో దృష్టి నడిపించుమన్న
నడిపించి హరి నీవు నమ్మియుండన్న ॥ఈ॥
నమ్మి నవరత్నముల పీఠమెక్కన్న
పీఠమెక్కిన అంబ పిలుచునో యన్నా ॥ఈ॥
పిలిచినంతటు నీవు నిలుచుండుమన్నా
పిలిచినంతటు వాడు నిజగురుడన్నా ॥ఈ॥

జంట్రగోవులు రెంటి నంటియుండన్నా
అంటి యూది మేన్మరచి యట్టె నిలువన్నా ॥ఈ॥
మేను మరచి ఘంటనాదము వినుమన్న
నాదము విని పోతులూరిని నమ్మియుండన్న ॥ఈ॥

ఈ తత్వంలోకూడా యోగసాధనను చెయ్యవలసినదిగా బ్రహ్మంగారు బోధించారు. పంచాక్షరీ మంత్రాన్ని పఠించాలనీ నవరంధ్రాలను బిగించి యోగాన్ని సాధించాలనీ నాసికాగ్రంలో దృష్టి నిలిపి శ్వాసలను సక్రమంగా నడిపితే యోగం సిద్ధిస్తుందనీ చెప్పారు. "నాదము విని పోతులూరిని నమ్మియుండన్నా" అనేది అంకితముద్ర.

## *ముప్పది యేడవ తత్వం :-* (పు. 44, 45)

ఎంతలెక్క తిరిగినా ఏమి లేదురా
చింత చేసి చూడకున్న వింతలేదురా
ముక్కు దిక్కు ఎక్కుబెట్టి నిక్కి చూడరా
అదిక్కు మూలమేమొ గాని దివ్యమాయెరా ॥ఎం॥

మునుగులోనె మునుగువేసి పొసగజూడరా
ఆ మునుగులోనె మునుగు దీసి ముక్తిచూడరా ॥ఎం॥

ఆకసమున గాలి విసరె అదిగో చూడరా
ఆగాలి మూలమేమొ గాని మూల చూడరా ॥ఎం॥

మూల మూల శోధించి ముక్తి జూడరా
అ మూలనున్న జ్యోతిని ముట్టించి చూడరా ॥ఎం॥

చల్లగాలి విసిరితే మొల్లలాయెరా
ఆమొల్లల్నాశించి (ముక్తి) వాసన కొలలాయెరా ॥ఎం॥

ఎరుపు నలుపు తెలుపు నదిఏమొ చూడరా
పచ్చ పసుపు కలిపినట్టి పద్మమాయెరా ॥ఎం॥
సత్తు చిత్తు నొక్కటైతె శివుని పేరురా
ఆసత్తు పోతులూరి బ్రహ్మస్వామి పేరురా ॥ఎం॥

ఈ తత్వంలో కూడా యోగసాధనను గురించే చెప్పారు. దృష్టిని నాసికాగ్రం మీద నిలిపి ఇడా, పింగళ స్వరాలను సక్రమంగా నడిపితే సచ్చిదానంద స్వరూపం కనిపిస్తుంది. అని బ్రహ్మంగారు చెప్పారు. ఈతత్వంలో "ఆసత్తు పోతులూరి బ్రహ్మస్వామి పేరురా" అనేది అంకితముద్ర.

## బ్రహ్మంగారు చెప్పిన భూత భవిష్యత్ వర్తమానాలు :-

సాహిత్యంలో ఉన్న వివిధ ప్రక్రియలను స్వీకరించి బ్రహ్మంగారు కాలజ్ఞాన గ్రంథాన్ని సంతరించారు. కాలజ్ఞానంలోని భూత భవిష్యత్ వర్తమానాంశాలను వింగడించాలంటే ప్రథమంగా భూత భవిష్యర్వర్తమానాలంటే ఏమిటో ఒక నిర్దిష్టమైన అవగాహన ఏర్పాటు చేసుకోవాలి. భూతకాలమంటే బ్రహ్మంగారి పుట్టుకకు పూర్వకాలం, అంటే క్రీ॥ శ। 1608వ సంవత్సరానికి పూర్వకాలం. భవిష్యత్ కాలమంటే బ్రహ్మంగారు సమాధిప్రవేశం చేసిన తరువాత కాలం. అంటే క్రీ॥శ॥ 1693వ సంవత్సరానికి తరువాతకాలం. వర్తమాన కాలమంటే క్రీ॥ శ॥ 1608 మొదలుకొని క్రీ॥ శ॥ 1693 సంవత్సరాల మధ్యకాలం అని చెప్పవచ్చు. బ్రహ్మంగారికి వర్తమానమైన ఈకాలంలో ఆయన చెప్పిన కొన్నిఅంశాలు సమీప భవిష్యత్తులో జరిగాయి. ఆయన సమకాలికాంశాలను కూడా వర్ణించారు. కనుక ఆయన జన్మించినదాదీ సమాధిప్రవేశం చేసినంతవరకు చెప్పబడిన అంశాలను వర్తమానాలుగా

నిర్ణయించడం జరిగింది. బ్రహ్మంగారు పలికిన భూత భవిష్యద్వర్త మానాలు రాజకీయ, మత, సామాజికాలుగా విభజింపబడి ఈ క్రింద ప్రదర్శించ బడుతున్నాయి.

## రాజకీయ సంబంధి వచనాలు :-

### భూత కాలికాలు :-

1) శాలివాహన శకవర్షంబులు 1258 అగునేటికి ధాతనామ సంవత్సర వైశాఖ శు॥ ౭లు హరిహరరాయలు ఆనగొంది 7 ఏండ్లు ఏలెను. స్వభాను నామ సంవత్సర వైశాఖ మాసమున విజయనగర నిర్మాణము చేసిరి. అక్కడ పాలించిన సంవత్సరములు 7. ఉభయం 14.

2) అతని తమ్ముడు బుక్కరాయలు పట్టము గట్టుకొని యేలిన యేండ్లు 29, నెలలు 8.

3) రెండవ హరిహరరాయలు పట్టము గట్టుకొని యేలినయేండ్లు 22.

4) విజయ బుక్కరాయలు యేలిన యేండ్లు 17.

5) పల్లె బుక్కరాయలు యేలినయేండ్లు 16.

6) గండదేవరాయలు యేలిన యేండ్లు 21.

7) రాజశేఖరరాయలు యేలిన యేండ్లు 6.

8) విజయబుక్కరాయలు యేలిన యేండ్లు, నెలలు, 10.

9) ప్రౌఢదేవరాయలు యేలిన యేండ్లు 21.

10) విరూపాక్షరాయలు యేలిన యేండ్లు 4.

11) మల్లికార్జునరాయలు యేలిన యేండ్లు 6.

12) రామచంద్రరాయలు యేలినది 1 సంవత్సరం.

13) రెండో హరిహరరాయలు యేలినయేండ్లు 12.

14) అంతట కురుపట్నాలు 133 యేలినయేండ్లు 155.
15) స్వతంత్రముగా సాళువ నరసింహరాయలు యేలిన యేండ్లు 5.
16) అతని కుమారుని ముందర బెట్టుకొని నరసరాయలు యేలిన యేండ్లు 13.
17) అతని కుమారుడు వీరనరసింహులు తమ్ముఁరాయలను చంపించి రక్తాక్షినామ సంవత్సరం ఆరభ్యం యేలినయేండ్లు 5.
18) నరసరాయని రెండవ కుమారుడు కృష్ణరాయలు శుక్ల నామ సంవత్సర వైశాఖమాసం ఆరభ్యంగాను యేలినయేండ్లు 21.
19) అచ్యుతరాయలు కుమారుని చంపించి యేలిననెలలు 8. శోభకృతు నామ సంవత్సరం ఆరభ్యంగాను యేలినయేండ్లు 22.
20) సదాశివరాయలను ముందరబెట్టుకొని రామరాయలు యేలినది.
21) రామరాజుతో విజయనగర పాలనము కడ అయిపోయెను. గనుక అవాంతరము యేండ్లు 7.
22) అటుతరువాత ప్రమోదూత నామ సంవత్సరంబున తిరుమల రాయడు పెనుగొండ పట్టణము గట్టుకొని యేలిననెలలు 10.
23) అతని కుమారుడు శ్రీరంగరాయలు యేలిన యేండ్లు అంగీరస నామ సంవత్సర ఆషాఢ శు॥ ౧౦లు ఆరభ్యంగాను యేలిన యేండ్లు 14.
24) పార్థివనామ సంవత్సర మాఘమాసం ఆరంభంగాను వెంకటపతి రాయలు యేలినయేండ్లు 28, నెలలు 7, దినములు 15.
25) ఆమీదట సోమవంశంవారికి పట్నాలు లేవు.

ఇంతవరకూ ఉన్న ఈ కాలజ్ఞాన వచనాలు కాలజ్ఞానం 2, 3, పుటల లోనివి. ఈ వచనాల్లో విజయనగర సామ్రాజ్య స్థాపన మొదలు విజయనగర - పతనం వరకూ ఉన్న విజయనగర రాజుల పరిపాలన వర్ణింపబడింది. పై వచనాలు అర్థాన్ని అపేక్షించని స్పష్టమైన ధోరణిలో

రాయబడ్డాయి. ఈ విషయం ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే బ్రహ్మంగారి కాలజ్ఞానవచనాలు మర్మంగాఉండి అర్థాన్ని అపేక్షిస్తాయి గనుక. ఇకమీాదట రాయబడిన కాలజ్ఞాన వచనాలకు సుబోధకంగా లేనివాటికి మాత్రమే అర్థం చెప్పబడింది.

26) అక్బరి గుర్రాలు తుంగభద్రనీళ్లు తాగినదే మొదలుగాను ప్రజా క్షయ మయ్యేదే గుర్తు. (పు. 94)

ఈవచనానికి "కాలనిర్ణయం" అనే శీర్షికలో విపులంగా అర్థం చెప్ప బడింది.

## వర్తమానకాలికాలు :-

బ్రహ్మంగారు క్రీ॥ శ॥ 1608లో జన్మించి క్రీ॥ శ॥ 1693లో సమాధి ప్రవేశం చేశారు. ఈ మధ్యకాలంలో బ్రహ్మంగారు చెప్పిన అంశాలు వర్తమానాలుగా గ్రహించబడ్డాయి. కనుక వర్తమాన కాల మంటే బ్రహ్మంగారు సమాధి ప్రవేశించకముందు కాలమేనని నిర్ణ యించి అప్పుడు జరిగిన అంశాలను మాత్రమే వర్తమానకాలం క్రింద వివరించడం జరిగింది.

1) ఇదిగాక ఔరంగశాయి రామావతారం పెండారీ మరాఠీ బలాలు కపులనబడుదురు. (పు. 23)

బ్రహ్మంగారు కందిమల్లయపల్లెలో ఉన్నరోజుల్లో ఢిల్లీ సింహాసనంమీాద ఔరంగజేబు ఉన్నాడు. అతడే ఔరంగశాయి కావచ్చు. రామావతారం అంటే రామునిలాంటివాడు అని అర్థం చెప్పవచ్చు. శివాజీ మరణానంతరం మరాఠీ సైనికులు వృత్తులులేక దోపిడీలు చేశారు.

2) కర్ణాటక రాజులు కారడవిలో బడిరి. (పు. 44)
3) గుత్తి పెనుగొండ బెబ్బులి జొచ్చును. (పు. 49)

పై రెండు వచనాలకూ "కాలనిర్ణయం" అనే శీర్షిక క్రింద స్పష్టమైన అర్థం చెప్పబడింది

4) కురు పట్నంబులును, తుళు పట్నంబులును భూమి సకలసమృద్ధి పొంది ఉండును. (పు. 57)
5) ఆ రాయపట్నాలవారు మాఘమందె నష్టమందిరి. (పు. 57)
6) అటుమీద రామరాజు సింహాసనంబవలంబించియే పోయెను. (పు. 57)
7) కందవోలు తురకలకు యిచ్చి శతతారాగ్ర ధర్మచరణం రాజు మూలచేరి మాఘమందే పోవును. (పు. 57)

ఈ వచనంలోని "శతతారాగ్ర ధర్మచరణం రాజుమూల" అనే మాటలకు అర్థం తోచదు. కర్నూలు పట్నం హిందూ రాజులచేత తురకల కివ్వబడిందనే అర్థం తెలుస్తున్నది.

8) చిన్నసాని తిమ్మననుంచి వానివంశ మణగును. (పు. 58)
9) మట్లవాడు గుండుబడి చచ్చును. (పు. 58)
10) చలమలరెడ్డివారి వంశము నష్టము బొందగలదు. (పు. 58)
11) ఆనెగొంది నుండు రాజులు అనుక్రమాన దురాచారం కలిగి దుర్జనులగూడి బ్రహ్మహత్యా ఘాతుకులై స్వజన హింసాపరులై పరస్త్రీ పరద్రవ్య చింతనులై యితరిపరి మొగల్‌వారిని అనువర్తించి బహులేమి జెంది సామభేద దండోపాయంబు వహించి అర్థసత్యం బొంది సన్యాసులై నిలువుతురు. (పు. 58)

12) జీవనక్షత్రంబుల శని సంచరింపగా పూర్వీకులైన నందేల యేలె అవురురాజు అపరాధనులై ౨ యేండ్లు ౧౧ నెలలు ఆస్థలం యేలుదురు.

13) ఆదవేణి కందనవోలు యేలిన అయిదోవర్గు యందలి తృతీయ వర్గత్రయం పేరిట తురకనాశనం అయి రాజ్యభ్రష్టుత్వం బొందిపోవును. (పు. 58)

ఈ వచనంలో చెప్పబడిన "అయిదోవర్గు యందలి తృతీయ వర్గత్రయం పేరిట" అనేదానికి అర్థం తెలియటల్లేదు.

14) మరిన్ని మఘ నక్షత్రమందు విజాతిపురము గోలుకొండ అశ్వపతి వారు కట్టుకొని ఆనగరాలలో చెల్లు దేశములకు హానిన్ని చరాచూరులు చేరి చెరుతురు. (పు. 58)

15) విభవమందు రాచూరు కందనవోలు ఆదవేణి దుర్గత్రయం బోవును. (పు. 58)

16) రాచశూన్యమైన దేశమందున్న దేశబ్రాహ్మణులు వృత్తిశూన్యులై మొగలివారలచేత దండహింసల బాధలబొంది విదేశీయగతులగుదురు.

17) వినుకొండ, బెల్లంకొండ, కొండవీడు, గుత్తి, గుఱ్ఱంకొండ, గండికోట, చంద్రగిరి, ఏలూరు, ఆరణి, చెంచుదుర్గంబులు మారుతోకణం కాగలవు.

పదహారవ వచనంలో అరాచకంగా ఉన్న దేశంలో విశ్వకర్మలు తమతమ వృత్తులు కోల్పోయి మొగలాయిలచేత శిక్షించబడి ఇతర దేశాలకు వెళ్లిపోతారనీ చెప్పబడింది. పదిహేడవ వచనంలోని "మారుతోకణం" అనే పదానికి ప్రకరణంలో అర్థం కనిపించలేదు.

18) కొన్నాళ్లు రాజులనే వేరు లేక కర్ణాటకం మ్లేచ్ఛకులాంతక మవును. (పు. 108)

19) అక్కరి గుర్రాలు తుంగభద్ర నీళ్లు తాగినదే మొదలుగాను మూడు దినాలకు వచ్చేము. (పు. 194)

ఈ వచనానికి "కాలనిర్ణయం" అనే శీర్షిక క్రింద అర్థం చెప్ప బడింది.

## భవిష్యదంశాలు:-

1) వీరభోగ వసంతరాయలు రాజ్యంచేసేది ౧౦౦ యేండ్లు వారి వారి సాంప్రదాయకంవారు చేసేది వెయ్యియేండ్లు. (పు. 5)

వీరబోగ వసంతరాయలు అంటే కలియుగంలో అవతరించబోయే విష్ణువు. తానే ఆ విష్ణువునని బ్రహ్మంగారు చెప్పారు. వీరభోగ వసంతరాయలు 100 సంవత్సరాలూ ఆయన సంతతివారు 1000 సంవత్స రాలూ పాలిస్తారట.

2) మొగలాయి గుఱ్ఱము రామేశ్వరమంటెనా శ్రీముఖమని నిదాన మాయెను. (పు. 22)

ఈవచనానికి "కాలనిర్ణయం" అనే శీర్షికలో అర్థం చెప్పబడింది.

3) అరవ దొరతనాలు చెడీని. (పు. 107)

తమిళరాజుల అధికారాలు అంతరిస్తాయని పై వచనానికి అర్థం.

4) ఒకరిదుర్గం ఒకరు పాలించేరు. (పు. 107)

5) అయిదువేల నాల్గు సంవత్సరంబు నాను
అవనీంద్రుడు అస్తమించేను మా
అయిదువేల ముప్పదారింటి మీదటు
అమితముగ యుద్ధములు జరుగూనుమా (పు. 222)

బ్రహ్మంగారు కలియుగంలో జరుగబోయే అంశాన్ని పైవచనంలో

చెప్పారు. కలియుగం 5004 అంటే క్రీ॥ శ॥ 1904.1 లో ఒక రాజు అస్తమిస్తాడని చెప్పారు. 1903 జూన్ 11వ తేదీన కింగ్ అలెగ్జాండర్ ఆఫ్ సెర్బియా హత్య చేయబడ్డాడు.2 కలియుగం 5036 అంటే 1936 తరువాత యుద్ధాలు జరుగుతాయని చెప్పారు. 1936 తరువాత రెండవ ప్రపంచయుద్ధం జరిగింది.

6) బహుధాన్య విక్రమ వత్సరంబుల లోన
బహుగ యుద్ధమూలు జరిగేనుమా
రాహుకేతులవలె రారాజు లిద్దరు
రణరంగమున కాలు దువ్వేరుమా (పు. 222)

బహుధాన్య విక్రమ సంవత్సరాలు ఇప్పటికి జరిగిపోయిన వయితే క్రీ॥ శ॥ 1938 - 1940 సంవత్సరాలు. బహుశః రెండో ప్రపంచ యుద్ధం కావచ్చు. జరుగబోయే వయితే క్రీ॥ శ॥ 1998-2000 సంవత్స రాలు కావచ్చు. అప్పటికి మూడవ ప్రపంచయుద్ధం వస్తుందేమో?

7) కోయ రాజ్యంబంత గొడవల పాలవును
కోయ నాయకుడతి కోపంబుతో
కువలయ పతికి బహు కష్టములు కలిగించి
అవనిలో అదృశ్యు డయ్యానిమా— (పు. 223)

భారత స్వాతంత్ర్య సంగ్రామంలో కోయవాళ్లను సమీకరించి వారికి నాయకత్వం వహించి తెల్లవారికి బహుకష్టాలు కలిగించిన అల్లూరి సీతారామరాజు విషయం కావచ్చు ఇది.

---

1. కలియుగం 3100 సంవత్సరాలు గడిచిపోయిన తరువాత క్రీ॥ శ॥ ప్రారంభ మైంది మొత్తం కలియుగం సంవత్సరాలు 5083 గడిచిపోయాయి. ఈ సంవత్సరాల్లో 3100 సంవత్సరాలు తీసివేస్తే ఆంగ్లసంవత్సరాలు వస్తాయి.
2. **Satyamurthy, K, Historical Table** — ప్రచు : అంతర్జాతీయ తెలుగుసంస్థ, హైదరాబాదు, 1978, పు. 163.

8) అయిదువేల పదురెంటిలోన నొక్క
అవనీంద్రుడు దివికేగూనుగా— (పు. 223)

కలియుగం 5012 అంటే క్రీ॥ శ॥ 1912లో ఒకరాజు మరణిస్తాడని బ్రహ్మంగారు చెప్పారు. క్రీ॥ శ॥ 1910 నవంబర్‌లో ఎడ్వర్డ్ 7th మరణించాడు.1 పైన చెప్పబడిన అంశంలో రెండు సంవత్సరాలు తేడా వస్తున్నది. కలియుగం ప్రారంభమై క్రీ॥ శ॥ 3100 అని కొందరూ 3102 అని కొందరూ చారిత్రకులు చేసిన నిర్ణయాల తేడాను బట్టి ఈసంవత్సరాలు తేడా వస్తున్నాయి. కలియుగ సంవత్సరాల్లో 3102 సంవత్సరాలు తీసివేస్తే క్రీ॥ శ॥ 1910 వస్తుంది. అది ఎడ్వర్డు చక్రవర్తి మరణించిన సంవత్సరం.

9) మీసాము లేనోడి దేశాని కొచ్చిని
మహి కొండలకు జెండలేసీనిమా— (పు. 224)

మీసం లేనివాడంటే ఆంగ్లేయుడు. అతడు ఈ దేశానికి వస్తాడనీ కొండలకు జెండాలు వేస్తాడనీ అంటే ఇక్కడి రాజుల కోటలమీద అధికార పతాకాలు ఎగురవేస్తాడనీ పైవచనానికి అర్థం చెప్పవచ్చు.

10) నాల్గువేల యనమన్నూట ముప్పది యేండ్లు
కలియుగాబ్దమూలు జరిగీనిమా
కలియందు శ్వేతముఖులు దొరలయ్యేరు
మెలకువతొ రాజ్యమేలేరుమా— (పు. 225)

కలియుగం 4830 ఏండ్లు జరిగిన తరువాత అంటే క్రీ॥శ॥ 1730 తరువాత తెల్లదొరలు రాజ్యపరిపాలన చేస్తారనీ పైవచనానికి అర్థం.

---

1. Satyamurthy, K, Historical Tables — ప్రచు : అంతర్జాతీయ తెలుగుసంస్థ, హైదరాబాదు, 1978, పు. 165.

## మత సంబంధి వచనాలు :-

### భూత కాలికాలు :-

1. షణ్మతంబులకు భేదము లేదని పల్కుతో పల్కే విరాట్టు అతడే నేను. నేనే తాను తానే నేను. (పు. 15.)

షణ్మత స్థాపనాచార్యుడని శంకరాచార్యులకు పేరు వచ్చింది. అ శంకరాచార్యుణ్ణి నేనని బ్రహ్మంగారు చెప్పారు. అంటే ఆయనకూ తనకూ భేదంలేదని బ్రహ్మంగారి అభిప్రాయం. శంకరుని అద్వైత సిద్ధాంతమే తనదని బ్రహ్మంగారు చెప్పారు.

2. యేమంటివా యన మూడునామాల దాసరి ప్రబలగలడు.

(పు. 21)

మూడునామాల దాసరి అంటే రామానుజాచార్యులు. ఆయన ప్రభవించి తన సిద్ధాంతంతో ప్రసిద్ధుడయ్యాడు. ఈ వచనంలో భూత కాలం భవిష్యత్తుగా చెప్పబడింది.

3. తెల్లకోకలు తిరుమణి తిరుచూర్ణం కట్టడి చేస్తిమి. (పు. 42)

తెల్లకోకలు అంటే తెల్లని పట్టువస్త్రాలు. తిరుమణి, తిరుచూర్ణం వైష్ణవుల అలంకారాలు. కట్టడి చేయడం అంటే నిర్ణయించడం.

4. శ్రుతి పురాణేతి హాసాలలోను మా అవతార మహిమ పూర్వ మహిమను పూర్వమైన మునులు ఆనతిచ్చినారు. (పు. 96)

వేదాలను, పురాణాలను, ఇతిహాసాలను, చెప్పిన పూర్వ మునులు తన అవతార మహిమను పూర్వమహిమను వర్ణించారని బ్రహ్మంగారు చెప్పారు. తాను విష్ణువుయొక్క అవతారాన్నని బ్రహ్మం గారి అభిప్రాయం.

## వర్తమాన కాలికాలు :—

1) ఓం నమో నారాయణాయ మంత్రంబు చతుర్దశ భువన భూభాగమున యీలోకముల జగతి శత్రువును నాశనంచేసి మిగుల పదో అవతారంబు ........ (పు. 31)

వైష్ణవమత సంబంధమైన ఈ అష్టాక్షరీ మంత్రం ఆంధ్ర దేశంలో ముమ్మరంగా ప్రచారంలో ఉంది. ఈ మంత్రంవల్ల ప్రపంచ మంతా వ్యాపించిఉన్న పాపం నశిస్తుందని బ్రహ్మంగారు చెప్పారు.

2) ఆ దినము మీద రాజాధిరాజులు రామానుజకూటమున పంక్తి. (పు. 33)

క్రీ॥ శ॥ 17వ శతాబ్దిలో రామానుజుని మతం విశేష ప్రచారాన్ని పొందింది. ఆనాటి రాజులు ఈ సిద్ధాంతాన్ని అనుసరించారు. ఈ మతస్థుల కూటాల్లో కులవిచక్షణ లేకుండా సహపంక్తి భోజనాలు జరిగాయి. మహారాజులు కూడా చాపకూటి పంక్తిలో పాల్గొన్న విషయాన్ని బ్రహ్మంగారు చెప్పారు.

3) నేడు మేము ఆనెగొందిలో ఆదికేశవుడే దేవుడని చాటిస్తిమి. (పు. 43)

ఆనెగొందిలో ఒకరోజు బ్రహ్మంగారు ఆదివిష్ణువు ఒక్కడే దేవుడని ప్రచారంచేసిన విషయం పైవచనంలో ప్రస్తావించబడింది.

4) పర్వత మల్లికార్జునుని పాదము ఇస్తిమి. (పు. 47)

దేవతల పాదాలు, కళ్లు, ఆయుధాలు, మున్నగువాటిని వెండి, బంగారాలతో చేసి దేవుడికి సమర్పించడం సంప్రదాయం. ఇలా బ్రహ్మంగారు చేసిఉంటారు.

5) మంగళగిరిలో మాయవాదులకు వైష్ణవులకు కలహమై రెండు
తెగలవారు మడిచేరు. (పు. 106)

ఈ వచనానికి "కాలనిర్ణయం" అనే శీర్షికలో అర్థం చెప్ప బడింది.

## భవిష్యదంశాలు :-

1) శైవ వైష్ణవ మతాలు రెండున్నూ ప్రబలముగా నడిచీని.
(పు. 107)

శైవ వైష్ణవ మతాలు రెండూ సమాన ప్రతిపత్తి కలిగి ఉంటాయని భావం.

2) యల్లమ్మ కంచూను మల్లమ్మ కంచూను
కల్లు మాంసము బెట్టి గుడిసేరుమా (పు.
కల్లా దేవతలాను గొలిచేటి వారెల్ల
నిల్వ పేరులేక పొయ్యీ్యానిమా (పు. 254)

యల్లమ్మ, మల్లమ్మ మొదలైన క్షుద్రదేవతలకు కల్లు మాంసాలను తీర్థప్రసాదాలుగా పెట్టి భక్షిస్తారనీ ఇలా పూజలు చేసే వారు నశిస్తారనీ పై గోవిందవచనానికి అర్థం.

3) మకరమందు గురుడు ప్రావేశ మయితేను
మతములన్నియు గతము లయ్యీ్యానిమా (పు. 255)

మకరరాశిలో గురువు ప్రవేశిస్తే మతాలన్నీ గతిస్తాయి. అంటే మతభేదాలు విస్మరించి ప్రజలంతా ఒకేమతంగా కలిసి మెలిసి జీవిస్తారని పైవచనంలో చెప్పబడింది.

## సామాజిక సంబంధి వచనాలు:-

### భూతకాలికాలు:-

1. ఆవులవారి భావులు పెట్టెనని అష్టాదశవర్ణాల వారన్ను చద్ది భత్యాలు కట్టుకపోయి త్రాగినారు. (పు. 23)

అనేకకులాలవారు చద్దిభోజనాలు తీసుకొనిపోయి ఒకచోట భక్షించినట్లు పైవచనం చెబుతున్నది. ఆవులవారి బావులనేది స్పష్టం కావడం లేదు.

## వర్తమానకాలికాలు:-

1. నేడు రేపటను తిరుణాల కట్టించేరు. (పు. 27)

ఒకటి రెండు రోజుల్లో తిరుణాళ్ల జరుగుతుంది అనే విషయం పై వచనంలో చెప్పబడింది.

2. మా భక్తుతైనవారు సమర్పించిన ఆవులను మాపేరు బెట్టి జితేంద్రియుడు పోషించుకుంటూ వుండెను. జితేంద్రియుని మా కులంలోకి తెస్తిమి. (పు. 43, 95)

బ్రహ్మంగారి భక్తులు ఇచ్చిన ఆవులను జితేంద్రియుడనేవాడు పోషించాడు. అతణ్ణి బ్రహ్మంగారు తమ కులంలోనికి తీసుకొన్నారు.

## భవిష్యదంశాలు:-

1. నదులలో స్త్రీలు జోలలు బాడేరు. (పు. 5)

నదులపై తేలియాడే చెక్క ఇళ్లు నిర్మించుకొని అందులో

ప్రజలు సంసారంచేస్తే స్త్రీలు నదులమీద జోలలు పాడవలసివస్తుంది. చైనా జపాన్ దేశాలలో ఇలా చెక్క ఇళ్లు నదులపై నిర్మించారు.

2. స్త్రీల కన్నుల నెత్తురు కురిచీని. (పు. 5)

పురుషాధిక్యం గల సమాజంలో తక్కువగా చూడబడుతూ సమస్యలను ఎదుర్కొంటూ బాధపడటాన్నే స్త్రీలకన్నుల్లో నెత్తురు వర్షిస్తుందని బ్రహ్మంగారు అన్నారు.

3. పంచాంగాలు మూలబడును. (పు. 72)

అంటే తిధి వార నక్షత్రాలమీద నమ్మకం పోయి ప్రజలు వాటికొరకు పంచాంగాలను చూడరని అర్థం. ప్రస్తుత సమాజంలో ఎక్కువమందికి పంచాంగాలమీద నమ్మకంలేదు. అవి మూలబడినట్లే.

4. యేమి రారా పోరా అనేమాటలు రావయ్యా పోవయ్యా అనేరు. (పు. 72)

ఆర్థికంగా వెనుకబడిన జాతులను పూర్వం అగ్రవర్ణాల వారు రారా పోరా అనేవారు. ఇప్పుడాపరిస్థితి మారిపోయింది.

5. మద మాత్సర్యాలు యెచ్చి కామక్రోధ లోభ మోహాలు వచ్చెని. (పు. 72)

6. జాతి సంకరంబులై పరస్పర వైరంబులు హెచ్చి పోట్లాటలున్ను కొట్లాటలున్ను మరణకర్మ శూన్య కృత్యంబులవల్ల బహుగా చేతురు. (పు. 105)

7. పైర్లు స్వల్పముగానే పండును. (పు. 105)

8. తండ్రులు కొడుకులు తమలో తాము కలహింతు... (పు. 105)

9. గురు, దేవ, బ్రాహ్మణ దూషణంబులు పుట్టేని. (పు. 105)

10. వారి వర్తనములు తప్పి నడిచేరు. (పు. 105)

11. వకరి చేతిసొమ్ము వకరు తీసుకొనేరు. (పు. 105)

12. చోరుల బాధలు హెచ్చిని. (పు. 105)

పై వచనాలలో చెప్పిన అంశాలు సుబోధకాలు. అందుచేత అర్థం రాయలేదు.

13. వేశ్యా వశీకరణాంజనాల చేత ప్రజలు భ్రమసి దురాశ ద్రవ్య నాశకులై దరిద్రులై చెడిపొయ్యేరు. (పు. 106)

వేశ్యలను వశంచేసుకొనే అంజనాలమీద మోజుతో ప్రజలు దురాశాపరులై ధనం పోగొట్టుకొని దరిద్రులవుతారని అర్థం.

14. దేవనిర్మితమైన వానలు చెడును. (పు. 106)

వర్షాలు ఋతుధర్మాన్ని అతిక్రమించి కురుస్తాయని పై వచనానికి అర్థం.

15. వకనిసొమ్ము వకనికి ఒకనిఆలు ఒకనికి మారుపొయ్యేరు. (పు. 106)

16. వుల్లిగడ్డాలకు వుపదేశంబిచ్చేటి
కల్ల గురువులు కలిలో నుండేరుమా (పు. 222)

ఈ వచనానికి "సందేశ సారాంశం" అనే శీర్షికలో అర్థం ఇవ్వబడింది.

17. అయిదు వేలమీద బహుధాన్య లోపల
అన్ని జాతము లొక్కటయ్యేనిమా (కాల. పు. 223)

కలియుగంలో 5000 అంటే క్రీ॥ శ॥ 1900 తరువాత వచ్చే బహుధాన్య లోపల జాతులన్నీ కలిసిపోతాయని బ్రహ్మంగారు చెప్పారు. క్రీ॥శ॥ 1938, 1998, బహుధాన్య సంవత్సరాలు.

18. తల్లూలు బిడ్డలు తగవులు నడచీని
తల్లాడించే దినము లొచ్చీనిమా (పు. 225)

తల్లి బిడ్డల మధ్య కూడా తగాదాలు వస్తాయని పై వచనానికి అర్థం.

19. ముండమోపు లెల్ల ముత్తైద లయ్యాని
ముందొచ్చె గతి మీకు తెలిసీనిమా (పు. 226)

"సందేశ సారాంశం" అనే శీర్షికలో పై వచనానికి భావం చెప్పబడింది.

20. వావి వరుసలు లేక పొయ్యేరు జగములో
వసుధాలో పంటాలు యెండీనిమా (పు. 226)

ఈ ప్రపంచంలో వావివరుసలు లేకుండా పోతాయనీ పంటలు ఎండిపోతాయనీ పై వచనం చెబుతున్నది.

21. తిరుపతి వెంకటేశ్వరుని గుడిలో
మ్లేచ్ఛులు అద్భుతంబుగ ఆడిపాడేరుమా (పు. 242)

తిరుపతి వేంకటేశ్వరుని ఆలయంలో మ్లేచ్ఛులు (అంటే హిందూమతేతరులు (ఆడి పాడతారు. అంటే వేంకటేశ్వస్వామిని పూజిస్తారని అర్థం.

## భవిష్యదుత్పాతాలు :-

1) పర్వతమున మల్లికార్జునుని గుడిలో పొగమంటలు వెడలీని.
2) గుళ్లలో దేవుళ్లకు మూర్తివంతములు వచ్చి ఊర ఊర నాట్యమాడీని.
3) దోషకారులకు చింతలు బుట్టీని.
4) శ్రీశైల మల్లికార్జునుడు సాక్షాత్కారముగా ప్రజలతో మాట్లాడి పొయ్యీని. వీరవసంతరాయలు వచ్చీని అని చెప్పీని.

5) అంపవర్షం కురిసీని.1

6) కంచి కామాక్షమ్మ ఉగ్రమువల్ల దక్షిణదేశము దొరలు శిశువులు ప్రజలు నష్టమవుదురు. కాం. పు. 3

7) ఆమీదట అష్టదిక్కులను బాలురు మొదలు నల్లగాలి వోసి నడి నెత్తి ప్రక్కలై గండమాలపుండ్లు అబ్బలు బొబ్బలు ఆకసమున పుండ్లు రాచపుండ్లు పుట్టి చత్తురు. కాల. పు. 3, 4.

8) సందేహము లేదు విచిత్ర వ్యాధులచేత ఉట్టి పడ్డట్లుగానే కూర్చున్నవారు అట్లే మడియుదురు.

9) ఆకాశమున నాలుగు చుక్కలు పుట్టును.

10) అమ్మరో తమకు ప్రాణాలు లేవని వెతపడి చచ్చేరు.

11) అష్టకుష్టువులు నోటిలో ముఖములో పుట్టి చచ్చేరు.

12) ఆకాశమున ధ్వని బుట్టీని అందువలన కొందరు నొచ్చేరు.
పు. 3, 4

13) శ్రీశైల శిఖరమున నిప్పులు రాలీని.

14) తేజమే తేజమే అనే వాక్యములు పుట్టీని.

15) వూరవూర ప్రజలు రచ్చకొట్టములవద్ద మొత్తుకొనేరు.

16) దేవి దేవి అనేశక్తి బెబ్బులివలె వాచరచీని.

17) నానా తోయాల వాక్యములు పర్వతము మీదనే పుట్టీని.

18) బసవేశ్వరుని కంట నీళ్లు గారీని కటకటా యని రంకె వేసీని ధణం ధణం యని కాలు దువ్వీని.

---

1. బాణాలవర్షం కురుస్తుందని పై వచనానికి భావం. నేటి అగ్రరాజ్యాలు పరస్పరం కలహించుకొని అణుశక్తితో దాడిజరిపితే కురిసేది అణ్వాయుధాల వర్షమే. అదే అంపవర్షం కురియడంగా భావింపవచ్చు.

19) సూర్యమండలమందు వాక్కు వాక్కు మనే ధ్వని బుట్టీని.
20) ఆకాశమున ధర్మదేవత వాచరచీని.
21) మహాదేవుని కంట నిప్పులు రాలీని.
22) బసవేశ్వరుని కన్నుల నీళ్లు గారీని జడలు ఎగసి ఎగసి ఆడీని.
23) త్రిశూల డమరుకములు కదలీని.
24) పర్వతముమీద పుట్టకంబముమీద ప్రతిమ మాట్లాడీని.
పు. 4.
25) భ్రమర ముందటు బసవేశ్వరుడు తోక విదలించుకొన్నదే గుర్తు.
గుగ్గెళ్లరాయడు ఏలూరి ఏనుగుచేత చచ్చీని. పు. 4, 5.
26) తిరుపతి వేంకటేశ్వరుని గుడిలో మ్లేచ్ఛులు ఆడిపాడేరు.
పు. 4, 5.
27) కపిధ్వజం కదలీని ఘుం అనే శబ్దము పుట్టీని.
28) నానా దిక్కులకు పంపులు ఎగసి ఎగసి అడీని.
29) తిరువళ్లూరు వీరరాఘవస్వామికి తిరుమేన చమటలు పుట్టీని.
30) లక్ష్మీదేవి కన్నుల నీళ్లు గారీని.
31) వినాయకుండు వూర వూర వేదమంత్రములు చదివీని.
32) వూర వూర బెబ్బులులు మనుష్యుల కరచి చంపీని.
33) దుర్గ స్థలాలకు తురకలు పారి గొత్తులై యుండేరు.
పు. 4, 5.
34) విలయకాలానకు గుణ్యమైన కార్యాలు గలిగీని గజిబిజి అయ్యీని.
35) ఘన సమూహములు కలకబారీని. పు. 7
36) కంఠగత వాత ఘాతకమైన కాక బుట్టీని.
37) కల్మషంబులు కాయంబు తోనే కరగీని.

38) గ్రహగతులు సుగతులు తప్పేని.

39) కాలమాన కల్పంబులకు వికల్పంబులు పుట్టేని.

40) అధ్యాత్మ యోగపురుషుని మహాప్రకాశమయ్యేని.

41) మహామన్నీలు కాలు మడచేరు.

42) ముక్కాకంఠ మల్లయ్యకు మొక్కులు చెల్లేని.

43) లంకమల రామేశుని రాక నిజమయ్యేని.

కాల. పు. 7.

44) పాలుట్ల రంగనాయకులు పసిబాలురతో మాట్లాడిపొయ్యేని.

45) ఏనుగు ఎనుములు ఎద్దులు మేకలు గొఱ్ఱెలు యివి అన్ని ఊర్జితమై యుండేని.

46) లొటిపిటలు, గాదనవాలు, సూకరములు, కుక్కలు, నక్కలు పులి, ఎలుగు, చీమ, దోమ, నల్లి, పేలు, పాము, తేలు, ఇవి మొదలైనవి నాశనమైపొయ్యేవి.

47) వ్యాధులు, కట్టుబోతులు, బాదీకాండ్లు, కొండేడు, పిల్లి, ఎలుక కొక్కు మొంగిస నాశనమై పొయ్యేరు.

పు. 18, 55.

48) లక్ష తొంభై వేలు యాదవులు మడసినట్లు తురకలు రాక్షసులు మడసేరు. పు. 39

49) త్రిపురాంతకుని గుడిముందర కంభానవున్న రాతితేలు బయలై పోవును.

50) ఈ రాతికోడి కూసి బయలై మాయమై పోవును.

51) ఈ చెరువులో నీళ్లు ఎర్రనౌను.

52) ఈ రాతినంది లేచి నాలుగు దిక్కులకు వురుకులు పెట్టును.

పు. 85

53) శ్రీశైల యాత్రలు తప్పిని.

54) ఆరెదొండ గుడియంతా చుట్టుకొనీని పెద్దపులి, పిల్లలు పెట్టీసి.

55) ఆ క్షేత్రాన (శ్రీశైలం) కల్లు చేపలు అమ్మేరు నేర్యల గుడిసెలు ఎగసీని కాకులు మడసీని. పు. 86

56) కాకులు మడసీని.

57) ౩౬౦ రోగాలు ఎగసీని వైద్యం పొరకపొయ్యాని పదిహేను యేండ్లవారు జారత్వం చేసేరు. పు. 86

58) నాగభోగ ప్రతిమ మాపారు వచ్చేరు అని కిలకిల నవ్వీని. పు. 97

59) మాయింటి ప్రాకారాన ఆరెదొండ చెట్టు పుట్టీని.

60) భ్రమర దేవళం లోను వక మొసలి వచ్చి ఏడుదినాలు వుండి పొయ్యాని. పు. 97

61) భ్రమరాంబ చాలువుగాను మంగళసూత్రం తెగిపడీని.

62) భ్రమర కంట నీళ్లు గారీని.

63) మల్లేశ్వరుని దేవళములో ఒక మొసలి ఏడుదినాలు వుండీ పొయ్యాని.

64) సిద్ధాపురం వీరన్న కుడికంట నీళ్లు గారీని.

65) ఆలింపూరు జోగులాంబ కంటను నీళ్లు గారిని.

66) ఆయమ్మ స్తనాల పాలు గారీని.

67) కందమూరి గోపాలుని గుడి ముందర తింత్రిణీమాను పుట్టీని.

68) మహానందిలో ఈశ్వరుడు వెడలించీని.

69) రెండు పాములు దేవళంలో పొరాడీని వక పాము దొడ్డది. అది శిఖరాన మూడురోజులు వుండివచ్చీని.

70) మహానందిలో పంచ మహా వాయిద్యాలు వాయించినట్లు వుండీని.

71) సూర్య నందీశ్వరుని గుడిముందర పనసమాను పుట్టీని.

72) ఆ చెట్టు ఆ క్షణమె పువ్వులు పూసీని కాయలు కాచీని పండ్లు పండీని అంతటు మాయమయ్యాని.

73) శిరివెళ్ల నరసింహుని గుడిముందర గంగరావిచెట్టు పుట్టీని.

74) నందేలలో పదహారు కొమ్మల యెదురుగుమి పుట్టీని.

పు. 97

75) జుర్రగడ్డ తిరువేంగళనాథుని గుడి ముందర యేరుమందిచెట్టు పుట్టీని.

76) బనగానపల్లెకు నాగయ్య అనేటి అయిదేండ్ల బ్రాహ్మణుడు చదువకనే వేదమంత్రాలు చదివీని.

77) అహోబిళాన దుర్నిమిత్తాలు పుట్టీని.

78) తాటిపర్తి చింతలరాయని యింటిన చండాలశబ్దం ఓం అని పలికీని.

79) చలిమెల శీమలో కల్లు బసవన్న రంకె వేశీని.

80) తిరువళ్లూరు వీరరాఘవ స్వామికి చెమట పుట్టీని.

81) భద్రకాళి వూగుతూ వుండీని.

82) కంచి కామాక్షమ్మ దేహాన చెమట పుట్టీని.

83) ఆయమ్మ కంట నీళ్లు గారీని.

84) ఆయమ్మ స్తనాల పాలు గారీని. పు 97, 98

85) ప్రజలు బహుగా చచ్చేరు

86) వాదంబులు హెచ్చీని.

87) వేశ్యా వశీకరణాంజనాల చేత ప్రజలు భ్రమసి దురాశన ద్రవ్య నాశకులై దరిద్రులై చెడిపొయ్యేరు.

88) కాళహస్తి ఈశ్వరుని ముఖమందు వుండే ద్వారపాలకుల వకముహూర్తంబున గంతులాడుదురు.

89) వెంకటేశ్వరుని కుడిభుజం అదిరీని పు. 106

90) కర్నాటకం లక్ష్మి చరించీని.

91) దేవాలయములు మ్లేచ్ఛుల పాలయ్యీని.

92) మళయాలం భ్రమగ్గిని. ధారణ తగిలీని.

93) దివ్యతిరుపతుల మార్గంబులు తప్పీని.

94) భూమి నెత్తురుచేత తడిశీని.

95) యెముకలు కొండల పొడవున బడీని.

96) భూత ప్రేత పిశాచ గ్రహాలు కోలాహలాలు ఆడీని.

97) భోభో యని ప్రజలు కూశేరు. పు. 106

98) ఆకాశాన ధ్వని బుట్టీని.

99) ఆకాశాన నాలుగు చుక్కలు పుట్టి మాయమయ్యీని.

100) హాహా యనే ధ్వని ప్రజలు పలికేరు.

101) ఆకాశాన అర్ధరాత్రి ఘణం ఘణం రాం రాం అనే శబ్దముల వినబడీని.

102) భూమి పెరిగీని.

103) భూమి వ్రక్కలయ్యీని.

104) భూమి నానా వర్ణములుగా కనిపించీని.

105) తిరువళ్లూరు వీరరాఘవస్వామికి తిరుమేన చమటలు బుట్టీని.

106) కృష్ణా గోదావరీ మధ్యమందు అనేక కలహంబులచే పోట్లాడ్చచ్చేరు.

107) వకరికొకరు లేక ప్రజలు అడవుల పాలయ్యేరు.

108) శీతోష్ణోదకములు అధికముగా కలిగి వుండును. పు. 107

109) ఈశాన్యమున నుండి విషగాలి వచ్చినను విపరీత నరులంత
జచ్చేరుమా ‌ ‌ ‌ ‌ ‌ ‌ పు. 222

110) బాగుగా అనంద వత్సరంబునాను — గుమత్లె నశియించేనుమా
పు. 224

111) కోనసీమ లోన కలతాలు బుట్టేని
సుఖ సన్నిరోగాల సమసేరుగా ‌ ‌ ‌ ‌ ‌ ‌ పు. 224

112) కంభాపు చెరువులో కలపొన్న పూసీని. ‌ ‌ ‌ ‌ ‌ ‌ పు. 226

113) కుమారస్వామి గుడి వాకిలి
యేడుదినములు మూసుక నుండేనుమా ‌ ‌ ‌ ‌ ‌ ‌ పు. 234.

114) పెన్నయొడ్డున యుండె చెన్నూరు గ్రామము
పెనుగొండ సీమకు చేరేనుమా ‌ ‌ ‌ ‌ ‌ ‌ పు. 250

115) తిరుపతికి తూర్పు చవుడు దిన్నెలలోను
ఆరు నిలువులు గల గంగ పెరిగీనిమా ‌ ‌ ‌ ‌ ‌ ‌ పు. 250

116) పన్నెండు పుట్లంత గాజులు పగిలీని
మొల పొడుగు రక్తము పారీనిమా ‌ ‌ ‌ ‌ ‌ ‌ పు. 250

117) భానుకాంతు లణగి పొయ్యీనిమా ‌ ‌ ‌ ‌ ‌ ‌ పు. 256

118) పూని పౌర్ణమి అమావాస్య అయ్యీని ‌ ‌ ‌ ‌ ‌ ‌ పు. 256

119) మల్లూరు నది పెరిగి గాబారులయ్యీని ‌ ‌ ‌ ‌ ‌ ‌ పు. 257
మార్కాపురం వారు మునిగేరుమా

## ప్రకృతి వైపరీత్యాలు :-

1] పశువులు, మేకలు, గొఱ్ఱెలు, ఆకాశమును జూచి అహో యని
అరచును.

2] జలములోనున్న జీవజంతువులు తాము చచ్చితిమని పలుకుతూ వచ్చును.

3] పర్వతమునకు ఒక మొసలివచ్చి 8 దినములుండి భ్రమరాంబ గుడిలో మేకపోతువలె అరచి మాయమయ్యీని. పు 4

4] ఆకాశము ఎర్రనయ్యీని.

5] నెత్తురువాన కురసీని పు. 5

6] కుక్కకూనలకు నక్కకూనలు బుట్టీని పు. 52

కుక్కలకు నక్కలు పుడతాయని పై వచనం చెబుతున్నది. వర్తమానకాలంలో శాస్త్రజ్ఞులు నక్కలకు కుక్కలను పుట్టించారు. టైగర్‌కు లైన్‌కు పిల్లనుపుట్టించి దానికి TION అని పేరు పెట్టారు. ఇది కలకత్తా జూలో ఉంది.

7] బనగానపల్లె పేటలో పులి జొచ్చీని.

8] నల్లముఖం వానరుడు వచ్చి బనగానపల్లె పూరవాకిటిలో ఏడ్చి పొయ్యీని. పు. 97, 98.

9] నల్లముఖం వానరులు ఊరిచుట్టూ తిరుగాడిపొయ్యీని.

10] తాడిపత్రిలో కాకులు, గద్దలు మూకలు గట్టుకొని ఆడుతూ వచ్చీని.

11] బనగానపల్లెలో మేకపోతు పాలు పితికీని. పు. 97, 98

12] యేనుగుకు పంది బుట్టీని పందికి యేనుగు బుట్టీని.

13] శిలలు కండలు గ్రక్కీని ఆ కండలు కాకులు గద్దలు భక్షించీని వాటిని జూచి ప్రజలు వెర్రిబట్టి గంతులు వేసేరు.

14] కుక్కలు గుర్రాల చంపీని. పు. 106

15] శిలావర్షం కురసీని

16] బెండ్లు మునిగీస గుండ్లు తేలీని. పు. 106

17] కాకులు వికారస్వరాలుగా కూశీని.

18] గూబలు యేడ్చీని.

19] ఝాము ఝాములకు తప్పకుండా నక్కలు కూశీని.

20] కొండవీటికి ఉత్తరాన రాతి గరుడకంబము మండీని.

21] ౪౮౬౯ యేండ్లకు యుగముపోతే కాశివద్ద గంగ కానరాక పొయ్యీని.

22] ఘాలిచేత వానచేత శ్రీశైల దక్షిణభాగానవున్న గుండ్లు దొర్లీని.

23] నెత్తురువాన కురిశీని.

24] బండలు పగిలీని.

25] ఆకాశాన గద్దలవలె కాకులు ఆడీని.

26] అప్పుడు పుట్టిన బిడ్డలు మాట్లాడీని. పు. 207

27] కృష్ణలో నడుమ బంగారు తేరు కనిపించును. ఆ తేరును చూచినవారు కన్నులు కానరాకపోవును. పు. 107

28] ఆకాశంబున నుండి రెండు బంగారు రెక్కల పక్షులు వచ్చి పురంబున వనంబుల సంచరిస్తూవుండగా పాపాత్ములైన జనులు పట్టేరు. చంపమని జనులు లక్షోపలక్షలు కన్నులు కానరాక చచ్చేరు. పు. 108

29] కడపయొద్ద యున్న కమలాపురములో కప్ప కోడికూత గూసీనిమా. పు. 222

30] గద్దా నొడిసి కాకి దన్నీనిమా. పు. 225

31] తాడిపత్రిలోన మనిషి మేకరూప మయ్యీనిమా. పు. 226

32] కందుకూరులోని స్త్రీ పురుషుడయ్యీని. పు. 227

33] ఉదయగిరి తుదను మర్రిచెట్టు క్రింద సుదతేడు నిలువులతో బుట్టీనిమా. పు. 231

34] గోల్కొండ వద్దాను గోవిందపురములో గోగర్భమున నరుడు బుట్టీనిమా. పు. 246

35] కరములు పదహారు కలిగిన కామిని గంటికోట మీాద తిరిగేనిమా. పు. 229

36] యాదగిరి యేటి జలచరములన్ని బాగుగా భువి పల్కు పల్కివిమా. పు. 234.

37] కోటకొండలోని కొంగ మాట్లాడీని. పు. 241

38] కొత్తపేట పైన పురములో ఒక్క కోతివచ్చి మాటాడీనిమా. పు. 241

39] రాయదుర్గమూన రామచిలుక వచ్చి రామధర్మజు వార్త బల్కినిమా. పు. 241

## ప్రతిజ్ఞా వచనాలు :—

ప్రతిజ్ఞ అంటే ఏదైనా ఒక విషయం తప్పక జరుగుతుందని దృఢంగా చెప్పడం. కాలజ్ఞాన గ్రంథంలో బ్రహ్మంగారు తాను చెప్పిన విషయం తప్పక జరుగుతుందని ప్రతిజ్ఞా వచనాలు పలికారు. అటువంటి ప్రతిజ్ఞావచనాలు ఈక్రింద ప్రదర్శించబడ్డాయి.

1) నానా వర్ణాలయందు సజ్జనులైన వారెవరున్నారో వారిని రక్షింతుము. ఇది తప్పరాదు. ధర్మం నిజమైతే యిది నిజమయ్యాని. పు. 6

2) రంగని పాదమే సాక్షి వ్రాసినదంతా తథ్యం. పు. 15.

3) ఇది తప్పితేను మాతను గవయగోరిన పాపాన బోదును. కాశిలో గోహత్య శిశుహత్య బ్రహ్మహత్య పాప మనుభ వింతును. పు. 24.

4) మేము మీకు యిచ్చిన వరములు అన్ని యిచ్చి రక్షిస్తే అదే పంతము మాఘ పున్నమ నాడు రక్షించేదే పంతము మేము ఆడి తప్పనిదే పంతము. పు. 28.

5) కావేటి రంగణి పాదమే సాక్షి ఈ వ్రాసినదంతా యథార్థము. పు. 31.

6) యిది మితిదప్పిన కాశిలో గోహత్య చేసిన పాపాన బోదును. పు. 45.

7) మేము రాకపోయి నట్టాయెనా కాశిలో బ్రాహ్మణవధ బ్రహ్మ హత్యలు మొదలైన పాతకాలు చేసిన పాపాన బోదుము. పు. 96.

## ఫలశ్రుతి వచనాలు :-

ప్రయోజనాన్ని గురించి తెలిపే మాటే ఫలశ్రుతి. ఏదైనా విషయాన్ని ప్రజల్లో వ్యాప్తి చేయడానికి ఫలశ్రుతిని చెబుతారు. మన పురాణకవులీ పద్ధతిని పాటించారు. ఇలాంటి ఫలశ్రుతి వచనాలు బ్రహ్మంగారి కాలజ్ఞానంలో కనిపిస్తాయి. అవి ఈక్రింద ఉదాహరించ బడ్డాయి.

1) అని పూజించి బ్రాహ్మణ పూజ చేసి బ్రాహ్మణోత్తముని నా మర్యాదగా భావించి షడ్రసోపేతంబుగా అన్నముబెట్టి తృప్తుని చేసినవారు నాకు ప్రీతిచేసినవారు వారే పరమ పుణ్యులు వారే పరమ భాగవతోత్తములు వారు ఇహ పర సౌఖ్యంబులు కొల్లలాడుదురు. వారికి నేను వశవర్తినై యుందును.

2) ఈ మంత్రమును దూషణ తిరస్కారంబులు చేసినవారు నరకమున నుండి క్రిమిభక్షణ చేతురు.

3) ఈ మంత్రమును ఎవ్వరైన నేమి భక్తిపూర్వకముగా పూజ చేసినవారు దండనమస్కారములు చేసినవారు అనేక శివ కల్పాలు నాతో జోడుగూడి సంచరింతురు.

4) ఈ మంత్రమునకు దండ నమస్కారములు భక్తిపూర్వకముగా ఎవరు చేయుచున్నారో వారు ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధియు పుత్ర పౌత్రాభి నిరంతర సకలశుభములు గలిగి వర్ధిల్లుదురు.
పు. 13.

5) యీ దండక వచనం ఎవ్వరైనగాని మంత్ర సంయుక్తులతో ధూప దీప నైవేద్య తాంబూలాదులు సమర్పించి వినినట్టాయన ఆచంద్రస్థాయి సుఖాన వర్ధిల్లుదురు. పు. 25. 26.

6) యీ గ్రంథసారము పానముచేస్తే అమృతపానం కంద అని ఆనందగురువులు చెప్పిరి. పు. 30.

7) యీ దేవ రహస్యము హాస్యము చేసినవారికి వారిరోమ కూపాలు ఎన్నో అన్ని అర్బుదసంఖ్యలు నరకకూపాన వేయించగలము. పు. 63.

8) యీ శ్లోకాలు అక్షర పరతత్వ శ్లోకాలు సాంద్ర సింధు వేదము లోనిది యీశ్లోకాలు చూచి యీపత్రిక లిఖించి మీసమీపానకు పంపించినాము అక్షరపరతత్వ లక్షణం యెరుగక యెవరు దూషింతురో వారు కులక్షయమై పోదురు.

9) యీ శ్లోకాలు అక్షరపరతత్వంబు యెరిగి యెవరు వీరధర్మజులను భజనచేతురో వారు ఆచంద్రస్థాయిగాను సుఖాన వుందురు.
పు. 69

10) మీరు యీ పత్రిక ప్రత్యేకముగా చదివించుకోనేది యీ వివరము విని దేవబ్రాహ్మణ విశ్వాసం గలిగి రామధర్మజుల మీద భక్తి గలిగి నడిపేస్తిరాయెనా ఆచంద్రస్థాయిగాను సుఖాన వుందురు. పు. 71

11) యీ వాక్యాలు కల్లోనిజమో యెరుంగము అనేవారు యెవరు గలరో వారికి చంద్రసూర్యులున్నంత పరియంతరం కారవాది నరకములు తప్పదు.

12) యిది దూషించినవారు హాస్యం చేసినవారు శతకాలాలు నరక ద్వారాన పడుదురు సమస్తమైన బాధలు వచ్చును. పు. 92.

## ప్రక్షిప్త వచనాలు :-

బ్రహ్మంగారి కాలజ్ఞాన రచనలో గడిచిన మూడువందల సంవత్సరాల్లో ప్రక్షిప్తాలు చేరినట్లు కనిపిస్తున్నది. బ్రహ్మంగారి రచనల ప్రస్తుత పరిశోధనలో ప్రక్షిప్తాలని నిర్ణయించబడిన కొన్ని వచనాలు ఈక్రింద ఉదాహరించ బడుతున్నాయి.

1) అని పూజించి బ్రాహ్మణపూజ చేసి బ్రాహ్మణోత్తముని నా మర్యాదగా భావించి షడ్రసోపేతముగా అన్నముబెట్టి తృప్తుని చేసినవారు నాయంత వారు. పు. 12

2) బ్రాహ్మణపూజా విధేయ. పు. 25

3) బ్రాహ్మణ ఆశీర్వాదము యశస్సునకు పు. 27.

4) ఆది భవ భోగమైన మంత్రంబు బ్రాహ్మణులకు చెప్పినవారు విశ్వకర్మ వంశాచారకులైనవారు. పు. 34

5) ఆరువేల కులంలోవున్న దుష్టులనెల్లా ఖండించేము. పు. 36.

6) ఈ వివరము విని దేవబ్రాహ్మణ విశ్వాసం గలిగి రామధర్మ జుల మీద భక్తిగలిగి నడిపిస్తిరాయెనా ఆచంద్రస్థాయిగాను సుఖాన వుందురు. పు. 71.

పై కాలజ్ఞాన వచనాలు పరస్పర విరుద్ధభావాలను ప్రకటిస్తున్నాయి. సర్వకులాలు సమానమేనని చెప్పి మహమ్మదీయుడైన సిద్ధయ్యను, మతంగ కులజుడైన కక్కయ్యను, బ్రాహ్మణుడైన అన్నాజయ్యను ప్రధాన శిష్యులుగా స్వీకరించిన బ్రహ్మంగారు ఒక కులాన్ని ద్వేషించారనీ ఇంకోకులాన్ని భూషించారనీ అనడం సమంజసంగా తోచదు. పై వచనాలు నిస్సందేహంగా ప్రక్షిప్తాలు. తదనంతర కాలంలో ఆయనకున్న బ్రాహ్మణ శిష్యులు బ్రాహ్మణ భక్తిని బోధించే వచనాలు చేర్చిఉండగా ఆయన విశ్వబ్రాహ్మణ శిష్యులు వారి కులాధిక్యాన్ని నిరూపించుకొనే వచనాలను చేర్చివుంటారు.

కాలజ్ఞానంలో ప్రక్షిప్తమైన మరొక ముఖ్యమైన అంశం ఈక్రింద వివరించబడింది. కాలజ్ఞానంలోని రెండవ సౌజన్యపత్రిక చివర ఇలా వ్రాయబడివుంది. "ఈ పత్రికను తీసుకొనివచ్చిన భక్తులను గ్రామము లోనికి పిలుచుకొనిపోయి ఆ భక్తులకు భత్యముయిచ్చి మఠానికి దక్షిణ యిచ్చి పై గ్రామములకు మేళతాళములతో ఊరేగింపు చేస్తూ మోతాదుల నిచ్చి పంపవలసినది. పు. 148

ఇలాంటి వ్రాతలు బ్రహ్మంగారు వ్రాయరు. ఈ వచన రచనా శైలి ఆయనది కాదు. ఆయన కాలంలో ఈ మఠనిర్మాణమే జరుగలేదు. ఇలా భత్యాలు అడుక్కొని తినదలిస్తే ఆయనకు వంశ పారంపర్యమైన హక్కుగలిగి దక్షిణలు కానుకలు భత్యాలు వచ్చే పాపఘ్ని పీఠాన్ని వదలి దేశసంచారం చెయ్యవలసిన అగత్యంలేదు. ఆయన కందిమల్లయపల్లెలో తన నివాస గృహంలో ఉండి వడ్రంగం కమ్మర వృత్తులు చేసి కుటుంబాన్ని పోషించుకొని తీరికవేళల్లో వేదాంతధర్మ

ప్రబోధాలు చేశాడు. అటువంటి కర్మయోగికి మోతాదులు[1]. అడుక్కొనే అవసరం ఉండదు. ఈ వ్రాతలు బ్రహ్మంగారు సమాధి ప్రవేశం చేసిన తరువాత మఠం నిర్మించిన తదుపరి చేర్చిన ప్రక్షిప్తాలని చెప్పడంలో సందేహంలేదు.

గోవిందవాక్యాలు అనే శీర్షికతో ఉన్న కాలజ్ఞానంలో కొన్ని వచనాలు బ్రహ్మంగారు చెప్పినవిగా తోచవు. ఉదాహరణకు –

"విశ్వంబులో విశ్వనాథావధూత యను
విశ్వబ్రాహ్మణు డొకడు పుట్టేనిమా" – పు. 222.

అనే వచనంలో భవిష్యత్తులో విశ్వనాథావధూత అనేవాడు విశ్వ బ్రాహ్మణ వంశంలో జన్మిస్తాడనే విషయం వుంది. ఈ వాక్యంలో ప్రయోగింపబడిన "విశ్వబ్రాహ్మణ" శబ్దాన్ని బ్రహ్మంగారు ఎక్కడా ప్రయోగింపలేదు. అసలాయన కాలానికి ఈ పదబంధం వాడుకలో లేదు. "విశ్వకర్మలు" అని మాత్రమే బ్రహ్మంగారి ప్రయోగం. కనుక ఈవచనం ప్రక్షిప్తమని చెప్పడంలో సందేహం లేదు.

## బ్రహ్మంగారి స్వీయవృత్తాంత సంబంధి వచనాలు:-

### భూతకాలికాలు:-

1) ముందు తాను బ్రహ్మలోకమునందు 72 బ్రహ్మకల్పములు రాజ్యపరిపాలనము చేసితినని చెప్పెను. పు. 1

---

1. మోతాదు అంటే ఒకరోజు వంటకు కావలసిన బియ్యం, కందిపప్పు, నేయి, మిరపకాయలు, ఉప్పు, మొదలైన పదార్థాలు.

2) అందుండి రజతాద్రికి బోయి 53 బ్రహ్మకల్పము లుంటిమి.

3) పిదప వైకుంఠమునకు వచ్చి 3000 యోజనముల పొడవున కూర్మసింహాసనము నిర్మించి అచ్చట 33 బ్రహ్మకల్పములు రాజ్యపరిపాలనము చేసి వైకుంఠమున మరల మాధవానంత స్వామి సేవ 297 బ్రహ్మకల్పంబులు సేయ నా స్వామి చతుర్విధ ముక్తి యిచ్చెను.

4) తర్వాత స్వామి వైకుంఠమున 10 దివ్యవర్షములుండి బనగానిపల్లె చేరి ఆదికాలమందు భూప్రదక్షిణము 150మార్లు చేసి సిద్ధాంతశిరోమణియగు ఆనందాశ్రమములయొద్ద సకల విద్యలు అభ్యసించి 1300 వత్సరములు సోభ్యం సోభ్యం అను యోగ శాస్త్రమును 19000 గ్రంథములను అభ్యసించి కాలమృత్యువు కడజేసి ఆ యోగముచే దివ్యశరీరినై 3,333 బ్రహ్మకల్పము లుంటిమి. పు. 1, 94, 95.

5) ప్రథమావతారమున ఆనందాశ్రమమునకు శిష్యుండనై 999 కోట్లు 7665 బ్రహ్మకల్పము లుంటిమి.

6) 2వ అవతారమున ఆనందాశ్రమములకు శిష్యుండనై 765 బ్రహ్మకల్పము లుంటిమి.

7) 3వ అవతారమెత్తి ఆనందాశ్రమములకు శిష్యుండనై 18 వేల యేండ్లుంటిమి.

8) 4వ అవతారమెత్తి ఆనందాశ్రమములకు శిష్యుండనై 1170 బ్రహ్మకల్పము లుంటిమి.

9) 5వ అవతారమెత్తి ఆనందాశ్రమములకు శిష్యుండనై 4 ఖర్వాలు 350 బ్రహ్మకల్పము లుంటిమి.

10) 6వ అవతారమెత్తి ఆనందాశ్రమములకు శిష్యుండనై 77 కోట్లు 237 బ్రహ్మకల్పము లుంటిమి.

11) అటుతరువాత 7వ అవతారమెత్తి అనందాశ్రమములకు శిష్యుండనై 735 బ్రహ్మకల్పము లుంటిమి.

12) 8వ అవతారమెత్తి అనందాశ్రమములకు శిష్యుండనై 2 లక్షలు 260 బ్రహ్మకల్పము లుంటిమి.

13) 9వ అవతారమెత్తి అనందాశ్రమములకు శిష్యుండనై యజ్ఞేంద్రునకు కుమారుడనై 73 కోట్లు 360 లక్షలు 3360 బ్రహ్మకల్పము లుంటిమి. కాల. పు. 1, 2, 94, 95.

14) భూత భవిష్యత్ వర్తమాన కాలానకు నానాదేశాలకున్నూ వ్రాయించినది మూడులక్షల ముప్పైరెండువేల 3,32000లు గ్రంథములు. పు. 5

15) ఈ తీరున ఈపత్రిక లిఖియించి అనందాశ్రమములకు వినిపించెను. సంతోష చిత్తుండాయెను. పు. 8

16) త్రిభువనంబు నెల్లా జయ జయ ధ్వనిచేత సిద్ధాంతమెల్లా కానబడ దెల్పితిమి. పు 15

17) బనగానపల్లె చేరి కార్తీక బహుళ 3లు దినము దినములమీద దివ్యదేహము చేసినాము. పు, 16

18) నందానందన యోర్మధ్యే వీరభోగ వసుంధరాః పు. 22

19) ప్రాంతమందు పాషాణవిగ్రహం చేసి నిలిపెను. పు. 36

20) శ్రుతి పురాణేతి హాసాలలోను మా యవతారమహిమ మా రాకడ పూర్వమైన మునులు ఆనతిచ్చినారు. అని

అంటిరాయెనా శాంతిపర్వమందు కడపటి మాఅవతార మహిమ వ్యాసులు చెప్పినారు. విద్యారణ్యులు మా అవతార మహిమ మా రాకడ విజయర్లక్ష గ్రంథమందు సంకీర్తనలోను మా అవతార మహిమ మా రాకడలు నిర్ణయం చేసినారు. క్రిష్ణమాచార్యులు తాముజేసిన చాతుర్లక్ష సంకీర్తనలోను మా అవతార మహిమ మారాకడలు నిర్ణయము చేసినారు.

పు, 95, 96

## భవిష్యత్ కాలికాలు:-

1) సామవేద ఘోషణాలచేత బాల్యయౌవన ప్రౌఢలు వీరభోజ వసంతరాయల చరితాలు పాడేరు. పు. 5

2) వీరయోగి వస్తున్నాడని భూమి పలికిని. పు. 5

3) మహానందిలో పదిహేను దినాలు వుండి భూమిమీద ప్రకాశమయ్యేరు. పు. 5

4) మహానంది మార్గమున మరుగు కొండలు మూడు దాటిపోగా అడగాను నెవ్వరుందురో వారే వచ్చే వీరయోగియని పక్కాణించినాము. పు. 8

5) సకలజన సంయుక్త సగుణధ్యాన అస్మద్దివ్యనామ పఠనాపరులై ఆనందాన వుండేది. పు 8.

6) మేమున్నూ వీరంభొట్లయ్యవారనే నామధేయంబు వహించి, హరిహర పురంబున సూర్యోపాస్తి పరుడనైయుండి ఓయి శంకరా ! అష్టైశ్వర్యపదంబునునైన చతుర్విధ మోక్షపదంబునునైన నొక దివ్యమంత్రము నీకు ఉపదేశ మిచ్చెద.

పు. 9

7) ఓహో శంకరా ! నేను నీవు బ్రహ్మ మనమువ్వురము భైరవా నందులు బ్రహ్మానందులు వీరాచార్యుల నామంబులు వహించి నవతరించి కలియుగంబున దుష్టజన నిగ్రహము శిష్టజన పరి పాలనము చేయుట కొరకే గదా ! నీ అభీష్టము నెరవేర సంకల్పించుచున్నాను. పు. 10

8) పదకొండో రుద్రుండనగా నేను ఆరువేల కులంలో వున్న దుష్టులనెల్లా ఖండించేము. పు. 36

9) శరామిలోవున్న ప్రజలందు వక ప్రతిమలోను అదే నారూపు అంతయు జూపితి. పు. 50

10) ఆనంద నందనం మధ్యే శ్రీమత్కైవల్య మందిరం. పు. 68

11) కార్తీక శుద్ధ ౧౨ల నాటికి వుద్భవమయ్యేము. పు. 70

12) సూర్యనందిన వుద్భవ మయ్యేము. పు. 71

13) అక్బరి గుర్రాలు తుంగభద్రనీళ్లు తాగినదే మొదలుగాను మూడు దినాలకు వచ్చేము. పు. 96

14) పింగళ సంవత్సర పిళపిళ మాసాన వచ్చేము. పు. 96

15) మేము వచ్చినది మొదలు కృతయుగధర్మాలు నడిపేము. పు. 96.

16) కన్యరాశి గతే జీవే విక్రమో
వీరధర్మజ ప్రయాణో భవేత్ పు. 103.

17) సమస్త జనులంతా వీ ర బ్ర హ్మ ము గా రి చరిత్రములో తగులుదురు.

18) యెనిమిది ముద్దాలు తొమ్మిది కాకాలు
యునికితో దిరుగు సుదర్శనంబు కత్తిబట్టేవాడు
వీరావసంతూడు ఖర్మాల చండాడ వచ్చేనిమా పు. 229

19) శ్రీరామ ధర్మజులు సృష్టిభారము దాల్ప
శృంగారమూర్తులై వచ్చేరుమా పు. 232

20) వికారి మూడేసి విష్ణునామము మీద
వీరావసంతూడు వచ్చేనిమా పు, 238

## వర్తమానకాలికాలు :—

1) నేనున్న నిజభక్త హృదయాంతరాళమందు నిలిచి నిఖిల వేదరహస్య తత్వ మహాతత్వ ఆదికాలాన కథాసందర్భమున్నూ అఖిల యోగజ్ఞాన భక్తిజ్ఞాన గతహేష్య జ్ఞానంబులున్నూ గ్రంథ రీత్యా బంధురమైన బోధకముగా బోధిస్తూవున్నాము. పు. 8

2) నేను భాగవతము వెంటనే తెస్తూ వున్నాను. పు. 14

3) నా దేహము దివ్యదేహము అవుతూవున్నది. పాయసము నెయ్యి కలసిన కథ యిప్పుడే కనిపిస్తూ వున్నాము. పు. 31

4) మా భక్తులైనవారు సమర్పించిన ఆవులను మాపేరు బెట్టి జితేంద్రియుడు పోషించుకుంటూ వుండెను. పు. 95

## బ్రహ్మంగారి తార్కికదృష్టి:-

కార్యకారణాల సంబంధాన్ని గురించి యోచించడమే తర్కం. ఏదైనా ఒక కార్యం జరిగితే దానికి కారణం ఏమిటి? అని ఆలోచించేదే హేతువాదం. తర్కశాస్త్రంలో ఉన్న శబ్దప్రమాణం, పరోక్షప్రమాణం,

ప్రత్యక్ష ప్రమాణాలలో హేతువాదులు ప్రత్యక్ష ప్రమాణాన్నే అంగీకరిస్తారు. ఇటువంటి తార్కికదృష్టి బ్రహ్మంగారికుంది. బ్రహ్మంగారు తార్కికదృష్టితో ఆలోచించి ఆలోచించిన విషయాన్ని అదే దృష్టితో ప్రజలు దర్శించేలా చేశారు. పెళ్ళిలో పఠించే మంత్రాలకు బ్రహ్మంగారు ఇలా హేతువు నడిగారు.

"సోమ ప్రథమో యనుచును
యీ మంత్రము చేత కన్య నీక్షించిన యా
సోమునకు ధర్మసతి యగు
భామామణి తనకునెట్లు భార్యగు సిద్ధా!

గంధర్వుడు రెండవ దిన
మందు నపేక్షించి తాను మరులుకొనంగన్
ముందైన భర్త చంద్రుడు
సందడి నెడబాయడేమి చోద్యము సిద్ధా!

మూడవ దిన మందగ్నికి
చేడియ సతియాయె ననుచు చేపట్టియు దా
గూడె మును పెండ్లి కొడుకని
చూడ నరుల కిదియు బ్రహ్మసూత్రము సిద్ధా!"

ఈవిధంగా ప్రశ్నించడానికి కారణమైన మంత్రమిది :-

"సోమప్రథమో వివిధే గంధర్వః వివిధే ఉత్తరః
తృతీయో అగ్నిః పతిస్తురీయస్తే మనుష్యజాః

స్మార్తానుక్రమణిక వివాహే పరిధానహోమ ప్రకరణే.

చంద్రుడు మొదలైన ముగ్గురు భర్తల తరువాత తాళి గట్టేవాడు నాలుగవభర్త అని పై శ్లోకానికి అర్థం. ఈ మంత్రాల అర్థం తెలిసి కోకుండా తాళికట్టేవాళ్లను అధిక్షేపించారు బ్రహ్మంగారు. ఇంకా ఇలా అన్నారు.

"రాళ్లు దేవతలైతె రావలదో పోవలదో" పు. 178
"సద్బ్రాహ్మడైతేను సత్తు చిత్తెరుగును
సద్బ్రాహ్మణక్రియ తరచవలెను
తరువలేడు గనుక తానెట్లు బ్రాహ్మడో." పు. 212

మంచి బ్రాహ్మణుడైతే "సత్తు" అంటే "కళ" అనీ "చిత్తు" అంటే బిందువు అనీ తెలుసుకోవాలి. అంటే అజపగాయిత్రీ మంత్రం అయిన "హంస"లో ఉండే బిందువు "చిత్తు" సకారం కళ అదే సత్తు అనబడు తుంది. ఈ తత్వాన్ని తెలుసుకొన్నవాడే బ్రాహ్మణుడు. ఇది తెలియనివాడు బ్రాహ్మణుడెలా అవుతాడు? అని చెప్పబడిన పై అంశాలు బ్రహ్మంగారి తార్కికదృష్టికి నిదర్శనాలు.

## సందేశసారాంశం :-

"కావ్యం యశసేऽర్థకృతే వ్యవహార విదే శివేతర క్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతా సమ్మిత తయోపదేశ యుజే."

మమ్మటుడు — కావ్య ప్రకాశకర్త.

అని ఆనందాన్ని ఉపదేశాన్ని కావ్యఫలాలుగా పేర్కొన్నాడు. భరతుడు మొదలైన లాక్షణికులు ఆనందం ధర్మోపదేశం ప్రధానమైన కావ్యప్రయోజనాలుగా పేర్కొన్నారు. బ్రహ్మంగారి రచనలు పరిశీలిస్తే అవి ఆనంద సంధాయకాలుగా సాక్షాత్కరిస్తాయి. కాలజ్ఞానగ్రంథంలో బ్రహ్మంగారి సందేశాలు ఇలా ఉన్నాయి.

## మతభేదాలను మరచిపోవాలి:-

మతభేదాలు మానవజాతి మనుగడకు మంచివికావు. మతాల లోని మంచిని మాత్రమే స్వీకరించాలి. మతభేదం మరచిపోవాలి. అని బ్రహ్మంగారు బోధించారు. హిందూమతస్థులైన అచ్చమ్మ అన్నాజయ్యలను, ముస్లిం మతస్థుడైన సిద్దయ్యను శిష్యులుగా చేసు కొన్న బ్రహ్మంగారి మత సమన్వయ సందేశం ఆయా కవితా ప్రక్రియల్లో ఈవిధంగా కనిపిస్తుంది.

1) షణ్మతంబులకు భేదములేని పల్కులో పల్కె విరాట్టు అతడే నేను. పు. 5

2) ఆకాశము ఎర్రనౌను ఆరుమతము లొక్కటౌను పు. 9

3) మహమ్మద్ హుసేన్ బ్రహ్మమే నారాయణుడు.
కాల. త. పు. 38

4) శివగోవింద గోవింద హరి గోవింద గోవింద. కాం. పు. 221

## కులతత్వం కూడదు:-

కులభేదాలు వట్టిభ్రమలు స్త్రీ పురుషులనబడే భేదంతో రెండే కులాలు ఉన్నాయి. కులభేదాల కుమ్ములాటలు కూడవు అని,

ఏదిరా కులము ఓరి
నాదకులంబని నడుపరా జాణ,, కాల. త. పు 44

అనే తత్వంలో చెప్పారు. నాదం అంటే ఓంకారం. "సారమైన కులము ఓంకారమైయుండు" అని పై తత్వంలోనే చెప్పారు. పీల్చే గాలే ఓం అనేది. అంటే అందరు మానవుల ప్రాణం గాలితోనే ఉంది.

అందరూ సమానమనే భావం పై తత్వంలో ఉంది. కు ల త త్వ ం కూడదని చెప్పిన బ్రహ్మంగారు -

"అయిదువేల మీద బహుధాన్య లోపల
అన్ని జాతము లొక్కటయ్యీనిమా.

కాల. పు. 223.

అంటూ జాతులన్నీ ఏకమవుతాయని భవిష్యత్తును పలికారు.

## స్త్రీలను గౌరవించాలి:-

బ్రహ్మంగారు "సిద్ధబోధము" "కాళికాంబ పద్య రత్నములు" అనే శీర్షికలతో రచించిన పద్యాల్లో స్త్రీలను గౌరవించాలని ప్రబోధించారు. ఈ అంశానికి తార్కాణంగా ఈ క్రింద ఉదాహరణలు ఇవ్వబడుతున్నాయి.

1) "యతులైన మునులైన నెవ్వరైనను ఏమి ?
సోమయాజులైన దొడ్డ ఘనులు
వనితలడ్డమైన వచ్చె తల్లనవలె"

కాల. పు. 190.

2) "అందరిని తల్లిగా యాత్మలో దలచిన
సందేహమనె తెగులు చచ్చిపోవు
తెగులు చచ్చిన వెనుక దేవుడు తానౌను"

కాల. పు 195

బ్రహ్మంగారు పలికిన భవిష్యత్తులోకూడా స్త్రీజాతి ప్రగతిని కాంక్షించారు. పూర్వం భర్తను కోల్పోయిన స్త్రీని అనేకవిధాలుగా

అనాదరించింది మన సమాజం. అతివకు ఈ అగచాట్లు అంతరించా లని ఆశించి బ్రహ్మంగారు

"ముండమోపులెల్ల ముత్తైదులయ్యేని" కాం. పు. 226

అని తెలిపారు. ఇలాంటి సందర్భాల్లో బ్రహ్మంగారి దృక్పథం ఏమిటి? ముండమోపులు ముత్తయిదువులు కావడం ఆయనకు ఇష్టంలేదా? అనిపిస్తుంది. కానీ ఇది భవిష్యత్తును వర్ణించడమేగాని ఆయన ఇష్టానిష్టాలను గురించి చెప్పలేము. ఆనాటికి జరగని ఒకకొత్త విష యాన్ని చెప్పారని భావించవచ్చు. ఇటువంటి సందర్భాలు బ్రహ్మం గారి రచనల్లో ఒకటి రెండుచోట్ల కనిపిస్తాయి. కాలజ్ఞాన తత్వాల్లో ఉన్న "రాక్షస కులములను నీరుచేయ శ్రీరాములు జననంబైనాడ." (కాల. త. పు. 7) అనే తత్వంలో భవిష్యత్తును వర్ణించి అది జరుగ నట్లయితే "అందుకు తప్పితె హీనజాతి వానింటను బుట్టేనన్నాడు." (కాల. త. పు. 78) అని శపథం చేశారు. జాతులన్నీ ఒకటేనని చెప్పిన ఆయన హీనజాతి అనిఅనడం కేవలం భాషావ్యవహారంలో అలవాటుగా ఉన్నమాటను వాడడమేనని చెప్పాలి.

## అహింసయే పరమధర్మం –

"అహింసా పరమోధర్మః" అనే సూక్తిని ప్రకటించి బ్రహ్మం గారు గ్రామదేవతల జాతరలో జంతుబలిని నిషేధించవలసిందిగా ఉపదేశించారు. తన సాహిత్యం ద్వారా హింసను విసర్జించమనే సందేశాన్ని అందించారు.

"యల్లమ్మ కంచూను మల్లమ్మ కంచూను
కల్లు మాంసము బెట్టి గుడిసేరుమా
కల్ల దేవతలను గొలిచేటివారెల్ల
నిల్వ పేరులేక పొయ్యానిమా  కాం. పు. 254
జీవిని మర్దించి జీవికి వేసెనా
జీవ దోషంబులు చిక్కుబడును
జీవహింసచేత చిక్కునా మోక్షంబు
కాళికాంబ హంస కాళికాంబ.  కాం. పు. 213

అని జీవహింసవలన మోక్షం లభించదని చెప్పారు.

## మూఢ విశ్వాసాలవల్ల ముక్తి లభించదు :-

విగ్రహారాధన, ఒక్కపొద్దులు, తీర్థస్నానాలు, కపటగురువులను గ్రుడ్డిగా నమ్మడం, తీర్థయాత్రలు మొదలైన మూఢవిశ్వాసాలను ఖండించి రచనలు చేశారు -

"చిల్లర రాళ్లకు మ్రొక్కుతువుంటే
చిత్తము చెడిపోనోరే యొరే"  కాల. త. పు 39

అనే బ్రహ్మంగారి తత్వం ప్రసిద్ధమైంది. అందులో మూఢనమ్మకాల నిలా నిరసించాడు. చిల్లర రాళ్లకు మొక్కితే చిత్తం చెడిపోతుంది. చిత్తంలోఉండే చిన్మయజ్యోతిని గమనించడం మంచిది. అని విగ్రహారాధనను నిరసించారు. ఒక్కపొద్దులవల్ల శరీరం క్షీణిస్తుందనీ మనస్సులో భగవంతుని దర్శించడం మంచిదనీ నిలకడ లేకుండా నీళ్లలో మునిగి మంత్రాలను గొనగడం నిరర్థకమనీ ఆత్మలోఉండే వెలుగును దర్శించాలనీ అదే సరైనమార్గమనీ బోధించారు. బాధ గురువులను ఆశ్రయిస్తే భావం చెడిపోతుందనీ భావంలోఉన్న బ్రహ్మకాంతిని

చూడటం నేర్చుకోవాలనీ బోధించారు. పై విషయాన్ని కాశికి పోవలెనా తీర్థము మోసుకురావలెనా అనే తత్వంలోకూడ చెప్పారు. ఇదే అంశాన్ని -

"తీర్థయాత్రలకెల్ల దేవుడొక్కడె గదా
వుత్తమతీర్థంబు యొద్ద గలదు
దివ్య తీర్థంబిదిగొ దేహమందున్నది
కాళికాంబ హంస కాళికాంబ"

అనే పద్యంలోకూడా చెప్పారు. తీర్థయాత్రలెన్ని తిరిగినా దేవుడు ఒక్కడే. తీర్థయాత్రాస్థలా లన్నింటికంటె శ్రేష్ఠమైంది దగ్గరే ఉంది. అది దివ్యమైన తీర్థయాత్రా స్థలం. అది మనదేహంలోనే ఉంది. అని పై పద్యానికి భావం. అంటే భగవంతుడు మానవ శరీరంలోనే ఉన్నాడని బ్రహ్మంగారి అభిప్రాయం. పైవిధంగా బ్రహ్మంగారు మూఢవిశ్వాసాలను ఖండించారు.

## వేషధారులైన సన్యాసులకు మోక్షం లేదు :-

,,వేషము సన్యాసి యోచన ప్రకృతి
పూజ చేయుట ఏమి పుణ్యమబ్బె
ప్రకృతి దీసెనా ఫలమిచ్చె గదవయ్య"

కాల. పు. 198.

అనే పద్యంలో గడ్డాలు మీసాలు పెంచుకొని లౌకికమైన ఆలోచనలతో పూజలుచేస్తే పుణ్యమబ్బదు. పైపై వేషాలవల్ల ఫలితం లేదు. అని

బ్రహ్మంగారు చెప్పారు. ఇంకా ఈ వేషధారులను గురించి ఆయన

,,యర్రబట్టలు గట్టి తొర్రిమాటల నాడె
పర్రె యోగి గాని పదవి గాదు
యర్ర పచ్చ తెలుపు మలినంబు నొక్కటే

కాల. పు. 202

అని అంటారు. ఇంకా

,,పట్టె వర్ధనాలు బాగుగా ధరియించి
పాపజాతి మనసు పట్టలేదు
మనసుపట్టి పట్టు మహిమ గన్గొనుమయా

కాల. పు. 202

పట్టెవర్ధనాలు ధరించినా పాపాత్ములకు మనసు నిలకడగా ఉండదు. మనస్సును నిగ్రహిస్తే మ హి మ కనుగొనవచ్చు. అని అన్నారు. గాయత్రీ మంత్రాన్ని నిత్యం గళంలో ధరించేవారు యజ్ఞోపవీతం ధరించవలసిన పని లేదు. పైపై వేషం కోసం సూత్రాన్ని ధరించేవారు ముక్తిమార్గాన్ని చూపించలేరు. అని బ్రహ్మంగారు చెప్పారు. వేషాలు వేసి నియమాన్ని ఉల్లంఘించేవారి గతిని వర్ణిస్తూ ఇలా భవిష్యత్తు పలికారు.

,,నీమమూ దప్పిన నామధారులెల్ల
నీళ్ల కన్నను పలుచ నయ్యేరుమా"

కాల. పు. 258

## బ్రహ్మజ్ఞానమే బ్రాహ్మణత్వం:-

పుట్టుకలో ప్రతివారూ సమానులే. ఆత్మ సంస్కారాదీ సత్క్రియలవల్ల బ్రాహ్మణత్వం కలుగుతుంది. బ్రహ్మజ్ఞానం కలవాడు

ఎవడైనా బ్రాహ్మణుడే. అనేది బ్రహ్మంగారి సిద్ధాంతం. సద్బ్రాహ్మణుడైతే సత్తుచిత్తులను గురించి తెలుసుకోవాలి. ఇలా తెలుసుకోలేనివాడు బ్రాహ్మణుడు ఎలాఅవుతాడు? అని ప్రశ్నించి,

"వెనుక ముందెరుగని దేమి బ్రాహ్మణ్యంబు
మున్ను గురుతెరుగని ముచ్చుగాక
స్పష్టమైన గురి చోటును గనవలె"

కాల. పు, 212.

అని అన్నారు. పూర్వాపరాలను తెలుసుకోలేనిది ఏమి బ్రాహ్మణత్వం? గతం తెలియని ముచ్చుతనమే. స్పష్టమైన లక్ష్యాన్ని గుర్తించాలి. లక్ష్యమంటే భగవంతునిపై గురి నిలపడమని అర్థం. అందుకే బ్రహ్మం గారు కేవలం పుట్టుకతోనే బ్రాహ్మణుల మనుకొని అర్థం తెలియని మంత్రాలను చిలుకల్లా వల్లించేవాళ్లు ఏమి బ్రాహ్మణులు ? అని అడిగారు. ఇంకా

"బ్రాహ్మణ శూద్రుల పేరు జెప్పగ లేరు
పేరు దెలియకున్న బ్రాహ్మణుండె
పెదవులాడించితే బ్రాహ్మణుం డెట్లవును?"

కాల. పు. 212

బ్రాహ్మణుడంటే ఏమిటి? శూద్రుడంటే ఏమిటి? అని అర్థం చెప్పలేని వాడు బ్రాహ్మణుడు ఎట్లా అవుతాడు ? పెదవులు కదిలించి మంత్రాలు చదివినంతమాత్రాన బ్రాహ్మణుడు కాడని భావం. పెదవు లాడించినంత మాత్రాన బ్రాహ్మణుడెట్లా అవుతాడు? అని నిగ్గదీశారు బ్రహ్మంగారు.

## గురు శిష్యులు యోగ్యత కలిగి ఉండాలి :-

,,గురుర్బ్రహ్మా గురుర్విష్ణు గురుదేవో మహేశ్వరః
గురుసాక్షాత్ పరబ్రహ్మా తస్మై శ్రీ గురవేనమః"

అని గురువును త్రిమూర్త్యాత్మకునిగా వర్ణించారు మన ప్రాచీనులు. ఆదర్శమూర్తియైన గురువెలా ఉండాలో నిజమైన శిష్యులెలా ఉండాలో గురుశిష్యుల లోపాలు ఏమిటో? ,,సిద్ధబోధము" అనే శీర్షికతో కాలజ్ఞానంలో రచించిన పద్యాల్లో బ్రహ్మంగారు ఇలా వివరించారు. గురుభావం తెలుసుకోకుండా గురువుమీద లక్ష్యంలేకుండా శిష్యుడు ఏమీ తెలుసుకోలేడు. గురువుల మర్మం గ్రహించడం కష్టం. గురువుల గుణనిర్గుణాలు గోప్యంగా ఉంటాయి. గురుపాదాలను ఆశ్రయించి కూడా త్రికాల ప్రసాదాలను మరిగితే యోగం చెయ్యడం అనవసరం అని చెబుతూ గుణహీనుడైన గురువును గురించి ఇలా అన్నారు.

,,గురుసూత్రమేయైతె కుక్కలు గరచునా
గుణము లేకున్నను కుక్క గరచె
కుక్క కున్న గుణము గురునికి లేదయా"

కాల. పు. 188.

గురుసూత్రమంటే గురువు బోధించే తారకమంత్రం. అది నిజంగా గొప్పమంత్రమే అయితే ఆమంత్రం తెలిసినవాణ్ణి కుక్కలు కరుస్తాయా! ఆ గురువుకు గుణం లేదు. కాబట్టే కుక్క కరుస్తుంది. కుక్కకున్న గుణంకూడా గురువుకు లేదు. తనకు ధర్మం బోధించడానికి తనలోనే గురువున్నాడు. అలాంటప్పుడు కల్లగురువులమిద కాంక్షవద్దు అంటూ

,,పుల్లిగడ్డాలకు వుపదేశ మిచ్చేటి
కల్ల గురువులు కలిలో నుండేరుమా
కల్ల గురువులనెల్ల కాలదన్నును యముడు

కాల పు. 222

అని కల్లగురువుల కుళ్ళునెల్లా తెల్లం జేశారు. ఇంకా కల్ల గురువుకు చల్లని గురువుకు ఉన్న భేదాన్ని ఇలా వర్ణించారు.

"వొళ్లెల్ల చెడగాల్చు కల్లగురుడే కాని
యుల్లములో కుల్లునెల్ల గాల్చి
కొల్లలాడు ముక్తి చల్లని గురుడయా"

కాల. పు. 213.

శరీరమంతా మతచిహ్నాల ముద్రలతో కాల్చుకొని పైపై వేషాలతో ఉండేవాడు అబద్ధపు గురువు. మనస్సులో ఉన్న కుళ్లునంతా కాల్చి వేసి ముక్తిని సాధించేవాడే నిజమైన గురువు. అని పైపద్యంలో చెప్పినట్లు ముక్తిని కొల్లలాడిన చల్లనిగురువే బ్రహ్మంగారు. ఇటు వంటి సద్గురువును వెదకి సద్గతిని సాధించిన మంచిశిష్యుడే సిద్ధయ్య అందుకే "బ్రహ్మంగారి వంటి గురువు సిద్ధయ్యవంటి శిష్యుడు లేడు" అనే ఆ భాణకం ఈ గురుశిష్యులపట్ల సార్థకమైంది.

## భక్తియోగాన్ని సాధించాలి:-

కాలజ్ఞానం ద్వితీయాశ్వాసంలో "అఖిల యోగజ్ఞాన భక్తిజ్ఞాన గత ఫ్యష్య జ్ఞానంబులును గ్రంథరీత్యా బంధురమైన బోధకముగా బోధిస్తూ ఉన్నాము.1" అని బ్రహ్మంగారన్నారు. ఆయన వేదాలు, ఉపనిషత్తులు, భారత భాగవతాది పురాణాలు మున్నగు గ్రంథాల్లోని విషయాలను ప్రజలకు బోధించారు. ఇందుకు

1) "చతుర్వేదాలు తనలో తానే చదివిని." కాల. పు. 5.

---

1. వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానం, ప్రచు : కష్ణమూర్తి, రంగయ్య కందిమల్లయపల్లె, 1974, పు, 15.

2) ,,యీ మంత్రంబు ఋగ్వేద, యజుర్వేద, సామ, అధర్వణంబులతో సమానము." కాల. పు. 13.

3) ,,ద్వంద్వాతీతం గగనసదృశం తత్వమస్యాదిలక్ష్యం."
కాల పు. 26

4) ,,గీతా నా భక్తులే శ్రేష్ఠం." కాల. పు. 15

5) ,,భాగవతము వెంటనే తెస్తూ వున్నాను." కాల. పు. 14

అనే కాలజ్ఞాన వచనాలను ఉదాహరింప వచ్చును.

చతుర్విధ యోగాల్లో మంత్రయోగాన్ని భక్తియోగ మంటారు· ఏకాక్షర, ద్వ్యక్షర, షడక్షర, అష్టాక్షర, మంత్రాలను భక్తియోగంలో జపిస్తారు. కాలజ్ఞానంలో

1) ,,ఓం నమో పరబ్రహ్మణే." కాల. పు. 11

2) ,,ఓం నమో నారాయణాయ" కాల. పు 31

అనే మంత్రాలు ఉన్నాయి. ఇంకా తన ముప్పదిరెండు నామాలతో కూడిన పూజా విధానాన్ని కూడా చెప్పారు. నిత్యపఠనానికి దండక వచనాన్ని రచించారు. ఇటువంటి మంత్రాలతో భక్తియోగాన్ని సాధించాలనీ భగవంతుని ధ్యానించాలనీ బోధించారు. ఇందుకు

1) ,,నారాయణ ధ్యాన మానుట యుత్తమం."
కాల. పు. 186

2) ,,నారాయణ ధ్యాన మందవలయు". కాల. పు. 186

అనే వాక్యాలను ఉదాహరణగా చెప్పవచ్చు. ఇలా ధ్యానించకుండా ఉన్నవారిని ఇలా అన్నారు.

,,నోటి నాలుక నందు రోకలి ఉన్నట్లు
రామభజన సేయ రాదు నోరు
పాపి కర్మి నోట పట్టదో రామక్రియ"

కాల. పు. 186

నోటికీ నాలుకకూ మధ్య రోకలి అడ్డం ఉన్నట్లుగా కొందరు 'రామ' అని అనలేరు. అటువంటివారి నోట రామనామం పట్టదని వ్యంగ్యంగా విమర్శించారు. హరినామ సంకీర్తనం చేస్తే

"మేకలు మూకగా ఆకుమేసెడి తావు
తోక చాలు పిల్లమేక వచ్చు
నాతీరు భక్తుండు హరి యిరువు జేరుగా."

కాల. పు. 213.

అని అన్నారు. మేకలు గుంపుగావెళ్లి ఆకులుమేసే చోటుకు పెద్ద మేకల తోకలవెంటే చిన్నమేకలు వెళ్లుతాయి. అదేవిధంగా భక్తుడు భగవంతుని చేరుతాడు. అని భక్తియోగాన్ని సాధించే మార్గాన్ని చూపించారు.

## బ్రహ్మంగారి వేదాంతం:-

బ్రహ్మంగారి వేదాంతం అద్వైతమని అంటారు. అలా అన డానికి ఆయన రచనల్లో ఆధారాలు కనిపిస్తున్నాయి. "అద్వైత వీర విజయంబుల విజయమునకు సందేహములు లేవు."1. వంటి వచనాల్లో బ్రహ్మంగారు తనది అద్వైత సిద్ధాంతమని వాచ్యం చేశారు. బ్రహ్మం గారికి పూర్వప్రవక్త శంకరాచార్యులు అద్వైత సిద్ధాంతాన్ని స్థాపించాడు. పరమాత్మ స్వరూపమైన బ్రహ్మమొక్కటే సత్యం. ప్రపంచంలో మనకు కనిపించేదంతా మిథ్య. జీవుడు అనబడే ప్రాణి

---

1. వీరబ్రహ్మం, పోతులూరి - కాలజ్ఞానం, ప్రచు : కృష్ణమూర్తి రంగయ్య
కందిమల్లాయపల్లె, 1974, పు. 48

బ్రహ్మంకంటె వేరుకాదు. రెండూ ఒకడే అనేదే అద్వైత సిద్ధాంతం. ఈ అంశాన్ని శంకరాచార్యులు "నహి జీవోనామ అత్యంత భిన్నో బ్రహ్మణః" బ్ర. సూ. భా. 1, I, 31. అని వివరించారు. శంకరుడు చెప్పిన ఈ వేదాంతమే బ్రహ్మంగారి వేదాంతం. అసలు శంకరుల తేజమే బ్రహ్మంగారిలా ఉద్భవించిందని అంటారు. పుట్టపర్తి నారాయణాచార్యులు బ్రహ్మంగారిని గురించి ఇలా అన్నారు.

"అనధిగతే వేదాన్తే కలిమలకలుషే జనే సదాచరతి
వీరబ్రహ్మభిదయా సమజని లోకే హి శాంకరం తేజః"

మ గు. దే. పు. 58

వేదాంత తత్త్వం తెలుసుకోలేక కలిదోషచిత్తులైన మనుషులు చరిస్తున్నపుడు శంకరుని తేజం వీరబ్రహ్మనామంతో లోకంలో అవతరించింది. అని పై శ్లోకానికి అర్థం. ఇందులోని "శాంకరం తేజః" అనేదానికి పరమశివుని తేజమని పండితులు అభిప్రాయపడ్డారు.1 కానీ శంకరాచార్యుల తేజమనేదే సరియైన భావం. బ్రహ్మంగారు తనకు శంకరాచార్యులకు భేదంలేదని ఇలా చెప్పారు.

"షణ్మతంబులకు భేదములేని పల్కులతో పలికె విరాట్టు
అతడే నేను నేనే తాను తానే నేను." కాల. పు. 42

హిందూ మతానికి చెందిన వైష్ణవ, శాక్త, సౌర, గాణాపత్య, కౌమార, కాపాలికాలనే ఆరు సంప్రదాయాలున్నాయి. ఈ మతాల్లోని దోషాలను తొలిగించి వాటిని ఏకీకృతం చేయడానికి శంకరాచార్యులు ప్రయత్నించాడు. అందుకే ఆయనకు షణ్మతస్థాపకాచార్యుడనే పేరు

---

1. వీరరాఘవాచార్యులు కొండూరి – మన గురుదేవుడు, ప్రచు : వీరరాఘవ గ్రంథావళి, తెనాలి, 1963, 78, పు. 58.

వచ్చింది. అలా షణ్మతాలకు భేదంలేదని అద్వైతభావాన్ని చెప్పిన శంకరుణ్ణే తానని బ్రహ్మంగారి కంఠోక్తి. కనుక శంకరుని సిద్ధాంతమే బ్రహ్మంగారి సిద్ధాంతమని చెప్పవచ్చు.

ఉపనిషత్తుల్లో వర్ణించబడిన "బ్రహ్మ" "ఆత్మ" అనే శబ్దాలు సర్వోత్కృష్టమైన అద్వైత సిద్ధాంతాన్ని బోధిస్తాయి. వేదాల సారమే ఉపనిషత్తులు. ఉపనిషత్తుల సారమే భగవద్గీత, బ్రహ్మసూత్రాలు. ఈ మూడు గ్రంథాలను ప్రస్థానత్రయ మంటారు. శంకరుడు ఈ ప్రస్థానత్రయానికి భాష్యాలువ్రాసి తనసిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. నాలుగువేదాల సారమనదగిన నాలుగు ఉపనిషత్ మహావాక్యాలున్నాయి.

1) "ప్రజ్ఞానం బ్రహ్మ" - ఋగ్వేదం
ఐతరేయారణ్యక శ్రుతి
తృతీయాధ్యాయం, పు. 48

ఈశ్రుతికి వివరణ (ఐతరేయోపనిషద్దీపిక) వ్రాసిన విద్యారణ్యుడు ప్రజ్ఞాన, బ్రహ్మ శబ్దాలకిలా అర్థం చెప్పాడు.

ప్రజ్ఞానం :- "యేనేక్షతే శ్రుణోతీదం జిఘ్రతి వ్యాకరోతిచ
స్వాద్వస్వాదూ విజానాతి తత్ప్రజ్ఞాన ముదీరితం"1

కన్నులద్వారా వ్యాపించిన అంతఃకరణ వృత్తితో కూడిన ఏచైతన్యంతో జీవుడు చూడటానికి వీలైన వస్తువులను చూస్తున్నాడో, శబ్దాలను

1. నాగభూషణదాసు, జవంగుల — వీరబ్రహ్మేంద్ర స్వాములవారి బోధామృతం, ప్రచు :- శ్రీ వీరబ్రహ్మేంద్రాశ్రమం, సత్తెనపల్లి, 1951, పు. 66.

వింటున్నాడో, గ్రంథాలను ఆఘ్రాణిస్తున్నాడో, తీపి, చేదులను తెలుసుకోగలుగుతున్నాడో ఆ చైతన్యమే ప్రజ్ఞానమని పై శ్లోకం అర్థం చెబుతున్నది.

బ్రహ్మ :- "చతుర్ముఖేంద్ర దేవేషు మనుష్యాశ్వగవాదిషు
చైతన్యమేకం బ్రహ్మతః ప్రజ్ఞానం బ్రహమయ్యపి1"

బ్రహ్మదేవునిలో, ఇంద్రాదిదేవతల్లో, మనుష్యులు, గోవులు, గుర్రాలు, మొదలైనవానిలోఉన్న ఒకేఒక చైతన్యమే బ్రహ్మ. అందుచేత నాలో ఉన్న చైతన్యంకూడా బ్రహ్మమే. అని పై శ్లోకానికి అర్థం. ఇలా ఈ ఐతరేయారణ్యకశ్రుతి అద్వైత తత్వాన్ని బోధిస్తున్నది.

2) "అహం బ్రహ్మస్మి." యజుర్వేదం
బృహదారణ్యకోపనిషత్
ప్రథమాధ్యాయం, 4వ బ్రాహ్మణం, పు. 27

ఆ బ్రహ్మమునే నేను. అని పై వాక్యానికి అర్థం.

3) "తత్త్వమసి." – సామవేదం
ఛాందోగ్య శ్రుతి
షష్ఠ ప్రపాఠకము, అష్టమఖండం, పు. 290.

ఆ బ్రహ్మమే నీవు. అని పై మహావాక్యానికి అర్థం.

4) "అయమాత్మా బ్రహ్మ." – అధర్వవేదం
మాండూక్యోపనిషత్
శ్లో॥ 2, పు. 24.

---

1. నాగభూషణదాసు, జవంగుల - వీరబ్రహ్మేంద్ర స్వాములవారి బోధామృతం, ప్రచు : శ్రీ వీరబ్రహ్మేంద్రాశ్రమం, సత్తెనపల్లి, 1951. పు. 66

ఈ ఆత్మయే బ్రహ్మం. అని పై వాక్యానికి అర్థం. ఈ నాలుగు ఉపనిషత్ మహావాక్యాలు అద్వైతసిద్ధాంతాన్ని బోధిస్తున్నాయి. బ్రహ్మంగారు ఈ మహావాక్యాల ప్రస్తావన తమ రచనలో ఇలా చేశారు.

"బ్రహ్మానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగన సదృశం తత్వమస్యాది లక్ష్యం
ఏకం నిత్యం విమలమచలం సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణ రహితం సద్గురుం తన్నమామి."

కాల. పు. 26

బ్రహ్మానంద స్వరూపుడైనవాడు పరమమైనసుఖాన్ని ప్రసాదించేవాడు, కేవలం జ్ఞానస్వరూపమైనవాడు, ఆకాశమువంటి వాడు, తత్త్వమసి మున్నగు ఉపనిషత్ మహావాక్యాలసారమైన అద్వైతభావం కలవాడు, ఒకే ఒక్కడు, నిత్యమైనవాడు, స్వచ్ఛమైనవాడు, చలించనివాడు, సర్వమునకు సాక్షిభూతుడైనవాడు, భావాతీతుడు, త్రిగుణ రహితుడు అయిన నా సద్గురువుకు నమస్కారము. అని బ్రహ్మంగారు గురు వందనం చేశారు. పై శ్లోకంలో "తత్త్వమసి" అనే ఉపనిషత్ మహా వాక్యాన్ని ఉదాహరించారు. ఇదే వాక్యాన్ని ఇంకా

"తత్త్వమస్యాది సంగతి యదార్థములు జాడలుగాగ"

కాల. పు. 110

అంటూ ద్విపద కాలజ్ఞానంలో రాశారు. కాలజ్ఞానం షష్ఠాశ్వాసంలో గురుస్తుతిలో ఉపనిషత్ మహావాక్యాల ప్రస్తావన నిలా చేశారు.

"శ్రీమద్బ్రహ్మాండ భాండ సుక్ష్మాండ లక్ష్యసూత్ర
సమరస మహావాక్య లక్ష్య సారాచార!"

కాల. పు. 58

బ్రహ్మంగారు ఉపనిషత్ మహావాక్యాలను తనరచనల్లో ప్రస్తావించారు గనుక మహావాక్యాల సారాంశం అద్వైతం గనుక బ్రహ్మంగారి సిద్ధాంతం అద్వైతమని చెప్పవచ్చు.

ఉపనిషత్తుల సారాంశమే భగవద్గీత. ఈ అంశాన్ని

"సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనన్దనః
పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్."

గీ మ. పు. 115

అనే శ్లోకం తెలుపుతున్నది. ఉపనిషత్తులన్నీ గోవులు గోపాలనందనుడైన కృష్ణుడు పాలు పితుకువాడు. అర్జునుడు దూడ. మహత్తరమైన గీతామృతమే పాలు. సద్బుద్ధి కలవారే దానిని త్రాగువారు. అని పై శ్లోకానికి అర్థం. ఉపసిషత్తుల తాత్పర్యం అద్వైతభావం గనుక భగవద్గీతకూడా అద్వైతాన్ని బోధిస్తున్నది. ఈ విషయాన్ని

"పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణే నస్వయమ్
వ్యాసేన గ్రధితాం పురాణమునినా మధ్యే మహాభార్తతమ్
అద్వైతామృత వర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీ
మమ్బత్వామను సందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్"

గీ. మ. పు. 114

అనే భగవద్గీత శ్లోకం నిరూపిస్తుంది. తనకిష్టమైన అద్వైతామృతాన్ని వర్షిస్తున్నది గనుక బ్రహ్మంగారు

"గీతా నా భక్తులే శ్రేష్ఠం" కాల. పు 15

అని భగవద్గీత విశిష్టమైనదని చెప్పారు. బ్రహ్మంగారి రచనలు

"బ్రహ్మమనగ వేరె పరదేశమున లేడు
బ్రహ్మమనగ జూడు బట్టబయలు
తనకుతానె బ్రహ్మ తారకమౌనయా"

కాల. పు. 187

"అంతా బ్రహ్మమయంబని
సంతసమున దిరుగువారు సర్వజ్ఞులు శ్రీ
కాంతుని కృపచే వారికి
చింతలు లేవయ్య యోగసిద్ధులు సిద్ధా!"

కాల. పు. 184

వంటి భావాలతో అద్వైతసిద్ధిని సాధించారు. బ్రహ్మంగారు తాను రచించిన గోవిందవాక్యాలకు పెట్టిన మకుటం "శివ గోవింద గోవింద హరి గోవింద గోవింద" అనేది అద్వైతామృతాన్ని వర్షించింది.

## సూఫీ సిద్ధాంత ప్రభావం:–

ఇస్లాం మతంలో ప్రభవించిన ఒక నూతన సిద్ధాంతమే సూఫీ మతం. ఈమతం ప్రథమంగా ఇరాక్ దేశంలో పుట్టింది. ఈమతాన్ని గురించి **"The new caxtion Ehcyclopedia"** లో ఇలా రాశారు.

**"Islamic mystical movement It's name derives from the Arabic word for "wood" referring to the clothes of rough wool worm by the early Moslem ascetics, The chief centre of Islams ascetic and mystical movements was Iraq and in particular Bagdad. '1.**

---

**1. The New caxtion Encyclopedia. 17th Vajume. The caxtion publishing company. P. LTD. London. 1977, P. 5571.**

ఈ సూఫీ సిద్ధాంతానికి సంబంధించిన తొలి సన్యాసులు ఉన్ని (సూఫ్) దుస్తులను ధరించినందువల్ల సూఫీలనబడ్డారని పై అంశంవల్ల తెలుస్తున్నది. సూఫీ అనే పదాన్ని గురించి రాస్తూ "ఇది "సోఫిస్ట్" అను గ్రీకు శబ్దము నుండి వచ్చియుండును.1 అని విజ్ఞానసర్వస్వంలో రాశారు.

ప్రేమద్వారా జీవుడు సత్ (భగవంతుడు) తో కలుస్తాడనీ పరమతత్వం అద్వైతమనీ సూఫీల నమ్మకం. వైరాగ్యం, ఏకాంత చింతన, జపం, ధ్యానం, ద్వారా ఈశ్వరునిలో తన్మయులు కావడం దైవ సాక్షాత్కారాన్ని పొందడం సూఫీల లక్ష్యం. దీన్ని గురించి పండితులిలా రాశారు.

**"Sufism teeches how to punify one's self, improve one's morals and build up one's inner and outer life in order to attain perpetual bliss." 2.**

సమస్తాన్ని పరిత్యజించి భగవంతుని శరణు జొచ్చినవారు మంచిఆచరణ కలవారు సూఫీలు. ప్లేటో వాదం భారతీయ యోగ వేదాంతం సూఫీ సిద్ధాంతానికి ప్రేరకాలని కొందరంటారు. క్రీ॥ శ॥ 770లో మరణించిన అబూహాశిం అనేవాడు మొదటి సూఫీ అని చెబుతారు.

ఈ సూఫీ సిద్ధాంత ప్రభావం బ్రహ్మంగారిపై ఉందంటారు. సూఫీలు అద్వైతభావం విశిష్టమైందని భావించినట్లు బ్రహ్మంగారు

---

1. డా॥ సచ్చిదానందమూర్తి, కొత్త - పాశ్చాత్య దర్శనం (వ్యా) విజ్ఞాన సర్వస్వం, సం, 7, పు. 198.

**2. Dr. Miravali-ud din Munshi Fazil, The History of philosophy Eastren and Western Edited by - Radha Krishnan, S. George Wen & Un Wine LTD., London 1953; P. 171.**

కూడా అద్వైతసిద్ధాంతాన్నే అనుసరించారు వైరాగ్యచింతన, జపం, ధ్యానం ద్వారా భగవంతుని చేరాలని సూఫీలవలె బ్రహ్మంగారుకూడ బోధించారు. కానీ సూఫీ సిద్ధాంతానికి, భారతీయ యోగ వేదాంతం ప్రేరకమని చెబుతున్నారు. బ్రహ్మంగారు భారతీయ యోగ వేదాంతాన్ని అనుష్ఠించారు కాబట్టి బ్రహ్మంగారిపైగల ప్రభావం భారతీయ యోగవేదాంత ప్రభావమనే చెప్పవచ్చు.

## వేదాంత పారిభాషిక పదాలకు వివరణ:-

వేదాంతాన్ని సాధారణ ప్రజలకు బోధించడానికి బ్రహ్మంగారు వచనాలు రాసినా తత్వాలు రాసినా వేదాంతసంబంధమైన సంస్కృత పారిభాషిక పదాలను వాడక తప్పలేదు. బ్రహ్మంగారు తన రచనల్లో వేదాంతగ్రంథాల్లో ప్రయోగించిన పారిభాషిక పదాలను ఉపయోగించారు. వేదాంతాలు అంటే ఉపనిషత్తులు. ఈవిషయం ఈక్రింది ఉపనిషత్ శ్లోకంవల్ల తెలుస్తుంది.

"వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః
సంన్యాస యోగాద్యతయః శుద్ధసత్వాః
తే బ్రహ్మలోకేషు పరాంతకాలే
పరామృతాః పరిముచ్యంతి సర్వే"

ముండకోపనిషత్తు, తృతీయ ముండకం,
ద్వితీయ ఖండం, శ్లో. 6, పు. 99.

సన్యాసయోగాదులను అభ్యసించడంవల్ల నియతేంద్రియులై నిశ్చితంగా పరమాత్మను తెలిసికొన్న నిర్మలచిత్తులైన విద్వాంసులు అందరూ ఉపనిషద్విజ్ఞానంవల్ల ఉత్కృష్టమైన అమృతత్వాన్ని పొందినవారై ప్రళయకాలంలో పరమేశ్వర నిర్మితమైన భూమి మొదలైన లోకాల్లో విడువబడతారని పై శ్లోకానికి అర్థం. ఈ అంశం ఉపనిషత్తులే

వేదాంతాలు అని తెలుపుతున్నది. ఉపనిషత్తుల సారాంశమే భగవద్గీత. భగవద్గీతలోని సారాంశం భాగవతంలో చెప్పబడింది. పై గ్రంథాలలోని పదాలనే బ్రహ్మంగారు తన రచనల్లో ప్రయోగించారు. ఇవేగాక తెలుగులో సీతారామాంజనేయ సంవాదమనే వేదాంతగ్రంథం ప్రామాణికమైంది. ఆయా గ్రంథాల తోడ్పాటుతో బ్రహ్మంగారు ప్రయోగించిన వేదాంత పారిభాషిక పదాలకు వివరణలు ఇవ్వబడుతున్నాయి.

**ఆపోజ్యోతి:–** ఈ పదం బ్రహ్మంగారి తత్వాల్లో ఇలా ప్రయోగించబడింది.

1) "నెయ్యోయమ్మ నెయ్యి మనవీరబ్రహ్మముపై నెయ్యి నెయ్యి
నెయ్యి ఆరింటు మూడింటును "ఆపోజ్యోతి" అనుభవపరులకు"
కాల. త. పు. 4.

2) "భూతాలనే మరి "ఆపోజ్యోతి" యొక్కటి గలదు
తెలిసికోండి ఆజ్యోతి వీరబ్రహ్మ శివపోతులూరయ్య
తెలిసికోండి." కాల. త. పు. 17

ఆపః అంటే సమస్తాన్ని జ్యోతి అంటే బాగుగా పరిశీలించేది. అని నైఘంటికార్థం. ప్రపంచాన్నంతటినీ చూడగలిగే వెలుగు భగవంతుడే. అతడే ఆపోజ్యోతి. ఈ పదబంధం ఉపనిషత్తుల్లో ఇలా కనిపిస్తుంది.

"పంచభూతాని పృథివీ
వాయురాకాశ ఆపాజ్యోతీంషి"

ఐతరేయోపనిషత్

తృతీయాధ్యాయం, శ్లో. 3, పు. 48

ఈశ్లోకంలోని అర్థాన్నిబట్టి ఆపః అంటే నీరు. జ్యోతి అంటే వెలుగు. ఈ పంచభూతాలనే మనవాళ్ళు దైవంగా భావించారు. కనుక ఆపో జ్యోతి అంటే భగవంతుడని అర్థం.

**ఉపరతి :—** ఈపదం బ్రహ్మంగారి కాలజ్ఞాన గ్రంథంలో ఇలా ప్రయోగించబడింది.

"పుపరతి సమరతి తెలిసియు
నిపుణత్వము తోడ గూడు నేర్పరి సిద్ధా!"

కాల. పు. 183.

ఆత్మనిష్ఠను బలపరచుకోవడానికి చిత్తవృత్తిని కర్మలవైపు పోనీయక మరలించడాన్ని ఉపరతి అంటారు. ఈపదం పరశురామపంతుల లింగమూర్తిచేత ఇలా ప్రయోగించబడింది.

"అతుల వైరాగ్య బోధోపరతులు మూడు
కలవు తారతమ్యంబుల నలువురకును"

సీతారామాంజనేయ సంవాదం, పు. 115

ఈ పద్యంలో వైరాగ్యం, బోధ, ఉపరతి అనే మూడు అంశాలు ఉన్నాయనే విషయం చెప్పబడింది.

**ఖేచరి:-** ఈ పదం బ్రహ్మంగారి ఒక తత్త్వంలో ఇలా ప్రయోగించబడింది.

"చల్లోయమ్మ చల్లా సద్గురువాక్యము నెగజల్ల
ఖేచరి ముద్రయు సత్కళవీధిని సమరసమైన"

కాల. త. పు. 4

తారక రాజయోగాన్ని అనుష్ఠించేవారు పట్టవలసిన అయిదు ముద్రలున్నాయి. 1) ఖేచరి 2) భూచరి 3) మధ్యమ 4) షణ్ముఖి 5) శాంభవి అనేవి. వీటిలో ఖేచరిని గురించి సీతారామాంజనేయం ఇలా అంటున్నది.

"కనులు మూసియైన కడు విచ్చియైన
భ్రూమధ్యమున చూపుమలచి నిలిపి
ఊర్ధ్వ ముఖము గాగ నొనరజూచినది
ఖేచరి యనుముద్ర కేశవర్య"

ఆశ్వాసం. 1 పద్యం 104

కళ్లు మూసియైనా కళ్లు తెరచిఅయినా రెండు కనుబొమలమధ్య చూపు నిలిపి పైకిచూచేది ఖేచరిముద్ర అవుతుందని పైపద్యంలో చెప్పబడింది.

## తారక రాజయోగము :-

నే జూచినానమ్మ నెలతరో తారక రాజ
యోగమునందు రాజిల్లు నా గురుని"

కాల. త. పు. 4.

అని అన్నారు బ్రహ్మంగారు. సాంఖ్య, తారక, అమనస్క యోగాలను రాజయోగమని అంటారు. ఇది భగవద్గీత ఆరవ అధ్యాయంలో ఆత్మ సంయమయోగంగా చెప్పబడింది. ఈ యోగాన్ని గురించి

"తారక యోగము దెలియగ
నేరక వేదాంతవాక్య నికురుంబముచే
నూరక వాదించుచు చెడు
వారికి మోక్షంబు గలదె వాయుకుమారా!"

ఆశ్వాసం. 1 ప. 92.

అని సీతారామాంజనేయం అంటున్నది. తారకరాజయోగం తెలుసుకోకుండా కొన్ని వేదాంత వాక్యాలతో ఊరక వాదిస్తే మోక్షం కలుగదు. అని పైపద్యానికి భావం.

**త్రికూటం :—** ఈ పదం బ్రహ్మంగారి కాలజ్ఞానతత్త్వంలో ఇలా ఉంది.

"ఓం నమశ్శివాయ సిద్ధమైన పదవి
ఓంకారమేదిరా ఓరీ
ఒనరుగా త్రికూట భ్రూమధ్యమందున్న
వాడెవ్వడో చూడరోరీ"

కాల. త పు. 12

ఇడా పింగళ షుషుమ్నా నాడులు కలిసే చోటునే త్రికూటమని అంటారు. భగవద్గీతలో –

"ప్రయణకాలే మనసా చలేన
భక్త్యాయుక్తో యోగబలేన చైవ
భ్రువోర్మమధ్యే ప్రాణ మావ్శ్యే సమ్యక్
సతం పరం పురుషముపైతి దివ్యమ్"

భగవద్గీత అధ్యాయం 8, శ్లో 10.

అని ఉంది. అంత్యకాలంలో యోగబలంతో ప్రాణవాయును కనుబొమలమధ్య నిలిపి పరమాత్మను ధ్యానించినవాడు పరమాత్మను పొందగలడు. అని పై శ్లోకానికి భావం. దీన్నిబట్టి కనుబొమల మధ్యస్థానమే త్రికూటమని తెలుస్తున్నది.

## పరంజ్యోతి:-

"చూపుల లోపల పాపల నడుమను
వెలిగేటి ఆ పరంజ్యోతిని నే జూచినానమ్మ."

కాల. త. పు. 4.

అన్నారు బ్రహ్మంగారు. పరంజ్యోతి అంటే శ్రేష్ఠమైన వెలుగు అని నైఘంటికార్థం. అంటే భగవంతుడని అర్థం. ఈ పదం ఇదే అర్థంతో భాగవతంలో ఇలా ప్రయోగించబడింది.

"పరంజ్యోతికి సర్వజ్ఞునకు కృపాశాంతమతికి
గడగియు ప్రకృతి పురుషులకంటె బరము
డైనవానికి మ్రొక్కెద."

తృతీయస్కంధం, ప. 386, పు 291.

పోతన ఈ పద్యంలో విష్ణువును పరంజ్యోతిగా సర్వజ్ఞుడుగా, కృపామూర్తిగా, శాంతమూర్తిగా ప్రకృతికి పురుషులకంటె శ్రేష్ఠునిగా వర్ణించి నమస్కరించాడు. శంకరాచార్యులు కూడా ఇదే అర్థంలో

"పరంజ్యోతి రాకార శూన్యం వరేణ్యం"

శంకర గ్రంథ రత్నావళి
నిర్వాణ మంజరి, శ్లో, 12.

అని పరమాత్మను పరంజ్యోతిగా నిరాకారునిగా శ్రేష్ఠమైనవానిగా వర్ణించాడు.

## బ్రహ్మజ్ఞానం:-

"పనికిమాలిన బ్రహ్మజ్ఞానం పలికితె బ్రహ్మంబయ్యేనా."

కాల. త. పు, 5.

అని బ్రహ్మంగారన్నారు. ఈ బ్రహ్మజ్ఞానాన్ని గురించి ఉపనిషత్తు

,,సత్యం జ్ఞానమనంతం బ్రహ్మయో వేద
నిహితం గుహాయాం పరమే వ్యోమన్"

తైత్తరీయోపనిషత్
ప్రథమోనువాకః
వాక్యం 1, పు. 35

అని అంటున్నది. సత్యస్వరూపం గలది, జ్ఞానస్వరూపం గలిది, అంతం లేనిది, గొప్ప ఆకాశంలో నిహితమైనదానిని ఎవరు తెలిసికొంటారో వారు బ్రహ్మజ్ఞానం కలవారు. అని పైవాక్యంవల్ల తెలుస్తున్నది.

**సచ్చిదానందము:-** సత్, చిత్, ఆనందం కలిసి సచ్చిదానంద మవుతుంది. సత్ అంటే శాశ్వతమైనదని, చిత్ అంటే ప్రకాశించునదని నైఘంటికార్థం. శాశ్వతంగా ప్రకాశించే ఆనందమే సచ్చిదానందం. శాశ్వతంగా ప్రకాశించే ఆనందం బ్రహ్మమే. ఈ అంశాన్ని ఉపనిషత్

,,ఆనందో బ్రహ్మేతి వ్యజనాత్" - తైత్తిరీయోపనిషత్

షష్ఠోనువాకః
వాక్యం. 6, పు. 73

అని వివరిస్తున్నది. కనుక సచ్చిదానందమంటే పరమాత్మ అని అర్థం. ఈ పరమాత్మను శంకరాచార్యులు ఇలా వర్ణించాడు.

,,అఖండే సచ్చిదానందే నిర్వికల్పైక రూపిణి
స్థితేఽద్వితీయభావేఽస్మిన్ కథం పూజా విధీయతే"

— ఆత్మపూజా గ్రంథం, శ్లో. 1.

నిర్వికల్పం, ఏకరూపం, అద్వితీయం, అఖండం, అయిన సచ్చిదా నందాన్ని పూజించడం ఎలా ? అని పై శ్లోకానికి అర్థం. కనుక సచ్చిదానందమంటే భగవత్ స్వరూపం.

**సత్కళ :-** "చలోయమ్మా! చల్ల: సద్గురువాక్యము నెగజల్ల
చల్ల చిలికి ఖేచరి ముద్రయు సత్కళవీధిని."

కాల. త. పు. 4

అని బ్రహ్మంగారు అన్నారు. సత్ అంటే శాశ్వతమైంది. అదే పరమాత్మ లక్షణం. మానవుని బుద్ధిలో వెలిగే పరమాత్మ ప్రతిబింబమే సత్కళ.

**సోహం —** ఈపదం కాలజ్ఞాన తత్వంలో ఇలా ప్రయోగించబడింది.

"సొంపుతో నిలిచి సోహం సోహం
సోహంబని చెంగట బలుకుచు" పు. 45

దీనినే **హంస** అనికూడా అంటారు. ఈపదం మరొకచోట ఇలా ప్రయోగించబడింది.

"ఆకారమను చిలుక హంసతో గూడుకొని
ఆడిస్తునున్నాడు రోరి" కాల. త. పు 12

మానవుల శ్వాసక్రియే హంస. ఈ విషయాన్ని ఉపనిషత్ ఇలా వివరిస్తున్నది.

**"సర్వా జీవే సర్వసంస్థే బృహంతే
తస్మిన్ హంసో భ్రామ్యతే బ్రహ్మచక్రే"**

**శ్వేతాశ్వతరోపనిషత్, అధ్యాయం. ౧, శ్లో. ౬, పు ౧౪.**

సర్వప్రాణులూ జీవించడానికి అనువైనది, సర్వప్రాణులూ నివసించేది, గొప్పది అయిన బ్రహ్మాండచక్రంలో జీవుడు త్రిప్పబడుచున్నాడు. అని పై శ్లోకానికి అర్థం. ఇక్కడ హంస అంటే జీవుడు అని అర్థం చెప్పబడింది.

## బ్రహ్మంగారివంటి సిద్ధపురుషులు :-

ఆంధ్రదేశంలో బ్రహ్మంగారు అద్వైతసిద్ధాంతాన్నీ సాంఖ్య యోగాన్నీ భక్తియోగాన్నీ జ్ఞానయోగాన్నీ అహింసా తత్వాన్నీ మతసామరస్యాన్నీ ప్రబోధించినట్లు ఆయనకు ప్రాచీనులు, సమకాలీనులు, అర్వాచీనులు, ఆయిన సిద్ధపురుషులు భారతదేశంలోని వివిధరాష్ట్రాలలో బోధించారు. ప్రాంతాలు వేరైనా భాషలు వేరైనా అందరూ విశ్వకల్యాణ ప్రదమైన బోధలు చేశారు. అలాంటి సిద్ధ పురుషులను గురించి ఈక్రింద రేఖామాత్రంగా పొందుపరచబడింది.

## ప్రాచీన సిద్ధపురుషులు :-

**తిరువళ్లువరు :-** ఈయన క్రీ॥ పూ॥ 2వశతాబ్దిలో ఉన్నాడని పండితులు నిర్ణయించారు. తమిళ దేశంలోని చెన్నై నగరంలో భగవంతుడు అనే ద్రావిడ బ్రాహ్మణుడికి ఆది అనే మాలస్త్రీకి జన్మించాడు. ఈయన "తిరుక్కురళ్" అనే గ్రంథాన్ని రచించాడు. "తిరుక్కురళ్" అంటే పవిత్రమైన పద్యాలని అర్థం. అతని కావ్యాన్ననుసరించి ఏకేశ్వరోపాసకుడుగా కనిపిస్తాడు. పుట్టుకతో సమస్తజనులు సమానులన్న విషయాన్ని ఈయన చాటాడు. తమిళదేశంలో సిద్ధిపొందిన మానవతావాది సిద్ధపురుషుడు.

**పతంజలి:-** క్రీ॥ పూ॥ 150వ శతాబ్దికి చెందిన వాడీయన. వీరి తల్లిదండ్రులు కొనికాదేవీ ఆత్రేయులు. మనో వాక్కాయాల పరిశుద్ధికై పతంజలి మూడుగ్రంథాలు రచించాడు. "పతంజలి యోగ సూత్రాలు" "చరకసంహిత" "వ్యాకరణ మహాభాష్యం" అని వాటి పేర్లు. ఈ గ్రంథాలవల్ల మనశ్శుద్ధి, వాక్శుద్ధి, కాయశుద్ధి కలుగుతా యని అంటారు. పతంజలి మహర్షి యోగసిద్ధి పొందినట్లు బ్రహ్మం గారు పొందారు.

**శంకరాచార్యులు:-** ఈయన కాలం క్రీ॥ పూ॥ 509-477. కేరళ దేశంలో ఆళ్వాయి అనే పట్టణానికి ఆరుమైళ్ల దూరంలోఉన్న కాలడి అనే గ్రామంలో జన్మించాడు. ఈయన 32 సంవత్సరాలు జీవించాడు. ఈ స్వల్పకాలంలో కాలడి నుండి కాశీవరకు సంచరించాడు. అద్వైతమతాన్ని ప్రచారం చేశాడు. విష్ణు సహస్రనామాలకు భాష్యం, భగవద్గీత, ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రాలు అనే ప్రస్థానత్రయానికి భాష్యం మొదలైన గ్రంథాలను రచించారు. శంకరుడు అద్వైతమతాన్ని బోధించినవిధంగా బ్రహ్మం గారు అద్వైతాన్ని బోధించారు.

**రామానుజాచార్యులు:-** (క్రీ॥ శ॥ 1019-1139) ఈయన కాంచీనగర సమీపంలోఉన్న శ్రీ పెరుంబుదూరు అనే గ్రామంలో జన్మించాడు. విశిష్టాద్వైతమతాన్ని బోధించాడు. దేశంలో భక్తి, జ్ఞాన మార్గాలను ప్రచారం చేశాడు. 108 సంవత్సరాలు జీవించి పరమపదించాడు. ఈయనలా బ్రహ్మంగారు భక్తి, జ్ఞాన మార్గాలను ప్రచారం చేశారు.

**మధ్వాచార్యులు:-** ఈయన క్రీ॥ శ॥ 1199లో భారతదేశపు పశ్చిమతీరంలోఉన్న ఉడిపి పట్టణానికి చేరువలోని పాజక క్షేత్రంలో జన్మించాడు. ఆసేతు సీతనగపర్యంతం అనేకపర్యాయాలు దిగ్విజయయాత్ర చేశాడు. స్వీయసిద్ధాంత ప్రతిపాదకాలైన 32 గ్రంథాలను "సర్వమూలము" అనే పేరుతో సంగ్రహించాడు. భక్తి మార్గాన్ని ప్రచారం చేశాడు. ఈయన ద్వైతమత స్థాపకుడు. ఈ మునలా బ్రహ్మంగారు భక్తిమార్గాన్ని బోధించారు.

**విద్యారణ్యుడు:-** ఈయన క్రీ॥ శ॥ 1230లో జన్మించాడు. క్రీ॥ శ॥ 1836లో సిద్ధిపొందాడు. అద్వైత ప్రచారానికి నవపీఠాలను స్థాపించాడు. సన్యాసదీక్ష వహించి శృంగేరీ పీఠాధిపతి అయ్యాడు. "శంకర విజయము" "పంచదశి" మొదలైన అనేక గ్రంథాలను రచించాడు. బ్రహ్మంగారు విద్యారణ్యులను గురించి కాలజ్ఞానంలో ప్రస్తావించారు.

**రామానందుడు:-** ఇతడు క్రీ॥ శ॥ 14వ శతాబ్దివాడు. భక్తిమార్గాన్ని తక్కువకులాల్లో ప్రచారం చేశాడు. వర్ణవ్యత్యాసాలను ఖండించాడు. భగవంతుణ్ణి ఆరాధించడానికి అందరికీ అర్హత ఉందని చాటాడు. రామానందుని శిష్యుల్లో మంగలి, చర్మకార, సాలె. మహమ్మదీయ మున్నగు కులాలవారున్నారు.

**చైతన్యుడు:-** ఈయన క్రీ॥ శ॥ 1485లో జన్మించి 1533లో పరమపదించాడు. భక్తిమార్గాన్ని బోధించాడు. వర్ణ విభేదాన్ని ఖండించాడు. ఈయన శిష్యుల్లో మహమ్మదీయులు కూడా ఉన్నారు. చైతన్యునిలా బ్రహ్మంగారు వర్ణవిభేదాన్ని ఖండించారు. మహమ్మదీయులను శిష్యులుగా చేసుకొన్నారు.

**కబీర్ :-** ఈయన క్రీ॥ శ॥ 15వ శతాబ్దికి చెందినవాడు. బ్రాహ్మణ కుటుంబంలో పుట్టి మహమ్మదీయులవద్ద పెరిగాడు. రామానందునికి శిష్యుడయ్యాడు. రాముడు అల్లా ఒక్కడేనని చెప్పాడు. ఇటువంటి భావాలతో కబీర్ అనేక కీర్తనలు రచించాడు. మత సామరస్యాన్ని బోధించాడు. ఈయనలాగే బ్రహ్మంగారు మత సామరస్యానికై పాటుబడ్డారు.

**నానక్ :-** పంజాబు దేశంలో క్రీ॥ శ॥ 1469లో తాల్వండి గ్రామంలో నానక్ జన్మించాడు. మతసహన బోధకు జీవితాన్ని అంకితం చేశాడు. తీర్థయాత్రలు చేసినందువల్ల సమాధులు దర్శించి నందువల్ల ప్రయోజనం లేదని ఈయన సిద్ధాంతం. ప్రపంచంలోని కల్మషాలమధ్య జీవిస్తూ నిష్కల్మషంగా గడపగలిగినపుడే ముక్తి లభిస్తుందని నానక్ విశ్వాసం. ఈయన బోధనలు హిందూ మహమ్మదీయ మత సామరస్యాన్ని సాధించినట్లు బ్రహ్మంగారి బోధలు హిందూ మహమ్మదీయులమధ్య ఐక్యతను సాధించాయి.1

**బసవేశ్వరుడు :-** (క్రీ॥ శ॥ 1120-1168) కర్ణాటక దేశంలో జన్మించాడు. కూడల సంగమదేవుని భక్తుడు. ఈయన వచనాలు రచించాడు. సర్వజ్ఞునికంటె ముందే కాలజ్ఞానాన్ని రచించాడు. ఈయన వచనాలను "బసవేశ్వర వచనాలు" అని అంటారు. బసవేశ్వరుని వచనాలిలా ఉంటాయి.

---

1. హనుమంతరావు, బి, యన్, యల్ - భారతదేశ చరిత్ర - సంస్కృతి, ప్రచు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఆకాడమీ పు, 22, 23, 24.

కన్నడ మూలం :-

"నిమ్మొడనె భక్తి హోయిత్తయ్యా
నిమ్మొడనె సదాచార హోయిత్తయా
నిమ్మొడనె యసంఖ్యాత మహాగణం గళు
హోదరణ్ణా!
మర్త్యలోకద మహామనె శూన్యవాయిత్తల్లా
బసవణ్ణా!

తెలుగు అనువాదం :-

నీతోనే భక్తి పోయినది
నీతోనే సదాచార మడుగంటి పోయినది
నీతోనే అసంఖ్యాత మహాగణములు పోయిరి
మర్త్యలోకమున మహా గృహము
శూన్యమై పోయెను బసవన్నా!" 1

పాల్కురికి సోమన ఈయన చరిత్రను "బసవపురాణం"గా రచించాడు. ఈయన భక్తిమార్గాన్ని ప్రబోధించాడు. ఈయన మాదిరిగా బ్రహ్మం గారు కాలజ్ఞానాన్ని వచనాలను రచించారు.

**సర్వజ్ఞుడు :-** ఇతడు క్రీ॥ శ॥ 16వ శతాబ్దికి చెందినవాడు. కర్ణాటక దేశంలోని హిరియకరూర్ తాలూకా అంబలూరులో

1. డా॥ రామయ్యా, బాడాల — బసవేశ్వర వచనాలు, ప్రచు: జగద్గురు విద్యా సంస్థ. సిరిగెరె, కర్ణాటక రాష్ట్రం, పు. 125.

క్రీ॥ శ॥ 1570వ సంవత్సరంలో జన్మించాడు. సర్వజ్ఞుడు కన్నడ భాషలో కాలజ్ఞాన వచనాలను రచించాడు. బిజ్జలుడు కల్యాణాన్ని పాలించే రోజుల్లో ఆతని మంత్రి బసవేశ్వరుడు నిర్మించిన అనుభవ మంటపంలో కూర్చొని సర్వజ్ఞుడు కాలజ్ఞానాన్ని చెప్పాడు.1 బ్రహ్మంగారి కాలజ్ఞానంలో నవమాశ్వాసంలో ఈ సర్వజ్ఞుని కాలజ్ఞానం చెప్పబడింది. సర్వజ్ఞుని కాలజ్ఞానంలో రాజకీయ, మత, సామాజికాది అంశాల భూత, భవిష్యత్, వర్తమానాలు చెప్పబడ్డాయి. ఈయన తనరచనలో జాతి, కుల, మత ద్వేషాలను ఖండించాడు. సర్వమానవ సమానత్వాన్ని ప్రబోధించారు. ఇలాగే బ్రహ్మంగారు కూడా సర్వ మానవ సమానత్వాన్ని ప్రబోధించారు.

## సమకాలీన సిద్ధపురుషులు:-

**వేమన:-** ఈయన క్రీ॥ శ॥ 17వ శతాబ్దికి చెందినవాడు. వేమన ఆటవెలది పద్యాలతో తనభావాలను ప్రచారం చేశాడు. మూఢభక్తిని, మూఢవిశ్వాసాలను ఖండించాడు వేమన బ్రహ్మం గారికి సమకాలీనుడు. బ్రహ్మంగారి రచనలో వేమన ప్రసక్తి ఇలా కనిపిస్తుంది.

"వేమనంత పెద్ద వెతకు కాళి" కాల. పు. 198

పై ఉదాహరణలో బ్రహ్మంగారు వేమనను ప్రశంసించారు. కనుక వేమనకంటె కొంచెం ప్రాచీనుడని చెప్పవచ్చు. ఇంకా బ్రహ్మంగారి కాలజ్ఞానంలో వేమన రచనతో పోలికలు కనిపిస్తాయి. అవి ఈక్రింద పొందుపరచబడ్డాయి.

---

1. వీరబ్రహ్మం, పోతులూరి - కాలజ్ఞానం, ప్రచు: కృష్ణమూర్తి, రంగయ్య, కందిమల్లాయపల్లె, 1974, పు. 74.

## వేమన బ్రహ్మంగారి రచనల పోలికలు :-

కాలజ్ఞాన గ్రంథంలో "సిద్ధబోధము" "హంసకాళికాంబ పద్య రత్నములు" అనే శీర్షికల క్రింద ఉన్నపద్యాల్లో వేమన పద్యాల పాదాలు యథాతథంగా కొన్ని కొన్ని మార్పులతో కొన్ని ప్రయోగించబడ్డాయి. వేమన పద్యాల్లో మొదటి పద్యంలో శివకవుల స్తుతి ఉన్నట్లుగా బ్రహ్మంగారి పద్యాల్లో మొదటి పద్యంలో శివకవుల స్తుతి ఉంది. "శరణు సేయర" అనేది రెండుపద్యాల్లో సమానంగా ఉంది. వేమన పద్యాల్లో ఉన్న

"బ్రహ్మమనగ వేరె పరదేశమున లేడు
బ్రహ్మమనగ జూడు బట్టబయలు
తన్ను దానెరిగిన తానె పో బ్రహ్మంబు
విశ్వదాభిరామ వినుర వేమ!"

వేమన పద్యాలు, పు. 187

అనే పద్యానికీ బ్రహ్మంగారి పద్యాల్లోఉన్న

"బ్రహ్మమనగ వేరె పరదేశమున లేడు
బ్రహ్మమనగ తానె బట్టబయలు
తనకు తానె బ్రహ్మ తారకమౌనయా
కాళికాంబ హంస కాళికాంబ!"

కాల. పు. 187

అనే పద్యానికీ పోలికలు ఉన్నాయి. వేమన పద్యాలను పోలిన పద్యాలు, పద్యపాదాలు, మాటలు ఈ క్రింద ప్రదర్శించబడ్డాయి.

1) కుక్కకున్న బుద్ధి గురునకు లేదురా!"

వేమన పద్యాలు, పు. 30

"కుక్కకున్న గుణము గురునకు లేదయా!"

కాల. పు. 93

2) ,,జీవి జీవి జంపి జీవికి వేయగా
జీవివలన నేమి చిక్కియుండె
జీవ హింసకులకు చిక్కునే మోక్షంబు"

వేమన పద్యాలు, పు. 93

"జీవిని మర్దించి జీవికి వేసెనా
జీవదోషంబులు చిక్కుబడును
జీవహింసచేత చిక్కునా మోక్షంబు"

కాల. పు. 213

పైన ప్రదర్శించిన ఉదాహరణాల్లో వేమన రచనకు బ్రహ్మంగారి రచనకు పోలికలు కనిపిస్తున్నాయి. వేమనగారి సిద్ధాంతమంటే బ్రహ్మంగారికి ఇష్టం కనుక ఆయన భావాలను పలుకుబడులను అనుసరించి ఉంటారు. లేదా ఇవి ప్రక్షిప్తాలైనా కావచ్చు.

**రామదాసు :-** ఈయన పేరు కంచర్ల గోపన్న. రామ భక్తుడు కావడంచేత రామదాసనే పేరు వచ్చింది. తెలంగాణాలోని నేలకొండపల్లెలో క్రీ॥ శ॥ 1630లో జన్మించాడు. 1659లో భద్రాచలం తహశీలుదారుగాఉండి ప్రభుత్వధనంతో రామాలయాన్ని ఉద్ధరించాడు. తత్ఫలితంగా తానీషాచే చెరసాలలో వేయబడ్డాడు. అనేక కష్టాలను అనుభవించాడు. అయినా రామభక్తిని విస్మరించలేదు. రామదాసు భక్తి కీర్తనలనూ దాశరధి శతకాన్ని రచించాడు. క్రీ॥ శ॥ 1680లో అనారోగ్య కారణంగా పరమపదించాడు.1

1. లక్ష్మీనారాయణ, కొడాలి - భద్రాచల రామదాసు చరిత్ర. ఆధారంగా రాయబడింది. ప్రచు : ఇతిహాస పరిశోధక గ్రంథమాల. మోపర్రు, 1977,

**తుకారాం:-** ఈయన మహారాష్ట్ర దేశంలోని దేహు అనే గ్రామంలో క్రీ॥ శ॥ 1608 కీలకనామ సంవత్సరంలో జన్మించాడు. విఠోబా భక్తుడై భక్తిమార్గాన్ని ప్రచారం చేశాడు. తుకారాం గాన యోగ్యాలయిన ఎనిమిదివేల గీతాలను రచించాడు. ఈ గీతాలను అభంగాలని అంటూ తుకారాం బోధనలను విని శివాజీ ఆయనకు శిష్యుడయ్యాడు. తుకారాం అనాగతవేదియై తన మరణముహూర్తాన్ని ముందుగానే ప్రకటించాడు. ఈయన నలభై సంవత్సరాలు మాత్రమే జీవించాడు. 7-3-1649 డోలా ఉత్సవంలో జలసమాధి అయ్యాడు.

## మంత్రాలయం రాఘవేంద్రస్వామి :-

ఈయన మధ్వమతానికి చెందినవాడు. కుల మత భేదాలను నిరసించి సర్వమానవులు సమానమని చాటాడు. జ్ఞానసాధనకు భక్తి రాజమార్గమని ఉపదేశించాడు. ఆదోని తాలూకాలో ఉన్న మంచాలలో మఠం నిర్మించుకొని ప్రజలకు జ్ఞానబోధలు చేశాడు. తన సమాధి ప్రవేశ ముహూర్తాన్ని ముందుగానే ప్రకటించి శిష్యుల సమక్షంలో సమాధిలోనికి వెళ్లాడు. ఈ సమాధిఉన్న ఈస్థలాన్ని ప్రస్తుతం మంత్రాలయమని అంటున్నారు.

## అర్వాచీన సిద్ధపురుషులు :-

**సిద్ధయ్య :-** ఈయన బ్రహ్మంగారి ప్రథమ శిష్యుడు. దూదేకుల కులానికి చెందినవాడు. కందిమల్లయపల్లెకు 8 మైళ్ల దూరంలో ఉన్న ముడుమాల ఇతని స్వగ్రామం. తలిదండ్రులు ఆదంబీ పీర్‌సాహెబ్‌లు. సిద్ధయ్య ఒక హిందూయోగి వరప్రసాది. సిద్ధయ్య తన పన్నెండవయేట బ్రహ్మంగారికి శిష్యుడయ్యాడు. బ్రహ్మంగారి బోధామృతాన్ని వంటబట్టించుకొన్నాడు. బ్రహ్మంగారి మార్గంలో

రచనలు చేశాడు. సిద్ధయ్యగారి ప్రసిద్ధమైన తత్వాలు కొన్ని ఈక్రింద ప్రదర్శించ బడుతున్నాయి.

1) "ఏ కులమని నను వివర మడిగితే
ఏమని దెల్పుదు లోకులకూ
పలు గాకులకు దుర్మార్గులకు
ఈ దుష్టులకు ॥ఏ॥
ఫాలభాగమున యాలలు బాడుచు
భావన కన్నది నా కులము ॥ఏ॥

ముట్టున బుట్టిందీ కులము
ముట్టంటున పెరిగిందీ కులము
ముట్టులో హరియు ముట్టులో శివుడు
ముట్టులో బ్రహ్మ ముగ్గురు మూర్తుల
మూలము తెలిసిందీ కులము ॥ఏ॥

ఇంటిలోపల ఇల్లు గట్టుకొని
మంటలోపల రాటం బెట్టుక
కంటిలోపల కదురు బెట్టుకొని
ముక్కులోపల ఏకు బెట్టుకొని
చెవులో బాకా చేతికి తీసుక
నారాయణ యను నరము తీసికొని
అష్టాక్షరి యను తడిక వేసుకొని
పంచాక్షరి యను మంచ దీసికొని
తధిమి తధిమి గుబదెబ గుబదెబ
ఏకిన కులమే మా కులము ॥ఏ॥

కాల. త. పు. 14.



సిద్దయ్యగారి సమాధి



సిద్దయ్యగారి మఠంలో పూజలందుతున్న బ్రహ్మంగారి
పాదుకలు, యోగదండం, శిఖాముద్రిక.



మఠాధిపతుల కుటుంబం

2) చందమామ చందమామ
చందమామ
ఈసంధి తెలిపే జ్ఞానులెవరే
చందమామ ॥చం॥

కాయమను పుట్టలోను చందమామ
పాము మాయగానె మెలగుచుండు
చందమామ ॥చం॥

జంట నాద స్వరములూద చందమామ
పామును పాదు పెకలింపవలెను చందమామ
తొమ్మిది వాకిళ్లుమూసి చందమామ
పామును నెమ్మదిగా పట్టవలెను చందమామ ॥చం॥
రామయను కట్టుగట్టి చందమామ
పామును యుక్తిచేసి పట్టవలెను చందమామ ॥చం॥
దేహ దేహముల యందు చందమామ
పాము తెలియకుండా చుట్టుకొన్నది
చందమామ ॥చం॥

అజపమంత్ర ధ్యానముచేత చందమామ
పాము అఖండ కళలతో వెలుగుచుండు
చందమామ ॥చం॥

పామును పట్టె యోగి ఎవరు చందమామ
ఓహో! అతనిపేరు సిద్ధగురుడు చందమామ ॥చం॥
కాల. త. పు. 46

సిద్ధయ్య హిందూ మహమ్మదీయ సమైక్యతను, శివకేశవాద్వైతాన్ని, సర్వమత సహనాన్ని బోధించాడు. కులభేదాన్ని నిరసించాడు.

బ్రహ్మంగారికి వారసుడై ఆయన సిద్ధాంత ప్రచారాన్ని కొనసాగించాడు. బ్రహ్మంగారిలా రాజయోగి అయ్యాడు. బ్రహ్మంగారివంటి గురువు సిద్ధయ్యవంటి శిష్యుడు లేడన్న ప్రశంసకు పాత్రుడయ్యాడు.

**కక్కయ్య :-** ఇతడు బ్రహ్మంగారి శిష్యుల్లో ఒకడు. బ్రహ్మంగారి బోధలవల్ల బ్రహ్మజ్ఞానాన్ని సంపాదించి సిద్ధి పొందాడు. బ్రహ్మంగారు రచించిన తత్వాలు పాడి ఆయన బోధలను ప్రచారం చేశాడు. మరణ ముహూర్తాన్ని ముందుగా ప్రకటించి సమాధిలో ప్రవేశించాడు. కందిమల్లయపల్లెకు తూర్పు దిశన బ్రహ్మంగారి మఠానికి కొద్దిదూరంలో కక్కయ్య సమాధి ఉంది.

**ఈశ్వరీదేవి :-** ఈమె బ్రహ్మంగారి మనుమరాలు. ఆయనలా తత్వాలు రచించి ఆయన బోధలు ప్రచారం చేసింది. యోగసాధన చేసింది. క్రీ॥ శ॥ 1695లో జన్మించి 1803లో సమాధి ప్రవేశం చేసింది.1. బ్రహ్మంగారిలా తత్వాలు, కాలజ్ఞానం రచించింది. ఈమె రచించిన తాళపత్ర గ్రంథాలు కందిమల్లయపల్లె ఈశ్వరీదేవి మఠంలో ఉన్నాయి. ఈ కాలజ్ఞానం స్వర్ణ సుబ్రహ్మణ్యకవి సంపాదకత్వంలో 1979వ సంవత్సరంలో ముద్రించబడింది. ఈమె చెప్పిన కాలజ్ఞానంలో బ్రహ్మంగారి చరిత్ర, భూత భవిష్యత్ వర్తమానాలు చెప్పబడ్డాయి. ఈ కాలజ్ఞానంలో బ్రహ్మంగారిరూపం కూడా వర్ణించబడింది. ఈశ్వరీదేవి చెప్పిన తత్వాలు, కాలజ్ఞాన వచనాలు మచ్చుకు ఈక్రింద కొన్ని ప్రదర్శించబడ్డాయి.

---

1. ఆంజనేయశాస్త్రి, తంగిరాల - ఈశ్వరమ్మ (వ్యా), ఆంధ్రప్రదేశ్ భూగోళ సర్వస్వము, ప్రచు : ఆంధ్ర రచయితల సంఘం, హైదరాబాదు, పు, 540.



పశ్చిమద్వారం

## తత్త్వాలు:-

1) "రాక్షస కులమును నీరుసేయ శ్రీరాములు
జననంబైనారు
అక్షయముగ తా దివ్యవత్సర మందు
ప్రకాశంబైనాడు"

2) "భక్తిగలిగి మనసందున మంత్రము
మానక నడపం డన్నాడు
వర్ణ వివేకముతో పని లేదని
స్త్రీ పురుషులు తెలియండన్నాడు

ఈశ్వరీదేవి కాలజ్ఞానం, పు. 117

3) "సాధు పూజలను సల్పు జనుల నా
సన్నిధి నిలిచేరన్నాడు
సాహసమును కడతేరి జయింతురు
శక్తి మొదలు నేనన్నాడు"

4) "భూ భారంబును తీర్చి భక్తులను
పాలించెదనని అన్నాడు
రేపగల్లు మా ద్వాదశాక్షరీ
మంత్రమునకు పండన్నాము"

ఈశ్వరీదేవి కాలజ్ఞానం, పు. 118

5) "పింగళ కాళయుక్తి సందున
భూభారము తెగునన్నాడు
కాలసంధి సరియాయెను ఇంకను
కలియుగంబు లేదన్నాడు"

ఈశ్వరీదేవి కాలజ్ఞానం, పు. 120

6) "శిక్షచేయు దుర్మార్గుల మీదికి
శక్తుల బంపేనన్నాడు
ఈక్షితి లోపల మానవ కోటికి
వింతలు చూపేనన్నాడు"

ఈశ్వరీదేవి కాలజ్ఞానం. పు. 121

## వచనాలు:-

1) "కాలజ్ఞానములు బనగానపల్లెలో గరిమరెడ్డి అచ్చమ్మగారి గృహముదగ్గర చింతచెట్టుక్రింద స్థాపనముచేసి తన నిజశిష్యుండైన సిద్ధప్పను వెంట తీసికొని శ్రుతి, స్మృతి సమేతముగా అనేక విషయములు తెలియజేయుచూ పుష్పగిరి అగ్రహారము వీధిన వస్తూయుండగా ........... వైదికు లందరు గుంపులుగూడి నిలువవేసినారు."

ఈశ్వరీదేవి కాలజ్ఞానం పు. 96

2) "మా తండ్రిగారు గోవిందయ్య గారున్నూ మా తల్లిగారున్నూ యేకసమాధియందు గూర్చుండిరి. నా చెల్లెండ్రు వివాహము లేకుండ కొన్ని సంవత్సరములుండి యిరవైఐదువేల కాలజ్ఞానములు వారి వారి సమాధులలో కూర్చొనేకాలమందు గ్రంథములు

దగ్గర నుంచుకొని వారున్నూ సమాధినిష్ఠ వహించి తపస్సుకు కూర్చుండిరి. నేనున్నూ వికృతినామ సంవత్సరములో సమాధిలో చేరబోవుచున్నాను."

ఈశ్వరీదేవి కాలజ్ఞానం, పు 109

ఈశ్వరీదేవి తాతగారిలా కాలజ్ఞానం, తత్వాలు రచించి భక్తిమార్గాన్ని ప్రజలకు బోధించింది. మతసామరస్యాన్ని ప్రబోధించి కులతత్వాన్ని ఖండించింది. నూటాఎనిమిది సంవత్సరాలు ఈలోకంలో నివసించి అనాగతవేదియై సమాధి ముహూర్తాన్ని ముందుగానే ప్రకటించి సమాధినిష్ఠ వహించింది. బ్రహ్మంగారి మఠం ప్రక్కనే ఈశ్వరమ్మగారి మఠం ఉంది. ప్రతిఏటా మార్గశిర బహుళ నవమికి ఆమె ఆరాధన జరుగుతుంది.

## భాషా విశేషాలు :-

క్రీ॥ శ॥ 17వ శతాబ్దిలో తెలుగు భాషా చరిత్రలో ఒక కొత్త మలుపు తిరిగింది. అన్యభాషల సంపర్కంతో తెలుగు కొత్తరూపాన్ని సంతరించుకొన్నది. ఈ రోజుల్లోనే యక్షగానాలు, వచన రచనలు, పదకవితలు, సామాన్యజన వ్యవహారానికి సమీపశైలిలో రచించబడ్డాయి. ఈకాలంలో తెలుగు భాషలో కొన్ని మార్పులు చేర్పులు చేయబడ్డాయి. ఈఅంశాన్ని గురించిరాస్తూ డా॥ తూమాటి దొణప్ప దీనికి కారణాన్ని "అన్యసంస్కృతుల ఒత్తడి భిన్ననిర్మాణ రీతులు గల భాషలతోడి సంసర్గం, నూతనావశ్యకాలు, జానపద ధోరణులు, వ్యవహర్తల అలసతా, అశక్తతా, అనుకరణవ్యగ్రతా మున్నగునవి భాషలలోని మార్పులనూ చేర్పులనూ ఇంటాబయటా వేగిరపరచే శక్తులుగా అభియుక్తులు పేర్కొంటూ ఉంటారు.1" అని అన్నారు. తెలుగుభాష ఇటువంటి మార్పులను చేర్పులను సంతరించుకొన్న రోజుల్లోనే బ్రహ్మంగారు రచనలు చేశారు.

బ్రహ్మంగారు కాలజ్ఞానాన్ని వచనంగా, ద్విపదలుగా, సౌజన్య పత్రికలుగా, పద్యాలుగా, గోవిందనామాలుగా, తత్త్వాలుగా చెబుతూంటే శిష్యపరంపర తాళపత్రాలమీద రాసుకొన్నారు. ఈ తాళపత్ర గ్రంథాలనే మఠంవారు ముద్రించారు. ఇప్పటి ఈ పరిశీలనకు ముద్రించబడిన కాలజ్ఞాన గ్రంథంలోని నిర్ధారక ప్రయోగాలు ఆధారం. ప్రస్తుత సమీక్షలో ఆయా ప్రయోగాలు ప్రధానలక్షణాలు మాత్రం రేఖామాత్రంగా రూపించబడుతున్నాయి.

---

1. డా॥ దొణప్ప, తూమాటి – తెలుగు హరికథా సర్వస్వం, ప్రచు: రచయిత, గుంటూరు 1978, పు. 262

## నామవాచకాలు :-

**గ్రామాల ప్రదేశాల పేర్లు :-** ప్రథమ ప్రకరణంలో "బ్రహ్మంగారి దేశసంచారం" అనే శీర్షికక్రింద ఆయన రచనలలో కనిపించే ఆయా గ్రామాల ప్రదేశాలపేర్లు ఉదాహరించబడ్డాయి. బ్రహ్మంగారికి తెలుగుపేర్లను సంస్కృతీకరించి చెప్పడం అలవాటు. పాపనాశన పురాన్ని "దురితహరపురం" (కాల. పు. 7) అనీ బనగానపల్లెను "కలప గ్రామం" (కాల. పు. 97) అనీ పోరుమామిళ్లను "కలహచూతపురం" (కాల. పు. 125) అనీ బాపనపల్లిని "భూసుర నగరం" (కాల. పు. 125) అనీ అన్నారు.

**సంవత్సరాల, మాసాల, వారాల పేర్లు :-**

గ్రామాలకు మారుపేర్లు పెట్టినట్లుగానే బ్రహ్మంగారు సంవత్సర, మాస, వారాలపేర్లను మార్చివేశారు. వాటిలో విలక్షణంగా ఉన్న కొన్నిరూపాలు, ఇక్కడ ఉదాహరించ బడుతున్నాయి.

| | | కాల. పు. | |
|---|---|---|---|
| 1) | కేశవ మాసం, | 54 | (వైశాఖం) |
| 2) | జీవ నక్షత్రం | 58 | ( ) |
| 3) | ధూర్జటినామ సంవత్సరం | 42 | ( ) |
| 4) | నారాయణ మాసం | 54 | (చైత్రం) |
| 5) | పిలపిల మాసం | 22 | (శ్రావణం) |
| 6) | పిశంగిల సంవత్సరం | 22 | (శ్రీముఖం) |
| 7) | పిప్పలాయ సంవత్సరం | 45 | ( ) |
| 8) | బ్రహ్మపుర సంవత్సరం | 61 | ( ) |
| 9) | శ్రీ తీర్థనామ సంవత్సరం | 42 | ( ) |

వీటిలో కొన్నింటికి ఇవ్వబడిన అర్థాలు బ్రహ్మంగారు చెప్పినవే. కొన్నింటకి అర్థాలు తెలియవు.

## సంఖ్యావాచకాలు :_

బ్రహ్మంగారి రచనల్లో కనిపిస్తున్న సంఖ్యావాచకాలు కొన్ని సాధారణంగా కనిపించినా కొన్ని విలక్షణంగా కనిపిస్తున్నాయి. నామవాచకాలను మార్చిన పద్ధతిలో సంఖ్యావాచకాలలో కూడా బ్రహ్మంగారి ఉక్తి వైచిత్రి కనిపిస్తుంది. బ్రహ్మంగారి రచనల్లోని సంఖ్యావాచకాలిలా ఉన్నాయి.

| | | కాల. పు. | |
|---|---|---|---|
| 1] | ఆరు తొమ్మిది | 41 | (పదిహేను) |
| 2] | ఆరు మూడు | 16 | (తొమ్మిది) |
| 3] | పదులు మూడు | 7 | (ముప్పై) |
| 4] | పదులు రెండు | 15 | (ఇరవై) |
| 5] | పంచకాలు రెండు | 15 | (పది) |
| 6] | పంచమొకటి | 34 | (ఆరు) |
| 7] | మూడారు | 18 | (తొమ్మిది) |
| 8] | మూడు మూడు మూడు | 20 | (తొమ్మిది) |

## విభక్తి విషయం :_

ప్రథమా విభక్తి :_ "ఆదికేశవు" (కాల, పు, 27) వంటి పదాలు "డు" ప్రత్యయ విరహితంగా పలుమార్లు ప్రయుక్తాలయ్యాయి. "ము" ప్రత్యయవిరహితంగా "దర్శన" (కాల, పు, 185) అనే ప్రయోగం ఉంది.

ద్వితీయా విభక్తి :— "తూర్పు పడమర నీళ్లకు సృష్టియోజన మనబడును. (కాల, పు, 23) అనే చోట ప్రథమకుమారుగా ద్వితీయ వచ్చింది. "కలి భారము ఖండించే నిమిత్తమై" (కాల, పు, 24) అనే చోట ద్వితీయకు మారుగా ప్రథమ ప్రయుక్తమైంది.

పంచమీ విభక్తి :— "— కంటె" కు బదులుగా "— కన్న" ఉపయుక్తమైనందుకు ఉదాహరణాలు :

| | | కాల. పు. |
|---|---|---|
| 1] | నాకన్న ఘనుని జేస్తిని | 2[illegible]. |
| 2] | మనసు కన్నా | 199. |
| 3] | మాకన్నా ఘనమైన స్వామి | 28. |
| 4] | వెలుగు కన్నా | 212. |

సంబుద్ధి :- కొన్ని విలక్షణమైన సంబుద్ధి ప్రయోగాలు ఇలా ఉన్నాయి.

| | | |
|---|---|---|
| 1] | ఒరే | కాల. త. పు. 39 |
| 2] | గురవే | కాల. పు. 13 |
| 3] | గురుడా | ,, ,, 218 |
| 4] | పరమ గురువా | ,, ,, 10 |

## క్రియా ప్రయోగాలు :—

బ్రహ్మంగారి రచనలో క్రియావాచక నిర్మాణంలో వ్యావహారిక శైలీ ప్రాబల్యం అధికం. ఇంకుచ్చు స్థానంలో - స్తు - వస్తుంది.

| | కాల పు. |
|---|---|
| కట్టుడి చేస్తిమి | 15 |

| | |
|---|---|
| | కాల. పు. |
| మంత్రోపదేశము ఇస్తిమి | 17 |
| వార్తలు యిస్తిమి | 26 |
| సాటిస్తిమి | 43 |
| పంపిస్తున్నాడు | కాల, త, పు, 7 |
| వివరిస్తున్నాడు | ,, ,, 7 |

ఇచ్చు మున్నగు ,,చు" వర్ణాంత ధాతువుల చేయు మొదలగు ,,యు" వర్ణాంత ధాతువుల ఆద్యక్షరం పైభాగానికి ,,స్తి" ఆదేశమవుతుంది.

| | |
|---|---|
| అన్ని యిస్తిమి | కాల, పు, 54 |
| కృతార్థుణ్ణి చేస్తిమి. | కాల, త, పు, 46 |
| నరజన్మ యిస్తుము | ,, ,, 46 |

సాహాయ్యక క్రియగా ,,కొను" ధాతువు అను ప్రయుక్త మయి నప్పుడు

| | |
|---|---|
| | కాల, త, పు, |
| కోసుక | 3 |
| చేసుక | 19 |
| తీసుక | 4, 38 |
| వేసుక | 11 |
| పట్టుక | కాల, పు, 24 |

పై పదాల్లో ,,క" సపదాంశంగా కనిపిస్తుంది. ఈక్రింది పదాల్లో ,,కొను" ధాతువు అనుప్రయుక్తం కాగా ,,కుని" సపదాంశంగా వచ్చింది.

| | కాల. పు. |
|---|---|
| అమ్ముకునేరు | 87 |
| అనందించుకునేది | 61 |
| కోటకు చేర్చుకునేరు | 81 |
| చెడుచుకునేరు | 88 |
| మాటలు తెలుసుకునేవి | 146 |
| సంరక్షించుకునేము | 72 |

,,కోను" ధాతువు అనుప్రయుక్తం కాగా –

ధ్యానంబు చేసికొ        కాల, త, పు. 5

అనేచోట ,,కో" సపదాంశంగా వచ్చింది. ఇంకా

| | |
|---|---|
| చేసికోనేరరు | కాల, పు, 67 |
| పుట్టించుకోబోక | ,, ,, 67 |
| సిద్ధాంతముగా వప్పుకోరు | ,, ,, 67 |

అనే స్థలాల్లో ,,కో" సపదాంశంగా కనిపిస్తున్నది.

## సమాసాలు:-

బ్రహ్మంగారి రచనలో కనిపించే వివిధ సమాసాలు క్రమంగా ఈ క్రింద పొందుపరచబడ్డాయి.

1] దేశ్య + దేశ్య

| | కాల. పు. |
|---|---|
| చీమల పుట్టలు | 15 |
| నల్ల గాలి | 3 |
| నడి నెత్తి | 4 |
| నెత్తురు వాన | 5 |
| పువ్వుల వాన | 5 |
| పొగ మంటలు | 3 |
| సందు గొందులు | 3 |

2] దేశ్య + తత్సమ

| | కాల, పు. |
|---|---|
| గుడిగోపురము | 49 |
| చద్ధి భత్యాలు . | 23 |
| జారు వాక్యాలు | 36 |
| తోయాల వాక్యములు | 4 |
| నడిమి వలయంబు | 11 |
| పసిబాలురు | 14 |
| పలు విరోధులు | 21 |

3] దేశ్య + తద్భవ

రచ్చ కొట్టములు    కాల, పు. 4

4] దేశ్య + అన్య దేశ్య

| | కాల, పు, |
|---|---|
| ఏడు తేజీలు | 85 |
| జోడు ఫిరంగులు | 147 |
| దొర హుకుము | 195 |
| నేల మాళిక | 76 |
| పెద్ద గోరీలు | 145 |

పై సమాసాలు దేశ్యం పూర్వపదంగా ఏర్పడ్డవి. ఇక సంస్కృతం పూర్వపదంగా ఏర్పడిన సమాసాలకు ఈక్రింద ఉదాహరణ లివ్వబడ్డాయి.

1] సంస్కృతం + తత్సమం

| | కాల. పు. |
|---|---|
| ఆనందాశ్రమము | 5 |
| కపి ధ్వజం | 4 |
| కృష్ణార్జునులు | 21 |
| గరుడాద్రి | 17 |
| పరమ యోగీశ్వరులు | 5 |
| పంచ శక్తులు | 15 |
| పుణ్య స్థలములు | 9 |

| | కాల. పు. |
|---|---|
| లీలావ తారంబులు | 5 |
| వేద మంత్రములు | 4 |
| శ్రీశైల శిఖరము | 4 |

2] సంస్కృతం + దేశ్యం

| | కాల. పు. |
|---|---|
| ఆదిమోకట్లు | 51 |
| ఉభయ కోట | 48 |
| దురితాకు | 43 |
| బహు దొడ్డ | 34 |
| మహా దొడ్డ | 43 |
| మహా మన్నీలు | 5 |
| వసంతరాలు | 52 |
| శుద్ధ పాలు | 45 |

3] సంస్కృత + తద్భవ

| | కాల. పు. |
|---|---|
| అబ్ద పున్నమ | 46 |
| కాముని పున్నమ | 86 |
| భేరి కోమట్లు | 72 |
| విభూతి బండారం | 88 |
| శివుని యాన | 76 |

4] సంస్కృత + అన్యదేశ్య

| | కాల. పు. |
|---|---|
| ఉత్తమ గాంధి | 223 |
| దివ్య తిరుపతి | 106 |
| సిద్ధ రౌతు | 37 |

తద్భవం పూర్వపదంగా చేయబడ్డ కొన్ని సమాసాలీక్రింద ఉదాహరించబడ్డాయి.

1] తద్భవ + సంస్కృత

| | |
|---|---|
| కొమార రాముడు | కాల. పు. 78 |
| జోగులాంబ | ,, ,, 97 |

2] తద్భవ + దేశ్య

| | కాల. పు. |
|---|---|
| జవ్వనంపు తోట | 12 |
| బంగారపు పావడ | 30 |
| రాచవీడు | 98 |
| రాచబిడ్డ | 98 |
| బంగారము రెక్కలు | కాల. త. పు 4 |

3] తద్భవ + అన్యదేశ్య

| | |
|---|---|
| రాయల దివాణము | కాల. పు. 90 |

అన్యదేశ్యం పూర్వపదంగా ఏర్పడ్డ సమాసాలకు ఉదాహరణాలు :

1] అన్యదేశ్య + అన్యదేశ్య

| | కాల. పు. |
|---|---|
| అడయాళం | 66 |
| ఉళిమాళికె | 81 |
| ఉళిబెళం | 90 |
| తిరువెంగళ | 97 |
| తిరుమల | 221 |
| మళయాళం | 29, 106 |
| ముల్లాసాహెబులు | 254 |
| హులిబెళం | 75, 76 |

2] అన్యదేశ్య + తత్సమ

| | కాల. పు. |
|---|---|
| కర్నాటక రాజులు | 44 |
| కురుమ సంతతి | 79, 84 |
| తిరు కల్యాణం | 26 |
| తుళువ దేశం | 57 |
| రండి రాజ్యము | కాల. త. పు. 9 |
| హుసేన్ దాసు | ,, ,, 38 |
| హోసమ దుర్గం | కాల. పు. 78 |

3] అన్యదేశ్య + దేశ్య

| | | |
|---|---|---|
| తంజావూరు | కాల. పు. | 107 |
| తిరువళ్లూరు | ,, ,, | 97 |

## వాక్యనిర్మాణ రీతులు:-

బ్రహ్మంగారి రచనలో వాక్య నిర్మాణ విధానంలో విలక్షణరీతులు దిగువ చూపబడుతున్నాయి.

## 1) క్రియా విరహిత వాక్యాలు:-

| | కాల. పు. |
|---|---|
| "కర్నాట దేశమునకు కాళి పంపు" | 3 |
| "ఇది మీకు ఆనవాలు" | 8 |
| "ఇది పరమ రహస్యము" | 13 |
| "నేను కావేటి రంగప్ప మహిమచే సకుటుంబము" | 14 |
| "సర్వానకు పంచమే కారణము" | 16 |
| "బ్రాహ్మణుల ఆశీర్వాదము యశస్సునకు ఆనంద భోగాలు" | 27 |
| "మాకన్నా ఘనమైన స్వామి" | 28 |
| "కావేటి రంగణి పాదమే సాక్షి" | 31 |
| "ఆదివేదానకు ఆనందగురువే సాక్ష్" | 39 |
| "అదిశేషుని శిరస్సున మణులు కంఠమాలలు" | 41 |
| "బ్రహ్మచారి ఆశ్రమమే శాశ్వతము" | 43 |
| "రామధర్మజుల యేలుబడి మహిమ సిద్ధాంత శిరోమణి నిర్ణయము" | 49 |

"రామధర్మజమూర్తి మహిమచే ఆర్తిని సంతోషంబు" కా.పు. 53

"అది రాజ క్షయం ప్రజా క్షయం" 85

"నా బిడ్డలు అనగా భక్తులే శ్రేష్ఠులు" 93

"ఆకాశమునకు ఇంద్రనీల వర్ణం" 157

2) తిర్యగ్జడాలు వాచ్యాలయినపుడు లిఙ్గాన్తులలో ప్రథమ బహు వచనానికి ఏకవచనం రావడం మామూలు. కానీ మహన్మతీ వాచకాలపట్లను ఏకవచనం ప్రయుక్తం కావడం విశేషం.

ఈ రెండింటినీ ఒకేవిధంగా చేసిన ప్రయోగాలు బ్రహ్మంగారి రచనలో కనిపిస్తాయి. మచ్చుకు కొన్ని ప్రయోగాలు దిగువ ప్రదర్శించబడుతున్నాయి.

కాల. పు,

"వారెవ్వరో ఆరో ఘడియకు అవులవున్న పోగలదు" 22

"అతిథులు ప్రబల మౌను" 33

"కొందరు నరులు తుత్తుమురు లాయెను" 44

"దొరలు సంసారుల అనేక బాధలు పెట్టును" 84

## 3) యత్తదర్థక ప్రయోగాలు :-

కాల. పు.

"సజ్జనులైన వారెవరున్నారో వారిని రక్షింతుము" 6

"అడగాను ఎవ్వరుందురో వారే వచ్చే
వీరయోగి యని వక్కాణించినాము" 8

"దండ నమస్కారములు భక్తి పూర్వకముగా
ఎవరు చేయుచున్నారో వారు ఆయురా
రోగ్య ఐశ్వర్యాభివృద్ధియు, పుత్ర పౌత్రాభి
వృద్ధియు, నిరంతర సకలశుభములు
కలిగి వర్ధిల్లుదురు" 13

ఆ పరతత్వ లక్షణం యెరుగక యెవరు కాల. పు.
దూషింతురో వారు కులక్షయమై పోదురు" 69

,,ఇంజేటిపాడు అహోబిళం ప్రాంత్యాల
యందు పట్నం కట్టేమని యెవ్వడు
తలుస్తూ వున్నాడో వాడు నిర్వంశమై పొయ్యీని" 98

,,ఈ సౌజన్య పత్రికను భూమిమీద ఎవరు
ప్రబలంచేస్తూ యున్నారో వారు సౌభాగ్యములు
కలిగి వర్ధిల్లుదురు." 146

,,ఎవ్వరు పూజలు చేస్తారో
వారిని రక్షింతుము." 141

''యీ వాక్యాలు కల్లో నిజమో ఎరుంగము
అనేవారు యెవరు గలరో వారికి చంద్ర
సూర్యులున్నంత పరియంతరం కాకవాది
నరకములు తప్పరాదు." 92

,,యెవరు వీరధర్మజులను భజన చేతురో
వారు ఆచంద్ర స్థాయిగాను సుఖానవుందురు" 69

,,యెవరు (కోడిగం) హాస్యం చేస్తూవున్నారో
వారినోట్లో వజ్రదంటి పురుగులు పడును" 146

,,యెవరు ఆక్షేపణ చేస్తూవున్నారో వారిని
కనకదుర్గాంబ ఖండించును" 147

,,యీప్రకారం యెవరు పూజలు చేస్తూ
వున్నారో వారికి పుష్పమిచ్చిన జోడు పుష్పము
లవును." 148

,,యివి యన్నియు యెక్కడ పుట్టువో
అక్కడనే అణగును." 165

"యెక్కడ మనస్సు పొందునో అచ్చటచ్చట కా. పు.
యగా పరమపదం కనబడును." 164

"శ్రీమన్నారాయణుని యందు భక్తి కలిగి
యుండేవి యేదిగద్దో అదే సాధ్యమనిపించును." 165

## 4) కర్మణి ప్రయోగాలు:—

"ఇదే లంక అనబడును.
వాళ్లంతా రాక్షసు లనబడును." 23

"ఈ అర్థమే శ్రుతి స్మృతి ఇతిహాస పురాణ
ఆగమాదులయందు పలుకబడుచున్నది" 167

"తీసి వేసిరా యని పలుకబడెను" 57

"పెండారి మరాటి బలాలు
కపులన బడుదురు." 23

"సకలమైనవారు మూడువేళల పాయసమే
భోంచేయబడుచు వుండేరు." 18

## ఛందో విశేషాలు:-

ప్రాచీనాంధ్ర కవు లందరిలాగే బ్రహ్మంగారు కూడా గద్య పద్యాలుగా తన రచనలను వెలయించారు. గేయాలు కూడా రచించారు. ఆయన రచన ఎక్కువగా గద్యరూపంలోనే సాగింది. ఆయన ఛందస్సుకు ప్రాధాన్యం ఇవ్వలేదు.

**1) గద్యం:—** "గద్యం కవీనాం నికషం వదన్తి" అనే ఆ భావానికి దీటుగా బ్రహ్మంగారు గద్యరచన చేశారు. గద్యం

కవులను పరీక్షించే సానరాయి. అంటే పరీక్షించే స్థానం. ఎందు చేతంటే పద్యకావ్యంలో కవి ప్రతిభతోపాటు వృత్తంకూడ సహాయ పడుతుంది. గద్యంలో వృత్తం లేదు. కేవలం కవి ప్రతిభా సంపత్తితోనే రసవంతంగా పద్యంతో సమానంగా రచించాలి. అందుకే గద్యం కవులకు పరీక్షాస్థానమని పండితులు చెప్పారు. కనుక గద్యం రాయడం అనుకున్నంత తేలిక కాదు. ఈ విషయంలో బ్రహ్మంగారు కృతకృత్యులయ్యారని చెప్పవచ్చు. ఆయన గద్యరచనా విధానంలో సంస్కృత మర్యాదలను పాటించారు. సంస్కృతంలో గద్యరచన నాలుగు విధాలుగా ఉంది. ఆ నాలుగు విధానాల్లో బ్రహ్మంగారి రచనలో కనిపిస్తున్న ముక్తక, వృత్తగంధి లక్షణాలు ఈక్రింద ప్రదర్శించబడుతున్నాయి.

**1) ముక్తకం :-** సమాస రహితమైన గద్యాన్ని ముక్తక మంటారు. ఉదాహరణకు ,,గురుర్వచసి" పృథురురసి" వంటి గద్యాలు ముక్తకాలు1. బ్రహ్మంగారి వచన కాలజ్ఞానంలో కనిపించే ఈక్రింది వాక్యాలు ముక్తకలక్షణాలు కలిగిఉన్నాయి.

| | | కాల. పు. |
|---|---|---|
| 1) | ,,గీతానా భక్తులే శ్రేష్ఠం" | 15 |
| 2) | ,,భాగవతం వెంటనే తెస్తూవున్నాను." | 4 |
| 3) | ,,సర్వానకు పంచమే కారణము" | 16 |
| 4) | ,,పురాతనమతం కిరాతన మతమయ్యేని." | 88 |

కాలజ్ఞానంలోని ఈ వచనాలు సమాస విరహితాలే కాక ఒక్కొక్క వాక్యంలో ఒక్కొక్క అంశం ఉంది. ఇది ముక్తక లక్షణం.

---

1. సూర్యనారాయణశాస్త్రి, సన్నిధానం - కావ్యాలంకార సంగ్రహం, పు, 265

**2) వృత్తగంధి:-** వృత్తభాగాలు గల దీర్ఘ సమాస కలితమైన గద్యాన్నే వృత్తగంధి" అని అంటారు.1.

ఉదా : ,,సమర కండూతి నిబిడ భుజదండ కుండలీకృత కోదండ శింజినీ టంకా రోజ్జాగరిత వైరినగర"2.

ఈ దీర్ఘసమాసంలో ,,కుండలీకృత కోదండ" అనేది అనుష్టుప్ వృత్త పాదం. ఇలా వృత్తభాగాలుండే గద్యాన్ని ,,వృత్తగంధి" అని అంటారు. అయితే బ్రహ్మంగారి గద్యం వృత్తగంధిగా కాక ద్విపద, సీస, కంద, మున్నగు దేశీయ చందోగ్రంధిగా కనిపిస్తుంది. మచ్చుకు కొన్ని ఉదాహరణాలు ఇక్కడ ప్రదర్శించబడుతున్నాయి.

*1) ద్విపద గంధి :-*

,,ప్రకృతిరూప సహస్రరూప స్వరూప" కాల. పు. 6
,,అగ్నిసాగర సోమసాగర సూర్య" ,, ,, 6
,,చిత్ర వీరపురుషాది ఖ్యాతనామ" ,, ,, 6

*2) సీస గంధి:-*

,,యోగ పరమయోగ భావయోగ" కాల. పు. 6

*3) కంద గంధి :-*

,,శ్రీమద్బ్రహ్మాండ భాండ" 56
,,శ్రీమత్సకల చరాచర" 65

---

1. సూర్యనారాయణశాస్త్రి, సన్నిధానం - కావ్యాలంకారసంగ్రహం, పు. 265.
3. పైది.

*4) గీత గంధి :-*

,,అజప యోగాది అఖిల యోగాంగధార" 65

,,దివ్య లీలావతార వినోదజన్మ" 65

*5) ఉత్సాహ గంధి :-*

,,చేరరాదొ కళల నోలలాడరాదొ మిమ్మునం" 66

"చేరి తూరి పారి నూరి వచ్చి చొచ్చి మించితే" 66

## 2) దండక వచనం:-

వచన కాలజ్ఞానం చతుర్థాశ్వాసంలో ,,ఇంకొక్క దండకన్యాయ వచనం అనతిచ్చేము"1. అంటూ ,,రాజాధిరాజ అగక్షయరాజ బహు రాజ" మొదలుకొని ,,శంతన హిరణ్య నమః" అని ముగించబడే దండక వచనాన్ని రాశారు. ఇది దైవస్తుతిపరంగా ఉంది. ,త గణం' తో ప్రారంభించబడడం, ,నమః' తో అంతం కావడం దండక లక్షణాలు. మిగతా దంతా వచనంలాగానే ఉంది. అందుకే దీన్ని దండక న్యాయ వచనం అన్నారు బ్రహ్మంగారు.

## 3) వృత్తాలు :-

బ్రహ్మంగారు వచన కాలజ్ఞానంలో తృతీయాశ్వాసంలో ,,శ్రీ వీరనారాయణ మహామంత్రం" చెబుతూ ,ధ్యానం' అనే శీర్షిక క్రింద ఈ శ్లోకాన్ని విరచించారు.

---

1. వీరబ్రహ్మం పోతులూరి - కాలజ్ఞానం, ప్రచు: కృష్ణమూర్తి, రంగయ్య, కంఠిమల్లాయపల్లె, 1974, పు. 25

„వీరం వీరవిభూషం సుతత్త్వభరితం ధీరాసనస్థం సదా
భూదేవీప్రణుతం విరించి వినుతం వీరాధివీరం హరిమ్
వీరంబ్రహ్మం మునియోగి మానసచరం వేదాంత విద్యాకృతిమ్
ఆచార్య మహం భజామి సతతం శ్రీ వీరనారాయణమ్"

ఇది శార్దూల వృత్తం.

## 4) జాత్యుపజాతులు :–

ఆరు విధాలైన కందాలు, ఉత్సాహ, తరువోజ, మధ్యాక్కర, మొదలైనవీ మంజరీ ద్విపద, ద్విపద, త్రిపద, చతుష్పద, మొదలైనవీ నవవిధ రగడలు, కళికోత్కళికలూ మొదలైనవీ జాతులు. నవవిధ గీతాలు, సీసన పత్రకము, ఉపజాతులు. వీటిలో బ్రహ్మంగారు సీసము, తరువోజ, కందము, కందార్ధనరువులు, ద్విపద, గీతము అనే ఛందాలను రచించారు.

**సీసము - తరువోజ :-** వచనకాలజ్ఞానం చివరలో

„సకలార్ధ పరివార జనులు సేవింపంగ
నిగమార్ధములు నొప్పు నగరిలోన" పు. 109

అనే సీస పద్యమూ,

„మంగళ ద్రవ్యముల్ మంత్రోక్తి దనర" పు. 110

అనే తరువోజ ఉన్నాయి. తరువోజను తరోజు అని రాయడం గమనించదగింది. పైన ఉదాహరించబడిన సీసపద్యం తరువాత రాయబడిన గీతపద్యంలోని మొదటిపాదం ఇలా ఉంది.

" | అందు | వెలయు స్వ | స్తి సమేతు డై వేద | రీతి | "

దీనిలో మూడవ గణంలో ఒక్క అక్షరం ఎక్కువయింది.

అలాగే పైనచెప్పిన తరువోజ చివరి పాదంలో

" | సరవిగా | తేరనే | త్ర సమదృ ష్టి నమర |

అనేదానిలో మూడవ గణంలో ఒక అక్షరం ఎక్కువయింది. తక్కిన పాదాల గణాలు లెక్కకు సరిపడుతున్నాయి. ఈలెక్కా చూసుకొనే దృష్టి బ్రహ్మంగారికి లేదు. అసలు యతిప్రాసలు గణాలు మున్నగు వానిగొడవ తనకు లేదని బ్రహ్మంగారి కంఠోక్తి.

**కందం:-** కాలజ్ఞాన గ్రంథంలో బ్రహ్మంగారు "సిద్ధ బోధము" "కాళికాంబ పద్యరత్నములు" అనే శీర్షికలక్రింద కంద పద్యాలు రచించారు. బ్రహ్మంగారి కందపద్య రచన ఇలా సాగుతుంది.

"వేదంబులు శాస్త్రంబులు
వాదంబుల కొరకె చదివి వస్తువు గనిరా
యేదారి తెలియ లేకను
వాదములకు దిరుగు వొట్టి నధలుము సిద్ధా!"

కాల, పు, 179

**కందార్ధ దరువు:-** కంద పద్యంలో పూర్వభాగమైన 1, 2 పాదాలు పద్యంగా నడిచి మూడు నాలుగు పాదాలు దరువు లక్షణా' లతో రచింపబడేది కందార్ధ దరువు. దరువులో రెండు అంతకు మించిన చరణాలు ఉండవచ్చు.

**దరువు:-** నృత్య నాటకాల్లోనూ సంగీత నాటకాల్లోను వాడబడే రచన దరువు. ఇది ధ్రువ అనే పురాతన రచన నుంచి వచ్చింది. సాహిత్యపు అర్ధాన్ని బట్టి సంవాదదరువూ స్వగత దరువూ

పాత్రప్రవేశ దరువూ వర్ణన దరువూ ఉత్తర ప్రత్యుత్తర దరువూ జక్కిన దరువూ ఒరడి దరువూ అనేరకాలు ఉన్నాయి.1.

బ్రహ్మంగారు తమకాలంలో ఉన్న పద్ధతి ననుసరించి కంద పద్యపు అర్ధభాగానికి దరువును జతచేసి దరువును రచించారు. ఆయన రచలో తాను తలపోసినవి వేదాంత విషయ సంబంధులు గనుక బ్రహ్మంగారి కందార్థ దరువులు స్వగత దరువుల కోవకు చెందినవని చెప్పవచ్చు. బ్రహ్మంగారు చెప్పినవవనబడే కందార్థాలు కొన్నింటిని కీ॥ శే॥ జవంగుల నాగభూషణదాసు సేకరించి "వీరబ్రహ్మేంద్ర బోధామృతము" అనే గ్రంథంలో ప్రచురించారు. కాని వచన కాలజ్ఞానంలో ఒకటి రెండు కందార్థాలు మాత్రం ఉన్నాయి. కాలజ్ఞాన చతుర్థాశ్వాసంలో

"శ్యామల వర్ణ శుభావహ
కోమల దీక్ష ప్రభావ కోశాంతరమై
ఈ మహి దుష్టచ్ఛేదన
కారణ మను జన్మనెత్తి కాన్పించెదనూ"

కాల, పు, 24

అనే కందార్థం ఉంది. దీనిలో పూర్వభాగం కందపద్య భాగం. మూడు నాలుగు పాదాల మాత్రాగణ విభజనచేస్తే ఇలాగుంటుంది.

| ॥ ǀ ǀ | ॥ ǀ | ॥ ǀ ǀ | ॥ ǀ ǀ |
|---|---|---|---|
| ఈ మహి | దుష్ట | చ్ఛేదన | కారణ |
| ǀ ǀ ॥ | ǀ ॥ ǀ | ǀ ॥ | ǀ ǀ ॥ |
| మను జ | న్మ నెత్తి | కాన్పిం | చెదనూ |

1. శ్రీమతి ద్వారక, పార్థసారధి N. C. గానకళాబోధిని, — ప్రచు : బాలసరస్వతీ బుక్ డిపో, కర్నూలు, మద్రాసు, పు, 100,

ఈ దరువులో నాలుగేసి ఆవృత్తాలూ ఆవృత్తానికి నాలుగేసి మాత్రలూ ఉన్నాయి. ఈవిధంగా చరణాలను పాడితే ఆదితాళగతిలో కందార్ధం నడుస్తుంది. ఇదీ కందార్ధాల స్వరూపం.

**ద్విపద:-** బ్రహ్మంగారు ద్విపద ఛందస్సులో ప్రత్యేకంగా కాలజ్ఞానాన్ని రచించారు. బ్రహ్మంగారి ద్విపద ఇలా సాగుతుంది.

„అమ్మాయి మంటలు నఖిల లోకముల
భయపడ నొప్పారె పటు జవోన్నతుల
ఘోటకా రూఢుడై గోవిందుడపుడు
గాటంపు ఖడ్గ ముగ్రంబుగా బూని"

కాల పు, 130, 131

ఇందులో ప్రాసనియమం లేదు. కనుక ఇది మంజరీ ద్విపద.

**గీతం.-** బ్రహ్మంగారు కాలజ్ఞానంలో ప్రత్యేకంగా తేటగీతి, ఆటవెలది ఛందస్సులను ఉపయోగించలేదు. కానీ సీసపద్య పాదాలనూ ఆటవెలది పద్యపాదాన్నీ యథేచ్ఛగా కలిపి పద్యాలు రచించారు. వీటినే గీతపద్యా లన్నారు. పద్యం నాలుగవ పాదంలో ఉండే గణాలు తప్పనిసరిగా ఆటవెలది గణాలు ఉన్నాయి. బ్రహ్మంగారి గీతపద్యంలో మొదటి రెండుపాదాలు సీసపద్య పాదం. మూడో పాదం సీసపద్య పాదభాగం. నాలుగో పాదం ఆటవెలది. ఇది బ్రహ్మంగారి గీతపద్య స్వరూపం.

"నారాయణధ్యానమ్ము మానుట యుత్తమం
నారాయణధ్యానమ్ము పానమైతె
సాలోక్య సామీప్య సారూప్యముల గెల్చి
కాళికాంబ హంస కాళికాంబ!

కాల. పు. 186

## గోవింద వాక్యాలు:-

బ్రహ్మంగారి గోవిందవాక్యాలు 5 మాత్రల గణాల ఆవృత్తిలో నడిచాయి. సంగీత పరిభాషలో 5 మాత్రలను 'తక తకిట' అనే సంజ్ఞతో సూచిస్తారు. దీని లయను ఖండగతి అంటారు. దాదాపు మూడువందల వరకూ ఉన్న ఈ గోవింద వాక్యాలన్నీ ఖండగతిలో నడిచాయి. గోవిందవాక్యాన్ని మాత్రాగణ విభజనచేస్తే ఇలా ఉంటుంది.

" | గోవిందు | డనగాను | భావించి | చూచితే |
| ఆనంద | బ్రహ్మమం | దాడగను
| ఏమందు | నేనింక | నాముండి | ముందర |
ఆనంద | మనెసిం | దాడితిరా |
శివగో | విందగో | విందహరి | గోవింద | గోవింద"

కాల, పు, 221.

ఇందులో "శివగోవింద గోవింద హరిగోవింద" అనేది అనుపల్లవి.

ప్రతిచరణం చివర ఇది పునరావృత మవుతుంది. ప్రతి చరణానికీ 7 ఆవృత్తాలు ఉన్నాయి. అనుపల్లవి 5 ఆవృత్తాలతో సాగింది. ఈ వాక్యాల్లో అక్కడక్కడా అప్రయత్నంగా యతిప్రాసలు కుదిరాయి. పైవాక్యంలో రెండవ చరణంలో ఆరవఆవృత్తిలో "మనెసిం" అనే గణంలో ఒకమాత్ర తగ్గింది. ఏడవ అవృత్తిలో "దాడితిరా" అనే గణంలో ఒక్కమాత్ర ఎక్కువైంది. ఇక్కడ ఈగణాలు వెంటవెంట ఉన్నాయి, కాబట్టి కలిపి చదివితే పదిమాత్రలు వచ్చి తాళం చెడిపోకుండా ఉంటుంది. సాధారణంగా గాయకులిలాగే చేస్తారు. కానీ ఒక్కగణంలో మాత్రమే ఒక్కమాత్ర ఎక్కువైతే కుదించీ ఒక్కమాత్ర తక్కువైతే పెంచీ పాడితే సరిపోతుంది. ఇది జానపద సంగీత విధానంలోని సాధారణ లక్షణం.

**తత్వాలు :—** బ్రహ్మంగారి తత్వాలుగా నిర్ణయించబడినవి ఈక్రింది గతులలో సాగుతాయి.

1) "పూజకు నేనోస్తి బ్రహ్మపూజకు నేనోస్తి"
— కిటతక, 8 ఆవృత్తాలు

2) "నేను జూచినానే బ్రహ్మము నాలో"
— తకతకిట, 9 ఆవృత్తాలు

3) "పోలో యమ్మ పోలు నాదేహమెరుగని పోలు"
— తక కిట తక, 8 ఆవృత్తాలు

4) "పనికి మాలిన బ్రహ్మజ్ఞానము పలికితె"
— తకిట కిట తక, 9 ఆవృత్తాలు

5) "ఇదిగో కాలంబు వచ్చెను"
— తక కిట తక, 7 ఆవృత్తాలు

6) "మద కావరము లార"
తకిట కిట తక, 6 ఆవృత్తాలు

7) "రాక్షస కులమును నీరు చేయ"
- తక తకిట, 6 ఆవృత్తాలు

8) "దండివాడపురా" - తక తకిట, 9 ఆవృత్తాలు

9) "అగ్రజు నెదుట వీరబ్రహ్మము"
- తక తకిట, 8 ఆవృత్తాలు

10) "వినుడీ బ్రహ్మము మాయ"
- తకతకిట, 7 ఆవృత్తాలు

11) "చెప్ప లేదంటనగ బోయేరు"
- తకిట కిటతక, 8 ఆవృత్తాలు

12) "ఇంతటను విడిస్థలంబిది"
- తకతకిట, 10 ఆవృత్తాలు

13) "శంఖు పోతులూరి రామ"
- తక కిటతక, 10 ఆవృత్తాలు

14) "ఓం నమశ్శివాయ"
- తకతకిట, 7 ఆవృత్తాలు

15) "ముట్టు ముట్టనియ్యేరు"
- తక తకిట, 4 ఆవృత్తాలు

16) "చెడు గుడాడెనే"
- తకిట కిటతక, 4 ఆవృత్తాలు

ఈవిధంగా పరిశీలిస్తే బ్రహ్మంగారి తత్వాలు ఎక్కువ ఖండ గతిలో త్రిశగతిలో నడిచిపోతూ వుంటాయి.

**అలంకారాలు:-** భాష పుట్టినప్పుడే అలంకారాలు కూడా పుట్టాయి. సాధారణ ప్రజలు మాట్లాడే భాషలో కూడా

అలంకారా లుంటాయి. పొట్టిగాఉన్న వ్యక్తులను బాతుతో పొడుగ్గా ఉన్న వ్యక్తులను తాటిచెట్టుతో పోలుస్తారు. అలంకారమంటే ఏమిటో తెలియనివారి మాటల్లోనే అలంకారాలు ఉంటే ఇక కవుల విషయం చెప్పేదేముంటుంది? అలంకార సహితమైనదే జీవద్భాష.

కావ్యానికి శోభను కూర్చేవి గుణాలు. తదతిశయ హేతువులు అలంకారాలు. మహాకవులు తమ కావ్యకాంతలకు అమూల్యమైన అలంకారాలను సంతరించారు. బ్రహ్మంగారు కూడా తమ కవితలలో సహజమైన అలంకారాలను ప్రయోగించారు. సాధారణ ప్రజలకు కూడా అందుబాటులో ఉండే ఉపమానాలను స్వీకరించి విషయాన్ని సుబోధకం చేశారు. బ్రహ్మంగారు తన రచనల్లో అంత్యప్రాస, అనుప్రాస అనే శబ్దాలంకారాలనూ, ఉపమ అనే అర్థాలంకారాన్ని ప్రయోగించారు. బ్రహ్మంగారు ప్రయోగించిన శబ్దాలంకారాలు కొన్ని ఈక్రింద ప్రదర్శించ బడుతున్నాయి.

## 1) అంత్యప్రాస:-

ఉదా :- 1) "సుత బంధు హితజన స్తోమంబు తోడ
మతిమంతులైనట్టి మంత్రులతోడ
ప్రకటిత భూషణాంబరముల తోడ"

కాల. పు. 126

2) "కవిత నిబద్ధికిని కన్నులు సాక్షి
వాక్కు నిబద్ధికిని యొరులు సాక్షి"

కాల, పు, 176

3) "ప్రపంచ నడత జూడ పెద్దలవాక్యము బాటా
ముగ్గురు మూర్తులు జూటా
మూలము ఎరుగుట బాటా"

కాల. త. పు. 42

## 2) అనుప్రాసః-

ఉదా :- 1) ,,చేరి కోరి తూరి పారి వచ్చి చొచ్చి కొంచి
మించితే మంచి మోక్షము కలుగును."

కాల. పు, 42

2) "విందు గావింప గోవిందు డావేళ
కందర్ప వైరిని కరుణ మన్నించి"

కాల. పు. 124.

3) "గురుడు గురుడు యనగ గురియెరుక గురుతెరుగు
గురుదృష్టి గురుతెరుగు గురుడు గురుడు"

కాల. పు. 179

4) ,,కన్నుల వన్నెలు చిన్నెలు
కన్నులనే బ్రహ్మపదవి గాంచవె కాశీ"

కాల. పు. 208

5) ,,ఉత్తర దేశమున సత్తుగ ప్రజలంత
కత్తులతో వేటలాడేరు మా"

కాల. పు. 229

6) ,,చెప్పు లేదంటునగ బోయెరు తప్పదిదిగో"

కాల. త. పు. 9.

ఇలా శబ్దాలంకారాలను నల్లేరుమీద బండినడకలా చేశారు బ్రహ్మం గారు. ఇక ఆయన ప్రయోగించిన అర్థాలంకారాలు ఇక్కడ చూప బడుతున్నాయి.

**1) ఉపమాలంకారం:-** ఉపమేయానికీ ఉపమానానికీ మనోహరమైన సాదృశ్యాన్ని వర్ణించడం ఉపమాలంకారం. బ్రహ్మంగారి రచనల్లో సముచితమైన స్థానాల్లో సహజమైన పద్ధతిలో ఉపమాలంకారం చోటుచేసుకొంది. అత్యంత ప్రసిద్ధాలయిన ఉపమానాలను గ్రహించి ఆయన చెప్పారు. బ్రహ్మంగారు ప్రయోగించిన ఉపమానాలంకారా లిలా ఉన్నాయి.

1) „నామహిమ తెలియని ద్రోహిమందలు
చీమల పుట్టలు మడిచినట్లు మడుతురు"
కాల. పు. 15, 44

2) „లక్షా తొంబై వేలు యాదవులు మడిసినట్లు తురకలు
రాక్షసులు మడసేరు." కాల, పు, 39

3) "మహాద్భుతము కోక పరచినయట్లు కనిపించీని."
కాల, పు, 108

4) „బండాటు లాడేటి పాపిష్టి నరులంత
పండాకు రీతిగా రాలేరుమా"
కాల. పు. 226

**సంగీతం:-**

„సంగీతమపి సాహిత్యం సరస్వత్యా స్తనద్వయమ్
ఏకమాపాత మధురమ్ అన్యదాలోచనామృతమ్"

అని లాక్షణికులు సంగీతసాహిత్యాల అనుబంధాన్ని వర్ణించారు బ్రహ్మంగారు తమ గేయాల్లో భావానికి ప్రాధాన్యాన్ని ఇచ్చారు. సంగీతానికి కొంతవరకే ప్రాధాన్య మిచ్చారు. ప్రస్తుతం బ్రహ్మంగారి తత్వాలను పాడేవారు ముఖ్యంగా నాదనామక్రియ, ముఖారి, ఆనంద భైరవి, ధన్యాసి, చక్రవాకం, యదుకులకాంభోజి, సావేరి, సురటు,

మొదలైన రాగాలతో పాడుతూ ఉంటారు. పైరాగాలు విన్నప్పుడు మనసు కరుణరస ప్లావిత మవుతుంది. బ్రహ్మంగారు రచించిన తత్వాల్లోని కరుణరసాత్మక వస్తువుకు పైరాగాల సమ్మేళనం పసిడికి పరిమళ మబ్బినట్లుగా ఉంది. బ్రహ్మంగారు సముచితమైన రీతిలో తమ గేయలకు సంగీతాన్ని సమకూర్చినట్లు అనిపిస్తుంది. ఛందస్సు ఉన్నప్పటికీ పాఠకులు ధారణచేయాలంటే సంగీతపు అవసరం ఎంతైనా ఉంది. సంగీత సహాయం లేనిదే పద్యాలుకానీ పాటలుకానీ కంఠస్థం కావు. ఈ అంశాన్ని గమనించే బ్రహ్మంగారు తమ రచనలకు సంగీతాన్ని సమకూర్చి ఉంటారు. అందుకే బ్రహ్మంగారి తత్వాలు సరస సంగీత సమన్వితాలయ్యాయి. కాళికాంబ పద్యరత్నాల్లో -

"తనువు తంబురకాయ తంత్రులె వాయువు
తులువలు శ్రుతిజేయ తెలియలేరు
ప్రణవంబు వాయించి బ్రహ్మంబుగనరయా"

**జ్యోతిశ్శాస్త్రం:-** బ్రహ్మంగారు తాను భవిష్యత్తును జ్యోతిశ్శాస్త్ర పాండిత్యం ఆధారంగా చెప్పారనడానికి కొన్ని తార్కాణాలు కాలజ్ఞానంలో కనిపిస్తున్నాయి. అవి క్రింద ఉదాహరించ బడుతున్నాయి.

1) శ్లో॥ "తులారాశి గతే జీవే ధూమకేతూర్భవం భవేత్
అళిస్తేతు సురాచార్యో వృష్టిస్స్యాత్ ఫలవృద్ధయః"
కాల, పు, 103

తులారాశిలో బృహస్పతి ప్రవేశిస్తే ధూమకేతువు పుడుతుంది. తులా రాశిలో వృశ్చికరాశి ప్రవేశమైతే అధికవృష్టిచేత ఫలవృద్ధి కలుగు తుంది. అని పై శ్లోకానికి అర్థం.

2) "మేషరాశిలో శని ప్రావేశమయితేను
మేలు కొందరికి అయ్యేని మా" కాల. పు. 221

3) "ధనుసుమీద గురుడు ప్రావేశమయితేను
ధనువు చేతను హరుడు బుట్టీనిమా" కాల. పు. 229

4) "కుంభమందూ గురుడు ప్రావేశమయితేను
కుంభినీ కుదురుగా యుండీనిమా"
కాల, పు, 229

5) "కన్యారాశిని శని ప్రావేశమయితేను
కుంభినీ కుదురుగా యుండీనిమా"
కాల. పు. 229

6) మకరమందూ గురుడు ప్రావేశమయితేను
మతములన్నియు గతములయ్యేని మా"
కాల. పు, 255

బ్రహ్మంగారి కాలజ్ఞానంలో కనిపించే యిలాంటి వచనాలు ఆయనకు గల జ్యోతిషశాస్త్ర పరిచయాన్ని తెలుపుతున్నాయి. భూత భవిష్యత్ వర్తమానరూపంలో ఉన్న భావసుమమాలికకు జ్యోతిశ్శాస్త్ర పరిచయం దారంలా ఆధారమైంది.

## బ్రహ్మంగారి రచనల్లో వృత్తి పదాలు :-

బ్రహ్మంగారికి విశ్వబ్రాహ్మణుల పంచవృత్తులన్నీ వచ్చు.

అందుచేత బ్రహ్మంగారి రచనల్లో ఆయనవృత్తికి సంబంధించిన పదాలు ఉపమానాలుగా దొర్లాయి. ఆయా సందర్భాల్లో ఆయన ప్రయోగించిన వృత్తిసంబంధ పదాలు వాటి వివరణలు ఈక్రింద ఇవ్వబడుతున్నాయి.

**కంసాలి** - (కాల. పు. 201)

"జీవుడు కంసాల చిక్కు తెలియగరాదు
భావమైతె పరబ్రహ్మ మతడు
వానికి పేరేమి వాడె పరశివుడయా"

అనే పద్యంలో మానవశరీరంలో ఉండే జీవుణ్ణి కంసాలతో పోల్చారు బ్రహ్మంగారు. స్వర్ణకారులను కంసాలులని అంటారు. స్వర్ణకారుడు కుంపటి మండటానికి గొట్టంతో ఊదుతాడు. అదేవిధంగా జీవుడు ఉచ్ఛ్వాస నిశ్వాసలను నడుపుతూ ఉంటాడు. ఈశరీరమే ఒక కర్మశాల. అందులో శ్వాసలు నడిపించే జీవుడే స్వర్ణకారుడు. పై పదం స్వర్ణకారవృత్తికి సంబంధించింది.

**కొలిమి – తిత్తులు – బొగ్గులు :–** ఈ పదాలు యోగ సంబంధమైన అంశాలకు ప్రతీకలుగా వాడబడ్డాయి. బొగ్గులు పోసిన కొలిమి నాభిస్థానంలోఉన్న మణిపూరకచక్రానికి సంకేతం. ఈస్థానం అగ్నిభూతానికి నిలయం. ఈ పదంలో బ్రహ్మంగారు ఏడుతిత్తులుపట్టి పూరిస్తామన్నారు. ఈ ఏడుతిత్తులూ ఏడు చక్రాలకు సంకేతాలు. ఈ చక్రాలనే తిత్తులతో గాలి ఊదితే మణిపూరకచక్రంలో అగ్ని వెలిగితే ఆకాకకు కుండలినీశక్తి లేచి సహస్రారచక్రానికి చేరుకొంటుంది.

"ఊదే తిత్తుల పైగానుండే ఉన్నతి తెలియర ఓరన్నా" (కాల. త. పు. 38) అనే తత్వంలోనూ "ఊది ఊది పొయ్యూ[illegible]

ఊపిరి సమరసమెరుగవలెన్" (కాల. త. పు. 40) అని మరొక తత్వం లోనూ "తిత్తులు" అనే పదాన్ని ప్రయోగించారు బ్రహ్మంగారు. కమ్మర కొలిమిదగ్గర గాలిఊదే తిత్తులు రెండుంటాయి. వాటిని రెండింటిని ఒక సక్రమమైన ధోరణిలో ఆడించినప్పుడు మంట చక్కగా మండుతుంది. ఇదే విధంగా యోగసాధకుడు ఉచ్ఛ్వాస నిశ్వాసలను ఒక క్రమంలో నడిపిస్తే మణిపూరక చక్రాగ్నిని మండించి కుండలినీ శక్తిని పైకి లేపగలుగుతాడు. తనవృత్తిలో నిత్యం కనిపించే సత్యాన్ని యోగసాధనకు పోల్చిచెప్పారు. ఇవి కమ్మరవృత్తికి సంబంధించిన పదాలు.

## పట్టు మద్ధకారు :— (కాల. పు. 188)

"గురుని బుద్ధియందు గూర్చివేసినయట్లు
పట్టు యిడుపు లేక పట్టవలెను
పట్టు మద్ధకారు పట్టుగా బట్టుడి"

పై పద్యంలో బ్రహ్మంగారు "పట్టు మద్ధకారు" అని ప్రయోగించారు. దీనినే "పట్టుకారు" అంటారు. ఇది పంచవృత్తులవారు కొలిమిలో కాలే వస్తువులను పట్టుకోవడానికి ఉపయోగించే సాధనం. గురువును

మనస్సులో నిలుపుకొని పట్టుకారుతో పట్టుకొన్నట్లు గట్టిగా పట్టుకోవాలని బ్రహ్మంగారు చెప్పారు. ఇది పంచవృత్తులకూ సంబంధించిన పదం.

## పుటము :— (కాల. పు. 191)

"ప్రకృతి విడిగొట్టి పట్టి విరిచితెకాని
వికృతి యనె గుణము విరుగబోదు
పకృతి పుటముంచి వికృతి గనవలె"

ఇందులో ,,పుటము" అనే పదాన్ని ప్రయోగించారు బ్రహ్మంగారు. ప్రకృతి అనేది మంచి. వికృతి అనేదిచెడు. మంచి చెడులు కలిసివున్న ప్రకృతికి పుటం పెడితే వికృతి విరుగుతుంది. పుటం పెట్టడమనే విషయం స్వర్ణకారవృత్తికి సంబంధించింది. బంగారంలో ఉన్న కల్తీని వేరుచేయడానికి పుటం పెడతారు. వర్తమాన కాలంలో ద్రావకంతో పుటం పెడుతున్నారు. పూర్వం ఎర్రమట్టిని ఉప్పును సమపాళ్లలో నూరి వన్నెతక్కువ బంగారానికి పట్టించి ఒక మట్టిపళ్లెంలో కొంతమట్టి పోసి ఆ బంగారాన్ని దానిమీదపెట్టి మళ్లీ పైన మట్టికప్పి ఆపైన మరొక మట్టిపళ్లెం ఉంచి దీన్ని పిడకలమధ్య పెట్టి కాల్చేవాళ్లు. ఇలాచేస్తే బంగారంలోఉన్న చెడు నిర్మూలించబడి బంగారానికి మంచి వన్నె వస్తుంది. దీన్నే పుటంపెట్టడం అని అంటారు.

## మరసీల - సుత్తె :— (కాల. పు. 191)

,,మనసుకు బుద్ధికి మరసీల గొన్నట్లు
గురుని ధ్యానము సేయ కూడదాయె
ఎరుకనె సుత్తెచే నెగురగొట్టితె పలుకు"

గురుధ్యానం చెయ్యాలంటే మనసు, బుద్ధి, రెండూ పనిచేయాలి. కానీ ఆ రెండింటికి కలిపి మరసీల కొట్టినందువల్లనేమో ప్రజలు గురుధ్యానం చేయడం లేదని బ్రహ్మంగారి భావం.

మరసీల సుత్తె అనేవి పంచవృత్తులవారు ఉపయోగించే పని ముట్లు. ఎరుక అనే సుత్తె అంటే విజ్ఞానమనే సుత్తెతో ఎగురగొడితే అజ్ఞానమనే మరసీల వదలిపోతుంది. అప్పుడు గురుధ్యానం చేసే అవకాశం లభిస్తుందని బ్రహ్మంగారు చెప్పారు.

**జాతీయాలతో కూడిన వచనాలు:-**

1) "యీ దండకవచనం ఎవ్వరైనగాని మంత్ర సంయుక్తంతో ధూపదీప నైవేద్య తాంబూలాదులు సమర్పించి విని నట్లాయెనా ఆచంద్రస్థాయి సుఖాన వర్ధిల్లుదురు." కాల. పు. 26

2) "వేదాంత శిరోమణి ఆదికులమున బుట్టి రామధర్మజుల కీర్తి నేడు మొదలుకొని అచంద్రతారార్కం సార్వకాలికం నడిచీని." కాల, పు, 29

3) "నా కుమారున్ని సూర్యసమానులుగా చూచేది. ఆచంద్ర తారార్క స్థాయుత్తై వర్ధిల్లును." కాల. పు. 37

4) "తండోపతండాతైన ఘాలివానచేత పశువులు, గొఱ్ఱెలు, అడవి జంతువులు మొదలైనవి ప్రాణికోట్లు ఆకాశముజూచి అరచీని." కాల, పు, 72

6) "కొండల మీదనుండి లక్షోపలక్షలు గుండ్లు దొర్లీని." కాల. పు. 108

7) "గుండెలు పగిలించి గుండ్లను పొడిచి చెండాడు మని నాదిశక్తికి దెలిపె." కాల. పు. 118

8) "అకలంక భక్తితో నధికోత్సవములు ఎన్నాళ్లకిచ్చె మా కిహము పరమ్ము కన్నులపండువుగా జూతుమనుచు." కాల. పు. 130

9) "విన్నవించేవ నేను విశదంబుగాను
చెన్నొందవినరయ్య చెవుల పండువుగ" కాల. పు. 133

## సామెతలతో కూడిన వచనాలు:-

1) "తామసచిత్తులై పోయిన కాలానకు వస్తుతూ వున్నారు."
కాల. పు. 66

2) "పూర్ణవాహినియైన పుణ్యానదీ తీరాన నుండి దాహము గొని వచ్చి పాడుభావిలో చెలమ తీసికొని ఉదకపానము చేయబోయి నట్టువలెనే ఉన్నది." కాల. పు. 66

3) "సకలమైన చదువులు పుస్తకములు చదివి ఆ రహస్యమును గుర్తెరుగక యేలాగంటే గాడిద గంధపుచెక్కలు మోసి పరిమళము గుర్తెరుగనట్లు." కాల. పు. 162

**మరుగు వాక్యాలు:-** బ్రహ్మంగారి కాలజ్ఞానంలో కొన్ని మరుగువాక్యా లున్నాయి. వాటిని "మరుగువాక్యాలు" అని ఆకాలంలోనే అన్నారనడానికి ఆధారంగా ఈక్రింది కాలజ్ఞాన వచనాన్ని చెప్పవచ్చు.

"ఓ స్వామీ! ఈ మరుగువాక్యంబులు మావంటి
నరపశువులకేమి తెలియంగద్దు?" కాల. పు. 20

ఈ మాటలను ఓబులయ్య అనే భక్తుడు బ్రహ్మంగారితో అన్నాడు. బ్రహ్మంగారి కాలజ్ఞానంలోఉన్న కొన్ని మరుగ వాక్యాలకు అర్థం చెప్పవచ్చు. అవి ఈక్రింద ప్రదర్శించబడుతున్నాయి.

1. "నేను భాగవతం వెంటనే తెస్తూఉన్నాను."
కాల. పు. 14

అంటే ఆ గ్రంథంలో ఉన్న భక్తిజ్ఞాన కర్మయోగాలనూ ఇంకా అందులో ఉన్న నీతులనూ ధర్మాలనూ గ్రహించి ఈ కాలజ్ఞానంలో బోధిస్తున్నానని బ్రహ్మంగారి భావం.

2. "టీక॥ పంచమికే పోతూ వున్నది." కాల. పు. 18.

అంటే తాను చెప్పిన విషయానికి అర్థం పంచమ శక్తివల్ల తెలుస్తుందని అర్థం. సృష్టి, స్థితి, లయ, తిరోధాన అనుగ్రహాలు పంచశక్తులు, చదువగా చదువగా తన అనుగ్రహంవల్ల తెలుస్తుందని ఆయన ఉద్దేశం.

3. "కంభం చెరువుకు తూర్పు దిక్కున కట్టకింద రెండు గొడుగులు చెయ్యిస్తేనవి మొదలు చేసిన కాలసంఖ్య తెలిసినదనుకా కాదనబట్టదు." కాల, పు, 21

అంటే కంబం చెరువు క్రీ॥ శ॥ 16వ శతాబ్దిలో శ్రీకృష్ణదేవరాయల భార్య జగన్మోహిని త్రవ్వించింది. ఈ చెరువుకట్ట నిర్మించేటప్పుడు జరిగిన గాథను అప్రాంతపు ప్రజలు ఇప్పటికీ చెప్పుకుంటూ ఉంటారు. ఈ చెరువుకట్టకు రెండుతూములు నిర్మించేదశలో పైనవేసిన బండలు నిలువకుండా పోతున్నాయి. ఆ సమయంలోనే పెద్దవర్షం వచ్చింది. కట్టకు గండిపడి గ్రామం కొట్టుకుపోయే ప్రమాదం సంభవించింది. ఆ తూములకు మరమ్మత్తు చేసే సందర్భంలో అగ్రామస్థులూ యాదవ కులస్థులూ అయిన చిన్నకంబడు పెద్దకంబడు అనేవాళ్ళు తమ చేతుల పైన అబండలను పెట్టుకొని అవి నిలకటానికి కారకులై ఆత్మార్పణ చేశారు. ఈ విషయము పై వాక్యంలో మరుగుగా చెప్పబడిందని అంటారు. ఇటువంటి మరుగు వాక్యాలను ప్రత్యేకించి ఎవ్వరూ వివరించలేదు. జనశ్రుతినిబట్టి చెప్పుకోవడమే గాని ఈ వాక్యాలకు ఇదే అర్థమని చెప్పడానికి ఆధారాలు లేవు.

## గురి గురి, నగురి, ముద్దు గురి, బాల గురి :—

(రా. ష. 15)

గురి అంటే లక్ష్యం. అంటే చూపు నిలపడం. ఈ లక్ష్యాలు వివిధాలుగా ఉన్నాయి. రెండు కన్నుల చూపులను నాసికాగ్రంపై నిలిపి సంపూర్ణంగా పైకెత్తి త్రిపుటి స్థానంలో వెలుగును చూచే దృష్టి పున్నమ దృష్టి. దీనినే బ్రహ్మంగారు గురి అన్నారు. ఇలా చూపును త్రికూట స్థానంలో నిలిపి కనులు పూర్తిగా మూసుకొనడాన్ని అమావాస్య దృష్టి అని అంటారు. దీన్నే బ్రహ్మంగారు నగురి అన్నారు.

ముద్రలు ఐదు ఉన్నాయి. 1) నేత్రాలు మూసియైనా తెరచియైనా నల్లగుడ్డు కనపడనీయకుండా భ్రూమధ్యానికి పైభాగాన దృష్టి నిలిపి చిదాకాశాన్ని చూడడం. దీనిని "ఖేచరిముద్ర" అంటారు. 2) రెండుకళ్లను కదలనీయకుండా ఏకదృష్టితో ముక్కు కొనను చూడటాన్ని "భూచరి ముద్ర" అంటారు. 3) కళ్లు సగం మూసి భ్రూమధ్యభాగాన చూపునిలపడమే అంతర్లక్ష్యం. దీన్నే "మధ్యమ దృష్టి" అంటారు. 4) నేత్రాలు, కర్ణాలు, నాసిక, నోరు ఈ నాలుగింటిని మూసివేసి భ్రూమధ్యంలో వెలుగును దర్శించడాన్ని "షణ్ముఖిముద్ర" అంటారు.

పై నాలుగింటిని ఏకంగా లక్ష్యంలోఉంచి బాహ్యాఖేచరి చేత నేత్రాలు తెరచిఉంచి భ్రూమధ్యంలో చిత్కళను చూడటమే "శాంభవీ దృష్టి" అంటారు. దీన్నే బ్రహ్మంగారు "ముగ్ధదృష్టి" అంటే ముద్దుగురి అని అన్నారు.

కన్నులు మూడువంతులు మూసి నాల్గవభాగం తెరచి భ్రూమధ్యంలో చూపు నిలపడాన్ని "పాద్యమిదృష్టి" అని అంటారు. దీన్నే బ్రహ్మంగారు "బాలగురి" అని అన్నారు. అంటే నెలబాలుని వంటి గురి. అర్ధనిమీలిత నేత్రాలతో చూసేగురి అని అర్థం.

## చెడుగుడాడెనే బ్రహ్మం బలిగుడాడెనే:- (కాల. త. పు. 15)

చెడుగుడు అనేది క్రీడా విశేషం. యోగాన్ని సాధించడం చెడుగుడు ఆటయితే మానవదేహం ఆటస్థలం అని చెప్పుకోవాలి. దేహంలో ఉండే జీవుడే ఆటగాడు. చెడుగుడు ఆడేవాడు ఒక సక్రమమైన పద్ధతిలో కూతపెడుతూ వేల కవతలకువెళ్లి ఎదుటిపక్షంవాణ్ణి అంటుకొని పరుగెత్తి వచ్చి తన స్థానాన్ని చేరుకోవడానికి ప్రయత్నిస్తాడు. అవతలిపక్షం వాళ్లు వెంటపడతారు. పట్టుకొన్న వాళ్లను కూత విడిచిపెట్టకుండా వేలదాకా లాక్కువస్తాడు. ఆట గెలుస్తాడ.

ఇదేవిధంగా యోగసాధకుడు హంసను నడిపించేటప్పుడు చెడుగుడుఆటలో ఆటగాడు కూతపెట్టుకొంటూ ఎదుటివాణ్ణి ఉడికిస్తూ అక్కడక్కడే తిరిగినట్లుగా సాధనలో ఊపిరిని అక్కడక్కడే తిప్పుతాడు. కుండలిని పైకి లాక్కువచ్చి యోగసాధన అనే ఆటను గెలుస్తాడు. ఈ తత్వంలో బ్రహ్మంగారు "అయ్య చూచెను ఆనందించెను" అని అన్నారు. సహస్రారంలో ఉండే పరబ్రహ్మమే ఆ అయ్య.

ఇంకా కొన్ని మరుగువాక్యాలు ఈక్రింద ప్రదర్శించ బడుతున్నాయి.

1) ,,సూర్యమండల వృషభ నందీశ్వరుని మీద శ్రీరాములు వస్తా వున్నాడు." కాల. పు. 14

2) ,,సాక్షాత్తు రామధర్మజమూర్తి ఉప్పునము. సర్వాత్మ సర్వే సర్వనాటకధారి సదోపవాసంబు పిడిపించి బోంచేయు కట్టడి చేస్తిమి. తెల్లకోకలు, తిరుమణి, తిరుచూర్ణముతో కట్టడి చేస్తిమి" కాల. పు. 15

3) "తూర్పువాటికి బోయిరా అంటె గూడూరు గురిజాల నందు సింధునది దాటిరాగా దాసనంగులు వచ్చి వరుసమాట లాడి నందువలన అయ్యోవారు కానూగారు కానివారు పోనూపోరు."
కాల, పు, 15

4) "ఈ రాతిపువ్వు రంకుముండలపాలై పోయెను."
కాల, పు, 20.

5) "కొరకరాని కొరవి దెచ్చి కొత్తచీర మూటుగట్టి కాళ్లు ముడిచే వేళ మీదర్శనం కాగలవాడవు." కాల. పు. 21, 22

6) "గాగీ గూగే అనే బ్రహ్మాస్త్రం అంతా యిచ్చినాడు."
కాల. పు. 40

7) ,,బ్రంగి బ్రంగి బభ్రభ బభ్రబ అనే ఆనందాన వచ్చేము."
కాల, పు, 40

8) ,,అంధాతు పరంధాతు అనే ఆదివాక్యమే కారణం."
కాల. పు. 53

9) "ఎప్పుడో ఏవేళనో మరి గుప్పుగుప్పున దాటిపోయే గుఱ్ఱపడుగులు ఏరుపడును." కాల. త. పు. 9

10) ,,గుడిముందరా నొక్క గుడ్డిముండున్నాది." ,, ,, 17

11) ,,చింత మానిమీద చేమంతి పూసెను" ,, ,, 38

12) ,,సర్వానకు పంచమే కారణము." కాల. పు. 16, 54

13) ,,పాయసములో నెయ్యి కలిసిన కథ
యిప్పుడే కనిపిస్తూ వున్నాము." కాల. పు. 31

14) ,,మేము త్రికోణమార్గమున పడిరాగా వక విచిత్రహంసల జూచి
కంచి కుంభకోణం మధ్య ఒకస్త్రీ లేదు." కాల. పు. 56

ఇలా బ్రహ్మంగారు పలికిన ప్రతి మరుగు వాక్యానికీ అర్థం చెప్పడం కష్టమే. ఆకాలంలో మౌఖికంగా విన్న శిష్య పరంపరకు ఈ మరుగువాక్యాల అర్థం తెలిసిఉండవచ్చు.

## అర్వాచీనులపై బ్రహ్మంగారి ప్రభావం :-

బ్రహ్మంగారి కవిత్వం, సిద్ధాంతాల ప్రభావం కొందరు అర్వాచీనులపై బడింది. బ్రహ్మంగారి సిద్ధాంతాలను అనుసరించిన కొందరు ముఖ్యులైనవారి విషయం ఇక్కడ రేఖామాత్రంగా ప్రదర్శింపబడుతున్నది.

## కొండూరి వీరరాఘవాచార్యులు :-

బ్రహ్మం గారిచేత ప్రభావితులైన వారిలో ఈయన ముఖ్యుడు. బ్రహ్మంగారు చెప్పిన వేదాంతం, భక్తి, జ్ఞానయోగాల వెలుగు ఈయనపై ప్రసరించింది. వీరరాఘవాచార్యులు బ్రహ్మంగారిని గురువుగా భావించి ఆయన సిద్ధాంతాలను ప్రచారం చేశారు. వీరరాఘవాచార్యులు రచించిన ,,తత్వ దర్శనము" ,,యోగ దర్శనం" ,,మిత్ర సాహస్రి" ,,మన గురుదేవుడు" అనే గ్రంథాలు ఈ విషయానికి అద్దం పడతాయి. కానీ బ్రహ్మంగారి భాష, శైలి, మున్నగువాని ప్రభావం ఈయనపై లేదు.

## కొండవీటి వెంకటకవి:-

బ్రహ్మంగారి సిద్ధాంతాలను అంగీకరించిన వారిలో కొండవీటి వెంకటకవి అగ్రేసరుడని చెప్పవచ్చు. బ్రహ్మంగారు సాధించిన మహాకార్యాలపైని ఆయనకున్న గౌరవభావాన్ని ఈక్రింది పద్యం ప్రదర్శిస్తుంది.

“మతకర్తలెల్ల మిథ్యానమ్ము హీనమ్ము
చాటించి ద్వేషముల్ చాటునాడు
అంగనామణుల స్వేచ్ఛం గంగపాల్సేయు
మాతృ విద్రోహులు మసలునాడు
తలయెత్తలేని జాతులు విద్యయే లేక
మొఱకుందనమ్ములో మసలునాడు
పరదాస్యభావ బంధుర వినీలాబ్దముల్
చెలరేగి చీకట్లు జిమ్మునాడు

సంఘ సంస్కృతి స్వేచ్ఛ విజ్ఞానశోభ
లల్లుకొన్న మల్లెమొగ్గ పందిళ్లు వెట్టు
నీ మహాకార్యముల్ నిల్చురా! మహాత్మ
వీరగురువర్య! మా నమస్కార మార్య!”

“దివ్య స్మృతులు” - ఖండిక నుండి.

బ్రహ్మంగారు చెప్పిన హిందూ మహమ్మదీయ ఐకమత్యావశ్యకత, కులరహిత సమాజం, అస్పృశ్యతా నిర్మూలన మొదలైన సిద్ధాంతాలు

యావద్భారత దేశానికి శిరోధార్యాలని వెంకటకవి అభిప్రాయం.1.

## కొసరాజు రాఘవయ్యచౌదరి:—

బ్రహ్మంగారి భాషను శైలిని కవితా విధానాన్ని అనుకరించిన వారిలో కొసరాజును ప్రధానంగా పేర్కొనవచ్చు. ,,నందామయా గురుడ నందామయా" అనే బ్రహ్మంగారి పల్లవిని గ్రహించి ,,పెద్ద మనుషులు" అనే చిత్రంలో నవీన కాలజ్ఞానాన్ని రచించారు. తాను రచించిన చలనచిత్ర గీతికల్లో సందర్భోచితంగా బ్రహ్మంగారి పేరు రాయడం ఈయనకు అలవాటు. అందుకు -

1) ,,ఆనాడు శ్రీయోగి వీరబ్రహ్మంగారు
కాలజ్ఞానం బోధ చేశారయా"

— వెలుగు నీడలు.

2) ,,బ్రహ్మం తాత చెప్పినదీ నిత్యం జరిగే సత్యమిదీ"

— తల్లా - పెళ్లామా?

అనే గీతాలను ఉదాహరించవచ్చు. బ్రహ్మంగారి రచనా పథాన్ని అనుకరించి కొసరాజు కృతకృత్యుడయ్యాడు.

## ఉపసంహారం:—

బ్రహ్మంగారు భక్తి జ్ఞాన యోగాలను ప్రజల్లో ప్రచారంచేసి కులమతద్వేషాలు కూడవని చెప్పి, సర్వమానవ సమానత్వాన్ని చాటి,

---

1. వ్యాసకర్త బ్రహ్మంగారి మఠంలో 24-5-81న వెంకటకవితో ప్రసంగించిన సందర్భంలో పై విషయం చెప్పారు.

తను నమ్మిన సిద్ధాంతాలను కవిత్వంగా చెప్పి, సర్వమానవ కల్యాణం కోసం శ్రమించారు. సర్వమతస్థులూ సోదరభావంతో మెలగాలని ప్రబోధించారు. మతసహనపు మార్గాన్ని వేసి హిందూ మహమ్మదీయ సామరస్యానికి బీజావాపన చేశారు.

భగవద్గీతను శ్రేష్ఠమని చెప్పిన బ్రహ్మంగారు అందలి భక్తి జ్ఞాన యోగాలను సామాన్యులకు అందుబాటులో ఉండేవిధంగా తేలికపరచి చెప్పారు. భగవంతుని దర్శించడానికి భక్తిమార్గం ఉత్తమమైనదని బోధించారు. భక్తిమార్గంలో పయనించడానికి అనుకూలమైన మంత్రాలను, స్తోత్రాలను రచించారు.

బ్రహ్మంగారు తనకు కలిగిన విజ్ఞానానికి తన జ్యోతిశ్శాస్త్ర పాండిత్యాన్ని జతచేసి భవిష్యత్తును దర్శించి, రచించిన గొప్ప కాలజ్ఞాని. ముఖ్యంగా బ్రహ్మంగారి కాలజ్ఞానానికున్న ప్రచారం అంతులేనిది. దేశంలో ఏమూల ఏవింతజరిగినా దీన్ని గురించి బ్రహ్మంగారు ఎప్పుడో చెప్పారు. అని అంటారు.

# అనుబంధం - 1

## జనస్మృతిలో బ్రహ్మంగారి జీవిత చరిత్ర

ఆంధ్రదేశ వాసులు బ్రహ్మంగారి జీవితచరిత్రను ఇలా చెప్పు కుంటూ ఉంటారు.

కలియుగంలో పాపం పెరిగింది. ఈ పాపభారాన్ని మోయ లేక భూదేవి వైకుంఠానికి వెళ్లి విష్ణువుతో మొరపెట్టుకొంది. విష్ణువు తాను భూలోకంలో వీరనారాయణ అనేపేరుతో జన్మించి దుష్టశిక్షణ శిష్టరక్షణ చేస్తానని చెప్పి అభయమిచ్చి పంపించాడు.

గంగానదీ తీరంలో బ్రహ్మండపురమనే ఊరుంది. ఆ ఊళ్లో ప్రకృతాంబా పరిపూర్ణయాచార్యులనే దంపతులున్నారు. సంతానార్థులై కాశీయాత్రకు వెళ్లారు. కాశీనగరంలో ఒకనాటి రాత్రి శివుడు కలలో కనిపించి విష్ణువు ఆమె కుమారుడుగా జన్మిస్తాడని చెప్పాడు. ప్రకృతాంబ గర్భం ధరించింది. నవమాసాలు నిండాయి. అప్పుడు స్వగ్రామానికి బయలుదేరారు. మార్గమధ్యంలో సరస్వతీ నదీ తీరంలో ప్రకృతాంబ మగశిశువును ప్రసవించింది. అతడు పుట్టినప్పుడు కాంతి వంతమైన నక్షత్రం పుట్టింది ప్రజలంతా చూడటానికి వచ్చారు. ఒక మర్రిచెట్టు క్రింద ఆ దంపతులు విడిది చేశారు. మరుసటి రోజు హఠాత్తుగా పరిపూర్ణయాచార్యులు మరణించాడు

సరస్వతీ నదీ తీరంలో అత్రి అనే ఒకమహర్షి ఆశ్రమం ఉంది. ప్రకృతాంబ భర్త మరణానికి బాధపడి ఆ శిశువును అత్రిమహర్షి

చేతుల్లో పెట్టి, పెంచి పెద్దవాణ్ణిగా చేయవలసిందిగా అర్థించి తన భర్తతో పాటు తానూ మరణించింది.

కర్ణాటక దేశంలో పినాకినీ నదీ తీరంలో పాపఘ్ని మఠం ఉంది. ఆమఠాధ్యక్షులు వీరభోజయాచార్యులు. ఆయన భార్య వీరపాపమ్మ. వారికి సంతానం లేదు. ఆ దంపతులు సంతానార్థులై తీర్థయాత్రలు చేస్తూ సరస్వతీ నదీ తీరానికి వచ్చారు. అక్కడ అత్రి మహర్షి ఆశ్రమంలో బాలుణ్ణి చూశారు. అత్రి ఆ దంపతుల కోరికను గ్రహించి ఆ బాలుణ్ణి ఆ దంపతులకు పెంచుకోవడానికి ఇచ్చాడు. బాలుణ్ణి తీసుకొని మఠానికి వచ్చిన తరువాత కొన్నాళ్లకు వీరభోజయాచార్యులు మరణించాడు.

వీరపాపమ్మ భర్త మరణంతో విచారంలో మునిగిపోయింది. అప్పుడు కుమారుడు ఆమెకు జ్ఞానోపదేశం చేశాడు. తాను తీర్థయాత్రలు సేవించడానికి అనుమతించమని అడిగాడు. వీరపాపమ్మ అనుమతించింది. అప్పుడు వీరప్ప వీరంభొట్లయ్య అనే పేర్లతో పిలువబడుతున్న బ్రహ్మంగారు తీర్థయాత్రలకు బయలుదేరాడు. యాత్రాపథంలో ప్రజలకు జ్ఞానోపదేశం చేశాడు. కాంచీనగరానికి వెళ్లి అక్కడ ఏకాంతప్రదేశంలో తపస్సు ప్రారంభించాడు.

వీరంభొట్లయ్య తపస్సు చేసుకొంటున్న ప్రదేశానికి ఆనంద భైరవవర్మ అనే కాశీరాజు వచ్చాడు. ఆయన ఒకరోజు వేటాడే సమయంలో పులివాత పడబోతున్న గోవును రక్షించబోయి బాణం వేశాడు పొరపాటున బాణం గోవుకు తగిలి మరణించింది. గోహత్యా దోషాన్ని బాపుకోవడానికి తీర్థయాత్రలు సేవిస్తూ వీరంభొట్లయ్యను

కలుసుకొని పాపపరిహార మార్గాన్ని అడిగాడు. ఆయన గోహత్యా దోష నివారణ మార్గాన్ని చూపించాడు. అనంతశైలవర్మ తన దేశానికి వెళ్లాడు.

కంచిలో తపస్సు ముగించి వీరంభొట్లయ్య కర్నూలు మండలం లోని బనగానపల్లె చేరాడు. ఆ గ్రామంలోని గరిమరెడ్డి అచ్చమ్మగారి గృహంలో పశుల కాపరిగా చేరాడు. అచ్చమ్మగారి గృహానికి దగ్గరగా ఉన్న రవ్వలకొండ ప్రాంతంలో గోవులను కాస్తుండేవాడు. రోజూ ఆవులను ఒకగిరిలో నిలిపి కదలకుండా చేసి రవ్వలకొండ గుహ లోకి వెళ్లి కాలజ్ఞానాన్ని రాస్తూ ఉండేవాడు. ఆవులు గిరలో ఉండి మేసినట్లే నెమరువేస్తూండేవి. ఆయన రచించిన ఆ తాళపత్రాలను అచ్చమ్మగారి ఇంటి ఆవరణలోని ఒకపాతరలో వేస్తూండేవాడు.

ఒకరోజు ఎప్పటిలాగే ఆవులు గిరలోఉండి నెమరు వేస్తున్నవి. కొందరు బాటసారులు ఆవులను దొంగిలించాలనే ఉద్దేశ్యంతో గిరలో అడుగు పెట్టారు. వెంటనే వాళ్లకు కళ్లు కనిపించకుండా పోయాయి. వాళ్లు ఈవింత జరుగగానే భయపడి ఇవతలకు వచ్చారు. ఎప్పటి లాగే కళ్లు కనిపించాయి. చేరువలోనే రవ్వలకొండ గుహలోని ఆ మహాత్ముని మహిమే ఇదని తెలిసికొని అచ్చమ్మగారింటికి వెళ్లి ఈవిషయం చెప్పారు. తనఇంట్లో ఉండి గోవులు కాసే వ్యక్తి సామాన్యుడు కాదని గుర్తించింది అచ్చమ్మ. వెంటనే వెళ్లి గుహలో కాలజ్ఞానం రచిస్తున్న ఆయనను చూసింది. ఆయనకు నమస్కరించి జ్ఞానోపదేశం చేయవలసిందిగా అచ్చమ్మ అర్థించింది.

వీరంభొట్లయ్య అచ్చమ్మను ఆమెభర్తను యాగంటి క్షేత్రానికి

తీసికొనివెళ్ళి ఆకొండ శిఖరంమీద తత్వోపదేశం చేశాడు. అచ్చమ్మ దంపతులతోపాటు ఎందరో భక్తులు అనుసరించి ఆకొండమీద జరుగు తున్న ముచ్చట్లను వినేవారు. అందుకే ఆపర్వతానికి ముచ్చట్లకొండ అనేపేరు వచ్చింది.

వీరంభొట్లయ్య తన ఉపన్యాసంలో "అహం బ్రహ్మాస్మి" అనే ఉపనిషత్ వాక్యాన్ని "నేనే బ్రహ్మమురా" అని తెలుగులో చెప్పారు. అప్పటినుంచి బనగానపల్లె నివాసులు ఆయనను బ్రహ్మంగారని పిలువ సాగారు.

బ్రహ్మంగారు తపస్సు చేసుకోవడానికి అచ్చమ్మ తన గృహ ప్రాంగణంలో ఒక నేలమఠాన్ని నిర్మించి ఇచ్చింది. ఆ మఠంలో బ్రహ్మంగారి తపస్సు నిరాటంకంగా సాగిపోయింది. ఇప్పుడే అచ్చమ్మ కొడుకు అంధత్వాన్ని పోగొట్టాడు బ్రహ్మంగారు. ఈవార్త ప్రజలందరికీ తెలిసింది. అప్పటినుంచి బ్రహ్మంగారిని చూసిపోవడానికి ఎందరో భక్తులు రాసాగారు.

ఈవిషయం నవాబుకు తెలిసింది. బ్రహ్మంగారిని తన దివాణానికి ఆహ్వానించాడు. ఒక పళ్లెంలో మాంసాహారాన్ని తెప్పించి బ్రహ్మంగారి ముందుంచి ఆరగించమన్నాడు. అందరూ చూస్తుండగానే ఆపళ్లెంలోని మాంసాహారం శాకాహారంగా మారిపోయింది. నవాబుకు ఆశ్చర్యం కలిగింది. తనను మన్నించమని వేడుకొన్నాడు. బ్రహ్మం గారు నవాబును క్షమించి జ్ఞానభిక్ష ప్రసాదించాడు.

బనగానపల్లెలోని మఠాన్ని శిష్యులకప్పగించి కుముద్వతీ నదీ తీరానికి వెళ్ళి తపస్సు ప్రారంభించారు బ్రహ్మంగారు. తీరిక సమయాల్లో ఒక రాతిమీద వీరభద్రుని విగ్రహాన్ని గండరించాడు.

ఒకనాటి రాత్రి జుర్రేరు పొంగి వీరభద్రుని శిల అల్లాడుపల్లె వరకు కొట్టుకొనిపోయి ఒక మడుగులో నిలువబడింది. మడుగులో ఉన్న ఈ వీరభద్ర విగ్రహమే ఒక బాలుడిరూపంలో వచ్చి ఆఊరి పిల్లలతో చెడుగుడు ఆడిపోతూ ఉంటే ఆ గ్రామస్థులు ఆశ్చర్యపోయారు. తరువాత గ్రామపెద్దలకు కలలో కనబడి తనకు ఆలయ నిర్మాణం చేయవలసిందని అడిగాడు. గ్రామపెద్దలు ఆలయాన్ని నిర్మించారు. ఈవిషయం తెలుసుకొని బ్రహ్మంగారు వచ్చి ఆ విగ్రహాన్ని ప్రతిష్ఠించారు.

అక్కడినుండి బ్రహ్మంగారు కందిమల్లయపల్లెకు చేరారు. ఆఊళ్లో వడ్రంగం కమ్మరం మొదలైన వృత్తులనుచేస్తూ తీరికవేళల్లో ఆధ్యాత్మిక ప్రబోధం చేశాడు. ఒకపర్యాయం కందిమల్లయపల్లె ప్రజలు గ్రామదేవత కొలుపులు ప్రారంభించారు. బ్రహ్మంగారిని తనవంతు చందా ఇవ్వవలసినదని అడిగారు. ఈవిషయం ఇష్టంలేని బ్రహ్మంగారు నిరాకరించారు. గ్రామంలోని రచ్చబండ దగ్గరకు ఆయనను పిలిపించి గట్టిగా అడిగారు. అప్పుడే బ్రహ్మంగారు గ్రామమునసబు చుట్ట కాల్చకోవడానికి పోలేరమ్మతో నిప్పు తెప్పించారు. ఈదృశ్యం చూసిన గ్రామపెద్దలు ప్రజలు బ్రహ్మంగారిని మహాత్ముడుగా గుర్తించారు. క్షమాభిక్ష నర్థించారు. బ్రహ్మంగారు వారిని క్షమించి జ్ఞానోపదేశం చేశారు.

బ్రహ్మంగారు కందిమల్లయపల్లె నుంచి పెద్దకొమెర్ల అనే ఊరు చేరారు. ఆగ్రామంలోని శివాలయంలో తపస్సు ప్రారంభించారు.

ఆగ్రామంలో శివకోటయ్య అనే విశ్వకర్మ ఉన్నాడు. ఆయనకు లేకలేక కలిగిన సంతానమే గోవిందమ్మ. బ్రహ్మంగారు రోజూ శివకోటయ్యగారి ఇంటిముందునుంచే స్నానానికి వెళ్లేవాడు. ఇలా వెళుతూ ఒకరోజు గోవిందమ్మను చూశాడు. తనస్వరూపాన్ని గురించి కలలు గంటూ తనను భర్తగా పొందాలని తపస్సుచేసే ఈమే తనకు కాబోయె భార్య అని గుర్తించాడు. గోవిందమ్మకూడా తనకు కలలో కనిపించే సిద్ధపురుషుడు ఇతడేనని గుర్తించింది. ఆమె తన తలిదండ్రులతో ఈ విషయాన్ని విన్నవిస్తే బ్రహ్మంగారిని ఒక సాధారణ సన్యాసిగా భావించి ఆయనంటే ఇష్టపడని శివకోటయ్య వివాహానికి నిరాకరించాడు. ఇదే సందర్భంలో బ్రహ్మంగారు ఒక మరణించిన వ్యక్తిని బ్రతికించి మహిమ చూపించాడు. అప్పుడు శివకోటయ్య బ్రహ్మంగారిని గుర్తించి ఆయనకు గోవిందమ్మనిచ్చి వివాహం చేశాడు.

వివాహితుడైన బ్రహ్మంగారు భార్యతో తీర్థయాత్రలకు బయలుదేరాడు. సమస్త తీర్థాలూ సేవించి చివరకు కాశీ చేరాడు. అక్కడికి ఆనందభైరవవర్మ వచ్చి బ్రహ్మంగారిని కలుసుకొన్నాడు. మరుజన్మలో ఆనందభైరవవర్మ మ్లేచ్ఛకులంలో జన్మించి తనకు శిష్యుడౌతాడని భవిష్యత్తు చెప్పాడు. ఆనంద భైరవవర్మ బ్రహ్మంగారి ఆశీస్సులు అందుకొని వెళ్లాడు. తీర్థయాత్రలను ముగించుకొని బ్రహ్మంగారు కందిమల్లయపల్లెకు చేరి ఎప్పటిలాగే శిష్యులకు వేదాంత బోధ చేస్తూ తన కులవృత్తులు చేస్తూ జీవయాత్ర సాగిస్తున్నాడు. బ్రహ్మంగారికి ఆరుగురు సంతానం కలిగారు.

బ్రహ్మంగారు భవిష్యత్తు చెప్పినవిధంగా కడప మండలంలోని ముడుమాల గ్రామంలోని ఆదంబీ పీర్‌సాహెబ్ అనే దంపతులకు

ఆసరికపై రవవర్మ సిద్ధయ్యగా జన్మించాడు. పన్నెండు సంవత్సరాల ప్రాయంలో బ్రహ్మంగారి దగ్గరకు వచ్చి యోగవిద్యను నేర్పవలసినదని అడిగాడు. బ్రహ్మంగారు అతన్ని శిష్యుడిగా స్వీకరించారు. మ్లేచ్ఛుడైన సిద్ధయ్య ఆశ్రమంలోనికి ప్రవేశించడానికి వీల్లేదని బ్రహ్మంగారి కుమారులు అభ్యంతరం తెలిపారు. కులం ప్రధానంకాదు గుణం ప్రధానమని బోధించి కుమారులు సిద్ధయ్యను సోదరుడుగా భావించేటట్లు చేశారు బ్రహ్మంగారు. బ్రహ్మంగారి ఆశ్రమంలో సిద్ధయ్య జీవించ సాగాడు. తమ కుమారుడు చెప్పకుండా వచ్చి ఇక్కడ ఉన్న సంగతి తెలిసికొన్న పీర్‌సాహెబ్ బ్రహ్మంగారి దగ్గరకు వచ్చి తన కుమారుని తనవెంట పంపమని కోరాడు. సిద్ధయ్య తండ్రివెంట వెళ్లడానికి నిరాకరించాడు. పీర్‌సాహెబ్ దీనికంతటికి కారణం ఈ బ్రహ్మం గారేనని దూషించి ఈవిషయం కడప నవాబువద్దర తెలుస్తానని చెప్పి వెళ్లాడు.

సిద్ధయ్యకు బ్రహ్మంగారు బ్రహ్మోపదేశం చేశాడు. యోగ విద్యను బోధించాడు. ఒకరోజు బ్రహ్మంగారు మానవశరీరంలో ఉండే షడ్చక్రాలను అందలి దేవతలను యోగదృష్టితో దర్శించవచ్చునని బోధిస్తుండగా ఆగ్రామానికి చెందిన కక్కయ్య అనే మాదిగ కులజుడు విని మానవ శరీరంలో ఉండే దేవతలను దర్శించాలని భావించి తన భార్య ముత్తి శరీరాన్ని కోసి చూశాడు కాని దేవతలు కనిపించలేదు. తనభార్య చనిపోయిందని కక్కయ్య విలపించి బ్రహ్మంగారి దగ్గరకు వెళ్లి ఆయనను దూషించాడు. బ్రహ్మంగారు విషయాన్ని గ్రహించి కక్కయ్యను ఓదార్చి అతడిఇంటికి వెళ్లి మరణించిన ముత్తిని

బ్రతికించాడు. కక్కయ్యకు జ్ఞానోపదేశం చేసి తనశిష్యుడుగా స్వీకరించాడు.

బ్రహ్మంగారు ముస్లిం మతానికి చెందిన సిద్ధయ్యను హిందూ మతంలో చేర్చుకొన్నాడనే అభియోగాన్ని మోపి కడప నవాబు తాఖీదు పంపాడు. బ్రహ్మంగారు వెంటనే కడప వచ్చి సమాధానం చెప్పాలని నవాబు ఆజ్ఞాపించాడు. ఈ పనికి గురువుగారు వెళ్ల నవసరం లేదని ఆయన పక్షాన తను వెళ్లడానికి అనుమతి తీసుకొని సిద్ధయ్య కడపనవాబు దర్బారుకు వెళ్లాడు. తనను చూడగానే సిద్ధయ్య తనకు నమస్కరించని కారణమేమిటని నవాబు అడిగాడు. తన నమస్కారాన్ని గ్రహించేశక్తి నవాబుకు లేదని సిద్ధయ్య చెప్పి దర్బారు లోనికి ఒక నల్లరాతిని తెప్పించి నమస్కరించగా పగిలి పోయింది. కడప నవాబు సిద్ధయ్య గొప్పతనాన్ని ఆయన గురువు బ్రహ్మంగారి మహిమను గ్రహించి క్షమాభిక్ష కోరాడు. సిద్ధయ్య నవాబును క్షమించి జ్ఞానోపదేశం చేశాడు.

బ్రహ్మంగారు ఉత్తరదేశ సంచారానికి బయలుదేరి భాగ్యనగరం చేరాడు. అక్కడ నవాబు బ్రహ్మంగారిని తన దర్బారుకు ఆహ్వానించాడు. బ్రహ్మంగారికి ఇచ్చిన పూజాద్రవ్యాలలో నూనెకు బదులుగా నీళ్లు ఇప్పించాడు. ఆ నీళ్లతోనే బ్రహ్మంగారు దీపారాధన చేశారు. నీటిలో దీపం వెలిగింది. అప్పుడు నవాబుకు ఆత్మలో అలుముకొన్న అజ్ఞానపుచీకటి తొలగిపోయింది. అప్పుడే బ్రహ్మంగారు భవిష్యత్తులో ప్రజలు నీటితో దీపాలు వెలిగిస్తారని చెప్పారు.

బ్రహ్మంగారి పీఠం హైదరాబాదు నుంచి బయలుదేరింది. మార్గంలో గురుశిష్యులు ముందుకు సాగుతున్నారు. బ్రహ్మంగారు సిద్ధయ్యమీద ఎక్కువ ప్రేమను ప్రదర్శిస్తున్నారని తక్కిన శిష్యులకు ఈర్ష్య ఉంది. ఈ విషయం గమనించిన బ్రహ్మంగారు వాళ్లకు గుణపాఠం చెప్పాలనుకొన్నాడు. దారిలో తన మాయతో ఒక చచ్చిన కుక్కను ఉండేటట్లు చేశాడు. శిష్యులకు దానిని చూపించి దానిని భక్షిస్తే ఉత్తమజ్ఞానం కలుగుతుందని చెప్పాడు. దానిని తిన డానికి శిష్యులెవ్వరూ ముందుకు రాలేదు. సిద్ధయ్య ముందుకు వచ్చి ఆ కుక్కను భక్షించాడు. శిష్యులు ఆశ్చర్యపోయారు. సిద్ధయ్యకున్న చిత్తశుద్ధి తక్కిన శిష్యులకు లేదని వారు గుర్తించేటట్లు చేసి వారికి గుణపాఠం చెప్పాడు బ్రహ్మంగారు.

బ్రహ్మంగారు ఈ ప్రయాణంలో నంద్యాల చేరారు. అక్కడ ఆయనకొక విశ్వబ్రాహ్మణుడు ఒకపరీక్ష పెట్టాడు. పుట్టెడు అన్నం వడ్డించి ఒక్కమెతుకు మిగులకుండా తినాలన్నాడు. బ్రహ్మంగారి అనుజ్ఞతో సిద్ధయ్య ఒక్కమెతుకు మిగలకుండా తిన్నాడు. ఆ విశ్వ బ్రాహ్మణుడు బ్రహ్మంగారి మహిమను గుర్తించాడు. క్షమించమని అడిగాడు. బ్రహ్మంగారు అతనికి జ్ఞానోపదేశం చేశాడు. అక్కడినుంచి బయలుదేరి అహోబిలంలో ఒక బ్రాహ్మణునికి కుష్ఠువ్యాధి నివారణ చేశాడు. ఆ బ్రాహ్మణుడు పుష్పగిరికి చెందినవాడు. బ్రహ్మంగారి కరుణకు పాత్రుడైన ఆ బ్రాహ్మణుడు ఆయనకు శిష్యుడయ్యాడు.

బ్రహ్మంగారు ఈ సంచారంలోనే మర్రిచెట్టుమీద ఉండి పర్రియా జీకులను బాధిస్తున్న బ్రహ్మరాక్షసికి శాపపరిహారం చేశాడు. కర్నూలులో

నవాబు దర్బారులో గర్భంతోఉన్న గుఱ్ఱపుకడుపులో ఉన్న పిల్లను గురించిన వివరాలనుచెప్పి వెలికితీసి చూపించి మరలా గర్భంలో ప్రవేశ పెట్టాడు. అక్కడినుంచి పుష్పగిరికి బయలుదేరాడు. దోవలో దొంగలకు మహిమ ప్రదర్శించి వారికి జ్ఞానోపదేశం చేశాడు. పుష్పగిరిలోని బ్రాహ్మణులు బ్రహ్మంగారిని చుట్టుముట్టి అల్లరి చేయగా ఆఊరు మండిపోయేటట్లు చేశారు. బ్రహ్మంగారి గొప్పతనాన్ని గుర్తించిన అక్కడివారు పువ్వుల రథంపై బ్రహ్మంగారిని ఊరేగించారు.

ఒకసారి పర్యటనలో బ్రహ్మంగారు దిగువమెట్ట అనే గ్రామానికి వెళ్లారు. ఊళ్లోకి వెళ్లే దారిలోనే ఒక విశ్వబ్రాహ్మణ గృహం ఉంది. ఆ గృహస్థుడు నాస్తికుడు. బ్రహ్మంగారంటే అతనికి వ్యతిరేకభావం ఉంది. ఆయింటి ముందాగి బ్రహ్మంగారు దాహం తీర్చుకోవడానికి నీళ్లు అడిగాడు. అప్పుడా విశ్వకర్మ లోహాన్ని కరుగుతున్నాడు. అంతా బ్రహ్మపదార్థమే గదా! ఈలోహాన్ని తాగండి అని పట్టకారుతో పట్టి అందించాడు. బ్రహ్మంగారు అందుకొని నీళ్లలాగా తాగాడు. ఆ విశ్వబ్రాహ్మణుడు బ్రహ్మంగారి శక్తిని గుర్తించి ఆయన శిష్య వర్గంలో చేరాడు. అతనికి బ్రహ్మంగారు జ్ఞానోపదేశం చేశారు.

కందిమల్లయపల్లెలో గృహిణులంతా ఒకపర్యాయం పోలేరమ్మకు చద్దులు పెడుతున్నారు. గోవిందమ్మ కూడా పెట్టాలని నిశ్చ యించింది. బ్రహ్మంగారు పోలేరమ్మ ప్రతిమకు నివేదన చేయవలసిన పని లేదనీ ఆమే స్వయంగా వచ్చి భోజనంచేస్తుందనీ గోవిందమ్మతో చెప్పారు. ఈ విషయం గ్రామంలోని ప్రజలందరికీ తెలిసింది. చద్దులు పెట్టేరోజు ప్రజలంతా బ్రహ్మంగారి ఇంటిముందు చేరారు. భోజనాల

సమయానికి ఎవరో ఒక గుర్తెరుగని బాలిక వచ్చి ప్రత్యేకించి వేసిన విస్తరిముందు కూర్చొని భోజనంచేసి వెళ్లిపోయింది. గ్రామప్రజలంతా ఈ వింతను ఆశ్చర్యంగా చూశారు. బ్రహ్మంగారి మహిమను కొని యాడారు.

బ్రహ్మంగారు ఒకరోజు తన కుటుంబ సభ్యులందరినీ సమావేశ పరిచి శిష్యులందరినీ పిలిపించి తాను కొద్దిరోజులలోనే సమాధి ప్రవేశం చేయబోతున్నట్లూ తన తరువాత తన పెద్దకుమారుడు గోవిందయ్యకు మఠాధిపత్యం ఇస్తున్నట్లు ప్రకటించాడు. బ్రహ్మంగారు తన శిష్యుడు సిద్ధయ్యకు విశ్వవిఖ్యాతి కల్పించాలని సంకల్పించాడు. తాను సమాధిలో ప్రవేశించేటప్పుడు మఠంలో లేకుండా చెయ్యాలని సిద్ధయ్యను పువ్వులకై పంపించాడు. సిద్ధయ్య పువ్వులకోసం అరణ్యానికి వెళ్లాడు. బ్రహ్మంగారు తాను అంతకుముందే నిర్మించు కొన్న నేలమఠంలో ప్రకటించిన ముహూర్తానికి భక్తుల, శిష్యుల కుటుంబసభ్యుల సమక్షంలో కూర్చొన్నాడు. కూర్చొనబోవడానికి ముందు అక్కడివారికి తత్వోపదేశం చేశాడు. గోవిందమ్మ తన సమాధి ప్రవేశానంతరం కూడా సుమంగళిగా ఉండాలని ఆదేశించాడు.

పువ్వులకోసం వెళ్లిన సిద్ధయ్య దోవలో అనేకబాధలు పడ్డాడు. భయంకరమైన గాలివాన వచ్చింది. ఎలాగో పువ్వులు తీసుకొని మఠానికి బయలుదేరాడు. మార్గమధ్యంలోనే తెలిసింది గురువు సమాధి ప్రవేశం చేశాడనే వార్త. అమితమైన దుఃఖంతో పరుగెత్తి కందిమల్లయ పల్లె చేరాడు. గురువుగారి సమాధిపైబడి ఏడ్చాడు. బ్రహ్మంగారు కనిపించి మాట్లాడకపోతే అక్కడే మరణిస్తానని ప్రతిజ్ఞచేసి తన

శిరస్సును సమాధిబండకేసి మోదసాగాడు. అప్పుడు సమాధినుండి మాటలు వినిపించాయి. సమాధిపైన బిగించిన మూతపలకలు తీయమని బ్రహ్మంగారు ఆదేశించారు. సిద్ధయ్య సమాధితలుపులు తెరువగా బ్రహ్మంగారు బయటకువచ్చి కర్తవ్యాన్ని బోధించి తన పాదుకలను, యోగదండాన్ని, శిఖాముద్రికనూ సిద్ధయ్యకు ఇచ్చాడు. స్వగ్రామానికి వెళ్లి వివాహం చేసుకొని రాజయోగివి కమ్మని ఆశీర్వదించాడు. బ్రహ్మంగారు యథావిధిగా మరలా సమాధి లోనికి ప్రవేశించాడు. సిద్ధయ్య గుర్వాజ్ఞను శిరసావహించాడు. సిద్ధయ్య వంటి శిష్యుడు నభూతో నభవిష్యతి అని నిరూపించాడు.

బ్రహ్మంగారు మహాసమాధిలో ప్రవేశించబోయేముందు అక్కడ సమావేశమైన వారితో తాను కలియుగాంతంలో వీరభోగ వసంత రాయలుగా అవతరించి కలిభారాన్ని ఖండించి కృతయుగధర్మం నడిపిస్తానని చెప్పాడు.

# అనుబంధం - 2

## స్వరూప నిరూపణ

బ్రహ్మంగారు 17వ శతాబ్ది చరమఘట్టంలో జీవసమాధి ప్రవేశం చేశారు. అప్పటికి ఛాయాగ్రాహక యంత్రాలు సృష్టింపబడలేదు. బ్రహ్మంగారి కాలంలోనూ అంతకుముందు కాలంలోనూ ఉన్న వ్యక్తుల స్వరూపాలను చిత్రలేఖకులు తైలవర్ణ చిత్రాలుగా రూపొందించి భద్రపరచారు. దేశంలోని సమస్త పుణ్యతీర్థాలలో విక్రయించే సకల దేవతల వర్ణచిత్రాలతోపాటు బ్రహ్మంగారి చిత్రపటాలు కూడా లభిస్తాయి. చిత్రలేఖకులు బ్రహ్మంగారి చరిత్రలు చదివి వాటిలోని వర్ణనలను అనుసరించి చిత్రించారు. బ్రహ్మంగారిని గురించిన గ్రంథాలపై వివిధ రకాలుగా బ్రహ్మంగారి రూపం చిత్రింపబడింది. ఆయాగ్రంథాల్లో వర్ణచిత్రాల్లో ఈ వ్యాసకర్త పరిశీలించిన కొన్ని చిత్రాలు ఇక్కడ వర్ణించబడుతున్నాయి.

**1) బ్రహ్మంగారి పట్టాభిషేక దృశ్యం:-** బ్రహ్మంగారు, ప్రక్కన గోవిందమ్మ, ఐదుగురు కుమారులు కుమార్తె వీరనారాయణమ్మ ఉంటారు. పాదాలచెంత సిద్ధయ్య నమస్కరిస్తూ కూర్చొనిఉంటాడు. ఇందులో బ్రహ్మంగారు గడ్డం మీసాలతో జటాజూటంతో నడిమివయసు వాడుగా చిత్రించబడ్డాడు.

2) బ్రహ్మంగారు తపస్సు చేసుకొంటున్న దృశ్యం. నిర్జన ప్రదేశం. పైభాగంలో బ్రహ్మ విష్ణు మహేశ్వరులు. బ్రహ్మంగారి పాదాలదగ్గర నమస్కరిస్తున్న సిద్ధయ్య.

3) పైవిధంగా ఉండే చిత్రాన్ని కొందరు మరొక విధంగా చిత్రించారు. ఈపటంలో బ్రహ్మంగారు వృద్ధుడుగా కనిపిస్తాడు.

4) 1933లో చాటకొండు సుబ్బయ్య రచించి ప్రచురించిన బ్రహ్మంగారి సంతాన చరిత్ర గ్రంథంలో బ్రహ్మంగారి చిన్న రేఖా చిత్రం ఉంది.

5) 1945లో ర్యాలి వీరభద్రేశ్వరస్వామి తమకు బనగాన పల్లెలో దొరికిన కాలజ్ఞానాన్ని సేకరించి ముద్రించాడు. ఆ పుస్తకంలో బ్రహ్మంగారి రేఖాచిత్రం ముద్రించబడింది. దీనిలో బ్రహ్మంగారు శతవృద్ధులుగా చిత్రించబడ్డారు. ఈ చిత్రాన్ని S. వెంకటరత్నాచార్య్ అనే చిత్రకారుడు 1929లో వేశాడు.

6) 1950లో చాటకొండు సుబ్బయ్యచే ప్రకటించబడిన "కాళికాంబ పద్యరత్నములు" గోవిందవాక్యములు, అనే గ్రంథాల్లో బ్రహ్మంగారి చిత్రపటం ముద్రించబడింది. ఇందులో బ్రహ్మంగారు నడిమి వయస్కులుగా చిత్రించబడ్డారు.

7) 1951లో జపంగుల నాగభూషణదాసు ప్రచురించిన "వీరబ్రహ్మేంద్ర బోధామృతం" లో ఇతర గ్రంథాల్లో బ్రహ్మంగారి చిత్రాన్ని ముద్రించారు. అందులో బ్రహ్మంగారు కొద్దివయస్సులో ఉన్నట్లు చిత్రించబడ్డారు. చిత్రకారుడు గుంటూరుకు చెందిన ఎం. వీరయ్య.

8) 1951లో ఇంకొల్లు శ్రీరామశర్మ రచించి ప్రచురించిన పారాయణ చరిత్రంలో తానే బ్రహ్మంగారి వేషం ధరించిన ఛాయా చిత్రాన్ని ప్రచురించారు. ఇందులో శతవృద్ధుడుగా బ్రహ్మంగారు కనిపిస్తారు.

9) 1961 - 79 సంవత్సరాలలో ముద్రించిన "యధార్థ కాలజ్ఞాన సహిత బ్రహ్మంగారి చరిత్ర" అట్టమీద ముద్రించిన చిత్రపటంలో బ్రహ్మంగారు నడివయస్కులుగా చిత్రించబడ్డారు.

10) 1977లో ప్రచురించిన "శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి చరిత్ర" వచనకావ్యంలో ముద్రించిన రేఖాచిత్రం ప్రకృతి ఛాయాచిత్ర భిత్తికతో జతపరుచబడింది. ఇంటిలో నిర్జనప్రదేశంలో తపస్సు చేసుకొంటున్న బ్రహ్మంగారు నడిమి వయస్కులుగా కనిపిస్తారు.

11) ఎన్. వి. గోపాల్ & కో వారు 1976లో ప్రచురించిన "బ్రహ్మంగారి కాలజ్ఞాన తత్వములు" అనే గ్రంథం అట్టమీద బ్రహ్మంగారి రేఖాచిత్రం తాటియాకు మీద రాస్తున్నట్లుగా చిత్రింపబడింది.

12) "ఈశ్వరమ్మ గారిచే చెప్పబడిన కాలజ్ఞానం" అనే గ్రంథంలో బ్రహ్మంగారి పట్టాభిషేక దృశ్యపు రేఖాచిత్రాన్ని ప్రచురించారు. వయస్సులో ఉన్నట్లుగా ఇందులో బ్రహ్మంగారు చిత్రించబడ్డారు.

13) సమస్త సృష్టికి విశ్వకర్మ హేతువని నిరూపిస్తూ మధ్యలో సింహాసనస్థుడైన బ్రహ్మంగారిని చిత్రించిన పటంలో చివరకు వీరభోగ వసంతరాయలుగా అవతరిస్తాడని సూచించే చిత్రపటాన్ని నాగేశ్వర రావు అనే చిత్రకారుడు వేశాడు.

14) ఇవిగాక ఇంకా దేశంలో వందలకొలదిగా నిర్మించబడ్డ బ్రహ్మంగారి దేవాలయాల్లో శిల్పులచేత తీర్చబడిన శిలావిగ్రహాలు,

స్వర్ణ, రజత, తామ్ర, కాంస్య, విగ్రహాలు, సిమెంటు, మట్టి, పాల రాతి బొమ్మలు అనేకం ఉన్నాయి.

పైన వివరించిన చిత్రాలకు విగ్రహాలకు ఒకదానితో ఒకదానికి పోలిక లేదు. ఎవరికి తోచినట్లు వాళ్లు వేశారు. వీటిని జాగ్రత్తగా పరిశీలిస్తే చిత్రకారులు శిల్పులు ప్రామాణికమైన ఆధారం లేకుండా వేశారని చెప్పవచ్చు. బ్రహ్మంగారి రూపాన్ని చిత్రించడానికి వాళ్ల ఊహాకందిన ఆధారం ఒకేఒక్కటి. ఆయన యోగి గనుక గడ్డం మీసం ఉంటాయి. అందుకని ఒకఋషిగా ఆయన్ను ఊహించి చిత్రించారు. అసలు బ్రహ్మంగారి రూపాన్ని చిత్రించాలనే ఊహ 1920 తరువాతనే కలిగిందని చెప్పవచ్చు. 1929 నుంచి బ్రహ్మంగారి రూపచిత్రణ ప్రారంభమైంది. అంతకుపూర్వం ముద్రించిన గ్రంథాల్లో ఆయన చిత్రాలు కనిపించవు. చాటకొండు సుబ్బయ్య 1929లో ప్రచురించిన స్వామిచరిత్రలో బ్రహ్మంగారి చిత్రం లేదు. 1933లో ప్రచురించిన సంతాన చరిత్రలో చిన్న రేఖాచిత్రంగా ముద్రించబడింది. అందులో సిద్ధయ్య చిత్రం లేదు. అప్పటినుండి బ్రహ్మంగారి స్వరూప చిత్రరచన విరివిగా జరిగింది.

ఇన్నిరకాల చిత్రాలు చూసినప్పటికీ ఆనాటి బ్రహ్మంగారి అసలు స్వరూపమెలా ఉండేదో అన్న సందేహం మాత్రం అలాగే ఉంటుంది. కలియుగంలో ముందు జరుగబోయే వింతలను చెప్పి భవిష్యత్తును వచించిన బ్రహ్మంగారు ముందు తరాలవారు చూడడానికి తన స్వరూపాన్ని భద్రపరచి మన కందించారు. బ్రహ్మంగారి స్వరూప వర్ణన కాలజ్ఞానంలో నిక్షిప్తమై ఉంది. "భూమిలోపున్న ప్రజలందు వక ప్రతిమలోను అదే నారూపు అంతయు జూపితి అందుకెదురుగా నా దివ్యమూర్తి అందుకు పూర్వ పశ్చిమోత్తర దక్షిణాలమీద

హనుమంతుడు వుండె."[1] అని చెప్పారు. ఇది అల్లాడుపల్లె వీరభద్రస్వామి ఆలయంలోని విగ్రహాల వర్ణన. బ్రహ్మంగారు చెప్పిన ఈ గుర్తులు అల్లాడుపల్లె వీరభద్రస్వామి ఆలయంలో కనిపిస్తున్నాయి. ఈశ్వరమ్మ చెప్పిన కాలజ్ఞానాన్ని స్వర్ణ సుబ్రహ్మణ్యకవి సంగ్రహించి 1979లో ప్రచురించారు. అందులో బ్రహ్మంగారి రూపరేఖల ప్రస్తావన ఉంది. ఈశ్వరీదేవి ఆ గ్రంథంలో "వారియొక్క (అంటే బ్రహ్మంగారి) రూపరేఖా సౌందర్యాదులను వర్ణించుచున్నాను. దీర్ఘబాహువులు, కంఠము పొడవు, పొట్టి కురచశరీరము, చంద్రుని ముఖము, శరీరముయొక్క రంగు ఎరుపు."[2] ఈశ్వరీదేవి వర్ణించిన ఈ రూపరేఖలు అల్లాడుపల్లె వీరభద్రస్వామి విగ్రహంలో కనిపిస్తాయి.

---

1. వీరబ్రహ్మం, పోతులూరి – కాలజ్ఞానం, ప్రచు : కృష్ణమూర్తి, రంగయ్య, కందిమల్లాయపల్లె, 1974, పు. 50
2. ఈశ్వరీదేవి, పోతులూరి – కాలజ్ఞానం, ప్రచు : విజయశేఖరాచార్య T. తెనాలి, 1979, పు, 108.

# అనుబంధం - 3

## కలియుగము

కృత త్రేత ద్వాపర కలియుగములను నాల్గు యుగములలో కడపటిది. శాసనకాలమును తెలుపు పద్ధతులలో నొకటి. నాలుగు లక్షల ముప్పదిరెండువేల సంవత్సరంబులు గలది. క్రీ॥ పూ॥ 3102వ సంవత్సరము ఫిబ్రవరి 13వ తేదీనుండి ప్రారంభము. The Fourth age of the world consisting 432000 years and consisting from 13th February 3102 B C. శుభమస్తు కలియుగ ప్రమాణం 432000 ఏండ్లు. స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శక వర్షాలు వేయింన్ని ననూట డెబ్బైరెండు యేండ్లు అను నేటి సాధారణ నామ సంవత్సర మాఘ శు పంచమి సోమవారము నాడు యిభురాహిము శహాబు కుతుబు నములుకు వొడయలుగార్కి కోయంకొండ హాశిం నిలిపిన శ్యాసన కంభం.

**(H. A S. 19. 32)**

శా. శ. 1472.

— ఈశ్వరదత్తు కుందూరి

శాసన శబ్దకోశము, పు. 64

# తెలుగు సంవత్సరాలకు సరియైన ఆంగ్ల సంవత్సరాలు తెలిపే పట్టిక

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1) | ప్రభవ | 1507 | 1567 | 1627 | 1687 | 1747 | 1807 |
| 2) | విభవ | 1508 | 1568 | 1628 | 1688 | 1748 | 1808 |
| 3) | శుక్ల | 1509 | 1569 | 1629 | 1689 | 1749 | 1809 |
| 4) | ప్రమోదూత | 1510 | 1570 | 1630 | 1690 | 1750 | 1810 |
| 5) | ప్రజోత్పత్తి | 1511 | 1571 | 1631 | 1691 | 1751 | 1811 |
| 6) | అంగీరస | 1512 | 1572 | 1632 | 1692 | 1752 | 1812 |
| 7) | శ్రీముఖ | 1513 | 1573 | 1633 | 1693 | 1753 | 1813 |
| 8) | భావ | 1514 | 1574 | 1634 | 1694 | 1754 | 1814 |
| 9) | యువ | 1515 | 1575 | 1635 | 1695 | 1755 | 1815 |
| 10) | ధాత | 1516 | 1576 | 1636 | 1696 | 1756 | 1816 |
| 11) | ఈశ్వర | 1517 | 1577 | 1637 | 1697 | 1757 | 1817 |
| 12) | బహుధాన్య | 1518 | 1578 | 1638 | 1698 | 1758 | 1818 |
| 13) | ప్రమాది | 1519 | 1579 | 1639 | 1699 | 1759 | 1819 |
| 14) | విక్రమ | 1520 | 1580 | 1640 | 1700 | 1760 | 1820 |

15) వృష - 1521 - 1581 - 1641 - 1701 - 1761 - 1821
16) చిత్రభాను - 1522 - 1582 - 1642 - 1702 - 1762 - 1822
17) స్వభాను - 1523 - 1583 - 1643 - 1703 - 1763 - 1823
18) తారణ - 1524 - 1584 - 1644 - 1704 - 1764 - 1824
19) పార్థివ - 1525 - 1585 - 1645 - 1705 - 1765 - 1825
20) వ్యయ - 1526 - 1586 - 1646 - 1706 - 1766 - 1826
21) సర్వజిత్తు - 1527 - 1587 - 1647 - 1707 - 1767 - 1827
22) సర్వధారి - 1528 - 1588 - 1648 - 1708 - 1768 - 1828
23) విరోధి - 1529 - 1589 - 1649 - 1709 - 1769 - 1829
24) వికృతి - 1530 - 1590 - 1650 - 1710 - 1770 - 1830
25) ఖర - 1531 - 1591 - 1651 - 1711 - 1771 - 1831
26) నందన - 1532 - 1592 - 1652 - 1712 - 1772 - 1832
27) విజయ - 1533 - 1593 - 1653 - 1713 - 1773 - 1833
28) జయ - 1534 - 1594 - 1654 - 1714 - 1774 - 1834
29) మన్మథ - 1535 - 1595 - 1655 - 1715 - 1775 - 1635
30) దుర్ముఖి - 1536 - 1596 - 1656 - 1716 - 1776 - 1836
31) హేవళంబి - 1537 - 1597 - 1657 - 1717 - 1777 - 1837

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 32) | విళంబి | – | 1538 | 1598 | 1658 | 1718 | 1778 | 1838 |
| 33) | వికారి | – | 1539 | 1599 | 1659 | 1719 | 1779 | 1839 |
| 34) | శార్వరి | – | 1540 | 1600 | 1660 | 1720 | 1780 | 1840 |
| 35) | ప్లవ | – | 1541 | 1601 | 1661 | 1721 | 1781 | 1841 |
| 36) | శుభకృతు | – | 1542 | 1602 | 1662 | 1722 | 1782 | 1842 |
| 37) | శోభకృతు | – | 1543 | 1603 | 1663 | 1723 | 1783 | 1843 |
| 38) | క్రోధి | – | 1544 | 1604 | 1664 | 1724 | 1784 | 1844 |
| 39) | విశ్వావసు | – | 1545 | 1605 | 1665 | 1725 | 1785 | 1845 |
| 40) | పరాభవ | – | 1546 | 1606 | 1666 | 1726 | 1786 | 1846 |
| 41) | ప్లవంగ | – | 1547 | 1607 | 1667 | 1727 | 1787 | 1847 |
| 42) | కీలక | – | 1548 | 1608 | 1668 | 1728 | 1788 | 1848 |
| 43) | సౌమ్య | – | 1549 | 1609 | 1669 | 1729 | 1789 | 1849 |
| 44) | సాధారణ | – | 1550 | 1610 | 1670 | 1730 | 1790 | 1850 |
| 45) | విరోధికృతు | – | 1551 | 1611 | 1671 | 1731 | 1791 | 1851 |
| 46) | పరిధావి | – | 1552 | 1612 | 1672 | 1732 | 1792 | 1852 |
| 47) | ప్రమాదీచ | – | 1553 | 1613 | 1673 | 1733 | 1793 | 1853 |
| 48) | ఆనంద | – | 1554 | 1614 | 1674 | 1734 | 1794 | 1854 |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 49) | రాక్షస | - | 1555 | 1615 | 1675 | 1735 | 1795 - 1855 |
| 50) | నల | - | 1556 | 1616 | 1676 | 1736 | 1796 - 1856 |
| 51) | పింగళ | - | 1557 | 1617 | 1677 | 1737 | 1797 - 1857 |
| 52) | కాళయుక్తి | - | 1558 | 1618 | 1678 | 1738 | 1798 - 1858 |
| 53) | సిద్ధార్థి | - | 1559 | 1619 | 1679 | 1739 | 1799 - 1859 |
| 54) | రౌద్రి | - | 1560 | 1620 | 1680 | 1740 | 1800 - 1860 |
| 55) | దుర్మతి | - | 1561 | 1621 | 1681 | 1741 | 1801 - 1861 |
| 56) | దుందుభి | - | 1562 | 1622 | 1632 | 1742 | 1802 . 1862 |
| 57) | రుధిరోద్గారి | - | 1563 | 1623 | 1683 | 1743 | 1803 - 1863 |
| 58) | రక్తాక్షి | - | 1564 | 1624 | 1634 | 1744 | 1804 - 1864 |
| 59) | క్రోధన | - | 1565 | 1625 | 1685 | 1745 | 1805 - 1865 |
| 60) | అక్షయ | - | 1566 | 1626 | 1686 | 1746 | 1806 - 1866 |

ఇప్పటికి కలియుగం 5086 సంవత్సరాలు గడిచిపోయింది. కలియుగ ప్రారంభం అయిన తరువాత 3100 సంవత్సరాలకు క్రీస్తుశకం ప్రారంభమైంది. అందుచేత జరిగిపోయిన కలియుగ సంవత్సరాల్లో 3100 సంవత్సరాలు తీసివేస్తే సరియైన క్రీస్తుశక సంవత్సరాలు వస్తాయి.

# ఆధార గ్రంథ సూచిక

## i. తెలుగు :

అనంతకృష్ణశర్మ, రాళ్ళపల్లి – వేమన, ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్, వాల్తేరు, ప్ర. ము. 1929, ద్వి. ము. 1945. తృ. ము. 1971

అయ్యలరాజు అయ్యల భాస్కరకవులు – రెట్టమతశాస్త్రం, వావిళ్ల రామస్వామిశాస్త్రులు & సన్స్, మద్రాసు.

ఆరుద్ర–సమగ్ర ఆంధ్ర సాహిత్యం, సం॥ 3 M. శేషాచలం & కో మద్రాస్, జూన్, 1965.

ఈశ్వరదత్తు, కుందూరి – శాసన శబ్దకోశము, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, 1967.

ఝాన్సీలక్ష్మి, పాటిబండ – భారతదేశ చరిత్ర – సంస్కృతి, తెలుగు అకాడమీ, హైదరాబాద్, 1973.

ద్వారక శ్రీమతి – ఎన్. సి. – గానకళాబోధిని, బాలసరస్వతి బుక్ డిపో కర్నూలు, మద్రాసు.

నన్నయ భట్టారకుడు – ఆంధ్రమహాభారతము, వావిళ్ల రామస్వామి శాస్త్రులు & సన్స్, మద్రాసు.

పోతనామాత్య, బమ్మెర – శ్రీ మహాభాగవతము, ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ హైదరాబాద్, 1968

రామరాజభూషణుడు – కావ్యాలంకార సంగ్రహము, M. శేషాచలం & కో మద్రాసు, 1959.

లక్ష్మీకాంతం, నామగిరి, - శ్రీ వీరబ్రహ్మంగారి కాలజ్ఞానం, శ్రీరామ ధర్మజ పాదుకాపీఠం, నిడదవోలు, ఫిబ్రవరి, 1964

లక్ష్మీనారాయణ, కొడాలి - భద్రాచల రామదాసు చరిత్ర, ఇతిహాస పరిశోధకమాల, మోపర్రు, 1977

లక్ష్మీనారాయణ, కొడాలి - చారిత్రక దృక్పథంలో వీర బ్రహ్మేంద్రస్వామి ఇతిహాస పరిశోధకమాల, మోపర్రు, 1978.

విజ్ఞానసర్వస్వం, 3 సంపుటాలు - తెలుగు భాషాసమితి, హైదరాబాదు.

విద్యా ప్రకాశానందగిరి, గీతా మకరందం - శ్రీ శుకబ్రహ్మాశ్రమం, కాళహస్తి, 1981.

వీరభద్రేశ్వరస్వాములు, ర్యాలి - శ్రీ మహత్ కాలజ్ఞాన గ్రంథ రాజము, శరభయాచార్యులు, సికిందరాబాద్, 1945.

వీరరాఘవాచార్యులు, కొండూరి - శ్రీవీరబ్రహ్మ సుప్రభాతం, చంద్రియాచార్యులు, తెనాలి.

వీరరాఘవాచార్యులు, కొండూరి - మన గురుదేవుడు, వీరరాఘవ గ్రంథావళి, తెనాలి, 1963, 78.

వీరరాఘవాచార్యులు, కొండూరి - శ్రీ సిద్ధయ్యగారి సంపూర్ణ చరిత్ర, జవంగుల నాగభూషణదాసు & సన్స్, సత్తెనపల్లి 1974.

వీరబ్రహ్మము, పోతులూరి - వీరబ్రహ్మ హరిగోవింద వాక్యములు, సుబ్బయ్యశ్రేష్ఠి, చాటుకొండు, కందిమల్లయపల్లె 1950.

వీరబ్రహ్మము, పోతులూరి - కాలజ్ఞానం, కృష్ణమూర్తి, రంగయ్య, కందిమల్లయపల్లె, 1974.

౹రాచార్యులు, పరిమి – కాలజ్ఞాన తత్వములు,
ఎస్. వి. గోపాల్ & కో మద్రాసు, 1976.

వీపూరయాచార్యులు, కడియాల – బ్రహ్మంగారి నాటకం,
రఘు బుక్ షాప్, తెనాలి, 1974.

వెంకటసుబ్రహ్మణ్య దీక్షితులు, కల్లూరి – భవిష్యపురాణం,
వావిళ్ల రామస్వామి శాస్త్రులు & సన్స్, మద్రాసు.

సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశము – 6వ సం॥

సుబ్బయ్య, చాటకొండు – శ్రీ వీరబ్రహ్మముగారి సంతాన
చరిత్రము, శ్రీ వంకర వీరయ్య – కందిమల్లయపల్లె, 1929

సుబ్బయ్య, చాటకొండు– శ్రీ వీరబ్రహ్మముగారి జీవిత చరిత్ర
జానకి ముద్రాక్షరశాల, ప్రొద్దుటూరు, 1933.

సుబ్రహ్మణ్యకవి, స్వర్ణ – శ్రీ శ్రీ శ్రీ వీరబ్రహ్మంగారి
కాలజ్ఞానం, విజయశేఖరాచార్య, తుమపాల,
తెనాలి, 1979.

సీతారామాచార్యులు, బహుజనపల్లి – శబ్దరత్నాకరము,
ది మోడ్రన్ స్కూల్ బుక్ & లిటరేచర్ సొసైటీ, మద్రాసు.

సీతారామ్, ఏలూరి – శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారి చరిత్ర,
శ్రీ లక్ష్మీనారాయణ బుక్ డిపో, రాజమండ్రి, 1977.

సోమదేవభట్టు, – కథా సరిత్సాగరము, వావిళ్ల రామస్వామి
శాస్త్రులు & సన్స్, మద్రాసు, 1958.

హనుమంతరావు, B. S. L – భారతదేశ చరిత్ర – సంస్కృతి,
ద్వితీయభాగం, తెలుగు అకాడమీ హైదరాబాదు, 1973.

## ii. సంస్కృతం :

ఈశావాస్యోపనిషత్తు, అను :- పండిత గోపదేవ్, అంబాదర్శన గ్రంథమాల, కూచిపూడి, 1981

ఐతరేయోపనిషత్, అను :- పండిత గోపదేవ్, అంబాదర్శన గ్రంథమాల, కూచిపూడి, 1982.

ఛాందోగ్యోపనిషత్, అను :- పండితగోపదేవ్, అంబాదర్శన గ్రంథమాల, కూచిపూడి, 1975

తైత్తిరీయోపనిషత్తు, అను :- పండిత గోపదేవ్, అంబాదర్శన గ్రంథమాల, కూచిపూడి, 1979.

బృహదారణ్యకోపనిషత్తు, అను :- పండితగోపదేవ్, అంబాదర్శన గ్రంథమాల, కూచిపూడి, 1982

శ్వేతాశ్వతరోపనిషత్తు. అను :- పండితగోపదేవ్, అంబాదర్శన గ్రంథమాల, కూచిపూడి, 1969

## iii ఆంగ్లం :

Archeological survey of Mysore, Annual Report, 1940.

Brief History of Andhra Pradesh, By Abdul Waheed Khan Published by State Archives Taranaka. Hyderabad, 1972

Shivajee and His times, By Jadunath Sankar,
Published by Orient Long Men Ltd.,
Madras, 1973
The New Caxtion Encyclopedia, 17th Valume
The Caxtion Publishing Company, P. Ltd.,
London, 1977.

## iv. వ్యాసాలు:

కోదండరామిరెడ్డి, మరుపూరు - విప్లవమత ప్రవక్త శ్రీ పోతులూరి వీరబ్రహ్మం, ఆంధ్రప్రభ, 1977.

దొణప్ప, తూమాటి - వేమన వీరబ్రహ్మేంద్రుల తాత్విక ధోరణులు, సి. ఆర్. ఆర్. కళాశాల రజతోత్సవ సంచిక.

## v. సమావేశాలు

బ్రహ్మంగారి మఠాధిపతులు శ్రీ వీరభోగ వసంత వేంకటేశ్వర స్వామితో 13-5-81, 11-10-83 తేదీలలో.

బ్రహ్మంగారి మఠం ఆస్థానపండితులు శ్రీ కొండవీటి వేంకట కవిగారితో 12-5-81వ తేదీన.

బ్రహ్మంగారి మఠంలో పోలేరమ్మ వేపచెట్టుదగ్గర పూజారి పద్మనాభాచార్యులుతో 11-10-83వ తేదీన.

బ్రహ్మంగారి మహాసమాధి దగ్గర పూజారి తీయబిండి చంద్ర మౌళి ఆచార్యులుతో 11-10-83వ తేదీన.

బ్రహ్మంగారి నివాసగృహం దగ్గర రచ్చబండ పక్కయింట వృద్ధుడు బొల్లా వెంకటసుబ్బయ్య (80 సం॥) వృద్ధునితో 11-10-83 తేదీన.

సిద్ధయ్యగారి మఠంలో ప్రస్తుతమఠాధిపతులు శ్రీ లక్ష్మీనరసయ వీరయ్యగార్లతో 12-10-83వ తేదీన.

అల్లాడుపల్లె వీరభద్రస్వామి ఆలయంలో పూజారి బలపను బ్రహ్మయ్యతో 13-10-83వ తేదీన.



శ్రీ సత్యనారాయణ ప్రింటింగ్ ప్రెస్, మార్కాపురం.